య్యర్థి సులభార్థుఁ జేయుక్రి,తార్థుఁడు దుర్లభుఁడు దలఁప నఖిలజగములన్.

వ. అని పలికి పూర్వాచారస్మారకత్వంబున ని ట్లనియె. 163

క. వినుము గుణవంతుఁ డొకరుఁడు, ధనవంతుం డైనయొక్క ధరణీనాథుం
దనకూడుసీరకై కాం,చన మడిగి తదీయబాలిశత్వము వేర్మి న్. 164

క. విహతాశుం డై లజ్జా,మహితం బగునాశ దొఱఁగుమదితో సకల
స్పృహయును నెవ్వనియందును, వహింపనని యతులమైనవ్రతముం బూనెన్.

వ. అని చెప్పి యప్పార్థివుం దొల్లి తానుధన మర్థించి యఫలితప్రయత్నుం డై
తత్కాలజనితవైరాగ్యంబునం దపస్వి యగుట దేటపరచి వెండియు 166

చ. ఒడఁబడి యీనివానియెడ నుల్లమునం దుఁ గృతఘ్నుతం గడుం
జెడు గగుదుర్వినీతునెడఁ జిత్తము కోర్కికిఁ బట్టు సేసి లే
వడి యగునీచకాంతయెడ వారక యాసలు సాఁగు నిట్లు పె
క్కెడలను బాఱునాసగమి యెల్లఁ దొఱంగుము సౌఖ్యమొందెడున్. 167

వ. అని యాసపజ్జం బోవమి సుఖకరం బగుటం దెలిపి సువీరద్యుమ్నునకుం గరు
ణించి యతనికొడుకు భూరిద్యుమ్నుం దనతపోమహిమ నాకర్షించి వీడుకొలిపె
నని చెప్పి ఋషభుండు సుమిత్రునిచిత్తంబు మృగయాశాయత్తంబు గాకుం
డునట్లుగా బోధించెఁ బాండవాగ్రజా నీవును నివ్వాక్యంబు లాదరించి సుస్థి
రుండవై నిరాశత్వంబున సంతాపంబు దక్కి సుఖివి గమ్మని పలికిన భీష్మునితో
సభ్యాపతి భవదీయవచనామృతాస్వాదనంబున మనంబు దృప్తి సన దింకను
ధర్మప్రకారంబులు వివరింపు మనిన నతం డతని కి ట్లనియె. 168

క. తనభూమిఁ బరుఁభూమిని, ధనము లుపార్జింప వలయు ధరణీశునకుం
ధనములు మూలము రాజ్యం,బునకును మూల మగుధర్మమునకు నరేంద్రా. 169

క. అది బెట్టిదంపువెరవున, మృదుభూతోపాయమునను మెయికొనద ప్రజం
బొదువ వలయు నాజ్ఞాసం,పద [1]గలసాకతముతోడఁ బతి యవహితుఁ డై. 170

క. విను బండారము పెరుఁగని, జనపతికి బలంబు మిత్త్రసంపదయును గ
ల్గునె బలమిత్త్రవిహీనున, కొనరునె రాజ్యంబు విభవ మున్నత మగునే. 171

ఉ. కావున నర్థసంపదలు గల్మియ యింతకు మూల మైన ను
ర్వీవరుఁ డాత్మశక్తి కతిరిక్తము లైనసముద్యమంబులం
దా వలియం దలంచి సముదగ్రతఁ గైకొను టొప్ప దవ్విధం
బావిభుతోంటికల్మికిని హాని యొనర్చు హరించుఁ బ్రాణముల్. 172

క. తనకొలఁది నుపాయంబులు, వొనరిచి ధనవంతుఁ డగుట భూపగుణము ని
ర్ధనుని నిజప్రజయును గై,కొనదు విరోధులును సరకు గొనరు కుమారా. 173

క. తెఱువాటున ముచ్చిమి నుద్ధురు లగుక్రూరులకు మూఁక దోరం బగున

1 గలస్వాగతముతోడఁ.

వ్వారవరివారల బలంబుగ, ధరణీశుఁడు గూర్చుకొనుట దైన్యము దెచ్చున్.
క. అన్యాయంబునఁ బొదలిన, సైన్యముచే సమరజయము సమకూర దనూ
నన్యాయపరులు గాంతురు, మాన్యత్వము దస్యులైన మనుజాధీశా. 175
వ ఇట్లగుటకు నుదాహరణం బగునొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము. 176

భీష్ముఁడు ధర్మజునకుఁ గాపవ్యోపాఖ్యానము సెప్పుట.

సీ. అవనిఁ బారియాత్రాచలంబున నుండు నొకబోయ ధర్మసంయుక్తబుద్ధి
వింట నేర్పరి మృగవితతిప్రకారజ్ఞుఁ డారణ్యదేశసంచారశాలి
తల్లికిఁ దండ్రికిఁ దద్దయు భక్తుఁడై ఫలమూలమధుమాంసములును మేలి
కూడుగూరలు [1]దొరకొల్పి వారికిఁ దృప్తి యావహించుచు శయనాసనాదు
తే. లగుపదార్థముల్ హృద్యంబులుగ నొనర్చు
వలయునాహారములు మునివరుల కిచ్చుఁ
బగఱఁ దోఁచినఁ బరిమార్చు భండనమున
నొకఁడ వేవుర నైన మహోగ్రగతుల 177
క. కాపవ్యుం డనుపేరను, దీపించినయ[illegible]నిభూరితేజము గని ర
క్షాపరుఁడు వలయు మన కని, యాపాలమునఁ గల్గుదస్యులందఱుఁ దమలోన్.
ఆ. అతనిఁ దమకు నెల్ల నాధిపత్యము సేయు, వానిఁగా వరించువారు గాఁగ
నిశ్చయించి కూడి నెమ్మిమైఁ జనుదెంచి, కాంచి యిట్టు లనిరి గారవమున. 179
క. బలవిక్రమసంపన్నుఁడ, వలఘుచరిత్రుఁడవు మమ్ము నందఱఁ బ్రభువై
తలకొని రక్షింపుము నీ, పలచినపని గొనుము పుత్రవర్గముఁ బోలెన్. 180
వ అనిన విని యతండు వారల కిట్లనియె. 181
సీ శిశుజనమునిజనస్త్రీజనంబులఁ జంపఁ గా దెట్టివాఁడైనఁ గడఁగి మీఁదఁ
గవియక పోడుచుట కల్మషం బగనఁ జెఱపట్టఁ దగదు విశేష మొకఁడు
వినుఁ [2]డెల్లసత్త్వంబులను బెంటిఁ జంపుట పాపంబు గోవుల బ్రాహ్మణులను
సంకటపెట్టంగఁ జనదు తదీయహితము గోరి పూని యుద్ధంబు సేత
తే. యధికపుణ్యంబు సస్యక్రియావిఘాత
మాచరించుట గడుదోష మవనిప్రజకు
బాధ గావించి కుడిచి శనంబు దొలుచు
ప్రవృత్తగతి నది వాలియంగఁ బోలియు నతఁడు. 182
వ అని చెప్పి మీర లీధర్మాధర్మంబు లెఱింగి నాపంచిన తెఱంగున బ్రదికెద రేని
మీకు ముఖ్యుండ నయి సఖ్యంబు సౌఖ్యంబుఁ బెనుప మీయోగక్షేమంబు
లరసెద ననియె దానికి వార లందఱుఁ బ్రీతిం బొంది యాతనిశాసనంబున వర్తిం
చి వర్ధిల్లి రిట్లు కాపవ్యుండు సాధులకు హితం బగునట్లుగా దస్యులం బాపంబులకుం

[1] సమకొల్పి. [2] డెట్టిసత్వజాతినిబెంటిఁ. 3 వచనంబున.

బాపి తానును వారును నిహపరసిద్ధులం బ్రశస్తి వహించె. 183

క. శాపవ్యోపాఖ్యానము, పాపహరము దీని శ్రవణపఠనము లటపీ
వ్యాపార క్షేమంకర, రూపము లగు దస్యుమృగవిరోధము లడఁచున్. 184

భీష్ముఁడు ధర్మజునకు దీర్ఘదర్శి మొదల గుమత్స్యముల తెఱం గెఱింగించుట.

వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లను దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండును ననుమత్స్యంబులు మూఁడు జలచరబహుళం బగునొక్కయేటి మడువునఁ దమలోనం బొందుగలిగి యుండునవి వేసవి సొచ్చిన దీర్ఘదర్శి దక్కటిరెంటినిం గూడం బిలిచి 185

క. మడు వింకఁగఁ బాతెడు నీ, రెడ త్రెవ్విన నొండుసోటి కేఁగఁగ రా దె
ప్పుడు నింకనినీళ్లు గల, మడువునకుం బోవ వలదె మన కిట్టియెడన్. 186

తే. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డిట్లనియె నేఁడి, ప్రాప్తమయ్యె నక్కార్యంబుభంగి నెఱిఁగి
యప్పటికిఁ దగునట్లు సేయంగవలయు, మానితోపాయవృత్తి నేమఱుట లేక.

వ. అనిన నయ్యిరుదెఱంగులపలుకులు విని దీర్ఘసూత్రుం డి ట్లనియె 188

క. జడనిధిచందంబున ని, మ్మడు వొప్పఁగ నిప్పు డేమి [1]మూఁడెనె యిమ్మై
నడిచిపడ రిత్తనెవ్వగ, లుడుగుఁడు మఱి చూచికొంద మొయ్యన తఱితోన్.

క. అనుటయు నిది కర్జము గా, దని పల్కుచు దీర్ఘదర్శి యంబుస్రోతో
జనితాభయ మగుపథమునఁ, జని చొచ్చెం బెద్దమడువు సమ్మదలీలన్. 190

వ. తక్కినరెండును నంద నిలిచె నిట్లు నిలిచిన యమ్మత్స్యద్వయంబునకు భయంబు జనియింపం గతిపయదివసంబులకు. 191

క. పాతెడునీ రెడత్రెవ్వఁగ, దాఱ బెడిద మైనయెండ దనుకఁగ నివురం
బాతె మడు వంత వేడుక, కాఱులు జాలరులు సొచ్చి క్రందుకొనంగన్. 192

క. వెరవున నూఁతల నెత్తెలఁ, గరముల మత్స్యములఁ బట్టి కడుసంతసముం
బొరయుచుఁ ద్రాళ్లం గ్రువ్వఁగ, గర మూహించి మదిఁ బ్రాప్త[2]కాలజ్ఞుండున్.

క. ఇం దొకత్రాడు గఱచి యే, నొందం గాఁ గ్రుచ్చినట్ల యుండెద వీ రి
క్రందుకొనుట మానంగ న,మందత నది యొడల విడిచి మడువు దఱిసెదన్. 194

క. అని యొకగుదిమీఁలనడుమ, నెనయంగాఁ దూఱి కఱచి యిరుదౌడలఁ ద్రా
డొనరంగఁ బట్టుకొని క్రు,చ్చినచందము దోఁప మూర్ఛఁ జెందినభంగిన్. 195

వ. ఉన్నంత వేఁట దీఱె యగ్గుది గలయతండు 196

క. తెలినీట రొంపి వోవం, [3]దోలుచునెడం ద్రాడు విడిచి దురితంబునకుం
దొలఁగి పొరదప్పి యం దొక, జలచర మున్నయెడ కేఁగె సంభ్రాంతగతిన్. 197

క. ముట్టఁబడి దీర్ఘసూత్రుం, డి ట్ట ట్టరుగఁగ నుపాయ మేది యొకనిచేఁ

---

1. మాఁడిననిమ్మై, నడిచిపడియెదరు నెవ్వగ; మాఁలెను నిమ్మై, నడిచిపడ రిత్త నెవ్వఁగ. 2 కాలజ్ఞుఁ డనున్. 3 దోలఁచునెడం.

బట్టువడెఁ దనదుడెందము, పట్టు [1]వదలి చకితవికలభావేంద్రియుఁ డై. 198

క. విను దొడవ్వులఁ గార్యము, గనికొని వలయుపని మున్న కావింపఁగ నే
రనిజడుఁడు దీర్ఘసూత్రుం, డనునమ్మత్స్యంబుభంగి నాపద నొందున్. 199

తే. అప్పటికిఁ దోఁచినట్టులు దప్పకుండ, ననువుతో ధృతి గల్గి కార్యంబు నడపు
నతఁడు ప్రాప్తకాలజ్ఞాఖ్యునట్లపోలెఁ, బరమసంశయ మయ్యెడుఁ బ్రదుకు గాంచు.

క. ధుర్యత ననాగతము లగు, కార్యము లూహించి పని తగం జేయునయా
చార్యుఁడు సౌఖ్యముఁ బొరయును, నార్యస్థితి దీర్ఘదర్శి యనుమీను క్రియన్.

పలితరోమశు లనుమూషికమార్జాలంబుల సంవాదప్రకారము

వ. అనిన విని ధర్మనందనుండు పెక్కండ్రు పగఱకు నగ్గమై హీనబలుం డైన నర
పతి యొప్పరుసున నాపద నిస్తరించువాఁ డనియడిగిన నప్పుడమితేనితో భీష్ముండు
మార్జాలమూషికసంవాదం బనునితిహాసంబు గల దది నీదగుప్రశ్నంబునకు
సదుత్తరం బగు విను మని యి ట్లనియె. 202

సీ. అడవిలో నొకమఱ్ఱియడుగున లాఁగలఁ బలితుండు నా నొక్కయెలుక యుండు
నమ్మహీజముమీఁద ననిశంబు రోమశుం డనుపిల్లి వసియించు నాసమీప
మున సంజకడ నిత్యమును మృగంబుల కురు లొడ్డి వేటువ వచ్చి యొక్కమాలఁ
దగపడ్డవానిఁ గొం చరుగు నొకప్పు డాహారంబునకుఁ బిల్లి యచటఁ దిరుగఁ

తే. బోయి యురిఁ బడి యుండంగఁ బొంచి చూచి
భయము దక్కి యచ్చోటన పలితుఁ డెరకుఁ
గ్రుమ్మరఁగఁ జంద్రకుం డను గూబపులుఁగు
[2]హాలికుఁ డను ముంగియు నింత నంతఁ దోఁచె. 203

వ. ఎరలకై వచ్చి యిట్లు దోఁచిన నయ్యెలుక యారెంటిబారికిం దప్పిపోవ రామి
దలంచి బెగ్గలించియు ధైర్యంబుకలిమిం గార్యం బూహించి యప్పిల్లిం గొండొక
నేరం జనుచు దానితో ని ట్లనియె. 204

క. ఉరిద్రెవ్వఁ గొఱికి యిప్పుడ, వెర వారఁగ నీకు నేను విడుగర సేయం
దొరకొనుట నీదుభాగ్యం, బరిత్వము దొఱంగి మైత్రి యలవఱుపు మదిన్. 205

క. ముంగికి గూబకు నగపడి, యంగంబులు వడఁకుచున్నయవి నా కిమ్మై
సంగతి గలిగిన నీయుత్సంగంబుననుండి భయము దక్కుదు నేనున్. 206

చ. అనవుడుఁ బిల్లి యిట్టు లను నార్తశరణ్యుఁడ వయ్యె దిట్టినీ
కనఘ హితంబు సేయ వల దయ్యె జగత్పతి సాక్షి గాఁగ ని
ప్పని దగఁ బూనితిఁ వెఱపుఁ బాచి ననుం గదియంగ రమ్ము వ
చ్చిన నకులంబు గూబయును జేరఁగ నేరవు నాకు నోడుటన్. 207

ఆ. అనిన నట్ల యగుట నాత్మ నెఱింగియు, గాదె సంధి యైన నాదు బ్రదుకు

1 గదల జనితవికల. 2 హరితుఁ డనియెడు ముంగియు నంత.

నీదువిడుగరయును నిజ మగు టూహించి, నిన్నుఁ జెందె బుద్ధినిశ్చయంబు.

క. అని పలికి పిల్లి పొదిగిట, ననయము నిశ్శంకవృత్తి నయ్యెలుక వసిం
చినఁ జూచి యయ్యులూకం,బును నకులము నచటు వాసిపోయె నిజేచ్ఛన్.

క. నకులము నులూకమును బో,కకు సంతస మంది యుండి గ్రక్కున నమ్మూ
షిక మయ్యురిచేరులు గొఱు,కక యలసత నల్ల నల్లఁ గఱచుచు నుండెన్. 210

వ. అమ్మెయిఁ బలితుండు గొనకొని యయ్యురిం గొఱుక కుండుట యెఱింగి రోమ
శుం డి ట్లనియె. 211

క. తగునే యిట్లు కృతార్థుఁడ, వగునీ కురి గొఱుక కిట్టు లాలస్యము సేఁ
త గటా కృతఘ్నుతకు నెల, వగు టొప్పునె కొఱుకు కడఁక నద్రోహుండ వై.

చ. అనుటయు నెల్క యిట్టు లను నాశ్రితరక్షణశీలు నిన్నుఁ గీ
డునఁ [1]బొరయింతునే యిది కడుంజెడుగుండన మేను భీతి నూ
నినమదితోడ నమ్మమిన నెట్టన యియ్యురిఁ ద్రెంప [2]నయ్యెదన్
మనమున నెగ్గుగాఁ గొనకు మాలనిఁ గాంచినయప్డ ద్రెంచెదన్. 213

క. ఉరిఁ బాసి యేమి దలఁతో, యరిత్వమున వినుము ప్రబలుఁ డైనయతనితో
వెరవున సంధి యొనర్చియుఁ, గరంబు నమ్మమియ నీతిగాఁ గొంద్రు బుధుల్.

ఉ. మాలనిరాక చూచి భయమర్దిత మైనమనంబుతోడ న
క్కాలమునందు నీకుఁ జనఁగా వలయున్ వెస మ్రానిపైకి నా
మూలయముం బొరన్ సమయ మప్పుడ నాకును గాన యత్తఱి
న్నే లొనరింతు నమ్ము మిది నిక్కము గర్జము నీ వెఱుంగవే. 215

క. అనవుడు న ట్లెలుక తలఁప, వినుము భవత్ప్రాణరక్ష వెసఁ జేసితి నే
ననఘా నీవును నమ్మెయి, నను నాపదఁ బాపవలదె నమ్మి రయమునన్. 216

ఆ. అనినఁ బిల్లి కిట్టు లను నెల్క వేగిర,పడకు ముచితకాలభావ్య మైన
యత్నవిధిగదా సమగ్రఫలత్వంబు, నొందు నొండు దలఁప కూర కుండు. 217

వ. అని యి ట్లప్పలితుండును రోమశుండును నొండొరులతో మాటలాడుచుండ
వేకువ యయ్యె నట్టియెడ. 218

క. తనతోఁ గొందఱు కుక్కలఁ, గొని యేతేరంగఁ గేలఁ గ్రూరకృపాణం
బును భీకరభంగి గ వెసఁ, జనుదెంచెన్ మాలఁ డధికసంరంభమునన్. 219

ఆ. పరిఘునామఁ డైన పాపాత్ముఁ గని భయ, మడరఁ బిల్లి యిట్టు లనియె నింక
నేమి సేయువాఁడ నిదె వచ్చె జముదూత, వోలె సత్వరముగ మాలవాఁడు.

క. అనిన విని యోడ కోడకు, మనుచుం దెగఁ గొఱికె వేగ మయ్యురిఁ బలితుం
డనయముఁ జకితాత్ముం డై, చనియెన్ రోమశుఁడు నవనిజముపైకి వెసన్. 221

చ. ఎలుకయు [3]బొక్కలోపలికి నేఁగి ముదంబునఁ బొంది చూడ సం

---

1 బొరయంగ సిత్తునె కడుం. 2 నియ్యెదన్. 3 బ్రొక్క.

కులముగ నేఁగుదెంచి పరిఘుం డురి నుగ్గగు టెల్లఁ జూచి ని
ష్ఫలతకుఁ జిత్త మెంతయు విషాదము వొందఁగఁ బోయెఁ బిల్లి య
య్యెలుకకు ని ట్లనుం జెవికి నిం పగురీతి నుదాత్తభంగిగన్ 222

ఆ. మేలు సేసి తగినమిత్త్రునిఁ బడసి త, త్సుచరితముల వచ్చు సుఖము లనుభ
వింపఁ జూచు టుడిగి వేర్పడి యుండుట, యరయ నీతివిదులతెరువు గాదు 223

చ. అనఘ భయంబు నొందు టిది యారయ [1]బేలతనంబు నెమ్మిమై
మును నను నమ్మి చెంది భయమోక్షణముం గని నాకుఁ జాల మే
లొనరఁగఁ జేసి తీవు దృఢి నుల్లమునం దగ విశ్వసింప కి
ట్లునికి సుఖంబె నాదుసిరి [2]కుత్తుఁడ వయ్యెదు రమ్ము ప్రీతితోన్. 224

క. బలవంతులైన చుట్టం, బులు నేనును నీకు మేలు వొనరింపఁగ ని
మ్ముల మనుట యొప్పదే నను, గలసిమెలఁగు విడువుశంకఁ గను మభిమతముల్.

వ. అనిన విని యప్పలితుండు రోమశునితో నీపలుకు లుచితంబులు నామాటలు
విను మని యి ట్లనియె. 226

చ. అరులను మిత్త్రులం దెలియ నారయు టెంతయు సూక్ష్మకృత్య మ
వ్వార వతిదుర్లభం బరులు వీ రన నుండియు మిత్త్రభావముం
బొరయుటయున్ సుహృజ్జనులపోలికి గల్గియు శత్త్రుతాగుణ
స్ఫురణ మొకప్డు సూపుటయుఁ జూతుము గాదె ధరిత్రి నెల్లెడన్. 227

వ. కావున నిన్నుఁ బెద్ద గడియుట గర్జంబు గాదు నీవును మద్వశగతిం బొందుటఁ
జూచి తేనియు నేమఱం జన దెట్లంటేని. 228

క. బలవద్రిపులు ప్రయోజన, ములకై లోఁబడుట గల్గుఁ బొలముల నేనుం
గులు దీమంబులపజ్జఁ ద, గిలి నెట్టన పట్టువడిన క్రియఁ జతురమతీ. 229

చ. అరియెడ మిత్త్రభావ మొకయప్పుడు కార్యముపొంటెఁ గల్గిన
న్వైరవునఁ బాముఁ బట్టునెడ నిక్కము నమ్మక దానివాతికిం
గరము దొలంగఁ జేయునరుకర్జము వట్టి చరించు టొప్పదే
పొరుగున నుండి నీకు హితముం దగఁ జేసెద నెప్డు పంచినన్. 230

మ. విను నీ కామిష మేను నీయెడఁ గడున్ విశ్వాసముం బూని చే
రిన నీచిత్త మొకప్డు డుద్ధతవికారీభూత మై దుర్వినో
దనహింసా[3]రుచి నొందు నీసుతసుహృద్బంధువ్రజం బేని మున్
ననుఁ గన్నన్ సహియింప దాత్మఁ గరుణ న్మన్నింపు మి ట్లుండెదన్. 231

వ. అని యంత నిలువక. 232

క. [4]బలుపుటురిఁ జిక్కి పేరాఁ, కలితో రే యెల్ల నున్నకతమున నీకుం
జలిది వలసి పిలిచెద విటు, వలయునె నీపలుకు నమ్మి వత్తునె చేరన్. 233

---

1 బేలుఁదనంబు. 2 కుత్తుఁడ. 3 రతి. 4 బలితపుటురిఁ బడి పేరాఁ.

ఆ. అనుడు నిట్లు దలఁప నగునె మత్ప్రాణర, క్షకుఁడ వైననిన్ను శత్రుఁ గాఁగ
దలఁతునే కృతజ్ఞతయుఁ బౌరుషంబును, గలుగ నేను వెఱవ వలవ దనఘ. 234

వ. అనిన రోమశునకుఁ బలితుం డి ట్లనియె. 235

క. నీవలన నేను బ్రదికితి, నీవును నాకతన మాలనికి నగపడ వై
తీవిధమునఁ గల్గుసుహృ,ద్భావమ చాలు నినుఁ జేరఁ దగ దిటమీఁదన్. 236

వ. ఇవ్విధంబునకు శుక్రు వాక్యంబులుం గల వాకర్ణింపుము. 237

క. బలవంతుఁ డైనశత్రుని, వలనఁ బ్రయోజనము గలిగి వలను కలిమిఁ దాఁ
గలసియు నది గడచనఁగాఁ, దొలఁగ వలయు నమ్మెనేనిఁ దుదిఁ గీడొలయున్.

ఆ. నమ్మఁ దగనివారి నమ్మకయున్నది, తగినవారి నైనఁ దర్ద నమ్మి
యుండఁ దగదు తన్ను నొరులు నమ్మెడునట్లు, యుండి యొరుల నమ్మకునికి నీతి.

వ. ఇట్టిద బ్రదుకుఁదెరు వగుటం జేసి. 240

క. నినుబోంట్లను నమ్మక యేనును బ్రతికెద ననఘ నీవునుం గని చండా
లునియట్టివారిమాయలు, నినుఁ బొందక యుండ బ్రదుకు నెఱఁ బొ మ్మింకన్.

క. అనిన విని సిగ్గువడి తన, చనుచోటికిఁ జనియెఁ బిల్లి సమ్మతిఁ బలితుం
డును వేఱొకతగులాఁగకుఁ, జని సముచితవర్తనమున సౌఖ్యముఁ బొందెన్. 242

క. బలుపగఱవలనియాపద, దలఁగుటకును రిపునిహీనతరు [1]నైనఁ దనుం
గలపికొని బ్రదుకుటకు ని,య్యెలుకయుఁ బిల్లియును వెరవు లెఱిఁగించెఁ దగన్.

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితో నెవ్వరియెడ విశ్వసింప కున్నం
జిత్తంబునకు విశ్రామంబుగల్గదు విశ్వసించిన దురితంబులుదొడరునట్లగుటం జేసి
విశ్వసించుటయు విశ్వసింపక యుండుటయు ననురెంటిలోనను బరమకర్తవ్యం
బెయ్యదియో నిశ్చయింప నేర ననుటయు నమ్మహీపతి కమ్మహాత్ముం డి ట్లనియె
నీయర్థంబు దేటపఱుచునట్టియితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము. 244

బ్రహ్మదత్తునితోఁ బూజని యనుశకుని చెప్పిన సంవాదప్రకారము.

సీ. బ్రహ్మదత్తుం డనఁ బరఁగిననరపతి నగరఁ బూజని యనునామ మొప్పఁ
జతురభాషిణి యొక్క [2]శారిక వర్తించు నది పిల్లఁ బెట్టి యింపారుపండ్లు
దెచ్చి యర్మిలి దాని కిచ్చుచో మే లేఱి యధిపుపుత్రున కిచ్చు నందుఁ గొన్ని
వాఁడును మచ్చిక వచ్చి యప్పిల్లతోఁ జర్లాట మాడుచు సంచరించు

ఆ. నొక్కనాఁడు దాది యొద్ద లే కుండ నృ,ద్దారకుండు పిల్లతల [3]నొగిల్చి
చంపె దానితల్లి సనుదెంచి కని మది, నిట్టు లనియె శోక మెసక మెసఁగ. 245

తే. అకట కూఁడి మెలంగి యే మొకటిరైన, నర్థి నిదియును దానును ననుభవించుఁ
బట్టి యాఁడుచు నుండు నిప్పాపజాతి, పడుచు సంపునె యిటు దీని విడుకమిడుక.

1 నెనయఁ. 2 శకుని వర్తిలుచుండు. 3 నగల్చి.

ఆ. రాచకొడుకు గాఁడె రాచవారికి నేటి
పరిచయంబు వేగ కరుణ విడుచు
హితవు మఱచు రాజు లెందు నమ్మికకుఁ బా
త్రములె సమదమతులు క్రౌర్యరతులు. 247

వ. అని నిందించి. 248

క. ఈపగ దీర్చెద నంచుం, గోపంబున రాజుకొడుకు గ్రుడ్డులు రెండుం
బోపడునట్లుగ గోళ్లన్, వే పెఱికి రయమున గగనవీథికి నెగసెన్. 249

వ. ఎగసి యచ్చోట నిలిచి బ్రహ్మదత్తుండు విన ని ట్లనియె 250

క. చేసె నఘము దత్ఫలముం, జేసేతం గుడిచెఁ గాని శిశువునెడన్ నా
చేసిన క్రౌర్యము లే దేఁ, జేసితి మాఱొండు గీడు సెందదు నన్నున్. 251

చ. అనవుడు బ్రహ్మదత్తుఁ డది యట్టిద నీదెసఁ గీడు లేదు నీ
చనుటకు నామనం బతివిషాదముఁ బొందెడుఁ దొంటియట్ల [1]నె
మ్మిన నిలు మన్నఁ బూజని శమించునె యొండొరుచేతఁ బడ్డయీ
వెనుఁబగ నొంచి మాటపస బేల్పడి క్రమ్మఱఁ జేరు టొప్పునే. 252

వ. అనిన విని యతండు. 253

క. చేసినదానికి మాఱుగఁ, జేసినఁ బగ యంతతోడఁ జెడుఁ గాక గుణుల్
[2]డాసిన నమ్మేలు విడిచి, దోసముఁ బట్టుదురె యెట్టితుచ్ఛులుఁ జతురా. 254

వ. అనిన నతనికి [3]శారిక యి ట్లనియె. 255

క. నెయ్యము సెడినను మాటల, తియ్యఁదనము వట్టి పగ మదిన్ మఱచినఁ జా
వయ్యెం జే టయ్యెఁ గలఁక, యయ్యె నొకటి మూఁడుఁ గాక యది మే లగునే.

ఆ. వినుము నేల [4]దోఁచికొనినను దాయాదు, లైన మాటమాట కేని నాఁడు
వారియెడను గీడు వారక చేసినఁ, బగ జనించు నిట్లు భంగు లైదు. 257

ఆ. పగయుఁ గల్గెనేని పాయునె గూఢ మై, ప్రాన నగ్ని యున్నమాడ్కి నుండుఁ
గాన నమ్మి [5]బేల కాలాంతరంబున, నైనఁ జెడును సందియంబు వలదు. 258

క. జననీజనకసహోదర, తనూభవుల సఖుల నమ్మఁ దగ దనినను నె
మ్మనమునఁ బగ గలవారలఁ, జనునే నమ్మంగ విడువు చతురవచనముల్. 259

వ. అనుటయు బ్రహ్మదత్తుం డి ట్లనియె. 260

క. కాలవశంబునఁ గీడు, న్మేలును జనులకును మూఁడు నీకును నాకున్
వాలి యవి సేయ వచ్చునె, బేలనె యే నంత యేల పెడఁబాయంగన్. 261

వ. అనిన విని శారిక యతని మొగంబు దేఱకొనం జూచి. 262

క. విను చల్లనిమాటలలో, మునిఁగి యలుక [6]గుబ్బతిలు సముద్రజలములో

---

1 నమ్మి నిలువుమన్నఁ. 2 డాసిన యమ్మేలు. 3 శకుని. 4 ద్రోఁచికొనినను. 5 'బేలు' అని పెక్కుప్రతులు. 6 గుబ్బటిలు.

నన యుండి యాఱ కెప్పుడు, గనగన మనుబాడబాగ్నికరణి నరేంద్రా. 263

క. అని పలికి యవిశ్వాసము, మనమున నెలకొల్పి రాజుమాటలకుం దే
లనివెరపుతోడ నాపూ, జని దన కిమ్మైనయెడకుఁ జనియెఁ గుమారా. 264

వ. అదియునుం గాక. 265

క. జననాథునకు నవిశ్వాసనిరూఢత వలయు నెల్లజనములయందుం
దనుఁ దనసిరిఁ గాచుటకై, యని నీతులు సెప్పుదురు బృహస్పతిముఖ్యుల్. 266

కణికుఁడు శత్రుంజయున కుపదేశించినహితవచనముల ప్రకారము

వ. అవ్వాక్యంబు లాదరింప వలయు నని పల్కి వెండియు భీష్ముండు పాండవాగ్రజు
తో సౌవీరపతి యగుశత్రుంజయునకు భారద్వాజవంశవర్యుం డైనకణికుండుపదే
శించినహితవచనంబులు గలవు వానిం జెప్పెద నాకర్ణింపు మని యిట్లనియె.

క. వికచముఖుఁ డగుచు శాత్రవులకు హితు లగునట్టివారలం గని భూపా
లకుఁ డెడ్డ కత్తెరయు నాలుక బెల్లము నై [1]మనంబులుం గనవలయున్.

ఉ. జ్ఞాతుల నమ్మి తోడుకొని శత్రుల నోర్చి యహీనరాజ్యముం
బ్రీతి యెలర్పఁ జేకొనినపిమ్మట సౌఖ్యసమృద్ధితోషిత
జ్ఞాతినికాయుఁ డై మది నజస్రము నమ్మక సర్పసంయుతం
బై తనరారురమ్యనిలయంబున నున్నటు లుండఁగాఁ దగున్. 269

వ. అని మరియును. 270

క. వినుము తఱి వేచి రిపు మూఁపున నోపఁగ వలయు సమయముం గనిగొని గ్ర
క్కునఁ గడవ శిలాస్థలి వైచినచాడ్పున నేర్పు [2]మెఱయఁ జెఱుచుట యొప్పున్.

క. పానము జూదము వేఁటయు, మానినియును భూపతులకు మధురవినోద
స్థానము లగు నైనను దగ, వైనవిధము దక్కఁ దగుల మాపద దెచ్చున్. 272

క. విని విననివాఁడపోలెం, గని కాననివాఁడపోలెఁ గావలయు విభుం
డొనరింపఁ దలంచినపని, కను వగునంతకు నభేద్యుఁ డై జనులయెడన్ 273

క. ఒల్లనికార్యం బౌసల, నల్లన కాలగతిఁ గడపునది కాలముచేఁ
బెల్లౌదవు విఘ్నములు భూవల్లభునకు [3]నెపము వెట్టవచ్చుం బిదపన్. 274

తే. బహుళ మగుగర్వమునఁ గార్యభంగియును న
కార్యసరణియు నెఱుఁగ కనార్యవృత్తిఁ
గాని తెరువున నడచు చున్నని గురుని
నైన శాసింపఁగాఁ దగు నండ్రు బుధులు. 275

క. తెగఁ దీర్పక [4]తగ నార్పక, తెగటార్పక కడమకొంత ద్రిక్కఁగ నున్నన్
జగతీశ యప్పు నగ్నియుఁ, బగయును గడుఁ బెరుఁగుఁ గీడు వాటిల్లుఁ దుదిన్.

ఆ. మార్దవమున మృదువు మర్దింపఁగా వచ్చు, మార్దవమున ఖరవిమర్దనంబుఁ

1 మనంబులుం గొనవలయున్; కలయఁ బలుకఁ గా వలయున్. 2 వెలయఁ. 3 దప్పు 4 తెగ.

జెల్లు మార్దవమునఁ జెల్లనియది లేదు, గాన మృదువ తలఁప ఖరము సువ్వె.

వ. అనిన విని యజాతశత్రుండు ధర్మంబు నడవక యవగ్రహాదిదురితంబులు దుస్తరంబు లయిన నాహారంబులు దొరకొననియట్టితో ద్విజాతు లేమిభంగిం బ్రాణంబులు రక్షించుకొనువా రనుటయు నాపగానందనుండు విశ్వామిత్రచండాలసంవాదం బనునితిహాసంబు భవత్ప్రశ్నంబునకు నుత్తరం బైయుండు నాకర్ణింపు మని యిట్లనియె. 278

విశ్వామిత్రచండాలసంవాదము

క. ఏపారి తొల్లి త్రేతా, ద్వాపరములసంధి నొక్కవఱపు ధరిత్రీ
తాపంబుఁ జేసె జనముల, పాపంబున వత్సరములు పండ్రెం డధిపా. 279

సీ. ఏఱులుఁ జెఱువులు నివురఁ గర్షనము లెందును జెడఁ దరులతాదులును గమర
భూమియుఁ బస[1]మాల గోమహిషాదిజీవధనంబు వొలియ భూవరులు మేర
దప్పి లోకములోనిధాన్యముల్ గొన నధర్మంబంత కంతకుఁ [2]బ్రబ్బ నధిక
లనదలఁ జెఱుపంగ యాగముల్ దేవతాపూజలు నెడలంగ భూసురప్ర

ఆ. ముఖము లైనవర్ణములచొప్పు దప్ప నాహారరహితజనము లచట నచటఁ
బడఁగఁ జూడ ఘోరభంగిగాఁ దఱచయ్యె, డొక్కలున్నవారికెక్క భయము.

వ. అట్టిసమయంబున. 281

క. మునిపతి విశ్వామిత్రుఁడు, దనయాఁకలి కెందు మెలఁగి ధైర్య మెడలి యో
దనమాంసమూలఫలములు, జనుల నడిగి యెందుఁ బడయఁ జాలక డప్పిన్.

వ. తూఁగాడుచుం జనువాఁడు. 283

చ. పసరపుటెంపప్రోవులును బందులడొక్కలుఁ గుక్క [3]గుట్టలున్
ముసుఁగు వడంగ భూమితలముం దఱి చారఁగఁ గప్పుచున్ మదిం
బస యొకయింత లేక పెఱప్రాణులనుం బొరిగొంచు నెప్డు దు
ర్వ్యసనతఁ గూరియున్న వెలివాండ్రురపల్లియఁ జేరి యయ్యెడన్. 284

వ. ఆర్తినొంది యిట యట వోవజాలక నేలం బడి యుండి ప్రాణంబులు వోవుట యుపేక్షింపం దగదు ప్రాణరక్షణంబ పరమధర్మం బని వితర్కించి తగునుపాయంబు చింతించు వాఁ డప్పుడ చంపి [4]తి త్రొలిచి గాలిగొన వైచిన కుక్కకడిమంబుఁ గనుంగొని. 285

క. ఇది దప్ప నిప్పు డియ్యెడ, నొదవదు ప్రాణంబు గావ నొం డొకఁ డిదియున్
మది నూహింపఁగ మ్రుచ్చిమి, [5]నొదవించికొనంగ వలసి యున్నది నాకున్.

తే. ప్రాణములు వోవ కుండంగఁ బరిహరింప
నొం డుపాయ మెయ్యదియు లే కుండెనేని
మ్రుచ్చిమియు ధర్మమగు నథమునిథనంబు

---

1 దూల. 2 బ్రబల. 3 పుత్తెలున్. 4 తో లొలిచి. 5 నొదలించి.

గొనుట యెందుఁ ముఖ్య మై చనుట గలదు. 287

వ. కావునఁ జండాలధనం బగుసారమేయమాంసం బపహరించి ప్రాణహాని పరిహ
రించికొందు నని నిశ్చయించియుండ నర్ధరాత్రం బగుటయుఁ జండాలు రెల్ల
నిద్రింప నల్లన లేచి చని యమ్మాంసంబు పట్టి తిగిచిన నచ్చేరువ నిద్రించుచుండా
లుండు విధివశంబున మేలుకని నీ వెవ్వండవు మాంసంబు ముచ్చిలించెదవు
నిద్రవోవం జుమ్ము నిన్నుఁ బొరిగొనియెద ననుటయు భయంపడి గ్రక్కున నమ్ము
నిపతి యేను విశ్వామిత్రుండ నని పలికిన వాఁడు వినయంబున శయ్య డిగ్గి
కరుణంగన్నీ రొలుకం బ్రణమిల్లి కేలు మొగిడ్చి మహాత్మా నీకిలం వేమి యని
యడిగిన నతండు సాంత్వనవచనంబుల నిట్లనియె 288

చ. దరికొనునాఁకలిం దనువిదాహము పుట్టినఁ బ్రాణహానికిం
బరిహరణంబు సేత కిది పాపము నైనను గుక్కనంజు దే
భరపడి ముచ్చిలించెద విభావసుఁ డెంతశుచిత్వసంపదం
బొరసియు సర్వభక్షకతఁ బొందును నన్నును జూడు మట్లగున్. 289

వ. అనిన విని చండాలుండు 290

తే. కుక్క మృగములలో నెల్లఁ గుత్సితంబు
దీనిఁ దిని ధర్మమున కేల హాని సేయ
నొం దుపాయంబు వెదకికొ మ్ముజ్జ్వలాత్మ
యనుడు వానికి ముని యిట్టు లనియె నధిప. 291

క. విను బ్రహ్మవహ్ని నాకుం, బెనుఁబ్రా పై యుండ నేను వెఱతు నె యిట్టి
ననుఁ బోవ నీక ప్రాణముఁ, దనువున నిల్పుటయ చూవె ధర్మం బరయన్. 292

ఆ. బ్రదికి యున్న నేఁ దపంబున విద్యను, బాచికొనఁగ నేర్తుఁ బాతకంబు
నట్టు లగుట జీవితాధార మైనయీ, నంజు డిప్ప డెట్లు నమల కుడుగ 293

చ. అనుటయు నంత్యజుండు నగి యట్టివిధం బధమంబు గాక నె
ట్టన యది ధర్మమే కటకటా మిముబోంట్లకు నిట్లు సేయఁగాఁ
జనునొకొ యన్న నమ్ముని ప్రశస్తుఁ డగస్త్యుఁడు దైత్యమాంసముం
దినఁడె నశించెనే యతని తేజముఁ బెంపును నంతనుండియున్. 294

వ. అనవుడు వాఁ డిట్లనియె. 295

క. పరహితము సేయఁ బూనిన, పురుషుఁడు పాపంబు సేసి పొందఁడు గీడుం
బరమముని యగు నగస్త్యుఁడు, పరోపకారార్థకృతి నభవ్యుం డగునే. 296

క. నాపుడు మదాత్మ బ్రాహ్మణ,తావిద్వత్తాస్పదంబు దానికిఁ గా నే
నీవిధి యొనరించుట పా,పావేశము లేదు దీని కడ్డపడకువే 297

క. అని ముని పల్కిన నంత్యజుఁ, డను మాంసము విడువ నోప కనుటగఁ దలఁపం
జనునె భవదీయ తేజో, ధనహానికిఁ గరుణ పుట్టదా యెవ్వరికిన్. 298

వ. అనవుడు గాధినందనుండు 299

తే. కరుణ గలవేనిఁ బ్రాణంబు గాచికొనఁగఁ
దలఁచునాకు నిమ్మాంస మిమ్మలఘుచరిత
యట్టులైన బ్రహ్మచ్ఛిమియు లేదన్నృత మెడలి
పడయువస్తువు సేయదు పాతకంబు. 300

వ. అనిన విని చండాలుం డి ట్లనియె 301

క. అతిశయితపుణ్యదీప్తులు, ప్రతిగ్రహము నీచనరునిపాలం జేయఁ
మతిఁ దలఁపఁ గూడునే విశ్రుతగుణ యే వెఱతు నింకఁ జూఱచుఱఁ బల్కన్.

వ. నీ వలచినయట్లు సేయు మని సారమేయమాంసం బిచ్చినఁ బుచ్చికొని దానం బ్రాణంబులు రక్షించుకొని విశ్వామిత్రుండు సనియె నింద్రుండు తదనంతరంబ లోకంబులవడ దేఱ వర్షించె నంత హర్షించి యత్తపస్వివర్యుండు దపోవిశేషంబున దోషంబునీఁగికొని మనీషిజనస్తుత్యంబగునిత్యవ్రతంబునవిలసిల్లె నాపత్సమయసమాచారం బిట్టిద యని చెప్పిన భీష్మునితో భూవల్లభుండు ధర్మసూక్ష్మప్రకారం బింతదురవగాహం బగునే యీయితిహాసం బాకర్ణించుట నాడెందంబు విషాదంబు నొందె ననవుడు నతండు ధర్మంబు బహుశాఖాసమన్వితంబై యుండు రాజులకు నెల్లతెఱంగులు నెఱుంగవలయువిషాదం బేలయనవుడునజ్జనవిభుండు

భీష్ముఁడు ధర్మజునకు శరణాగతరక్షణసుకృతం బెఱింగించుట.

క. శరణాగతసంరక్షణ,పరులకు సమకూరు నెట్టిపాటిఫలము ని
ర్భరకరుణాకర పరమా,దరమున నెఱిఁగింపు నాకు దాని తెఱంగున్. 304

ఆ. అనిన భీష్ముఁ డిట్టు లను ముచుకుందుండు, నాఁగఁ బరఁగుధరణినాయకుండు
దనుజమంత్రిచేత వినినది యొకకథ, యఖిలపాపహరణ మాచరించు. 305

వ. అయ్యితిహాసంబు సెప్పెద దాన నీయడిగినయర్థంబు దెలియు నవహితుండవై యాకర్ణింపుము 306

సీ. పాపాత్ముఁ డొకబోయ పక్షుల వధియించి తినియును బెక్కమ్మికొనియు నడియ
బ్రదుకుగా దానికి బహుసాధనంబులు సవరించుకొని మహాటవిఁ జరింప
నొకనాఁడు పెనువానయును గాలియును ముట్టి సకలజీవులకు నాశంబు పుట్టు
నట్టిది యై కాన యంతయు జలమయం బైన బెగ్గిలి యన్నరాధముండు

తే. [1]వేగ వక్త్రోడ యెల్లను వెడలి మిఱుత, నొకవనస్పతి జొంపమై యున్నదానిఁ
జెంది రాతిరి యగుటయు శిలయ సెజ్జ,గాఁగ శీతార్తుఁడై యుండెఁ గౌరవేంద్ర.

క. ఆలుబ్ధకుఁ డత్తరువర, మాలోకించి కడు భక్తి ననియె నిచటిభూ
తాలిం గొలిచెదఁ గరుణా,శీలత ననుఁ గాచుటకు విశిష్టవినీతిన్. 308

వ. అని యి ట్లప్పక్షిధ్వంసకుండు శయనంబుప్రాపించియుండ నమ్మహీమహంబుకోట

1 వెరవుతో నల్లనల్లన వెడలి మిఱుత; పెల్లు వక్త్రోడిఁ బడియంత నుల్లి మిఱుత.

రంబున వసియించి యుండునది యొక్కకపోతంబు దనవల్లభ యొటయేని మేఁ
తకుం బోయి రాక తడసిన శోకించి. 309

సీ. ఎచటనున్నదియొక్కొ యింతప్రొద్దాక చోట నుండు నేననుఁబాసి యుజ్జ్వలాంగి
యస్మేను లేకున్న నిస్మేలికలిమి నిరర్థకం బధికానురాగయుక్త
యగుపతిగుణముల నైహికాముష్మిక సుఖసాధనంబులు సువ్వె పతికి
నేకారణంబున నే మయ్యెనో వానయేపునఁ దెగియెం గా నోపు నకట

తే. నేమి సేయుదు మందిరం బిపుడు పాడు, వాఱుచున్నది యనఁగ నప్పలుకులెల్ల
బోయవలలోన నున్నకపోతి విని మనంబు సంతోషపూరమగ్నంబు గాఁగ. 310

క. పతిమదికి నింత యెక్కిన, యతివగదా పుణ్యవతి ప్రియాలాపము లీ
గతి వినఁ గాంచితి జన్మము, కృతకృత్యం బయ్యె నాకు గెలిచితిజమునిన్. 311

వ. అని యుల్లంబునన యుగ్గడించి పతికిం దన తెఱం గెఱింగించి విధికృతంబునకు
వగవం బని లే దని మఱియు ని ట్లనియె. 312

చ. శరణము సొచ్చినం దగఁ బ్రసన్నతఁ గైకొని రక్షణంబు సా
దరముగఁ జేయు టత్యధికధర్మముగా బుధకోటి సెప్పు నీ
వరసిమహా ర్తు వీని శరణాగతు నోపినభంగి నాపదం
బొరయక యుండఁ జేయుము ప్రభూతపునీతునఁ గొంకు వోయెడున్. 313

క. అని యేర్పడ భాషించిన, విని శోకము డిగ్గవిడిచి విహగము గరుణం
దనజాతి సెప్పి తగ ని, ట్లనియె మనుజభాషణముల నాలుబ్ధకుతోన్. 314

క. ఓయన్న డస్సినాఁడవు, మాయింటికి నతిథి వైతి మసలక నీకుం
జేయవలయు నాతిథ్యం, బేయది భవదీప్సితార్థ [1]మెఱిఁగింపవనా. 3 5

చ. అనవుడు నుల్ల మెంతయుఁ బ్రియంబు వహింపఁగఁ బక్షివైరి సీ
తున సకలాంగకంబులుఁ [2]బ్రతున్నము లయ్యెడు దీనిఁ బాపవే
యనిన విహంగమంబు రయ మారఁగ నచ్చటిపుల్ల లెల్ల ము
క్కునఁ గొని తెచ్చి ప్రో విడి యకుంఠిత మైనదయాగుణంబునన్. 316

వ. ఆపాంతపల్లియకు రయంబునం జని పుల్లతల సంగతం బై నయింగలంబు. 317

క కొనివచ్చి పుల్లప్రోవునఁ, దనుకంగాఁ జేసి నెమ్మి దళుకొత్తఁగ ని
ట్లను బోయతోడ మే నీ, యనలంబునఁ గాఁచికొనుట కై లె మ్మనఘా. 318

చ. అనవుడు వాఁడు గుప్వహృదయం బలరం దనయంగకంబు ల
య్యనలశిఖాకలాపమున నల్లన యల్లన కాఁచి శీతబా
ధన్స ముడుగంగఁ జేయఁగఁ బదంపడి యాఁకలి సాలఁ దోఁచెం దోఁ
చిన నెఱిఁగించె గువ్వ కది సేయ నుపాయము లేక యాత్మలోన్. 319

వ. వగచి వెలువెలంబాఱి తలంచికొని వాని కి ట్లనియె. 320

---

1 మెఱిఁగింపుతగన్. 2 బ్రదూనము.

తే. ఖగములకు జీవనం బటఁ గలదె సంగ్ర, హించినట్టిది యాఁకలి కేమి యైన
మాకు దొరకున్నఁ దిందుము గాకయైన, నీవు డస్సితి వాతిథ్య [1]నియతివలయు.

కపోతంబు దనశరీరమును బోయ కాహారంబుగా నిచ్చుట.

వ. నాశరీరం బాహారంబుగా నిచ్చెదఁ గొనుము. 322

క. అని పలికి యగ్ని వలగొని, తనదేహము దానిలోనఁ దడయక యిడినం
గని బోయ విస్మయంబున, మన మూనఁగఁ గొంతసేపు ప్రాన్పడి యుండెన్.

వ. పదంపడి. 324

మ. కలదే యిమ్మెయిపౌరుషంబు జగతిం గారుణ్య మేపార ని
ష్ఫలుఁ గిట్లిచ్చునె మేను నాదుచరితంబుల్ నిందకుం బట్టు లై
తలఁపన్ వచ్చిన నింతకీ డగునె యేతత్క్రూరతాఘోరచే
ష్టలు మానం గలవాఁడఁ బక్షిగురు వై సంధించె సద్బోధమున్. 325

వ. అని యంతరంగంబున వైరాగ్యంబు నిరంతరం బగుటయు నంత నిలువక. 326

మ. ఇది యిట్లాలిని బంధులం దొఱఁగి తా నీయగ్నిలోఁ గూలె నొ
ప్పిదమై యుండఁగ నిట్టి[2]తెంప యొలయం బెంపారువైరాగ్యసం
పద పాపంబుల నెల్లఁ ద్రుంపఁగ మహాప్రస్థానపుణ్యాత్మ మొం
దెద నే నిప్పుడ యంచు మానసము శాంతిం బొంద నిర్మోహుఁ డై. 327

క. వలలోన నున్న పులుఁగుల, వెలువడఁగా విడిచి వలయు వెండియుఁ దనకుం
గలపక్షినిహతిసాధన,ములు నచటనె యుండఁ బోయె బోయ నియతుఁ డై.

ఆ. అక్కపోతి నాథుఁ డగ్నిలోఁ బడుటకు, శోకవహ్నిఁ జిత్త మాకులముగ
నెలుఁగు రాలుపడఁగ నిట్లని పలవించె, నశ్రుజలతరంగితాస్య యగుచు. 329

క. నాయాఁకలి కోర్వ వెపుడు, వే యైనను నేఁ గొనంగ వెండి యనుభవిం
తాయాస పడుటఁ గనుఁగొని, నోయుదు నచుఁబాసి యిట్లు సనుట దగవగునే.

వ. అని వెండియు. 331

సీ. ఇరుగుజొంపంబుల నింపారువిరులను బలు పైనపొదలక్రేవలకుఁ దార్చి
సెలయేటిలుంకలి తెలినీటఁ దనుపుసొం పెలసినగిరుల [3]తెప్పలకుఁ జేర్చి
మావిమ్రాకల నెలదీవలఁ జెన్నొందు తోఁటలకడ [4]నలితోడఁ జెంది
యలరుసెత్తమ్ములకలిమిఁ జెల్వగుడిగ్గి యలతీరభూముల నల్లఁ బొంది

తే. నన్ను మనమునఁ దేల్చి యానంద మొందఁ, గేలి సలిపెడునీ దగులీల మఱవ
నావశంబె ప్రాణేశ ప్రాణంబు లిపుడ, నిన్నకూర్చి యేతెంతు నీసన్నకడకు. 332

వ. అట్లుం గాక. 333

క. తెనియనుమరణమునఁ దన, మేను విడిచినట్టికాంత మేలిపదవికిం
దాను నతండును నరిగి య,మానస్థిరసుఖము లందు చుండుట విందున్. 334

1 నీతి. 2 తెంపు వెలయం. 3 తెంపలకుఁ. 4 నర్థితోడఁ

క అని పలికి యప్పుడ యనలము, ఘనముగ దరికొల్పి మది వికాసముఁ బొందం
దనవల్లభుఁ దలఁచుచు వల, గొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్. 335

క. స్ఫురితవిమానముమీఁద న,మరతతి వేష్టింప రత్నమయభూషణుం
దరదివ్యమూర్తి వెలిఁగెడు, వరునిఁ గలసి పరమసౌఖ్యవైభవ మెసఁగన్. 336

తే లీల మూరిఁబోనచ్చర లేమపిండు, బలసి యభినందనము సేయఁ బొలిచె నిట్లు
సనినపక్షియుగ్మంబు వర్తనము దోఁచెఁ,బుణ్యవర్తనుఁ డగుట నాబోయ కప్పుడు.

వ తోఁచిన నతండు. 338

క. ఏనును ని ట్లగుదు ననుచు, మానినకౌతూహలమున నుల్లము వొదలఁగా
మేనెల్ల ముంప్లు సింపఁగఁ, గానఁ దఱిసి గళితరక్తకలితాకృతి యై 339

తే. అరుగుచుండువాఁ డొకచో దవానలంబు, గట్టిదిరికానవం బెల్ల ముట్టిమండ
సంభ్రమోపేతచిత్తుఁడై చక్కఁజొచ్చి,యొడలువోఁ ఱఁగి దేవత్వంబువడసియొప్పె 340

ఉ. ఈయితిహాస మర్థిమెయి నెజ్జనముల్ వినినం బఠించినం
బాయు నుదాత్తగోహననపాతక మైనను భూరిసౌఖ్యముల్
వేయివిధంబులం బొరయు విన్ము తగఁగా శరణార్థిఁ దోషితుం
జేయని[1]వాఁడు కల్మషముఁ జెందు నొకప్పుడుఁ బాయ దేమిటన్. 341

వ. అని యిట్లు శరణాగతరక్షణాఫలవిశేషప్రకటనం బగులుబ్ధకకపోతాఖ్యానంబు
చెప్పిన విని యప్పితామహునిమీఁదం బ్రీతివినయవిస్తారవిలోకనం బెలయ న
ప్పాండవాగ్రజుండు. 342

క. పాపంబు బుద్ధిపూర్వ, వ్యాపారము గాక తొడరినప్పుడు మనుజుం
డేపాట దానినంతయుఁ, బాపికొనం జాలు సుజనబాంధవ చెపుమా. 343

వ అని యడిగిన నయ్యార్యవర్యుం డాధరణీభరణధుర్యునకు నిట్లనియెఁ దొల్లి పరి
క్షిత్తనయుం డగుజనమేజయుం డనుమహారాజు దన కబుద్ధిపూర్వకబ్రహ్మహ
త్య వాటిల్లినం దత్కిల్బిషంబు వాపికొనియె నది పురాణకథయై మునులవలన
వినంబడు నత్తెఱం గెఱింగించెద నాకర్ణింపుము 344

క. పాపంబు దొడరుటయు నా, భూపాలకుఁ బ్రజయు విడిచె భూసురులును నిం
దాపాత్రంబుగఁ జేసిరి, తాపము మదిఁ గదిరి యతఁడు తల్లడ మందెన్. 345

తే. అట్లు జనమేజయుఁడు వగ నారఁ గూరి
పురము వెడలి యొక్కరుఁడును బోయి కాన
నాంతరము సొచ్చి శౌనకుం డనుమునీంద్రు
నాశ్రమము రోసికొని చని యమ్మహాత్ము. 346

వ. కాంచి దండప్రణామం బాచరించి సవినయంబుగఁ గరంబులు మొగిచి నిల్చి
నం జూచి యతండు. 347

1 వాఁడు... బాయఁ డేమిటన్.

చ. వెనుఁబోల వల్చుచున్నయది పీనుఁగుఁ జూచినయట్లు లయ్యెడున్
నినుఁ గనుఁగొన్న నీయెడకు నీవిది యేటికి వచ్చెఁ దెక్కడేఁ
జనుము శిరంబు క్రిందుగ నజస్రము వ్రేలఁ గలాడఁ పీభవం
బునఁతుదిఁ గ్రూరకాకచయముల్ దొలువన్ నరకాధివాసి వై. 348

చ అనుటయు గర్హకర్హుఁ డగునట్టిదురాత్మునిఁ బూజితవ్రతుల్
గని యిటు లంటయుక్త మటు గాన కదా భవదీయపాదవం
దన మొనరించి మీఁపలన దారుణపాపము వాచికొందు నే
ననుచుది వచ్చినాఁడ సదయం బగుచూడ్కిఁ బరిగ్రహింపవే. 349

వ. అనిన విని కరుణాయత్తచిత్తుం డగునత్తపోధనసత్తముం డిట్లనియె. 350

క. విను కొంద ఱల్పబుద్ధులు, నను నెంతయు ధిక్కరింప నవ్వఁగ వారిం
గొనక బుధు లైనవిప్రులు, ననిమిషులును మెచ్చుచుండ ననియెద నీతోన్. 351

క. హీనప్రజ్ఞుఁ డకార్యము, లైనవి నేసి తుది వగచు నతులప్రజ్ఞా
సామమదారూఢుఁడు వగ, నూనఁడు [1]దురిత మనువఆతిఁ గోడక యునికిన్. 352

వ ప్రజ్ఞాకార్యంబు లై యనుష్ఠింప వలయువానిం జెప్పెద నీకుం బాపంబునెడ
ననుతాపంబు గలిగి ధర్మప్రవణుండవై తి యనుటయు నమ్మనుజనాథుండు. 353

క. తాపసవర తీవ్రం బగు, పాపాగ్నిజ్వాలచయము పాలుపడి పరీ
తాపము నొందుచు ధర్మ,వ్యాపారజలాభిలాషి నై యున్నాఁడన్. 354

వ. భవదీయకృప నాశ్రయింప వచ్చితి నన్నురక్షింపవే యనవుడు నమ్మునీంద్రుండు.

క భీతి [2]యొకటి గోరుటయును, నీతలఁపులలోన దీని కిది గత మనఁగా
నే తెరువును గలుగదు మ, చ్చేతోగతి ధర్మవృత్తిఁ జిక్కుట దక్కన్. 356

క. ఆతురత నీవు నాకడ, కేతెంచినదానఁ జేసి యెలసినధర్మ
ద్యోతనకౌతూహలమున, నీతోఁ బడవలసె వినుము నిశ్చలమతివై. 357

క భూవిబుధుల కెయ్యది హిత, మావిధమున నడచువాఁడ వగునది ద్రోహ
భావంబు ప్రతిజ్ఞాతం, బై వెలయఁగ వలయు నీకు నాజాతియెడన్. 358

చ అనవుడు ధర్మవృత్తము మదాత్మకు నైజము దోషవృత్తికిన్
మునివర యేను భీతుఁడ సముజ్జ్వలవిప్రకులంబు నాకు మ
న్ననలకుఁ బాత్ర మెవ్విధమునం దెగి ద్రోహము దానియందు నా
మనము దలంప దింతకును మాన్యభవచ్చరణంబు లంటెదన్. 359

వ. అనుచుఁ దదీయపాదస్పర్శనంబు సేసి యవ్విధంబునం గృతశపథుం డగుటయుఁ
గరుణాగోచరం బగుచిత్తంబుతో నత్తపోధనవర్యుం డాదరమేదురావలోకనం

---

1 దురితములవిరతి కోపకయుండున్. 2 నొకటి గోరుటయును, నీతలఁపునఁ దోడ దీనికేది గతము నా, నేతెరువునఁ గలుగదు.

బాభూపాలునిమీఁద నొలయు నిట్లను నశ్లేనిం జెప్పెద నవహితుండ వయి యాకర్ణింపుము 360

సీ. శ్రీమంతుఁడును బలశ్రేష్ఠుండు నగురాజు భోగంబు దర్పంబుఁ బోవ విడిచి
ధర్మంబు గైకొని తపమును దానంబు నధ్యయనంబును యాగవిధులు
నాచరింపఁగఁ జూచి యచ్చెరువడి యనుగ్రహము సేయదె భూతరాజి యతని
కధిప యయాతివాక్యము నర్థ మెఱఁగింతు వినుమ సరస్వతియును దృషద్వ

తే. తియును నఘపుణ్యనదులందుఁ దిరిగి తీర్థ, సేవ సేయుచు నధ్యయనావధాన
దాననిర్ధూతరాగత్వదయలు గలిగి, పరఁగఁ బాపకళంకలేపంబు వాయు. 361

వ. అదియునుం గాక యొక్కపరమస్మృతి సెప్పెద వినుము 362

చ. దురితము సేసి తాపమునఁ దూలిన నిం కిటు సేయ నన్మతిం
బొరసిన ధర్మసంచరణ బుద్ధియ మే లని యూఁదినం గ్రియా
పరుఁ డయి మేలు సేసినను బాదము పాదముగాఁ గ్రమంబునన్
విరియు సమస్తముం దదభివిష్టకళంకము నిశ్చయంబుగన్. 363

చ. నరవర పాపముం డడిగినన్ గురుఁ డిట్లని చెప్పె బుద్ధితోఁ
బొరయనిపాతకంబులు సబుద్ధికపుణ్యములన్ నశించు నం
బరమునఁ బట్టినట్టిమలపంకము గారములోన నద్దఁగా
విరిసినయట్లు నమ్ము మిది వేదము సెప్పిన నేనుఁ జెప్పితిన్. 364

వ. అని యిట్లు బహుప్రకారంబులం గారుణికోత్తముం డగునత్తాపసోత్తముం డా భూవరు బోధించి తీర్థసేవాదిపునశ్చరణంబులం బరిపూతాత్ముం గావించి యశ్వమేధంబు సేయించిన నుజ్జ్వలుం డయి యజ్జనమేజయుండు నిజరాజ్యంబు పరిపాలనంబు సేసె నని చెప్పి వెండియు. 365

భీష్ముఁడు ధర్మజునకుఁ గృధ్రజంబుకోపాఖ్యానము సెప్పుట.

సీ. గాంగేయుఁ డిట్లనుఁ గౌంతేయపూర్వజునకు విదిశాపట్టణమున నొక్క
బాలుండు మృతుఁ డైన బంధులు ప్రేతభూమికిఁ గొనిపోయి యమేయశోక
వివశాత్ములై పలవింపఁగా గ్రద్ధ యొక్కటి వచ్చి మీఁద నిక్కడ భయంబు
దక్కి యేడ్చుచునుండఁ దగ దిదె క్రుంకెడుఁ బ్రొద్దు రాక్షసులును భూతములుఁ బి

తే. శాచములు వచ్చి తిన నిపు డేచి వచ్చు, జననమరణముల్ వింతలె చన్న శిశువు
తోన యందఱుఁ జనుటకుఁ బూని యుండు,వారలే పొండుపీనుంగు వైచివేగ.

క. తెగి పోయినవా రేడ్చిన, మగుడుదురే వెఱ్ఱులార మానుఁడు మీరుం
దెగుదురు దడసిన నావుడు, నగు నట్టిద కర్జ మనుచు నంద ఱు భీతిన్. 367

వ. శవంబు విడిచిపోవం జూచిన నొక్కనక్క [1]బొక్కలో నుండి వెడలివారలతోడ.

సీ. గ్రద్ధమాటల కేల కడుభీతిఁ బొందితి రక్కటా బాలుని నజ్జనదను

---

1 బ్రొక్క.

నిటు వైచి పోవఁ గా శ్లిట్లాడె నేడ్వఁడు శోకంబు వోవ నిచ్చోటఁ గొంత
ప్రొద్దంతలో విధిక్రూరుండు గాకున్నఁ బ్రాణంబు గ్రమ్మఱ రాక గల్గు
నో యెఱుంగుదురే యినుండును నస్తాద్రిఁ [1]జేరఁడు వెఱవక మీరు నిలువుఁ

తే. డనిన వాపను మనమున నాస వుట్టి, మగిడి వచ్చిన గ్రద్ద యిమ్మందబుద్ధి
యైననక్కమాటలు విన నగునె వికృత,మయ్యెఁ బీనుంగు వచ్చునేయనువులింక.

క. కడుబెట్టిదుండు కాలుఁడు, మిడుక మిడుక నపహరించు మీ రీయాసల్
విడువుఁడు బాలునికి సుగతిఁ, బడయుఁడు దానాదు లైన బహుధర్మములన్.

వ. అని పలికిన నాగృధ్రంబువచనంబు లాక్షేపించి యజ్జంబుకంబు వారల నుద్దేశించి

క. క్రూరంబు గృధ్ర మిట్టిదు,మారకునిం జూచి చూచి మసలక పోవన్
మీ రెట్లోర్చెదరో క,న్నీ రిటు ననుబోఁటులకును నిలువ కొలికెడున్. 372

క. దయ మాలి పోవ నేటికిఁ, బ్రయత్నమునఁ బోదువ దైవబలమున మీకుం
బ్రియ మెసఁగ బ్రదుకు బ్రదుకం, డయినను మఱిపోవ రాదె యని చెప్పుటయున్.

వ. గ్రద్ద యిట్లనియె. 374

ఆ. ఏను బుట్టి వేయు నిన్నూఱు మున్నూఱుఁ, గలవు వత్సరములు గాన నెందు
బాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధుని; జచ్చి పోయి మగిడి వచ్చువాని. 375

క. ఒకటి గలదు చత్తురు వే, ఱొకగర్భంబునకు మృతులు [2]నుక్కివ మాన
క్కను నేటిబుద్ధి పీనుఁగు,నకు బ్రదుకలె గలుగు నిట్టినవ్వులు గలవే. 376

సీ. అనవుడు [3]నెగ వెక్కి యాబిడ్డ వైచి పోయెడువారలకు నడ్డపడుచు నక్క
యినుఁడు రాఘవుఁడు నేర్పున బ్రదికింపఁడే మృతుఁ డైనభూసురసుతుని మగుడ
సృంజయుకొడుకు సచ్చిన నారదుఁడు ప్రభావంబునఁ గ్రమ్మఱ వానిఁ దేఁడె
యట్టులయొకసిద్ధుఁ డమరుండు మీ యేడ్పు లాలించిదయ బాలు నసువులొసఁగ

ఆ. నేని మేల కాదె యిది యేల పోయెద, రనిన వారు మగిడి యరుగుదెంచి
శిశుపుశవముచుట్టుఁ జేరి పెల్లేడ్చిరి, పనవి పనవి యంత నినుఁడు గ్రుంకె. 377

వ. ఆగృధ్రంబును జంబుకంబును నాఁకలిచేత వందురుచుండి తానతానబాలశవంబు
నాహారంబు గొనుటకై యివ్విధంబునం దమతమపల్కునేర్పున నజ్జనంబుఁ
గ్రమ్మఱించెఁ బ్రొద్దు గ్రుంకినం దా నచ్చోట నిలువ నేరదు గావున గ్రద్ద
యటమున్న వారు వోవునట్టి తెఱంగు మాట లాడె రాత్రియైనం దనకు మేలు
గావున నక్క వారలు దడయుటకుం దగినచందంబుఁ జెప్పె నది వాని తెఱంగు
ప్రేతవనవిహారనిరతుం డగుశంకరుండు కరుణాకింకరుం డగుట నప్పుడు. 378

ఆ. అట్లు పనవి యేడ్చు నజ్జనంబునకుఁ బ్రత్యక్షు డై వరంబు లడుగుఁ డనిన
సంప్రమోదభక్తి సంభ్రమభరితు లై, చక్క నవనిఁ జాగి మ్రొక్కి వారు 379

---

1 జేరెడు. 2 యుక్తి నిజమె నక్కకు. 3 నెక వెక్కి; వెకి వెక్కి.

క. బాలమరణశోకంబునఁ, దేలక యుండంగఁ గావు దేవోత్తమ నీ
వాలించిన బ్రదికితిమి ద,యాళుహృదయ పార్వతీప్రియా చంద్రధరా 380

వ. [1]అనుచు లేచి నిలుచుటయు శివుం డాశిశువుప్రాణంబు లొసంగి వీఁడు శతా
యుస్సంపన్నుం డగువాఁ డని యాన తిచ్చి యాగృధ్రజంబుకంబులకు నాఁకలి
యెన్నండును లేక యుండం బ్రసాదించి యంతర్హితుం డయ్యె సంతోషంబున
నంతరంగంబులు నంగంబులుం బొదల నజ్జనంబులు బాలు నెత్తికొని పలుమఱుం
జూచుచుం గౌఁగిలించుచుం జనిరి గృధ్రంబును జంబుకంబును ముదంబునం
బొంగుచుం బోయి తమతమకులంబులలోఁ బ్రభూతంబు లై ప్రవర్తిల్లె నార్తజ
నబాష్పప్రమార్జనంబు ప్రభువునకుం గర్తవ్యం బగుటకును నిజకార్యార్థు లగు
కపటులనేర్పుమాటలతెరువు లెఱింగికొనుటకును నుదాహరణం బై నయీగృ
ధ్రజంబుకోపాఖ్యానంబు. 381

క. వినినఁ బఠించిన వ్రాసినఁ, గొనియాడిన దురితపీడకుం దొలఁగి నరుం
డనుపమధర్మములకు భా,జన మగు నాయుఃప్రవృద్ధి సంపద నొందున్. 382

భీష్ముఁడు ధర్మజునకుఁ బవనశాల్మలీతరుసంవాదంబు సెప్పుట.

సీ. అని వినతుం డగునాధర్మసుతునకు ముదమునఁ జెప్పెభీష్ముండు మఱియు
నిట్లను నిది యొక్కయితిహాస మధిప యాకర్ణింపు హిమవన్నగంబునందుఁ
గల దొక్కబూరుగు గడుఁ బెద్దకాలంబు ముదురు శాఖాశోభిమూలదృఢము
నారదముని యొక్కనాఁ డత్తరువుపొంతఁ జని చని వేడ్క ని ట్లనియె నెమ్మి

తే. బూరుగా యింతపఱపును బొడవుఁ గల్గి, నీవు మృగపక్షిసంశ్రయణీయ మగుచు
నునికిగని ప్రీతి నడిగెద ననిలుచేతఁ, బడు [2]నొకప్పుడు తరులు నీ పడమియెట్లు.

క. పవనునకును నీకును బాం,ధవము గలదొ యతఁడు నిన్ను దయ రక్షింపన్
సవినయవృత్తిని బ్రతికితొ, చెవులకు నిం పెసఁగ నిజము సెప్పుము నాకున్. 384

క. అనిన విని బూరు విట్లను, ననిలునిబల మస్మదీయ మైనబలముతోఁ
నెన గా దేర్పడ విను పదు,నెనిమిది యగునంశమునకు నెనయ దరయఁగన్. 385

వ. అని పలుకుటయు నమ్మునీంద్రుండు. 386

ఆ. అమ్మచెల్ల యిట్టు లనకుము కొండలు
లోను గాఁగఁ బవనుచే నపాస్త
[3]మహిమ గలుగు లెఱుఁగుమా భూతములచేష్టి
తములు వాయువశగతములు గావె 387

క. అనుటయుఁ బెలుచనియెలుఁగున, ఘనమూలప్రబలశాఖకాదుర్జయు న
న్నును దాఁకిన నతని ప్రభం,జనుఁ డనునామంబునకు నసత్యత వచ్చున్. 388

వ. అని గర్వంపుమాట లాడినయాశాల్మలిం జూచి సురమునిప్రవరుండు. 389

---

1 అని యనేకవిధంబుల వేఁడుటయు శివుం. 2 మహీజము లెల్ల సీ. 3 మహిమము లగు లెఱుఁగు.

చ. మఱవక యుండు నీబిరుదుమాటలు నీ విటు లంట మారుతుం
డెఱిఁగెడు నెట్లు నంచు వెస నేఁగి సమస్తముఁ జెప్ప నాతఁ డే
త్తెఱఁ జనుదెంచి నీ వలె కడిందిమగండవు నిన్నుఁ దాఁకినం
జెఱు తలె వేరు బూరుగ నశించితి గా కిట పల్కు లేటికిన్. 390

మ. అని కోపంబునఁ బల్క నప్పవనుతో నాభూరుహం బింతపె
ల్చన నీ [1]వాడెడునంతతక్కువనె బేలా లోకసామాన్యవృ
క్షనికాయంబును నన్ను నొక్కటిగ నిచ్చం జూచితే యన్న న
ల్లనిన వ్వొప్పఁగ నాసమీరణుఁడు హేలాస్ఫారుఁ డై యిట్లనున్. 391

క. ఒకనాఁ డజుండు నీనీడకు డబ్బొటఁ గుదెంచుటయు నమ్మే లా
త్మకు ప్రేఁగై మన్నించిన, మెకమెకపడి తిట్ల పలుకు మీ తగ రేపున్. 392

వ. అని పలికి పలుమొగంబుతోడం బోయిన నబ్భూరు దలంకి. 393

చ. మనుగడ దప్పునొక్కొ మునిమాటలు వైకొన నైతి నాబలం
బన నది యెంత యుగ్రత మహాబలు రాకను నోర్వఁజాల నా
తని నొకభంగి గెల్తు నని దాఁ దలపోసి హరించె నాకులుం
గొనలును జొంపముల్ నిడుదకొమ్ములు రే యడుగుక రయంబునన్. 394

వ. అట్లు తన్నుం దాన విఱుచుకొని యున్నంత వేగుటయు 395

చ. ప్రతినకు నీడు గా భయదభంగిఁ బ్రభంజనుఁ డేఁగుదెంచి యా
క్షితిరుహముం గనుంగొని యిసీ యిది నాపని నీవ చేసి [2]తీ
ధృతి మతి సంతసింపు మిట తేజముఁ బొందుము నీదుబాంధవ
ప్రతతికి నివ్విధంబుసదుపాయము మేలెఱిఁగింపు పెంపునన్. 396

వ. అని యుల్లసం బాడి సముల్లసదతి నాసదాగతి ననియె నట్లు శాల్మలి పవను
చేత భంగంబు నొంది వగం గుందెఁ బ్రబలునితోడ దుర్బలుండు దొడరి మత్స
రగ్రస్తుం డయిన నపాస్తవిభవుం డగు నని తెల్పు నప్పవనశాల్మలీసంవాదంబు
పుణ్యప్రదం బయినయుపాఖ్యానం బని చెప్పిన. 397

ఆ. పాండవాగ్రజుండు పాపంబునకు నధిష్ఠాన మెద్ది భరతసత్తమాగ్ర
గణ్య దాని నెఱుఁగఁగాఁ జెప్పు మనుడు నాతనికి భీష్ముఁ డిట్టు లనియెఁ బ్రీతి.

సీ. వినుము పాపముల కెల్లను నధిష్ఠానంబు లోభంబ యది కామలోలతయును
గ్రోధంబు మత్సర ద్రోహంబులును బరధనదారవాంఛలు దైన్యపాటు
ప్రీడాక్షమాసత్యవిముఖభావంబును గలిగించి ధర్మంబు గలఁచి నరునిఁ
బ్రయి మాలి యేమిటి కయినను [3]గర్ధించు వానిఁగా సమకట్టుఁ గాన లుబ్ధ

ఆ. జనులఁ దొఱఁగి లోభ మనుతిరిం బడనిస, త్యవ్రతులను బరమధార్మికులను

---

1 వాడెద వంతతక్కువనె. 2 తిమ్మతి నిఁక సంతసింపు మిటుమన్ననఁ బొందుము. 3 నర్థించు; బొంకించు.

బాపభీతమతులఁ బనిగొను లోభంబుఁ, జెంద నీకు నీదుచిత్తవృత్తి 399

వ. అనిన విని యజాతశత్రుం డజ్ఞానం బాపదలకును దుర్గతికిని మూలం బని విందు
దాని తెఱం గెఱిఁగింపు మనిన నాపగాతనయుం డమ్మనుజపతి కిట్లనియె. 400

క. రోషము శోకము రాగ, ద్వేషము లభిమానదర్పవేగాలస్యా
శ్లేషము లజ్ఞాన మని మ,నీషిజనము సెప్పు మాననీయచరిత్రా. 401

క. విను లోభము నజ్ఞానం,బును సదృశఫలప్రదముల పుట్టును లోభం
బున నజ్ఞానము గావున, జననాయక లోభ ముడుగ సౌఖ్యము లొందున్. 402

ఆ. అనిన ధర్మపుత్త్రుఁ డనఘ ధర్మంబు నా,నాప్రకారగతి వినంగఁ బడు మ
దీయచిత్తమునకుఁ దేటపడంగ వి,శిష్టధర్మ మెద్ది సెప్పు మనుడు. 403

వ. ప్రియం బంది భీష్ముం డతని కిట్లనియె. 404

భీష్ముఁడు ధర్మజునకు దమంబు ప్రభావం బెఱిఁగించుట.

క. తమతమ కలవడువిజ్ఞా,నముల తెరువు లాదరించి నానాగతులన్
సుమతులు ధర్మము దెలిపిరి, దమము పరాయణము ధీరతమ యన్నిటికిన్. 405

తే. దమము నిశ్శ్రేయసము పుణ్యతమము ధర్మ
సార మది వెలిగా ధర్మసంచయంబు
సిద్ధిఁ బొందునె దమముతో బుద్ధి పొందు
గనినఁ బొందనియున్నతుల్ గలవె యధిప. 406

క. తమముం గడచినసద్ధ,ర్మము లే దని విందు నాశ్రమము లన్నిటికిన్
దమవంతుఁడు గామముఁ గ్రో,ధము లోభము మత్సరంబు దర్పము గెల్చున్.

క. శీలంబు మైత్రి కరుణ య,లోలుపభావము తితిక్షలో నగుమునిలో
కాలంబనీయసద్గుణ, జాలంబు దమంబురూపసంపద యధిపా. 408

క. గుహయందు నిహిత మనియెడు, మహనీయబ్రహ్మపదము మహితదమతో
పహితుం డగువానికి స,న్నిహితం బని చెప్పుదురు మనీషిజనంబుల్. 409

వ. అని విశదంబుగా వివరించె 410

ఆ. అట్లు దమముమహిమ యాదరంబున విని, యమృతసేవ సేసి నట్లపోలె
హర్షమయమనస్కుఁ డై భీష్మ నడిగె నా,ధర్మనందనుండు దపమువిధము. 411

వ. అడిగిన నతం డతని కిట్లనియె. 412

భీష్ముఁడు ధర్మజునకుఁ దపంబువిధము సెప్పుట.

క. తపము నిదానము ధర్మ,ప్రపంచమున కెల్ల దానిఁ గ్రమమున వ్రతతం
త్రపరాయణు లొనరింతు ర,ధిప ఫలమూలాంబువృత్తిఁ దృప్తిఁ బొరయుచున్.

క. విను మశననిగ్రహము దప, మనునభిధానంబు గలమహాధర్మము త
ద్ధనవంతుచిత్తవశగతిఁ, జను నఖిలస్థావరమును జంగమతతులున్. 414

తే. పంచవిధవృత్తు లగుమహాపాతకములు, లోనుగాఁ గిల్బిషము లెల్ల లుంఠితంబు

లగుఁ దపంబున సత్యశౌచాదు లొాలయు, నఖిలసిద్ధులు నటచేత నావహిల్లు.

వ. అనిన విని దేవపితృభూదేవగణంబులు సత్యంబు ప్రశంసించుఁ దదీయస్వరూపం బును నది దొరకొను తెఱంగును నెఱింగింపు మని యడిగిన నజాతశత్రునకు శంతనుపుత్త్రుం డి ట్లనియె. 416

భీష్ముఁడు ధర్మజునకు సత్యస్వరూపాదులు సెప్పుట.

క. సమతయుఁ దమముఁ దితిక్షయు, నమత్సరము హ్రీయు ధృతియు ననసూయార్య త్వములు నహింసాదాన, క్షమాత్యజనసూనృతములు సత్యముమూర్తుల్. 417

క. సత్యాకృతు లగుగుణములు, నిత్యాసుస్థితసమగ్రనిర్మలయోగ స్థిత్యభిముఖునకు సులభము, లత్యంతసుఖప్రదంబు లవికార్యంబుల్. 418

చ. కుదురు సమస్తధర్మములకున్ విను సత్యము యోగమోక్షస
త్ప్రదములు సత్యకార్యములు పాప మసత్యముకంటె నొండు లే
దు దలఁప నశ్వమేధములు దొమ్మిదినూఱులు వెండి నూఱునై
యొదవిన నీడుగావు భరతోత్తమ సత్యముతోడ నారయన్. 419

వ. అనిన విని ధర్మతనయుం డరిషడ్వర్గం బేమిట నుదయించు నెట్లు సమయు నెఱిం గింపవే యనుటయు ననిమిషనదీనందనుండు ధర్మనందనున కి ట్లనియె. 420

భీష్ముఁడు ధర్మజున కరిషడ్వర్గాదులు దెలుపుట.

సీ. మనుజేంద్ర సంకల్పమునఁ బుట్టుఁ గామంబు రూపఱు దేహనిరూపణమునఁ
బరులదోషంబునఁ బ్రభవించుఁ గ్రోధ మక్షీణక్షమాయుక్తిఁ జేసి పొలియు
భూతాస్థిరత్వంబు బుద్ధిఁ గానమి లోభమనఘ జనించుఁ గాంచిన నడంగు
నజ్ఞానమున మోహ మావహిల్లు నధర్మ లేపవర్జనమున లేక తక్కుఁ

తే. గులమునను విద్య ధనమునఁ గలుగు మదము
మరలి వానిపెం పూహింప మ్రంది పోవు
సాత్త్వికుఁడు గామిఁ బొడము మాత్సర్య మిదియుఁ
జెడుఁ గురూత్తమ సాధుసంసేవనమున. 421

క. ఈయాఱింటను సకలా,పాయంబులు మానవులకుఁ బాటిలు వీనిం బాయంగ జడియ నోపిన, ధీయుతునకు శుభము సద్గతియు సమకూరున్. 422

క. ఇవి దోఁడేళులభంగిం, గవియుఁ బురుషు ధైర్యహానిఁ గనికొని ధైర్యం బవలంబించినవరుఁ జే,రవు వీనికి నిదియ తెఱఁగు రాజవరేణ్యా. 423

తే. అధిప యివి ధార్తరాష్ట్రులయందుఁ జాలఁ
గలిగియుండు నీబుద్ధి నొక్కండుఁ జొరదు
సారధీరతాసంపదుదారమతివి
గాన యింకను నిర్జింతు వీని నెల్ల 424

వ. అని వెండియు. 425

క. హింసావిహారి యైననృశంసుం డీయాఁబుఁ గలుగుజనుకంబెను గీ
డంసప్రదేశలలితో, త్తంసీకరణోపలాల్య ధరణీవలయా. 426

క. మే లనుభవించుఁ జుట్టము, లాలోకింపంగఁ గుజనుఁ డదియు నృశంసా
శీలమ పంచి కుడుచునతఁ, డేలోకంబునను బేర్మి యొసఁగ సుఖించున్. 427

వ. అని చెప్పి వెండియు. 428

ఆ. వినుకుటుంబభృత్యజనజీవనంబుఁ ద్రివర్షములకుఁ గల్గువాఁడు నధిక
మొదవినట్టియతఁడు సుర్వీశ యర్హులు, మాననీయసోమపానమునకు 429

క. క్రతువు లొనరించుభూసురతతికిఁ గ్రియాశేషయోగదానాదులు దు
ర్గతిఁ గొఱఁతవడిన ధరణీపతి నెఱపఁగవలయు వానిఁ బరికించి తగన్. 430

క. ధనధాన్యపశుసమగ్రుం, డనఁ బరఁగెడునట్టివైశ్యుఁ డధ్వరముం జే
యనినాఁడు బ్రాహ్మణాధ్వరమునకు నతనిసొమ్ము రాజు పుచ్చి యిడఁ దగున్.

క. కుడువక పెట్టక శూద్రుఁడు, కడునెక్కుడు గూర్చినట్టికనకముఁ గొలుచుం
బుడమిపతి ధర్మకృతులకు, నిడునది సగము గొని మేదినీశ్వరవర్యా. 432

క. విను విప్రులు పేద లగుట, మనుజేంద్రుని బుద్ధిలేమి మాతాపితృభా
వన నతఁడు వారిఁ బ్రోచినఁ, గనుమేలున కెల్ల గలదె కౌరవనాథా. 433

క. ఆమద్రవ్యము మణియును, దామయు శుచు లగుటఁ గాదె రామారత్నా
రామత దగ వగు దుష్కుల, మై మెచ్చుమి దోఁచెనేని ననిరి మునీంద్రుల్. 434

క. అమృతము విద్యయుఁ బరమహితము సేయుటఁ బుచ్చికొండ్రు దానిని దానిఁ
సుమతులు విషమువలననైన మహీశ్వర నీచ మగుజనముచే నైనన్. 435

క. భూపాలక విను పంచమహాపాతకకరులుఁ బతితు లక్కడులు ప్రా
ణాపాయాంతప్రతికృతిఁ, బాపుదు రత్యధికపుణ్యపరతను బాయున్. 436

క. యానాసనాన్నపానవిధానాధులఁ బతితు బెరసి తాఁ బతితుఁ డగుఁ
మానవుఁడు దపోముఖధర్మానుష్ఠానములఁ బాచు నక్కిల్బిషమున్. 437

క. అనృతము పాతక మగునైనను వనితలయెడను బెండ్లి [1]నవ్వున మృతి వ
చ్చిన సర్వధనముఁ జెడుచో, విను మది పాపంబు గాదు విమలచరిత్రా. 433

క. ఏపాపమేని లేనిది, కాపురుషత నొకనిమీఁదఁ గలిగించిన న
ప్పాపము సేసినవాఁ డగు, నాపొలువ యనంగ విందు మార్యులచేతన్. 439

ఆ. తల్లిఁ దండ్రిఁ బాయఁ దగ దకారణమునఁ, బాసెనేని వాఁడు పతితుఁ డాస
నంబు సెజ్జ భోజనము చీర వటుకుమారులకుఁ బ్రీతి నొసఁగఁ బొలియుఁగీడు.

వ. అనియె నట్టియెడం గృపాణరణనిపుణుం డగునకులుండు సకలాస్త్రశస్త్రసార
విశారదుం డైనయబ్భాగీరథీసుతునకు సవినయంబుగాఁ బ్రణమిల్లి ధను వుత్త
మాయుధం బని చెప్పుదు రది సర్వజనసమ్మతంబు ధనువునకు బాణంబులకు

---

1 నాఁడును.

వైకల్యంబు వాటిల్లినయెడం బరవీరప్రహారణంబునకు నాత్మత్రాణంబునకుం గృపాణంబు మే లని యుండుదు నాతలం పెట్టిదియో తెలిసికొనవలయుఁ దత్సంభవప్రభావంబులుం దదీయపూర్వాచార్యునిం జెప్పవే యని యడిగిన. 441

భీష్ముఁడు నకులునకు ఖడ్గప్రభావంబు తెఱంగెఱింగించుట.

సీ. అతనికి నాతఁ డి ట్లను బ్రహ్మ జగములు సృజియించి భూతసంసృష్టి సేయ
దివిజమర్త్యాదిజంతువు లమ్మహాత్ముఁ విధించిన తెరువులఁ దిరిగి బ్రదుకు
చుండ దైత్యులు సముద్దండత నన్యాయవర్తు లై సురమునివ్రాతములకు
బాధ లొనర్ప నప్పరమేష్ఠి హిమశైలతటమున వేయువత్సరము లధిక
తే. నియతిమెయిఁ దప మొనరించి నిష్ఠఁ గ్రతువు, [1]సేసె నయ్యగ్నిఁ బుట్టె నశేషలోక
భీతికర మగునుగ్రంపుభూత మొకటి, ప్రాంశుకృష్ణ మై దంష్ట్రలు ప్రజ్వరిల్ల.
ఆ. అప్పు డినుఁడు మాసె ననిలుండు సుడివడి, వీచె నుల్క లురిలె వెఱఁ దలంకు
సురల మునులఁ జూచి సరసిజభవుఁ డిది, నాదుమతమ యొండు గాదు వినుఁడు.

వ. ఇది రాక్షసనాశంబునకుం దోఁచినయుత్పాతంబు [2]లోకంబులరక్షింపను రాక్షసుల వధియింపను సాధనంబుగా ఖడ్గంబుఁ గల్పించితి నని పలుక నాభూతం బారూపంబువిడిచి ఖడ్గాకృతిఁ గైకొని తన మెఱుంగులుదిక్కులదీటుకొనం బొల్చిన.
క. కమలాసనుండు నిజచిత్తము భక్తిమయంబు సేసి తలఁచె హరునిఫా
లముకంటిమంటతో నయ్యమరవరదుఁ డేఁగుదెంచె నచటికి నెమ్మిన్. 445

ఉ. వచ్చినఁ దత్పదాంబురుహవందనపూర్వము గాఁగఁ బద్మజుం
డిచ్చెఁ గృపాణ మవ్విభుఁ డహీనసముద్యమలీలఁ గ్రాలుచుం
బుచ్చికొనంగ నాసభ యపూర్వమనగ్రప్రమదంబు [3]తోడిపే
రచ్చెరువాటు నొందె నటు లయ్యసిఁ గైకొని మేను వెంచుచున్. 446

తే. హరుఁడు బెట్టుగ నవ్వి పెల్లార్చుటయును
విని సముద్ధతరయమున దనుజకోటి
మునుఁగఁ బఱతెంచి తాఁకిన మునుముకొని వ
ధించి యిల యెల్ల నెత్తుట ముంచె నతఁడు. 447

ఉ. దైత్యుల నిట్లు గీటడఁచి ధర్మము నిల్పి ప్రసన్నమూర్తిసాం
గత్యము నొంది యప్పరమకారుణికుండు త్రిలోకరక్షణౌ
దార్త్యమునన్ వెలుంగుహరిఁ దద్దయు వేడుకఁ బిల్వఁ బంచి సం
ప్రీత్యభిరాముఁ డై యొసఁగెఁ బెంపుగ నమ్మహనీయఖడ్గమున్. 448

వ. అట్లొసంగినం గైకొని దుష్టదమనం బాచరించుచునుండెడు నవ్విష్ణుండు మహాస్త్రరూపం బగునయ్యాయుధంబు పదంపడి మరీచి కొసంగె మరీచి భార్గవునకు భార్గవుం డనేకమునులకు మును లింద్రునకు నింద్రుండు లోకపాలురకు నొసంగెఁ

1 సేయ నయ్యగ్ని. 2 సురల రక్షింపను. 3 తోడఁ జే, రచ్చెరువాటు.

గ్రమంబున మనుప్రభృతు లైనమానవేంద్రులు వడసి నిజసంతతికి నిచ్చుచు వచ్చి రందు దుష్యంతుండు భరతున కిచ్చె నాభరతునివంశంబునందు ఖడ్గ సంప్రదాయంబు గలిగి వచ్చె నొకముని యనుగ్రహింప [illegible] డధిగమించి కృపున కిచ్చెఁ గృపునిచేత మీ రేవురుం బడసితిరి విశేషించి యీవిద్యయం దత్యంతాదరణవంతుండ వగుటంజేసి దీనివలన వెలసితివి నిస్త్రింశంబునకు నక్షత్రంబు గృత్తిక యగ్ని యధిదేవత గురుండు రుద్రుం డని చెప్పి వెండియు ని ట్లను నసి విశసనంబు ఖడ్గంబు [1]తీక్ష్ణధారంబు దురాసదంబు శ్రీగర్భంబు విజయంబు ధర్మపాలం బన నెనిమిదిపూజ్యనామంబులంబరఁగి కృపాణంబు ప్రహరణంబులలోనం బ్రధానం బై నెగడుచుండు. 419

క. సుమహిత మగునీఖడ్గా,గమ మగుపుణ్యకథ వినఁగఁ గాంచినపురుషుం
డమితయశంబును నధిక, ప్రమదంబును సద్గతియును బడయుఁ గుమారా. 450

క. అని యిట్లు నకులునకు భీ,ష్ముని చెప్పినకథ సుచిత్తమున విని కుంతీ
తనయాగ్రజుండు పురికిం, జనియెడుప్రొ ద్దగుడు వినయసంభృతుఁ డగుచున్.

వ. సముచితంబుగా నమ్మహాత్ముని వీడ్కొని చని యోగ్యవర్తనంబు లాచరించి వినోదగోష్ఠి నుండి విదురునిం దమ్ముల నుపలక్షించి ధర్మార్థకామంబులయం దుత్తమ మధ్యమాధమత్వనిరూపణంబు సేయుఁడు చూత మని పల్కిన నవ్విభునకు విదురుం డి ట్లనియె. 452

ధర్మజునితో విదురాదులు ధర్మార్థకామంబులతారతమ్యంబు సెప్పుట.

క. విను ధర్మంబున ధన మగు, ధనమున సిద్ధించుఁ గామతంత్రం బటు గా
వున మధ్యమంబు నధమము, ధనకామము లుత్తమంబు ధర్మం బధిపా. 453

చ. అనవుడు బార్థుఁ డిట్టు లను నర్థము మూలము ధర్మకామవ
ర్తనముల కట్లు గాకయు విరక్తత నొంది జటాదిధారణం
బునఁ జరియించువారికిని భూవర యర్థము దేహకృత్యసా
ధన మసురేజ్యకణ్వులును దానిన మే లని పూని చెప్పరే. 454

వ. కావున నర్థంబు ప్రధానం బనుటయు నకులసహదేవు లేకవాక్యత ని ట్లనిరి.

తే. అర్థధర్మంబు లితరేతరాశ్రయములు, గాన వాసిలో నొకఁడూఁదుమానవేంద్ర
జగము [2]వోకలఁ బుచ్చునసంభృతార్థుఁ, డైనవానికిఁ గామముప్రాప్య మరయ.

క. తమలో సరి ధర్మము న,ర్థము నర్థంబునకుఁ గామతంత్రము ఫలరూ
పము గావున నప్పురుషా,ర్థమునుం గొనియాడ వలయు ధరణీనాథా. 457

వ. అనిన విని పవననందనుం డి ట్లనియె. 458

క. దధిసారముచందంబున, నధిపా ధర్మార్థసార మగుకామరసం
బధమ మనుతలఁపు సుఖసం,విధానబాహ్య మని నీవివేకమ యెఱుఁగున్.

---

1 తీక్ష్ణవర్మంబు. 2 'పోకులఁ' అని పెక్కుప్రతులు.

క. విను మఱి యలరునఁ దేనియఁ గొనుగతి నత్యంతసుఖము గొన నగుఁ గామం
బున నధికసుఖము లొందని, జనుసిరి [1]దాఁ గొల్పు లేనిసస్యమ కాదే. 460
తే. అనఘ ధర్మార్థకామంబులందు నొకట, నర్థిఁ దగిలినమానవుం డధముఁ డొకటి
మాని వర్తించునాతఁడు మధ్యముండు, నడపు నన్నింటి నుత్తమనాయకుండు.
క. అని యి ట్లందఱుఁ జెప్పఁగ, విని చిఱునవ్వున ముఖారవిందము చెలువం
బినుమడిగా ధర్మజుఁ డి, ట్లను వారలఁ గలయఁ జూచి యాదర మెసఁగన్. 462
వ. ఏ నడిగిన తెఱంగునకు విదురునివాక్యంబు సిద్ధాంతంబు దక్కటివారివచనంబు
లు నొక్కొక్కమెయి నాదరణీయంబు లది యట్లుండె నామతంబు వినుండు.
క. భూతములు జరామరణో, పేతంబులు గాన మోక్ష మెదఁ గోరుట మే
లాతతవర్గత్రయసం, జాతమనోదుఃఖభారసహముఁ డగుకంటెన్ 464
వ. అది గోరిన దొరకొనునే యందు మేని. 465
క. మనమున ధర్మము నర్థం, బును గామముఁ గీలుకొనక పొరపొచ్చెము లై
చన సుఖదుఃఖంబుల మద, మున దైన్యముఁ బొందకునికి మోక్షకర మగున్.
వ అనిన విని వార లందఱు నభినందించిరి మఱునాఁడు నదీనందనుం గొలిచి
యుండి ధర్మనందనుండు నరపతులకు వలయువారును వలవనివారును నెట్టిట్టి
వా రని యడిగిన నమ్మహీపతి కి ట్లనియె. 467
ఉ. తొలిమిఁ బేర్చువారలును ధర్మవిధిజ్ఞులు సత్యవంతులుఁ
లోలత లేనివారు మదలోభనిరర్థకకోపహీనులు
న్శీలసమేతులుం బలుక నేర్చుట కార్యము కాన్పు పెంపుమైఁ
జాలుట గల్గుభృత్యులును సంపద నేయుదు రాత్మభర్తకున్. 468
ఉ. క్రూరుఁడు లోభియుఁ శఠుఁడుఁ గొండియుఁడుఁ జడుఁడుం గృతఘ్నుఁడుఁ
నేరనివాఁడు బొంకరియు నిందకు నోర్చునతండుఁ బందయుఁ
ధీరత లేమి దుర్నయమతివ్యసనత్వము గల్గువారలుం
జేరువ నున్కి భూపతికిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా. 469
క. ఒప్పనిగుణములఁ బరగెడు, నిప్పురుషాధములలోన నెల్లఁ గృతఘ్నుం
డొప్పఁడు గడు నిట్లగుటం, జెప్పెదునితిహాస మొకటి సెప్పెద నధిపా. 470
వ. అది కాశ్యపగౌతమాఖ్యానం బనం బెద్దలగోష్ఠిం బ్రవర్తిల్లు. 471

—భీష్ముఁడు ధర్మజునకు నాడీజంఘునిచరిత్రంబు సెప్పుట.—

చ. విను మొకబ్రాహ్మణుండు కులవృత్తము [2]పెంపుఁ దొలంగి బోయెదా
ని నొకత గర్తిఁ జేసికొని నెమ్మిఁ గిరాతులఁ గూడి వేటకుం
జనుఁ దిను మాంస మద్దురితసక్తుఁడు భోగపరుండు గావునన్
ధనము ఘటింపఁగాఁ దగువిధం బని చూచి వణిగ్జనంబుతోన్. 472

[1] యొనుకొలుచు లేని; యొనుకోలు లేని. [2] ఎల్లఁ...గల్చి; గల్చి.

వ. చెలిమి చేసి కొందఱు గోపుట్లు బేహారంబువెంట దేశాంతరంబునకుం జనఁ దానును వారితోడం గూడి పోవం బోవ గిరిగహనదుర్గమస్థలంబున నొక్కవన గజంబు 473

ఆ. సాతులోని కుఱికి జనముల నున్మద, లీల నేలఁ బెట్టి కాలఁ జమరఁ
బొచ్చుటయును భీతి విచ్చి నల్దిక్కులఁ, బఱచి రెల్లవారుఁ బటురయమున.

క. ఆయనయుఁ గాందిశీకుం, డై యుత్తరదిక్కు వాఱె నతిదూరముగా
నాయెడ నొకమార్గము గని, పోయెను దాను నట పోవఁ బోవం గెలనన్. 475

తే. పొదలతఱచున బొంపమై పొడవుఁ బఱపుఁ,గలిగి వట్రువఁదనమునఁ జెలువుమిగిలి
యున్న వటభూరుహముఁ గని యుల్ల మచట, నిలువఁ గోరిన నాయ్రానినీడఁ జేరి

క. వనలతలకుసుమగంధము, గొని సుడివడుగాడ్పు డప్పిఁ గొండొక దేర్పం
దను పార నచటఁ గూర్పుం,డె నతం డట్లుండ నచ్చటికి లలితగతిన్. 477

వ. ఒక్కమహాబకంబు వచ్చె నది పద్మభవునకుం బ్రసాదపాత్రం బగుచు నాడీజం ఘుండును రాజధర్ముండు ననుపేళ్లం బరఁగు నాకొక్కరకు నమ్మఱ్ఱి నివాసం బై యుండు నప్పుడు య ట్లేతెంచి యవ్విప్రునింగాంచి ప్రియంబు దలకొనుచూడ్కి నాదరించి 478

క. ఎందుండి యేమిపనికై, యెందుల కరిగెదవు భూసురేశ్వర ప్రీతిం
బొందితి నినుఁ గని తగియెడు, విందు నయితి నాకు నీదువిధముం జెపుమా. 479

వ. అని యడిగిన నతం డేను మధ్యదేశీయుండ గౌతముండ నొక్కమహనీయచరి త్రునిపుత్త్రుండ బాలప్యంబున వేదాధ్యయనాదివిప్రకర్మవిరహితుండనయి కామ లోలత్వంబున బోయత యిల్లాలుగా బోయలం గలసి యుండి వేదఱికంబునకు నలసి [1]బేహారంబువెంట నొక్కసాతుం గూడి పనదేశంబున కరుగుచోట గిరి గహనదుర్గమప్రదేశంబున. 480

క. వనకరి యొక్కటి యాసా,తునకుఁ గవిసి జనచయంబుఁ ద్రుంపఁ దొడఁగుడుఁ
విను మెల్లవారునుం గను,కనిఁ బఱచిరి భీతి నేను గాననభూమిన్. 481

ఆ. పఱచి దిక్కు దప్పి భాగ్యంబుకల్మి నీ, దైననిలయమునకు నరుగుదేరఁ
గంటి ననిన మేలు గాక నీదారిద్ర్య, మపనయింతుఁ జింత యపనయింపు. 482

వ. అంతకు నియ్యాతిథ్యంబుఁ గయికొను మని రుచిమంతంబు లగుమందాకినీమీ నంబులు సుపక్వంబులు నేసి మధురంబు లగువన్యఫలంబులుదెచ్చి తృప్తి యగు నట్లుగాఁ నతనికి నాహారవిధి యొనర్చి రాత్రి యగుటయుం బల్లవపుష్పసాంద్రం బగుశయనంబు గల్పించి యబ్బకపతి యద్ధరణీసురునితోడి సముచితసల్లాపంబు లను సుఖనిద్రను నారాత్రి గడపి వేగుటయు నవ్విప్రు నాలోకించి. 483

క. విను మిత్త్రుండును రజతముఁ, గనకము బుద్ధియును నాల్గు గారణములు మ

---

1 బేహారులవెంట.

ధ్యాయుంగా వరియింపం బోయితి నద్దేవగురుండు నన్ను దూషించి పరిత్యజించె
నింక నేటిబ్రదు కని పలికిన నప్పరమసంయమి యప్పుడమిఱేనితో బృహస్పతి
ని న్నొల్లకున్న నేమి యంగిరసునిపిన్నకొడుకు సంవర్తుం డాధిషణుచేత ధిక్క
రింపంబడి సకలంబును విడిచి వెడలి వైరాగ్యంబువెంపున దిగంబరుం డయి తిరుగు
చున్నవాఁ డతనిపాలికి నరుగు మమ్మహాత్ముండు భవన్మఖంబునకు నుపదర్శనం
బాచరించు ననవుడు సంతసిల్లి యాభూవరుం డి ట్లనియె. 42

క. మునివర బ్రదికితి సంవ,ర్తుని నెచ్చటఁ గాంతు నెవ్వరుసునం దగ నా
డిన నతఁడు ద్రోపు సేయక, ననుఁ గైకొను నెఱుఁగఁ జెప్పు నాకుం గరుణన్. 43

వ. అని ప్రార్థించినయప్పార్థివోత్తమునకు నత్తపోధనసత్తముం డి ట్లనియె. 44

సీ. భూపాల యతఁడు కాశీపురిఁ బాయక వర్తించు నున్మత్తవర్తనమున
నతని నెఱిఁగెడునట్టియుపాయంబు వినుము పురద్వారమున శవంబు
నిడికొని నీ వుండు మేతెంచి చూచి నివర్తించువాని సంవర్తుఁ గాఁగ
నెఱుఁగుము మరలి య ట్లేఁగంగ వెనుకన పోమ్ము నిశ్చలభక్తిపూర్వకముగ

ఆ. నెచట నైన నీకు నేకాంత మొదవిన, శరణు సొరుము వినయభరితవృత్తి
నాదుగుఱుతు సెప్పినా రెవ్వ రనినను, జెంద నారదుండు సెప్పె ననుము. 45

మరుత్తుఁడు సంవర్తునిఁ దనయజ్ఞమున కుపద్రష్టగా వరియించుట

సీ. ఇప్పుడు నారదుం డెం దున్నవాఁ డన యడిగినయట్లైన నతఁడు నాకు
ని న్నెఱింగించి యగ్నిప్రవేశము సేసె ననుము శంకింపక యనుడు నమ్మ
హీపతి వారాణసీపురంబున కేఁగి దిక్కుమాలినపీనుఁ గొక్కచోట
బడి యున్నఁ గని దానిఁ బట్టించికొని పురద్వారప్రదేశంబు సేర నరిగి

తే. యచట నక్కుణపము నిడి యంతనంత, వేచికొనియుండఁగా నొక్కవెఱ్ఱివాఁడు
వచ్చి శవముఁ గనుంగొని వాటువడ్డ,పసరమునుబోలెఁ గ్రమ్మఱి పాఱుటయును.

వ. వాని సంవర్తుం గా నెఱింగి యజ్ఞనపతి యతనిపజ్జన చనం జన నతండు మరలి
చూచి పై ధూళి సల్లియు నుమిసియు వేదుఱుచందంబు భావింప నాభూ
వల్లభుండు. 47

క. వినయముతోఁ గేల్ మొగుచుచు, ననుగమనం బుడుగ కరుగ నాతండును ని
ర్జన మగుప్రదేశమునకుం, జని యొకవటవిటపిసీడఁ జదికిలఁ బడియెన్. 48

వ. డప్పి భావించుకొని యమహాత్ముం డట్లు గూర్చుండుటయు. 49

సీ. ఆరాజు సేరి సాష్టాంగప్రణామంబు సేసి నిల్చిన ననుఁ జెప్పి నిన్ను
ననఘు పుత్తెంచినయతనిపే రెఱిఁగింపు నిజమైన సిద్ధించు నీమనోర
థంబు బొంకగు నేనిఁ దలయేడుప్రయ్యలై పడు దని యమ్ముని వలుకుటయును
నారదుఁ డెఱిఁగించె నాకు మి మ్మని నిజ మాడిన సంవర్తుఁ డాతఁ డెచట

తే. నేమి తెఱఁగున నున్నవాఁ డెఱుఁగ వలయుఁ
జెప్పు మనుడు మీ తెఱఁ గెల్లఁ జెప్పి నన్ను
నిందుఁ బుత్తెంచునపుడ యయ్యాద్యధర్మ
పరుఁడు పోదఁ జొచ్చె నని చెప్పె నరవరుండు.

వ. చెప్పిన నప్పరముని యప్పుడమితేనియాననం బాలోకించి. 51

క. ననుఁ గానఁగ నీవచ్చినపని యెయ్యది యనిన నానృపతి నాయజ్ఞం
బునకుఁ గృపమీఱ ఋత్విక్కనము సేయుంగవలయు సంయమినాథా. 52

వ. ఏను మరుత్తుం డనువాఁడ భవదీయజనకుం డుపాధ్యాయుండు గాఁ గ్రతుకర్త
యైనకరంధమునిపౌత్రుండ ననుటయు సంవర్తుండు సంప్రీతి నాతనితో నీవు
నీకార్యంబు నాకుం జెప్పితి నా తెఱంగు వినుము మాయన్న యగుబృహస్పతి
దనతపోబలంబున నన్ను నవమానించిన మదీయగృహాధనాదివస్తువు లెల్లను
విడిచి యిట్లు దిరిగెద ననుబోఁటిపీనుంగు నీ కుపద్రష్టయైన నయ్యెడు పెంపునుం
గలదె యమ్మహాత్ము నీవు వరియింపు మట్లు గాక యేన కావలయు ననుతలంపు
గలదేని. 53

ఆ. అన్న నాకు మాన్యుఁ డాతండు వనుపంగ, నాచరింతు నీదుయాగమునకు
నొజ్జతనము వేగ మూర్వీశ యగ్గురుఁ, గని యనుజ్ఞ వడయు మనిన విభుఁడు. 54

సీ. ఆతనికడకు మున్నరిగితిఁ గృప వుట్టఁ బలికితి నతఁడు నాపలుకు సరకు
గొనక యమర్త్యయాజనము ననుష్ఠించు నేను మర్త్యునియొజ్జ నేల యగుదు
ననియె నాతోడియీయాసున వాసవుఁడు గురు నుడిపినకతమునఁ గడఁగి గురుఁడు
నను ధిక్కరించె నిం కనఘ యం దేమని పోదు మీమాహాత్మ్యమునను వాస

ఆ. వుని నతిక్రమింతు నని నమ్మి యున్నాఁడఁ, గైకొనంగవలయుఁ గరుణ వెలయ
ననిన మునియు నట్ల యయ్యెడుఁ గా కని, పలికె మఱియు నానృపాలుతోడ.

*తే. అయ్యెడుం గాక యిపుడు నీ కనుచు నీవు, సంచలించినయప్పుడ శాప మిత్తు
నీకుఁ గీడును బాటిల్లు నింత దలఁచి, సుస్థిరుండవు గావలె సుజనవర్య. 56

వ. ఏను నీయధ్వరంబున నుపదర్శనంబు సేయుచుండ నద్దివస్పతియు బృహస్పతియుఁ
బ్రద్వేషించి రోషంబు వాటింతురు దానికి నులికి నీవు సంచలించిన మదీయ
శాపంబునం గీడు వచ్చు నింత దలంచి సుస్థిరనిశ్చయుండవు గావలయు విచా
రించుకొమ్మనిన నమ్మహానీయుతో నమ్మహీనాథుండు. 57

సంవర్తుండు మరుత్తునియజ్ఞమున నుపద్రష్ట యగుట

సీ. నీకృప గాంచితి నాకు నిం కొండువిచారంబు లేటికి సంయమీంద్ర
యాదివస్పతియు బృహస్పతియును నేల పశుపతి విద్వేషపరతఁ గలఁచె

* ఈపద్యము వ్రాఁతప్రతులందుఁ జూపట్టదు.

నేనియుఁ గలఁగుదు నే యని పలికి మీసంగతి వాసిన సరసిజాప్త
చంద్రతారకకులాచలములు గలయంతకాలంబుఁ బుణ్యలోకములు లేక
తే. పోవు నని శపథము శుద్ధభావవృత్తిఁ
బలుకుటయు మెచ్చి యమ్మునిపతి మహేంద్రు
కంపె నిను ధనవంతునిఁ గా నొనర్చి
క్రతువు నడపుదు నని చెప్పి ప్రమద మెసఁగ. 57

వ. మఱియు ని ట్లను నెత్తెఱంగున నేను ధనవంతుండ నగుదు నం టేని వినుము హిమవంతంబు నుత్తరభాగంబున ముంజవంతం బనుపర్వతంబు గల దందు శివుండు శివాసహాయుం డై సురసిద్ధగరుడగంధర్వాదిసమస్తభూతజాలంబు సేవింప విహరించు చుండు. 58

క. మరణజరారోగము ల,[1]గ్గిరి యేడిరువులను లే వఖిలగుల్మలతా
తరువులఁ గుసుమఫలంబులు, గర మొప్పుచు నుండు నెల్ల కాలములందున్. 59

తే. ఆనగంబుపార్శ్వంబుల నరుణకిరణ, రుచివితానంబు ననుకరించుచు వెలుంగు
శుద్ధకాంచనమయశిలాస్థూలవాలు,కాప్రభాజాల మాశ్చర్యకారి యగుచు. 60

వ. మన మయ్యెడకుం బోయి. 61

సీ. శ్రీకంఠు రుద్రుని శివుఁ బూషదంతఘ్ను హరునిఁ గపర్ది శంకరుని నంత
కాంతకు వరదుని నాదిదేవునిఁ ద్రిలోచను సహస్రాక్షుని శాంతమూర్తిఁ
[2]జీరవాసుని ధన్వి సిద్ధు దండధరు మృగవ్యాధు నుష్ణిషిఁ గనకబాహుఁ
బశుపతి వృషు భూతపతి మాతృభక్తుని నజు నగ్నివక్త్రుని నభవు భవుని
ఆ. భక్తిఁ బ్రస్తుతించి ప్రణతులఁ దేల్చి తత్కరుణ వడసి పసిఁడి ద్రవ్వి తండ
ములు నృపాల పెక్కుమోపులు దెత్తము, రమ్ము భారవహులఁ దెమ్ము చాల.

క. అని పలికి యమ్మహాత్ముఁడు, గొనిపోవఁగఁ బోయి శివు నకుంఠితకరుణం
గనక మసంఖ్యముమోపులు, గొని వచ్చి నతండు మంచుకొండయిఱువులకున్. 63

వ. ఇట్లు మహాధనవంతుం డై మరుత్తుండు సువర్ణమయంబులుగా యజ్ఞవాటంబును భాండప్రముఖసకలక్రియాసాధనంబులును శయ్యాసనాదులుం గావించుకొని తత్ప్రదేశంబున నతిమానుషం బగువిభవం బెసంగ యజనంబున కుపక్రమించు టయు బృహస్పతి యంతయు నెఱింగి యంగంబు కృశం బై వెలరువాఱునట్టి వగం బొందిన సంక్రందనుండు సూచి యవ్వాచస్పతి కి ట్లనియె. 64

ఆ. తెలివు వొంది యున్నదియు నీదుచిత్తంబు, సురల బ్రదుకుతెరువు లరసి నడపు
చున్నవాఁడవే సముత్సాహమున వారు, నీకుఁ బ్రియ మొనర్చి నేర్చి మండ్రె.

వ. అనుటయు నాచార్యుండు సర్వంబు సంపన్నంబయనిన ననిమిషపతి యతనితోడ.

క. నీయొడలు డస్సి వెలువెల, నై యున్నది నీకు నిట్టి యధికపువగపుం

---

1 గ్గిరియం దెయ్యెడల లే. 2 బీతవాసుని ధన్వి బిసదంతు సిద్ధు మృగవ్యాధు.

జేయఁగ వెఱవనినీచులఁ, జేయుదు దండితులఁ గాఁగఁ జెప్పుము వారిన్. 67

వ. అనవుడు నాచార్యుం డట్టిది లేదు మరుత్తుండు మహనీయం బగుమఖుం బొనరింప నుద్యోగించినవాఁ డతనికి మద్విరోధియగుసంవర్తుండు యాజకుం డయి యది నడపువాఁ డయ్యె నని వింటి మద్విషాదంబునకు మూలం బిది యట్లు గాకుండం జేయవలయు నజ్జననాయకు నియమించి సంవర్తునియాజకత్వంబు నవశ్యంబును మాన్చునది యని పలికినం బాకశాసనుండు పార్శ్వంబున నున్నయగ్నిదేవు నాలోకించి నీవు మరుత్తుపాలికిం బో మ్మతండు క్రతుకరణంబున కుత్సహించిన వాఁడు తదీయం బగునుపదర్శనంబు బృహస్పతి యాచరించువాఁడుగా సంఘ టించి రమ్మని నియోగించిన. 68

ఆ. అట్లు సేయువాఁడ నని యగ్ని నిజతనుస్ఫురణ మతిశయిల్ల నరుగుటయును నుల్ల మచ్చెరువున నూన మరుత్తుండు, ప్రణతి యాచరించి భక్తితోడ. 69

అగ్నిదేవుం డింద్రసందేశము మరుత్తున కెఱింగింప వచ్చుట

సీ. సంవర్తుఁ బిలిచి యాసనపాద్యముఖ్యోపచరణముల్ నడపించి పరిసరమున నున్న నయ్యనలుఁ డయ్యుర్వీశ్వరునితోడ బలవైరి వనుప నీపాలి కనఘ యరుగుదెంచితి దూతనై యన్న నవ్విభుం డవ్వాసవుండు సౌఖ్యమున వెలుఁగు చున్నాఁడె యమరసముత్కరం బతనికిఁ బ్రియ మాచరించి వర్తించుచున్నె

ఆ. యాదరంబు గలదె నాదెస నాసహస్రాక్షు నెమ్మనంబునందు హవ్య వాహ యనుడు నతఁడు వసుమతీపతికి నిట్లనియెఁ గౌరవాన్వయాగ్రగణ్య. 70

క. సురనాథుఁడు దద్దయు సుఖి, సుర లాతనికిం బ్రియంబు సొలయక యొనరిం తురు నీదెస నాదర మెప్పరుసవరున కగ్గలంబు భూపవరేణ్య. 71

వ. నావచ్చినపని సెప్పెద నాకర్ణింపుము. 72

క. నీజన్మమునకు ధిషణుఁడు, యాజకుఁ డై మర్త్య నిన్ను నమరత్వదశా భ్రాజిష్ణుఁ జేయు నమ్మెయి, రాజితముగ నాచరింపు క్రతుకార్యంబున్. 73

వ. ఇది యింద్రుండు నీతోడం జెప్పు మన్నకార్యం బనుటయు నమ్మనుజనాథుం డమ్మహాత్ముతోడ. 74

ఆ. అనఘ యేడు మ్రొక్కులా బృహస్పతికి మ్రొక్కెద నతండు నన్ను నదయవృత్తి నపహసించి తాను యాజకత్వమునకు, నెట్లుఁ జొరక యున్న నేను బోయి. 75

క. అనుజుం డతనికి నను వెను, కొనరినసంవర్తుభక్తి నొడఁబఱచి తగం గొని వచ్చితి మత్క్రతుయాజన మీ యోగీశ్వరుండ చాలుం జేయన్. 76

అనిన నగ్నిదేవుఁ డమరగురుం డుపద్రష్టయైన వజ్రధరుఁడు నీకు నలఘుపుణ్యలోకములు సులభ్యములుగ, లీలఁ జేయు నట్లు మేలు గాదె. 77

క. అనవుడు సంవర్తుఁడు గడుఁ, గనలి యనలుతోడ నిట్టిగతి నీ వింకా

డిన మద్దారుణదృష్టిని, నినుఁ గాల్తుఁ గా మగుడు మిప్పునికిఁ దిరుగకుమీ. 78

చ. అనుటయు భీతి నగ్ని యమరాధిపుపాలికిఁ బోయి యే మరు
త్తునిఁ గని నెమ్మి నీదగుక్రతుక్రియకుం గురు యాజకుండు గాఁ
గొను మని చెప్పితిం విని యకుంఠితనిశ్చయుఁ డైనయవ్విభుం
డనిమిషమంత్రికిం వెఱతు నాతనిఁ దమ్మునిఁ గోరితెచ్చితిన్. 79

వ. ఈయోగీశ్వరుండు మదీయాధ్వరంబునకు యాజకుం డనుపలుకు వలికి సంవర్తుం
జూపె నే నంత నిలువక పురుహూతునకుం బ్రియం బొనరించిన నీకుం బుణ్య
లోకంబులు సిద్ధించు నట్లు సేసిన మే లని తఱిమి చెప్పినను నప్పుడమితేఁ డొడం
బడఁడ. 80

చ. అన విని యింద్రుఁ డి ట్లనియె నగ్నికి నిమ్మరి పోయి చెప్పు మ
జ్జనపతితోడ నాపలుకు సమ్మతిఁ జేయక తక్కెనేని న్యేఁ
బనిచెద వజ్రముం జమునిపాలికి నన్నరనాథు వేగమే
యనుచుట కింతయెల్లిద మె యాతనికిం మనయాజ్ఞ యారయన్. 81

వ. అని పలుకుటయుఁ బావకుండు పాకశాసను నాలోకించి. 82

సీ. ఇంక వచ్చిన దారుణేక్షణదగ్ధుఁ గావింతుఁ జుమ్మీ యని విపులకోప
మూర్తి యై పలికె సంవర్తుండు గావున వెఱతు నే నట పోవ వేలోకండు
పోవుఁ గా కనవుడు దేవేంద్రుఁ డన్యుల నీవు దహింతు గా కేవిధమున
నొరులు నిన్ను దహింతురో వేదమాట యి ట్లాడు దే యనుటయు నగ్ని వలుకు

ఆ. మూఁడులోకములును వాఁడిమగంటిమి, నేలుచున్న వాని నెట్లు వృత్రుఁ
డాక్రమించె నిన్ను నదియును గాక పర్జన్య మఱియు వినుము బ్రహ్మబలము.

సీ. సర్యాతిక్రతువున నయ్యాశ్వినుల సోమపానంబు నీకొడఁబాటు గాక
పాయంగఁ బెట్టిన భార్గవచ్యవనుండు వారికిఁ గా సురవర్గసహిత
ముగ నిన్ను బాధితుండుగఁ జేసె నిజమంత్రబలమున దాని కీ వలిగి వజ్ర
మే త్తెఱఁ గొని యమ్మునీశ్వరు సాధింపఁ గడఁగిన నగుచు బె ట్టడఁచెఁ గాదె

తే. యతఁడు పుడిసెఁడునీరనయప్పు డతనిఁ, దెలచి సోను మాశ్వినులకుఁ గలుగఁ జేసి
తరయ నెందును బ్రహ్మబలాతిశయముఁ, గడచినట్టిబలంబులు గలవె యనఘ. 84

క. అనవుడు బ్రహ్మబలము గడు, ఘన మగు టెఱుఁగుదు మరుత్తుఁ గాఱియఁ బెట్టం
జనదే నా కని శక్రుఁడు, పనిచెను గంధర్వలోకపతి ధృతరాష్ట్రున్. 85

వ. పనుచునప్పు డతని కి ట్లనియె. 86

తే. నీవు పోయి మరుత్తుని నెమ్మిఁ గాంచి, గురుని నీకు యాజకుఁడుగఁ గొనఁగవలయు
నట్ల చేయక యున్న వృత్రారి క్రోధ, దీప్తుఁ డై కులిశంబుఁ బు త్తెంచు ననుము.

వ. ఈమాట సంవర్తునిసన్నిధిన యాడు మని పలికిన నాధృతరాష్ట్రుం డియ్యకొని

చని సంవర్తసహితుం డై యున్నమరుత్తునిం గని తాను గంధర్వుం డనియును
ననిమిషపతిపంపున వచ్చితి ననియుఁ జెప్పి యప్పుడమి తేనితో మఱియు
ని ట్లనియె. 88

చ. వినుము మదీయబుద్ధి పృథివీవర యాజకుఁ గాఁగ నీమఖం
బునకు బృహస్పతిం గొనుము పూర్వదిశాపతి కవ్విధంబు ప్రీ
తి నొసఁగు నట్లు సేయ కవధీరణ చేసితయేని వజ్రముం
బనుచు నతండు నీకయి సభాసదులుం విన జాటి చెప్పితిన్. 89

సీ. అనిన మరుత్తుఁ డయ్యమరగురుండు నాయాగంబు నడపుట కాత్మ రోసి
రా కున్న సంవర్తుఁ బ్రార్థించి తెచ్చితి నింక నట్టులు సేయ కెట్లు వచ్చు
ననఘ మిత్త్రద్రోహ మధికపాపముగాదె యిదినీవెఱుంగు దయ్యింద్రుఁ డెఱుఁగు
సిద్ధసాధ్యాదిప్రసిద్ధులు నెఱుఁగుదు రిమ్మాట గురునకు నియ్యకోల
తే. యనుడు గంధర్వుఁ డదె వినవయ్యె వజ్ర
ఘోరనాదంబు నీ కోర్వఁ గొలఁది యగునొ
కాదొ నీవ యెఱుంగుదు మేదినీశ
యనుటయును నృపుఁ డాలించి విని భయమున. 90

వ. సంవర్తున కెఱింగించి. 91

క. కులిశము వచ్చుచు నున్నది, యలు కొందెదు నామనంబు ననఘచరిత స
భ్యులు సంత్రాసము నొందిరి, తలకొని రక్షింపవలయు దయ మ మ్మెల్లన్. 92

వ. అనిన విని యమ్మహాయోగీశ్వరుండు. 93

సీ. ఇంద్రుని దెస భయం బించుకేనియు వల దతఁడు నన్నెఱుఁగఁడే యధిప వినుము
సంస్తంభవిద్యాప్రశస్తవైభవమున వజ్రంబు నతఁడు నవ్వాసవాది
దైవతంబులయాయుధంబులు నాచేతఁ బ్రతిహతిం బొందు దుష్పవనచండ
వృష్టిప్రముఖమహావికృతుల బాధింతు ననుడు మ్రోయుచునిదె యరుగుదెంచె
ఆ. భిదుర మెవ్విధమున భీతి దొఱంగుదు, ననియె నృపతి యాతఁ డల్ల నగుచు
దాని సరకుగొనకు తగువర మడుగు న్యాతపము పేర్మి నిత్తు ధరణినాథ. 94

చ. అనిన మరుత్తుఁ డి ట్లనియె నాతనితో భయ మెల్లఁ బాసె నే
నిను వర మర్థి వేఁడెద మనీష విరోధము దక్కి యధ్వరం
బున కిట వచ్చి దైవతవిభుండు నిజోచితహవ్యభాగముం
గొనియెడు నట్లు గాఁగ మునికుంజర చిత్తమునం దలంపవే. 95

క. తమభాగంబులు దక్కిన, యమరులునుం బ్రీతిఁ గొనఁగ యాగంబు ప్రయో
గము సుప్రణీత మయి లోకమనోజ్ఞము గాఁగ వలయుఁ గారుణ్యనిధీ. 96

క. అనుటయును మదాహ్వానం,బున నింద్రుఁడు సోమపానమున కేతెంచుం
జనుదెంతు రతనితోఁ ద,క్కినయమరులుఁ దొడఁగు యజ్ఞకృతికి నరేంద్రా. 97

మరుత్తునియజ్ఞంబున హవిర్భాగంబులు గొన నింద్రాదులు వచ్చుట

వ. అని పలికి దవ్వులన యవ్వజ్రంబు వారించి గంధర్వునకు వీడుకోలు సేయించి యయ్యోగీంద్రుండు దేవేంద్రుని దేవతలను బిలిచె నమ్మహాత్మునిమహనీయ మంత్రశక్తినాహూతు లైనయప్పురుహూతప్రభృతిబృందారకులు ప్రియంబున నరుగుదేర నమ్మునిపతి యజ్ఞపతి వారల నెదుర్కొనుతెఱంగు నడపి తానును గూడ నడచి వారికి నర్ఘ్యపాద్యాదిపూజనంబులు విధివిహితప్రకారంబునం జెల్లించె నమ్మరుత్తుండును మరుత్పతికిం బ్రణమిల్లి దేవా నీవు విజయంచేసి నా జన్మంబు సఫలంబు సేసితి కృతార్థుండ నైతిం గృపాధాము నామీఁదియలుక మాని నన్నుం జల్లనిజూడ్కిం జూడు మని ప్రార్థించి సంవర్తుం జూపి యిత్తాపస పతి బృహస్పతిస్వరూపంబ కావునం గ్రతుయాజకుండు గాఁ బ్రతిగ్రహించితి నని విన్నవించుటయు ననిమిషనాథుండు నీవలనం బ్రీతిం బొందితి నీతం డయ్య మరగురుననుజుం డతనియ ట్లగుటకు సందియం బేమి యనుచు వికచవదనుం డై కనుంగొనిన నమ్మునివరుం డాదివిజవరున కి ట్లనియె. 99

ఆ. అఖిలలోకభర్త వమరేంద్ర నీ విట్లు, లాదరమున వచ్చు టరయ నాత
పంబుఫలము గాదె పావనమూర్తి యీ, రాజు క్రతువుఁ బుణ్యరాశి యయ్యె.

చ. సకలవిధానదక్షుఁడవు సర్వము నారసి చేయఁ బంపు నీ
సకృపవిలోకనంబులను [1]సార్థము లై క్రతుమంత్రతంత్రముల్
వికలత లేక చెల్లు జనవిశ్రుతుఁ డీనృపుఁడున్ భవద్దయన్
సుకృతులలోనఁ బెంపు గని చూడఁ గనుం దగఁ బుణ్యలోకముల్. 100

వ. అని యిట్లు నిభృతుం డై యభివర్ణనపూర్వకంబుగా సంభాషణం బాచరించిన.

సీ. భూరిహర్షంబునఁ బొంది పురందరుం డమృతాశనులఁ గలయంగఁ జూచి
యజ్ఞవాటం బుదాత్తాభిరామంబుగఁ జేయింపుఁ డప్సరస్త్రీజనంబు
నాట గంధర్వులపాటఁ జెల్లింపుఁడు నావుడు వా రట్ల నడపి మఱియు
సకలకర్మములకు సాహాయ్య మాచరింపంగ వేఱొకయగ్నిభంగి వెలిఁగి

తే. లసితసముచితపీఠ మలంకరించి, వేడ్క సంవర్తముని హవిర్విధి యొనర్ప
యాగ ముజ్జ్వలమును సుప్రయోగకంబు,నగుచునొప్పారె భరతకులాగ్రగణ్య.

తే. [2]ప్రీతిఁ బేర్వేరఁ బిలిచి చేసేత సోము, మమ్మహాయోగి యంది యీనెమ్మిఁ బాన
మాచరించి సహస్రనేత్రాదు లైన, యమరు లానందమునఁ దేలి రధిపముఖ్య.

వ. ఇట్లు మరుత్తుండు మరుత్పతికిం బరమతృప్తిఁ గావించి యామంత్రణంబు సేయ నయ్యిందఱు నభినందించి నిజనివాసంబులకుం జని రజ్జననాథుండు. 104

చ. యజనము సెల్లుకాలము సమాప్తతఁ బొందిన నాఁడు దద్దయ
క్కజ మగుభంగిఁ బ్రస్ఫురితకాంచనరాసు లనేకముల్ బహు

---

1 సాధ్యములై. 2 ప్రీతి రెట్టింపఁ బేర్వేరఁ బిలిచి సోమ.

ద్విజులకు భక్తియుక్తియును వేడుకయుఁ గా వినయంబు నొప్పఁ గం
భజనపరార్థుఁ డై యొసఁగెఁ బౌరవవంశపయోధిచంద్రముఁ. 105

తే. అంతఁ బోవక హేమమయత్వమహిత, యజ్ఞవాటభాండాదిపదార్థములును
బ్రాహ్మణావళి కిచ్చె నప్పాట నతఁడు, హిమగిరిప్రాంతమునఁ గ్రతు వెలమిఁ జేసి.

వ. సంవర్తునిచేత ననుజ్ఞాతుం డై నిజపురంబునకు నరుగుదెంచి వార్ధివేష్టితవసుం
ధరావలయంబునం బుణ్యాపరత వెలయం బాలించె బ్రాహ్మణులు దమయోపినంత
యుం బసిండిద్రవ్యితండంబులు దెచ్చుకొని తక్కినదాని నచ్చట నొక్కెడనిధిగా
నిక్షేపించి దీనిం గాలాంతరంబున నెవ్వరేనిం గని రివి యక్కనినవారిధనంబ
యని రమ్మహాకాంచనసంచయంబు గొనివచ్చి విచ్చలవిడి నశ్వమేధయాగంబున
సకలదేవతలం దృప్తులం జేయు మనియె నట్లు వేదవ్యాసమునీశ్వరుండు సెప్పిన
వచనంబులు వినియును బంధువిషయశోకంబునం గ్రమ్మఱం దెలివి నొందియు
నొందక ధూమంబు వాఁదివిన యనలంబునుంబోలె నున్న పాండవాగ్రజుం
గనుంగొని కమలనాభుండు. 107

తే. వంక రైనతలం పెల్లవసుమతీశ, యరయ మృత్యుపదం బగు నార్జవాన్వి
తంబు బ్రహ్మపదం బింత తథ్య మేల, యీఱతాఱతలంపుల బీఱువాఱ. 108

క. కర్మానుష్ఠానంబును, నిర్మలముగ నడపఁ బడదు నీచే విను మో
ధర్మతనూభవ వగయును, నిర్మూలము సేయ విది మనీష గలిమియే. 109

వ. వగ [1]నిర్మూలము సేయమి యెట్లంటేని నీ వంతశ్శత్రుల నెఱుంగవు గాదె కావున
నేతద్విషయం బైన యొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము. 110

—— శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు మనస్తాపోపశమంబు సేయుట ——

సీ. అవని యెల్లను వృత్రుఁ డాక్రమించి తదీయగుణ మగుగంధంబు గొనిన వజ్రి
వానిపై వజ్రంబు వైవఁ గ్రమ్మంబున నంబు తేజపవనాంబరముల
యందుఁ బ్రవేశించి యందుల రసరూపసంస్పర్శశబ్దములఁ జండవిక్ర
ముం డైనయతఁడు సముద్ధతిఁ గొనఁగొనఁ దోడ్తోడ నమ్మహేంద్రుండు గులిశ

ఆ. నిహతి వెలువరింప నిర్భరవేగుఁ డై, యతనిలోను సొచ్చె నసుర దాన
మూర్ఛవోయె దివిజముఖ్యుండు బోధితుఁ, జేసె మంత్రవిధి వసిష్ఠుఁ డతని. 111

వ. ఇట్లు వసిష్ఠప్రయుక్తమంత్రశక్తిం బ్రబుద్ధుం డై నవ్వృత్రశత్రువుండు శరీరాంతర్గతుం
డై నవ్వృత్రు నదృశ్యుం బైనవజ్రంబున వధియించె నవ్వాసవుం డీధర్మరహస్యంబు
తెఱంగు మునుల కెఱింగించె మునులు నాకుం జెప్పిరి మానవేశ్వర దీని నీవు
దెలిసికొను మని పలికి యప్పాండవాగ్రజునితో నప్పుండరీకాక్షుండు వెండియు
ని ట్లనియె. 112

సీ. శారీరమును మానసంబును నా రెండు దెఱఁగు లై వ్యాధి వర్తించు నందు

1 నిర్మూలము సేయు మది యెట్లంటేని.

వినువాతమును బిత్తమును శ్లేష్మమును సమత్వంబుఁబొందినయప్డు స్వస్థుఁడగున
రుం డవి మూఁడు నొక్కండైన వికృతి నొందిన శరీరవ్యాధి యనఁగఁ బరఁగు
సత్త్వరజస్తమస్సమత సుస్థితి విషమత మనోవ్యాధి యీద్వితయమునకు

ఆ. నొంటి దోఁచు నెప్పుడు నొదవ దన్యోన్యసం,జనకజన్యభావ సత్తఁజేసి
వికృతికాల మొకట నొకటి దోఁచునది వా,తాదులందు గుణములందు నధిప.

వ. ఇది సూక్ష్మకర్మానుష్ఠానప్రకారంబు దీని నీ వలవరింపవు గావునం గర్మానుష్ఠా
నంబును నిర్మలంబుగా నడపంబడ దంటి నని పలికి మఱియును. 114

క. వాతాదులందు గుణములు, నీ తెరువునఁ దక్కు వగుట యెక్కు డగుట నీ
[1]చేతఃప్రశక్తిఁ దోఁచి నృ,పా తెలియఁగ వలయు సమతపరశాంతికి నై. 115

సీ. అమ్మెయి గాక వాతాదులు సత్త్వముఖ్యములును దివిచినఁ గలుఁగు దేని
నది నీస్వభావఁ మే మఱఁ గల దింకను జెప్పెద నవధాన మొప్ప వినుము
సభ కేకవస్త్ర రజస్వలఁ బాంచాలిఁ గొని రాక మఱవు కాననములోన
నిడుమలు గుడుచుట నెడ్డ బెట్టకు జటాసురసైంధవాదులదురితకృతులు

తే. దలఁపకుము మాత్స్యపురమున దైన్యపడుట, బుద్ధిసేయకు భీష్మాదియుద్ధతంత్ర
మారయంగ యుద్ధంబు గా దందుఁ బుట్టు, కీడు మే లేమియును జిత్తగింపకుండు.

వ. దాని నెట్లు యుద్ధంబు గా దనియె దం టేని నది మిథ్యాయుద్ధంబు సత్యయుద్ధం
బాకర్ణింపుము. 117

ఉ. అమ్మెయి బంధుమిత్త్రులసహాయతకల్మి ప్రయోజనంబు లే
దమ్మహనీయయుద్ధమున కాత్మయు తోడు మనంబు శత్త్రుఁ డీ
వెమ్మెయి నైన శాంతి ఘటియింపుము లోపగఁ దీర్పు మందు శాం
తమ్మ చుమీ మనోవిజయితక్ష వెలుఁగొందుము శాంతబుద్ధి వై. 118

తే. అంతరం బగునిక్కయ్య మధిప గెలువ, కిట్ల యేగతి బోయెదో యెఱుఁగ దీని
నీవ కనికొని సద్బుద్ధినిశ్చయప్ర,వీణుఁడవు గమ్ము మాటలు వేయు నేల. 119

వ. అని చెప్పి కౌంతేయాగ్రజునితోఁ గృష్ణుండు వెండియు ని ట్లను రెం డక్షరం
బులు మృత్యువు మూఁ డక్షరంబులు బ్రహ్మం బవి యెయ్యవి యం టేని వినుము
మమ యనునవియును నమమ యనునవియును నై యుండు భూతంబులచేతం
గానంబడక యాబ్రహ్మమృత్యువులు పోరుచుండు. 120

క. తత్త్వ మనశ్వర మశరీ,రత్త్వంబునఁ బరఁగు భూతరాశి నియతనా
శిత్త్వంబు హింసకత్వము, దాత్త్విక మై లేదు దేహదళనమున నృపా. 121

క. శరధిపరివేష్టితక్షితిఁ, బరిపాలించినను దానిపై,ద్రృఢమమతం
బొరయక వర్తించిన నృపపూరుషుని దురితంబు లెట్లు వొందఁగ నేర్చున్. 122

క. వనమున వన్యాహారం,బున వర్తించినఁ బదార్థములపై మమతక్ష

1 చేతఃప్రసక్తిఁ దోఁచి నృపా తెలుఁ గెఱుఁగ నగు సమత.

మనమున విడ కుండిన నమ్మనుజుఁడు మృత్యుముఖవర్తి మనుజాధీశా 123

క. వెలిపగఱ గెలుపు గెలుపే, యలఘుమతిఁ గెలువవలయు నభ్యంతరశ
త్రులఁ దద్విజయము మోక్షము, నలవడుపం జాలు నొంట నమ్మే లగునే. 124

క. విను మంతశ్శత్రులలో, ఘనుఁ డగుఁ గాముఁడు నిరస్తకామం బగువ
ర్తనము విరల మధ్యయనయ,జనదానంబులును గామసహితములు గదా. 125

వ. ఇవ్విషయంబునం గామగీత లనువాక్యంబులు గలవు వాని నాకర్ణింపుము
కాముండు లోకంబు నుద్దేశించి యి ట్లనియె. 126

క. అనపాయుం డగునెవ్వం,డును నను బాధింపఁ జాలఁడు ప్రయత్నము నా
ధన మగునె వేదవేద్యుం, డ నయి వరఁగుచున్న నాయెడను విహతికిన్నై 127

క. [1]ధృతి నెవ్వఁడు నన్నుం బ్రవి,హతుఁ జేయఁగఁ జూచు [2]భావమగుదు నతని కే
నతఁ డది యెఱుఁగఁడు గాన వి,హతి బొం కై పోవఁగా జయము లే కుండున్.

క. ననుఁ దపమునఁ బ్రహరించెద, నని యెవ్వఁడు దొడఁగు నతనికాతపముఫలం
బున దెసఁ గోరిక నై యే, జనియింతుం జెఱుపఁ గా వశమె యెవ్వనికిన్. 129

క. నను మోక్ష మూఁది చెఱచెద, నని యెవ్వఁడు దలఁచు వానియందే మోక్షా
ర్థనమై యునికి నవధ్యుఁడ, సనాతనుఁడఁ ద్రోవఁ నొకఁడుఁ జాలఁడు నన్నున్.

క. అని యివ్విధమునఁ గాముఁడు, దనుఁ జెఱుపఁగ రామిఁ జెప్పుతలఁ పొందినఁ జె
ప్పినభంగి నెదను దోఁచెను, విను మవధానమునఁ బాండవేయప్రవరా. 131

చ పనివడి పూఁచి పట్టమి సుబంధురనైర్ధ్యము నిర్వహింతు నే
ననుమతి నొప్ప కుండుట సముగ్రతపంబున తత్ఫలేచ్ఛ లే
కునికి విమోక్షతృష్ణభర మొందమి కాము నడంచుఁ గాన యి
య్యనువులు లేమి సువ్వె యనపాయత గా నతఁ డాడె భూవరా. 132

క. విను పెక్కులేల కోరిక, మనమునఁ జొరనీక యున్న మడియుం గాముం
డనవద్య యశ్వమేధం, బొనరింపుము గోరకుండు మొక్కటియు మదిన్. 133

ఆ. అశ్వమేధమఖమునం దట్ల యనఘ య,లోలుపత్వగుణవిశాలబుద్ధి
శాలి వై ఫలాభిసంధి లే క క్కామ్ము, ధర్మగాఁ బొనర్పు ధర్మతనయ. 134

క. చచ్చినబంధులఁ గొని రా, వచ్చునె తలఁపకుము నీవు వారిం గ్రతువుల్
విచ్చలవిడిఁ జేయుము నిను, మెచ్చు జగంబు సమరూరు మీఁద సుగతియున్.

వ. అని యిట్లు కృష్ణుండు సెప్పెఁ బారాశర్యుండు బోధించె దేవస్థానుండు నారదుం
డును హితవచనంబు లుపదేశించి భీమాదులు నలువురును ద్రౌపదియును దగిన
మాటలు సెప్పిరి శాస్త్రచక్షుర్మహితు లైనమహీసురులు యోగ్యవచనంబు
లుపన్యసించి రివ్విధంబుగ నందఱవాక్యంబులు నాకర్ణించి శోకంబు విడిచి
యాభూకాంతుండు ధరణీపాలనాధ్వరకరణంబుల కియ్యకొని యశుచిత్వనివృత్తి

1 ధృతి మెయి నెవ్వఁడు ననుఁ బ్రతి. 2 భావమగుడు.

రై గంగాతీరంబునఁ గొన్ని దినంబులు నిలుచువాఁ డయి మునివర్గంబునకుఁ బ్రదక్షిణంబును బ్రణామంబును జేసి. 136

క. మీకారుణ్యంబున నా, శోకం బంతయును బాసె సుమనస్కృత సు
శ్లోకాత్ములార కలిగెఁ, నాకుఁ విచ్ఛేయుఁ డింక నను మఱవకుఁడీ. 137

వ్యాసనారదాదిమునులు ధర్మజు వీడ్కొని స్వస్థానములకుఁ బోవుట

వ. అని పలికి విశేషించి వేదవ్యాసమునివరుపాదంబుల కెఱఁగి భవత్ప్రసాదంబునం గందువ గనినకనకమ్ము మిమ్ముం బురస్కరించుకొని పోయి చేకొనం గల వాఁడ నప్పటికి సన్నిధి సేయవలయు నప్పెన్నిధికి నాశ్రయం బైనహిమగిరి మహీధరంబులోన నెల్లను బరమాశ్చర్యనిధి యని సవినయంబుగాఁ బ్రార్థించి నాపైఁ బెక్కులు కళ్యాణకరణకల్యంబు లగుమాట లాడితిరి మహాభాగ్యవంతు లకుఁగాక యిట్టివారికారుణ్యంబు దొరకొనునె మీకరుణయ నన్ను భాగ్య వంతుం డని తెలిపెడు నని [1]బహుప్రకారంబులం బ్రస్తుతి సేసె నట్లామంత్రి తులై యమ్మహాత్ములందఱుఁ గృష్ణార్జునామంత్రణంబు గైకొని యంతర్ధా నంబు సేసిరి పదంపడి భీష్మునకుం బరలోకక్రియలు ధృతరాష్ట్రసహితుం డై యాచరించి కర్ణప్రభృతికురుప్రకరంబునకు నూర్ధ్వలోకసాంద్రసౌఖ్యసిద్ధ్యర్థం బుగా నానావిధదానవిధులు నిర్వర్తించి కృతకృత్యుం డై కతిపయదినంబుల కచ్చోటుగదలి పాండవాగ్రజుండు పాండున్నృపాగ్రజు నగ్రేసరుం గావించుకొని కరినగరంబున కరిగి యతనిం బూజించి తదనుజ్ఞాశోభితుం డగుచుఁ గృష్ణుండును భీమాద్యనుజులు మోదంబునొంద జనులు నభినందింపఁ బెం పారి [2]వసుం ధరాపరిపాలనధురంధరుం డయ్యె నని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయ నున కి ట్లనియె. 138

ధర్మజుఁడు ధరణిం బాలించునపుడు కృష్ణార్జునుల వర్తించువిధము

తే. ఇవ్విధంబున ధర్మజుం డెలమి ధరణి, పాలనము సేయఁగాఁ గృష్ణపార్థు లెట్టి
తెఱఁగు వార లై యెచట వర్తించి రెఱుఁగఁ, జెప్పవే నాకు సజ్జనసేవనీయ. 139

వ. అని యడిగిన వైశంపాయనుం డి ట్లనియె. 140

సీ. ధర్మజుం డిమ్మెయి ధరణిఁ బాలింపంగ ననఘు యింద్రప్రస్థమున వసించి
కృష్ణుండుఁ గ్రీడియుఁ గ్రీడాపరత సరిత్కాననపర్వతసానుదేశ
ములఁ జరించుచు విప్రపూజలఁ బుణ్యకథాశ్రవణముల సత్కావ్యగోష్ఠిఁ
బ్రొద్దుపుచ్చుచుఁ దమపూర్వవృత్తము లైన సమరతంత్రప్రముఖములఁ జెప్పి
తే. కొనుచునుండుదు రాత్మీయతనయు నరుఁడు,దలఁచి వగచిన శోకంబుదలఁగునట్టి
వాక్యసంతతి నావృష్ణివరుఁడు దేర్చు, సముచితోక్తుల ధర్మజుశాంతి వొగడు.

క. [3]విను మయకృతసభఁ గ్రొత్తగఁ, [4]గని యచ్చో నొక్కయెడ సకౌతుకనానా

---

1 సూనృతప్రస్తుతిసేసె. 2 పృథివిం బాలించె నని చెప్పిన. 3 వినుమామయుఁసభ. 4 గనుఁ గొని యం దొక్కయెడ.

జనపరివృతులై యుండుదు, రనూనవిభవమునఁ బ్రమద మూరఁగ వారల్. 142

వ. ఒక్కనాఁ డప్పుండరీకాక్షుండు గాండీవితో ని ట్లనియె. 143

సీ. సమరంబు ధర్మవిజయపరికీర్త్యంబు గాఁ జేసి భూమి నిష్కంటకముగఁ
బాలించుచున్నాఁడు ప్రజ ప్రీతి నొందంగ విద్వజ్జనంబులు వివిధసుఖము
లనుభవించుచుఁ దన్ను వినుతింపనెగడెడు శాంతియు సమతయు సకలజనముఁ
గొనియాడి సిద్ధులు మునులు సేవింతురు ధర్మనందనుఁ డి ట్లుదాత్తుఁ డగుచె
తే. యతని కున్నతి గావించి రనిలజుండుఁ, గవలు నెంతయు నీచేతిగాండివంబు
లీల గల్గి మహాధర్మశాలి సత్యనిత్యుఁ డమ్మహీపతి గృతకృత్యుఁడయ్యె. 144

వ. అనియగ్గించి యతనియాననం బాలోకించి 145

ఉ. నీవలనన్ మహాత్మ విను నిర్భరచిత్తుఁడ నైతిఁ జూడఁగాఁ
బోవుతలంపు పుట్టెడుఁ బ్రభూతగుణున్ బలదేవు వత్సలన్
దేవకి నార్ద్రచిత్తు వసుదేవుని మద్గతరాగసాంద్రస
ద్భావుల సర్వయాదవులఁ బార్థ ననుం దగ నన్పి పుచ్చవే.

క. ద్వారకకుఁ బోయివచ్చెదఁ, గౌరవపతి కిత్తెఱంగు [1]కార్యజ్ఞానో
దారుఁడ వగునీ వొచ్చి, త్త్వారూఢము గాఁగఁ జెప్పు మగు సమయమునన్. 147

తే. అవ్విభుఁడు వోయి వత్తు గా కనక పోను
మేను బ్రాణంబుఁ దనయులు మిత్త్రగణము
బంధులును నర్థచయము నప్పార్థివేంద్రు
సొమ్ము తదనువర్తనము ప్రతమ్ము నాకు. 148

వ. కావున. 149

క. మనము కరినగరమునకుం, జని పుణ్యాత్ముని నజాతశత్రుని నెలమిం
గని తగునవసరమున నృపుని విజ్ఞాపించి యతని పనిచినభంగిన్. 150

క. నడతము పోద మనుఁడుఁ గవ్వడి గొండొకవడి విచారవన్మానసుఁ డై
కడు మే లటు సేయుద మని, యొడబాటుంబలుకు పలికి యొయ్యన పిదపన్.

వ. అమ్మహాత్మునితో ని ట్లనియె. 152

చ. అనికిఁ [2]దొడంగునప్పుడు మదాత్మ గలంగినఁ గొన్ని తత్త్వబో
ధనమహనీయవాక్యము లుదాత్తకృపం దగ నీవు సెప్పి తే
మనమున వానియర్థములు మాధవ నిల్పఁగఁ జాల నైతి న
వ్వినుతవచస్సుధారసము వీనుల నింకొకమాఱు నింపవే. 153

క. అనిన నగుచు నొకకేల నతనిఁ గౌఁగిటఁ జేర్చి బుద్ధి తత్త్వవిహీనుం
డను శ్రద్ధారహితుఁడు నై, తని దూఱి ముకుందుఁ డిట్లు లను నాతనితోన్.

తే. [3]బ్రహ్మపద వేదనమునకుఁ బరమహేతు

1 కార్యవిధిజ్ఞో, దారుఁడ. 2 నడంగునప్పుడు. 3 బ్రహ్మపదవిత్త్వమునకును.

భూతములు నాఁటివాక్యముల్ బుద్ధి దన్మ
హార్దములు నిల్వ వైతి శక్యంబె యింక
నవ్వచనములు సెప్పంగ నలఘుశౌర్య. 155

శ్రీకృష్ణుం డర్జునునకుఁ దత్త్వజ్ఞానస్థిరీకరణము సేయుట

వ. తద్విషయం బగునది యొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము నాకడకు నొక్క విప్రోత్తముండు వచ్చిన నేనును దత్త్వజ్ఞానంబు తెఱం గుపదేశింపవే యనుటయు నతండు కాశ్యపనామధేయుం డగునొక్కధరామరుం డొక్కెడ విజితేంద్రియుండును జ్ఞానవిజ్ఞానశాలియుఁ ద్యక్తసంసారపరిగ్రహుండును బ్రబుద్ధసేవితుండును నగునొక్కసిద్ధునిం గాంచి సంభృతవినయుం డై శిష్యత్వంబున భక్తి నాశ్రయించిన నమ్మహాద్విజునకు నమ్మహానీయుండు సెప్పినవాక్యంబులు సెప్పెద నవధానంబుతో వినుమని పల్కి మదీయవదనంబునం జూడ్కి నిలిపి యి ట్లనియె. 156

ఆ. అట్లు భక్తిఁ దన్ను నాశ్రయించిన శుచి,త్వాధికుండు నిర్మలాత్మకుండు
నతులవినయపరుఁడు నగువిప్రవరుని వీ,క్షించి యిట్టు లనియె సిద్ధవరుఁడు. 157

సీ. పుణ్యంబు లగుకర్మముల నెప్పుడును జేసి యింపారుచుండు నైహికసుఖంబుఁ
ద్రిదివంబుఁ బడసితి ధీయుత యత్యంతయత్నలబ్ధం బై నయట్టిపదము
పదపడియొకమాత్ర భ్రంశంబు నొంది కామక్రోధముఖచిత్తమలవిశేష
ములఁ బొరిఁ బొరి జన్మమును మరణంబును గలుగంగ నేను దల్లులను దండ్రు

తే. లను సహోదరులను బుత్త్రులను ననేక,జాతికలితులఁ గాంచితిఁ జన్నుఁబాలు
వివిధభంగులదానిఁ ద్రావితి సుహృద్వి,యోగధననాశదుర్దశలొందెఁ బెక్కు.

క. మానసశారీరము లగు, నానావేదనల వివిధనరకగతుల దుః
ఖానేకత్వ మొనర్చువి,మానవధబంధనప్రమర్దనకృతులన్. 159

వ. అనుభవించుచు నుండి విసివి లోకతంత్రంబు పరిత్యజించితిఁ బదంపడి యాత్మప్రసాదంబున నిట్టిసిద్ధి వడసితి నింక లోకంబుల నాలోకింప నాకుం బ్రజాసర్గంబు గలయంతకాలంబును శుభంబ నిరంతరం బై కలుగుచుండు నే నంత కంతకు నెక్కుడు లెస్స యగుదశలన పొందుదు బ్రహ్మానందంబు సులభంబ యని పలికి మఱియును. 160

ఉ. ప్రీతుఁడ నైతి నీదెసఁ బరిస్ఫుటభంగిని జెప్పు మెద్ది నా
చేత నుపాస్తిమైఁ బడయఁ జేరితి నీ కది గల్గునట్లు గాఁ
జాతు నవశ్యముఁ గా వినయసుందర నన్ను నెఱింగి వచ్చి తీ
వీతెలి వస్మదీయమతి కించిన నిన్నుఁ బరిగ్రహించితిన్. 161

క. అనుఁడు నతఁడు హర్షించుచు, ననుఁ బరతత్త్వప్రబోధనమునఁ గృతార్థా
త్మునిఁ జేసి జన్మమృతిదుఃఖనిరాస మొనర్చు పరమకారుణ్యనిధీ. 162

వ. అనుచుం దచ్చరణంబులు గరంబుల నవలంబించి ప్రణతి యాచరించి కేలు మొగిచి యున్న నయ్యుర్వీసురోత్తముతో నాసిద్ధసత్తముండు నీకుం బరిపాటిం జెప్పెద సావధానమానసుండ వై యాకర్ణింపు మని యిట్లనియె. 163

ఆ. ధర్మసాధనంబు దనువు ధర్మము పరి,జ్ఞానదాయి యట్లు గాన తనువు
నోమ వలయు మర్త్యుఁ డేమిట నేమఱ, కాత్మహితము గోరి యనఘచరిత. 164

వ. ఏమఱుటల తెఱంగు వివరించెద. 165

సీ. తనసత్త్వమును బలంబును దన కయ్యెడు కాలంబు నారయఁగాఁ దలంపఁ
డాహారములు గొను నవియును నగునవి గానివి యనువివేకంబు బుద్ధిఁ
జొనుపఁడు బహుళభోజన మొకమరి సేయు నొకమరి దుర్భిక్ష నుపవసించు
గతకాలమును నపక్వంబును గురుదుష్టవిషమవిరుద్ధము విపులరసము

తే. నైనయన్నముఁ దా నరయక భుజించుఁ
గుడుపుపైఁ గుడ్చు దిన నిద్రఁ గూరు సురత
పరత నొందుఁ బెల్లాయాసపడు విమూఢుఁ
డతని బాధించు దోషత్రయంబుఁ గెరలి. 166

వ. అని చెప్పి. 167

శ్లేష్మాదిరోగవికారంబుల నిరూపించుట

ఆ. అర్హకర్మలోప మవచయ మొనరించు, ననఘ దేహమున కనర్హ వేగ
ధారణములు రోగతతి జనింపఁగఁ జేయుఁ, గామరోషములను గాయ మెడలు.

క. అత్యంతప్రబలంబులు, పైత్యవికారములు రేఁగి ప్రాణములకు శీ
ఘ్రాత్యయముంజేయు మహా,ద్ధత్యంబున నెలవు వెడలఁ దఱిమి సుచరితా.

తే. అవ్వికారంబు లెక్కుడై యడరి యెచ్చు
నెచటు భిన్నంబు సేయు నయ్యెడలు మర్మ
నామకంబులు మర్మభిన్నత్వ మెట్లు
సేయకుండుఁ బరిచ్యుతి జీవమునకు. 170

క. వినుము తెలియంగ శ్లేష్మం, బనుదోషం బారఁ బరఁగి యవయవములు జా
డ్యనిరూఢంబులుగాఁ జే,యును లోపలిబయలు నెల్ల నొయ్యన కప్పున్. 171

వ. పదంపడి. 172

క. కుత్తుకకు నడ్డపడు నో, ర్వొత్తిలి పోనీక యాఁగు నూర్ధ్వశ్వాసం
బెత్తఁగఁ జేయును జీవుం, డత్తనువున నుండ నేర కంతట వెడలున్. 173

క. స్రోతోమార్గంబులఁ జొ,వే తమ కర్హంబు లైనవిషయంబులఁ బ్ర
స్ఫీతమతిం జాతురో,వేతములై యింద్రియంబు లేనును బుట్టున్. 174

క. స్రోతోమార్గములు గఫము,చేత నిరుద్ధంబు లైనఁ జెడు నింద్రియజా

తాతతశక్తులు దానను, వీతము లగుఁ జేష్టితములు విను మనుజులకున్. 175

తే. వాయు వంగంబులందు దుర్వ్యాప్తిఁ గదిరి
నొవ్వుఁ దెవులును బుట్టించుఁ గ్రొవ్వు సెఱచు
సందు లెడలించుఁ గ్రమమున నెందుఁ బరఁగి
తనువు [1]మ్రానుగఁ జేసి జీవుని వెలార్చు. 176

క. నాలుక యాడుట కేలుఁ, గాలు ముడుపఁ జాఁప నగుట కాయంబునయం
దిలీలలు వాయుగతు, [2]శ్లే లే నివి గలుగుఁ దక్కుమే లమలాత్మా. 177

క. ఎక్కటి యిట్టివి దోషము, లొక్కొకమరి రెండుమూఁడు నొదవిబెరయుఁ దా
నక్కడు సన్నిపాతం, బక్కజముగఁ దనువుఁ బాపు నది జీవాత్మున్. 178

క. ఈవిధమున వెడలి చనిన, జీవుఁడు నిజకర్మజాలసిద్ధగతులకుం
బోవుం దద్భవసుఖదుఃఖావేశముఁ బొందుచుండు నస్యైయెడలన్. 179

క. కృతకర్మఫలము దెగఁ గుడిచి తనకుఁ దగినట్టిపుట్టు నెందు మగుడ ని
ట్టితెఱంగున జీవాత్ముఁడు, గతాగతము లనుభవించుఁ గల్మషరహితా. 180

క. పాపాత్ములు నరకముఁ బుణ్యోపేతులు దివము విధినియుక్తి నవశతం
బ్రాపింతురు గావున నిర్లేపం బగు మోక్ష మొంద లే రట్టిజనుల్. 181

తే. ఊర్ధ్వగతి కేఁగుమానవు లుండునట్టి,నెలవు లార్యులు శాస్త్రసునిశ్చయమునఁ
గని యెఱింగింతు రవి నీవు వినుము నీకుఁ, దెలియునట్లుగఁ జెప్పెద ధీసమగ్ర.

తే సోముఁడనఁ దారకములన సూర్యుఁడనఁగఁ,గలుగు తేజస్విమూర్తులనెలవులందు
ధర్మపరులుండుదురు తారతమ్యములకు,మనసు లెరియునట్టివి గడుమంచి వగు నె.

క. అదియును గాక ఫలంబులు, దుది ముట్టఁగఁ గుడిచి వెడలఁ ద్రోవఁ బడుదు ర
ట్టిది సౌఖ్య మగు నె శాశ్వత, పదంబు మోక్షంబ కాక భవ్యవిచారా. 184

వ. అని చెప్పి గర్భావాప్తిప్రకారం బెఱింగించెద విను మని పలికి సిద్ధుం డా
భూసురున కి ట్లనియె. 185

తే. అశుభములును శుభమ్ములు నైనకర్మ,ములఫలంబులు గుడువక పోవఁ గాదు
మన్యువశగతమైనయాత్మకు నుదాత్త,చరిత యది కారణము సువ్వె జన్మమునకు.

క. ఎనయఁగ శుక్లము శోణిత,మును బెరసి వెలందిగర్భమున నెలకొను న
ప్పుని బ్రహ్మశక్తి బీజ,త్వనిరూఢిం బొనరు నవి మొదలుఁ బిండం బై. 187

క. విను మాబీజము పిండము, తనువునఁ జైతన్యరూపతం బరఁగి శిరం
బును గేలుఁ గాలు నుదరం,బు నురము వెన్ను నను నంగముల నేర్పఱుచున్.

వ. అని చెప్పి. 189

క. జననార్హవేళ వెలువడి, తనతొల్లిటికర్మములకుఁ దగినవివిధవ
ర్తనములఁ బొందు నవి దెగినఁ, జని మఱియుం బుట్టుఁ గర్మసంతతికిఁ దగన్. 190

---

1 మానుగ. 2 శ్లేలైనం గలుగు దక్కులే వమలాత్మా.

క. నరుఁ డెంతకాలమేనిం, బరమం బగుముక్తిపదముఁ బడయక యుండుం
బురుషవర యంతకాలముఁ, బొరి బొరి నిబ్బంగిఁ జావుఁబుట్టువు నొందున్. 191

సీ. కావున ముక్తికిఁ గారణం బగుదాని నేర్పడఁ జెప్పెద నెఱిఁగి కొనుము
దానంబు శమమును దమమును బ్రహ్మచర్యంబును వ్రతపరిరక్షణంబు
దయయును బరధనదారవర్జనమును [1]నియమయమేంద్రియనిగ్రహములు
జననీజనకగురుజనపూజలును దేవతాతిథిపితృదేవతార్చనములు

తే. సత్యమును శౌచమును శుభసంవిధాన
నిరతియును ధైర్యమును గ్రౌర్యనిరసనమ్ముఁ
గలిమి పుణ్యవృత్తం బిది గలుగునరుఁడు
మొనయు దీని నూఁతగఁ గొని మోక్షమునకు. 192

క. పదపడి ధర్మాచరణము, వొదలుం దత్స్వాత్మవిధము బుధజనులకడం
గదలక నిలిచి యెఱిఁగికొన, విదితం బగువారిశీలవృత్తములఁ గడున్. 193

క. వారలు సెప్పెడిశాంతో,దారవచనసమితి వినఁగఁ దద్గతబహుగం
భీరార్థము లంతగికర,ణారూఢము లైనఁ బొరయ వాపద లెందున్. 194

సీ. వ్రతపరినిష్ఠమై వర్తించుచుండి యింద్రియవిజయమును శాంతియును గలిగి
బ్రహ్మైకభజనతత్పరుఁ డగు చుండెడునతనికి బ్రహ్మంబు హుతవహుండు
సంస్తరంబునుయోగ్యసమిధలు జలమును మంత్రంబు గురుఁడు బ్రహ్మంబ యిట్టి
సచ్చరణంబు సూక్ష్మబ్రహ్మచర్యంబు దీనియం దుత్తమస్థిరత గలుగు

తే. వాఁడు హర్షశోకోద్దామవాయుహతుఁడు
గాఁడు మేదురమోహాంధకారమున వె
డంగుపడఁడు సంసారనిస్సంగసిద్ధిఁ
బొందుఁ గాలక్రమమున సత్పూరుషవరుఁడు. 195

వ. అని చెప్పి మఱియును. 196

### తత్త్వజ్ఞానవిశేషప్రదర్శనము

సీ. ఆదిసృష్టిఁ బ్రధాన మనుతత్త్వ మంబుజాసనుఁడు గల్పించి చేతన మొనర్చె
క్షర మండ్రు దానిఁ దత్పర మగుతత్త్వంబు నక్షర మనియును నమృత మనియు
నార్యులు సెప్పుదు రమ్మిథునంబునయందు సంపన్నంబు లఖిలభూత
జాలంబులకును సంజనకంబు లైనబీజము లిది శ్రుతివాక్యసంభృతార్థ

తే. మతఁడు గలిగించె గమనము నాగమనము
జీవరాశికిఁ గావున నావిధమున
నది భ్రమించుచునుండుఁ బుణ్యాతిశయము
కతన జీవాత్ముఁ డొకఁడు దక్కఁ గాంచినపుడు. 197

1 నియమంబు నింద్రియనిగ్రహంబు.

క. విను సుఖదుఃఖము లచిరముల,నియుం దను వశుచి యనియు నఖిలపదార్థం
బును నశ్వర మనియుం గ,ర్మనిరూఢత జాడ్య మనియు మది నూహించున్. 198

క. ఊహించి తన్నుఁ గప్పెడు,[1]మోహావేశంబు ద్రోచి మోక్షపదప్రా
ప్తిహాను సంసారాబ్ధ్యవ, గాహనముం జేయ కుండు గతకల్మషుఁ డై. 199

వ. అని పలికి వెండియు. 200

క. జనిరుగ్జరామరణములు, గని ప్రకృతివిధంబు లెస్సగా నెఱుఁగుటఁ ద
జ్జనితక్లేశమునకు విసి,విన మర్త్యులు పరమపదము వెదకుదు రనఘా. 201

సీ. అట్టివా రిట్టివా రగుట మేల్ గనికొని యజవంబుఁ బూతంబు నైనచోట
నాసీనుఁ డై హృదయంబున నొకచింతయును లేక యూఱడి యుండ యదరి
తోఁచుతోఁపుల నెల్లఁ దోడ్తో నడంచి నిరాలంబనుం డైనయతఁ డొకండు
సర్వమిత్త్రుండును సర్వసహుండును నిర్జితేంద్రియుఁడును నిస్పృహుఁడును

తే. గామకోపహీనుఁడు శముఘనుఁడు నైన
యతఁ డొకండు మానాభిమానాపగమము
సర్వభూతాత్మకత్వదర్శనముఁ గలుగు
నతఁ డొకండు వీరలు గందు రనఘ ముక్తి. 202

సీ. ఒలయులాభాలాభములుఁ బ్రియద్వేషంబులును సుఖదుఃఖములును సమంబు
లై యుండు నెవ్వని కాసపాటును నవజ్ఞతయు నెందును లేక సర్వధర్మ
తంత్రలోలుండును ధర్మశీలుండుఁ గాఁ డెవ్వఁడు గూర్చువా రొవ్వ కుండు
వా రని తనకు నెవ్వరును గల్గక త్రివర్గేచ్ఛ యెవ్వనిచేత నీడ విడువఁ

తే. బడు నకర్మభావంబుఁ దాపత్రయాప
గమము వైరాగ్యసుస్థిరత్వమును గల్గు
నరయ నెవ్వనియం దేని నతఁడు నతఁడు
నతఁడు నతఁడును గందు రవ్యయపదంబు. 203

క. అసమాలంబ మశబ్దము, రసగంధస్పర్శరూపరహిత మగుణ ము
ల్లసితగుణ మగు వెలుఁగు న,భ్యసననియతిపరుఁ డొకండు వడయుం బుత్త్రా. 204

తే. సర్వసంకల్పవర్జనశాలి యగుచుఁ, బరమశాంతి చిత్తంబునఁ బట్టుకొల్పు
నతఁ డనింధనానలమున ట్లల్లఁ బొందు, వికృతివర్జిత మైననిర్వృతి గృతాత్మ.

వ. అని నిర్దేశించి యోగిజనానుభావ్యం బైననెల వెఱింగించెద నని పలికి యోగులు
దాన నాత్మదర్శనానందంబు నొందుదు రవధానంబున నాకర్ణింపు మని
యి ట్లనియె. 206

ఆ. అనఘ ముంజగర్భ మగునిషీక నిదర్శ,నంబు గాఁగఁ గనుఁగొనంగవలయుఁ
దనువు ముంజ మాత్మ దదిషీక నిష్కర్ష, విధము సుమ్ము యోగవిదునివెరవు.

క. తనువువలన నిష్కర్షం, బొనర్చి జీవాత్ముఁ గాంచు యోగివరుండ

1 మోహాతిశయంబు.

య్యను వాదవి యట్లు దన్నుం, గనినప్పుడు జననమరణగతులం దొఱఁగున్.

క. ముక్తుండు జరామరణవి, యుక్తుం డై హర్షశోకయోగ మెడలి స
ద్భక్తులకును నప్పద మీ, శక్తుం డగుఁ జువ్వె బ్రహ్మచర్యము పేర్మిన్. 209

ఆ. ఒడలి యస్థిరత్వ మూహించి యాత్మయం, దధికనిష్ఠ గలుగునతఁడు సకల
భూతకోటివలనఁ బొందఁడు భయము రా,గాదిదుఃఖములకు నగపడండు. 210

క. విను యోగయుక్తునకు శ, స్త్రనిహతి జలబాధ యగ్నిదాహము మొద లై
చనునవ్వికారములు లే, వనఘ యతఁడు గోరఁ డైంద్ర మగుపద మైనన్. 211

క. తనయంద తన్ను లెస్సగఁ, గనుటం గడచినసుఖంబు గలుగదు లోకం
బున నెందు దాని కయ్యెడు, వినుతానుష్ఠానమునకు విసువమి వలయున్. 212

వ. అయ్యనుష్ఠానం బెట్టి దనిన. 213

క. తనయెఱిఁగిన తెరువున నె,మ్మన మంతర్వర్తిఁ జేసి మఱి బాహ్యగతిం
జన నీ కుండఁగ నది యొం, దనువునఁ బడు నిలుపవలయు నచ్చోట దానిన్. 214

వ. అది యె ట్లనిన. 215

తే. దంతములు జిహ్వ గుత్తుక తాలుతలము
గంఠనాళంబు హృదయం బగణ్యచరిత
మఱియు లోపల నెచటికి మనసు మెలఁగెఁ
దాఁ గదల్పక యచటన యాఁగవలయు. 216

వ. అని చెప్పె నని చెప్పి నాతో శిష్యుం డని మఱపువం బలికి తలంచికొని కొండొక నవ్వుచు నవ్విప్రుండు నా మొగంబు సూచి యచ్యుతా యాసిద్ధుం డనువాఁడ నేన కదా నీయెఱుంగనియది యునుం గలదే మఱియు నక్కాశ్యపనామధేయుం డడిగిన తెఱంగు దానికి నుత్తరంబు నాయిచ్చినవిధంబును విను మని యి ట్లనియె. 217

ఆ. కేలు మొగిచి వినయశాలి యమ్మేధావి, విశదకరుణఁ జెప్పవే మహాత్మ
పరమమోక్షకరణపరిణతం బైనయు,దాత్తసూక్ష్మసుకరధర్మ మనియె. 218

వ. అనిన నవహితుండ వై యాకర్ణింపు మని పలికి యి ట్లంటి. 219

ఆ. పాలకడవ వెన్క పసులలోఁ డించిన, యాతఁ డెట్లు దాని నరసికొనుచు
నుండు నట్లు లోన నునిచినమనసు నే, మఱకయాత్మ వెదకు తెఱఁగు మేలు. 220

క. ఈ తెఱఁగున నుద్యుక్తుం, డై తెలి వొందినమనంబు నతులవివేక
ఖ్యాతి మరిగించి శశ్వ, ద్ద్యోతిత మగు బ్రహ్మము జతురయోగి గనున్. 221

తే. అయ్యనాదితత్త్వము చక్షురాదికంబు, లైనయింద్రియములకు గ్రాహ్యంబు గాదు
సకలమలనిరాసాజ్యప్రసన్నతరమ,నఃప్రదీపంబు దద్దర్శనం బొనర్చు. 222

క. కలయంగ నెల్లయెడలం, దలలును లోచనములును బదంబులు హస్తం
బులు నై యాతత్త్వం బు,జ్జ్వలభంగి వెలుంగ యోగవంతుఁడు గాంచున్. 223

క. తను నేర్పరించి కేవల, మును శాంతము నైనతత్త్వమును సంతతముం
గనుచున్నఁ దన్ను నెఱుఁగం, గనుఁజీకటిఁ బాపువెలుఁగు గలుగుం బుత్త్రా.

వ. బ్రహ్మవిద్యారహస్యంబు సర్వంబు నీకుం జెప్పితి నీవింక సుఖివి గమ్ము పొమ్ము నేనుం బోయెద నని యామంత్రణంబు సేసిన నపాస్తసంశయుం డయి యాశిష్యుం డరిగె నిట నిన్ను దర్శింప వచ్చితి నని పలికి యమ్మహాద్విజుం డంతర్హితుం డయ్యెఁ బరమహితం బైనయావాక్యసంతానంబు సమవధానంబున వినంబడియె నే పాండవమధ్యమా నాఁడు రథస్థుండ వయి నిన్ను నేతపేయం బయిన యర్థజాతంబు వినిపించితి నని యప్పురుషవరుతోడం బురుషోత్తముండు వెండియు ని ట్లనియె. 225

సీ. వ్యామిశ్రమతి యగునతనికి నకృతాత్ముఁ డైనవానికి నవధానరహిత
చేతస్కునకు నిది సెప్పఁ గా దేఁ దొల్లి దెలియంగఁ జెప్పితి దేవతలకు
గాండివి నీవు దక్కఁగ నిది మర్త్య లాకర్ణింపఁ దగువారు గల రె యొరులు
పరమరహస్య మీపరిపాటి దీన నయ్యమృతవస్తువు గని యఖిలదుఃఖ

ఆ. ములుఁ దొఱంగి నిత్యముక్తత వెలుఁ గొందు,నరుఁడు వైశ్యు లైన నాతు లైన
శూద్రు లైనఁ గండ్రు సువ్వె యిమ్మెయి ముక్తి, బ్రాఁతె బ్రాహ్మణులకు రాజులకును.

క. వినిపించితి నిను బోధం,బునకు నుపాయంబు ఫలసముదయము మోక్షం
బును సౌఖ్యనిర్ణయము ని,క్కనుట గడవ సుఖము లొందుగలవే యరయన్.

ఆ. శ్రద్ధ గలిగి లోకసంగ్రహాసంగంబు, నీడ విడిచి యెవ్వఁ డీయుపాయ
ముల భజించువాఁడు మోక్షలక్ష్మికిఁ బతి, యగు నొకింత సందియంబు వలదు.

క. చెప్పం గలయది యెల్లను, జెప్పితి నీ కింత గడవఁ జెప్ప నొకఁడు లే
దిప్పాట నెలల నాఱిటఁ, జొప్పడు యోగంబు నియతిశుద్ధాత్మునకున్. 229

వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణునకు నధ్యాత్మవిద్యావిషయంబు లగువాక్యంబులు సెప్పె నని చెప్పిన విని యన్నరనారాయణులు మఱియు నెవ్విధంబున వర్తించి రని యడుగుటయు. 230

చ. గుణసముతానుభూతివ్యాతికోవిదసారవివేకభవ్య చా
రణసురసిద్ధసాధ్యఖచరప్రముఖాఖిలభూతసేవ్య వీ
క్షణకలనాకృతార్థమునిసార్థబహుస్తుతివాక్యరత్నభూ
షణమహనీయఖేలన నిసర్గకృపాకృతలోకపాలనా. 231

క. నవ్యత్వపురాణత్వద,శావ్యపనయదుర్నిరూపసౌందర్యా వే
దవ్యాసవాక్ప్రకాశిత, దివ్యధురాధుర్య యోగిధీసత్కార్యా. 232

మాలిని. భువనభవనదీపస్ఫూర్తితేజోవిలాసా
సవితృశశిమయత్వస్ఫారచక్షుర్వికాసా
వివిధనిగమవిద్యావేద్యసూక్ష్మప్రభాసా
పవనవిజయలీలాప్రౌఢచేతోనివాసా. 233

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున యశ్వమేధపర్వంబు నందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## అశ్వమేధపర్వము - ద్వితీయాశ్వాసము



సుఖనిష్పాదనకే
లీసక్తపదారవిందలీలా సతతా
భ్యాసవికాసిసమాధిప
మాసాదితశాంతిలోల హరిహరనాథా. 1

బ్రాహ్మణగీతలు

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

ఆ. అట్లు శౌరి పార్థు నంచితబ్రహ్మవి,ద్యాప్రబోధకంబు లైనయట్టి
వినుతవాక్యములు సవిస్తరముగ విని,పించి యతనివలనిప్రీతిఁ జేసి. 3

వ. వెండియు నిట్లని బోధించు. 4

సీ. భర్తృభార్యాకృతభవ్యసంవాదంబు నభయనామకము నై యతిశయిల్లు
నట్టిది యొకయితిహాసంబు విను పార్థ జనసుతసమధికజ్ఞానవర్ణి
తాత్మకుఁ డైనమహాద్విజుఁ డొకఁడు వివిక్తప్రదేశసేవిత్వనిరతి
నున్నెడ నల్ల నాసన్నయై వినయంబు భక్తియు నెసఁగఁ దత్పత్ని ప్రణతి

తే. యాచరించి మహాత్మ యథార్థ్యాత్మబోధ, భరితఁగాఁ జేయవే నన్నుఁ గరుణ పల్ల
వింప నని దయ పుట్టంగ వేఁడుటయును, మందహాసవిభాసియై మగువఁ జూచి. 5

క. ఈమాటకుఁ జారుముఖి, నామది ముద మందెఁ గాన నాతికి నిది యే
లా మేటితలం పనుత్రో,పేమియు లేదోపి వినుము హితవచనంబుల్. 6

వ. నాయొఱింగినభంగిఁ జెప్పెద నని పలికి యయ్యతులవ్రతుండాపతివ్రత కిట్లనియె.

సీ. వినను గానను జేయ వెర వైనయవి కర్మములు వానిఁ గర్మకర్తలు సమస్త
సిద్ధిప్రదము లని చెప్పుదు రజ్ఞానతిమిరాంధు లై విను ధీరచిత్త
జగమున లేదు నిష్కర్మత్వ మొందేనిఁ గలిగె నేనియును మౌర్ఖ్యముగ దాని
నిందింతు రెక్కుడునెల వది యాత్మ నేఁ గందు బ్రహ్మాంబు నిష్కళత నందు

తే. వెలుఁగు నగ్నితో సోముండు గలసి మిథున
ధర్మమం దెప్డు నడపి భూతములఁ దాల్చు
నజుఁడు మొదలుగ నక్షరోపాస్తి యందుఁ
జేయుదురు శాంతి నింద్రియజిత్త్వ మొంది. 8

వ. అక్షరంబు తెఱం గెఱింగించెద. 9

సీ. స్పర్శంబు రసము రూపంబును శబ్దంబు గంధంబుఁ గా కున్కి కారణముగఁ
ద్వక్కును జిహ్వ నేత్రమును శ్రోత్రంబును ఘ్రాణంబునను బరిగ్రహవిధాన
మాచరించుటకు లోనైయుండ దాతత్త్వ [1]మమలినబుద్ధ్యవగమము దాని
బ్రాపించుఁ బ్రాణాది పంచవాయువులును విను దానివలన వర్తనముఁ బొందు
తే. నంద డిందుఁ బ్రాణంబు నపానమును స
మాననామకవ్యానమధ్యమున నడచు
మెలఁగుచుండుఁ బ్రాణాపానములకు నడిమి
దెస నుదానంబు శ్రుతి యిట్లు దేటపఱిచె. 10

క. నెలకొని ప్రాణాపానం,బులఁ బురుషుఁడు సుప్తుఁ డైనఁ బొలఁతి విలీనం
బు లగు సమానవ్యానం,బులు యోగులు సంశయంబుఁ బొందరు దీనన్. 11

క. విను తెలియంగ నుదానం,బున సుప్తుం డైనఁ బ్రాణము నపానంబుగ్
వనజనిభలోచనా పురుషుని విడువవు యోగిజనుల చూపి ట్లుండున్. 12

అంతర్యాగప్రకారంబు నిరూపించి చెప్పుట

వ. ఇవ్వాయువు లేనును మనంబును బుద్ధియుం గూడ నీయేడును వైశ్వానరునకు జిహ్వలు వైశ్వానరుం డనఁ బ్రాణులదేహంబులం దగ్నిరూపంబున వెలుంగుచున్న యాత్ముండు ఘ్రేయంబును భక్ష్యంబును దృశ్యంబును స్పృశ్యంబును శ్రావ్యంబును మంతవ్యంబును బోద్ధవ్యంబును నగునీసప్తసంఖ్య సమిధలు ఘ్రాతయు భక్షయితయు ద్రష్టయు స్ప్రష్టయు శ్రోతయు మంతయు బోద్ధయు నయిన యీయేడ్వురును వరుసన ఘ్రేయాదు లయినహవిస్సు లేడింటిని వేల్చు ఋత్విజు లిది సప్తహోతృవిధానప్రకారంబు వైశ్వానరువదనంబులు పదియు దిగ్వాయుసూర్యచంద్రపృథివీపావకశక్రవిష్ణుప్రజాపతిమిత్రాత్మకంబులు శబ్దస్పర్శరూపరసగంధవక్తవ్యకర్తవ్యగంతవ్యవిసర్గానందంబులు హవిస్సు లీపదింటిని క్రమంబున నాహుతులు సేయుహోతలు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థంబు లయినదశేంద్రియంబు లిట్టిదగు దశహోతృవిధి యీ రెంటిని నెఱింగి యిందేవిధంబుననేనియు జీవాత్ముం డుపద్రష్టగా నంతర్యాగంబు నడపుయోగిజనంబులు జననమరణవిముక్తు లగుదురు బహిర్యజ్ఞపరులు గమనాగమనభ్రమణంబులం బొందుచుండుదు రని చెప్పి వెండియు. 13

---

[1] మమలినబుద్ధ్యుపగమము.

క. విను ప్రాణవాదికరూప,త్వనిరూఢిం బుట్టు వాక్కు దాని వెనుచనుఁ
మనము పురుషార్థబుద్ధిం, బను పడి యని చెప్పె సతికి బ్రాహ్మణుఁ డనఘా. 14

క. విని యావిప్రునితో ని,ట్లను నయ్యెలనాఁగ మన మనఘ ప్రేరేపం
గ నెగయు వాక్కు దదనువ,ర్తనము మనంబునకు నెవ్విధంబునఁ గలుగున్. 15

వ. అనవుడు నతండు. 16

చ. మనసు నుదానవాయువును మానిని గూడి వెలార్చు వాక్కు నా
త్మునివలనన్ భవద్వచనమున్ జనతానుభవంబు [1]చొప్ప నై
నను విను కార్యమున్ గుఱిచినం దగ వాగనువర్తనంబు సే
యన వలసెన్ మనంబునకు నమ్మెయి గల్గుట నట్లు సెప్పితిన్. 17

వ. అని పలికి మఱియు నమ్మహీసురోత్తముం డిట్లనియె. 18

క. మనసును [2]వాక్కును మాలో, ననఘచరిత యెక్కు డెవ్వ రని యంభోజా
సను నడిగిన నతఁ డెక్కుడు, మన మనవుడు వాణి యక్కమలభవు తోడన్. 19

వ. ఏను నీకుం గామదోహిని నయి యుండ నన్నెట్లు దక్కువగాఁ బలికి తనిన నతండు స్థావరంబును జంగమంబును నన నాకు రెండుమనస్సులు గల వందు స్థావరంబు నాయొద్దను జంగమంబు నీకడను నిలుచు భవద్గోచరత్వంబునం బరఁగువర్ణంబు మంత్రంబు స్వరంబు జంగమమనస్సుగా నెగడు దానికంటె నీవెక్కుడు నీకంటె నెక్కుడు స్థావరమనస్సు గావున నిమ్మాట యాడం గల దానవుగా వని నిర్దేశించె. 20

క. విను మమ్మెయినిర్దేశం,బున నవ్వాగ్దేవి మూర్ఛ వోయినయ ట్లే
మిని బలుక కుండి పదపడి, వినయంబున నజుని శరణు వేఁడె లతాంగి. 21

వ. అనిన బ్రాహ్మణి పతితో బ్రహ్మమాటకుం గొఱవోయినవాణి యేమిటం దేఱె నని యడిగిన బ్రాహ్మణుం డిట్లనియె. 22

క. ప్రాణాపానంబులయెడ, వాణి నిలుచుఁ గాన ప్రాణవాయు వొదవి త
త్త్రాణత్వ ముడిపె నది గీ,ర్వాణజ్యేష్ఠప్రభావవాసిత యగుటన్. 23

వ. ఇట్టి వని వాఙ్మనసప్రకారంబు లెఱుంగుట మోక్షంబునకు మూలం బింకను వాణీమనస్సులతెఱంగు సెప్పెద వినుము. 24

తే. ప్రాణుఁ బొదువుట వాణి యపానుఁ జెంది
తా నుదానభూతాత్మ యై తనువు విడిచి
వ్యానచేష్టితసర్వసంవ్యాప్తి నొంద
మనసు సుస్థితి నొందు సమానునందు. 25

వ. మనసు సుస్థితిం బొందుట ముక్తికిం గారణం బని చెప్పి వెండియు. 26

సీ. ఘోషిణి నాఁగ నఘోషిణి యన రెండుదెఱఁగులు గలిగి వాగ్దేవి పరఁగు

1 చొప్ప మై. 2 వాకును దమలో.

సందఘోషిణి గరియసి యుత్తమరసంబు గోపువందంబునఁ గురియుచుండు
నవ్యయరూపదివ్యప్రభావోజ్జ్వల బ్రహ్మవాదిని యిట్లు బ్రాహ్మణాధము
గనుట మహానందకర మని చెప్పి యవ్విప్రుఁడు మఱియు నవ్వెలఁదితోడ

తే. వినుము ఘ్రాణాదికము లైదు మనసు బుద్ధి
యొకయధిష్ఠానమున నుండియును నెఱుంగ
వబల యొం డొంటివిషయంబు నలమికొనఁగ
ననిన వివరింపు మీతెఱం గనియె నింతి. 27

వ. అనుటయు నయ్యవనీదేవుం డయ్యువిద కి ట్లనియె. 28

సీ. గంధంబు ఘ్రాణంబ కాని తక్కినయాఱు నధిగమింపఁగ నోప వధిగమించు
రసము జిహ్వయ యితరములాపనికిఁగావు రూపంబుఁ[1]జక్షుస్స యోపు నెఱుఁగఁ
బెఱయవి యెఱుఁగవు తెఱవ సంస్పర్శంబుఁ గాంచుఁ జర్మంబ తక్కటివి గానఁ
జాలవు శబ్దంబుఁ జాలుఁ బట్టంగ శ్రోత్రంబ యన్యములు దత్కారణమునకు

తే. వెరవు లేవు సంశయితసంవేదనంబు
మనసుకృత్యంబ యిక్కార్యమునకు నొండ్లు
సొరవు నిష్ఠ బుద్ధిన యగుఁ జొరఁగ నేర
వి త్తెఱంగున కపరంబు లెఱిఁగికొనుము. 29

ఇంద్రియమనఃపరస్పరసంవాదప్రకారము

వ. అనిచెప్పి మనస్సునకు నింద్రియంబులకుం దొల్లి గలిగినసంవాదంబు సెప్పెద
నాకర్ణింపు మింద్రియంబులు మనస్సుతో నేము నీవు నొక్కరూప యనుటయు
మనస్సు వాని కిట్లనియె. 30

చ. చన దిటు లంట గం పెఱుఁగఁ జాలదు నాసిక [2]జిహ్వయుం జవుల్
గొన వెర వేదు రూపు గనుఁ గొంటకుఁ గన్ను వలంతి గాదు సోఁ
కు నెఱుఁగుశక్తి చర్మమునకుం బ్రభవింపదు శబ్దజాతము
న్వినఁ జెవి కల్ప మేనియును నే ర్పొడఁ గూడదు నేఁ దొఱంగినన్. 31

వ. నిజంబుగా నేను దొఱంగితి నేని. 32

ఆ. అప్రయోజనంబు లై యుండు నాఱిన, నిప్పులట్లు శూన్యనిలయములును
బోలె మీస్వరూపములు గాన మనలోన, నెక్కుడేన చూవె యింత నిజము.

వ. అనిన విని యింద్రియంబు మనంబున కి ట్లనియె. 34

సీ. ఇంతవ ట్టిట్టిద యిట్లైనయంతన కలుగ నేర్చునె యధికత్వ మేము
వెలిఁ గాఁగ నీ వొకవిషయంబు నేనియు ననుభవించితయేని నధిక మగుట
గానంగ వచ్చు మాలో నొకం డడఁగిన ననుభవింపుము తదీయార్థ మట్లుఁ

---

1 చక్షువయోపు. 2 జిహ్వకుం జవుల్, కొనుటకు లేదు రూపు.

గాక ఘ్రాణంబున గంధంబు జిహ్వ రసంబు చక్షువున రూపంబు వినుము
ఆ. చర్మశక్తిఁ జేసి సంస్పర్శవిషయంబు, శ్రోత్రయుక్తి శబ్దమాత్రకంబు
కాని యొంట నొంటిఁ గబళింపఁ జాల వెట్లధికతానిరూఢి కాఁపడితి. 35

క. మును మే [1]మాలంబించిన, వెనుకఁ గదా నీకు ననుభవింప వశం బో
మనసా [2]నీ వెంగిలి కా, దనుమా యవ్విషయ మెక్కు డయ్యెడు మనలోన్.
క. నీ వడఁగినను బ్రాణముఁ, గావఁగ మాయంద బోధకం బగుద్రవ్యం
బావర్తింపఁగఁ జేయుట, గావించును నీకుఁ దెలివుఁ గనికొను మిదియున్. 37
సీ. అట్లు గా దిట్లని యనుశాసనము సేయఁ గడునేర్చుశిష్యులకడకుఁ బోయి
వినిపింపఁ దొడఁగి యవ్వినుతార్థములు వార లుగ్గడింపఁగఁ గనునొజ్జవోలె
మముఁ గొని విషయోత్కరము నీవు భోగ్యంబు గాఁ జేసికొందు నీకలలు గన్న
యప్పుడు మాలేమి నవ్విషయంబు బొంకైన వాకిలి లేనియాలయంబుఁ
ఆ. జెంది మరలినట్లు నేడ్పాటు వారయుదు, గాక సత్యభుక్తి గలదె నీకు
నింతపట్టుఁ గాన్పు మేమును నీవును, గలసి పరఁగ భోగకలన గలుగు. 38

వ. అని యివ్విధంబున మనంబును నింద్రియంబులును సంవాదంబు సేసె నని
యప్పురుషవరుం డావరవర్ణినితో వేఱొక్కండు వినుమని యి ట్లనియె. 39
సీ. ప్రాణప్రభృతు లగుపవను లంభోరుహగర్భుని నొక్కటఁ గానఁ బోయి
యెక్కుడు మాలోన నెవ్వఁడు నావుడు నవ్విభుం డెవ్వార లుడఁగ నడఁగు
దురు పెఱవార లెవ్వరికిఁ బ్రవర్తన మొందిన నెల్లవారును జరింతు
రధికు లందఱకును నట్టివారలు మీరు నను డని పలికినఁ జనక నిలిచి
ఆ. ప్రాణుఁ డాది గాఁగ [3]బవను లందఱుఁ దమ్ము,వలన నవ్విధంబు గలుగఁ దెలుప
నాతఁ డే నెఱుంగనా యది యట్టిద, వినుఁడు మీవిశేషవృత్తిభంగి. 40

తే. ఎప్పు డెవ్వరివలన నే చొప్పు గలుగు
నపుడ వా రెక్కు డగుదు రన్యోన్యమిత్ర
భావమునఁ దాల్పుఁ డొండొరుఁ బవనులార
పొరిఁ బరస్పరభావనాపరుల రగుఁడు. 41

వ. ఇత్తెఱంగున మీకు భద్రం బగుం బొం డని పుచ్చె నట్లుపదేశించిన బ్రహ్మ
వాక్యంబుల వాయువులు సమత నొందె నని చెప్పి వాయువిషయం బైనయది
నారదదేవమతసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మని బ్రాహ్మణుండు బ్రాహ్మణి
కి ట్లనియె. 42

తే. దేవమతుఁ డనువిప్రుండు దేవమునివ, రేణ్యుఁడగునారదునినొక్కపుణ్యభూమిఁ
గాంచి వినతుఁడై యాతనికరుణవడసి,భక్తిరసముప్పొంగారఁ దత్ప్రాంతమునకు.
సీ. అల్లన చన నాతఁ డాదరంబున నిందు ర మ్ముండు మనుచుఁ గరమునఁ జూపు

1 మవలంబించివ. 2 నీవ యెఱిఁగి కా, దనుమా యెవ్విషయ. 3 బవనులుఁ దమతమ.

నెడ సమానీనుఁ డై కడు వినయంబున హస్తములు మొగిచి దయాసమగ్ర
యొఱిఁగింపు పవనంబు లేనింటియందును జాయమానం బగుజంతువునకుఁ
దొలితొలి యెద్ది దాఁ దొడఁగు వర్తింపంగ ననవుడు నారదుం డతనితోడ
తే. వాయు వెయ్యది గర్భసంవాసమునకుఁ, జొనుపు జీవునిఁ దజ్జంతుజననవేళఁ
దొలుత దాని కనంతరకలితమైన, మారుతంబు ప్రవర్తించు మఱియు వినుము.
తే. పురుషునందు సమానంబుఁ బొలఁతియందు
వ్యానమును జువ్వె పొడమించు వరుస ననఘ
శుక్లమును శోణితంబును జాలు గల్గు
నయ్యుగంబును విధిచెద్ది నమరఁ బొంద. 45
క. విను సృష్టశోణితంబునఁ, బనుగొనుశుక్లంబువలనఁ బ్రాణుఁడు దగ వ
ర్తన మొందుఁ బ్రాణశుక్లము, లనూనహేతువులు గానపానుఁడు నడచున్. 46
క. చనుఁ బ్రాణుఁ డధోగతి న్యూర్ధ్వనిరూఢి నపానుఁ డివ్విధము గలయీరెం
టను నగ్నిమయోదానం,బును వ్యానంబును సమానమును వర్తించున్. 47
ఆ. పావకుండు సర్వదేవాత్మకుండు ప్రాణంబునకు నపాననామమునకు
నంతరమున వెలుఁగునాభవ్యమూర్తి యు,దానరూప మండ్రు తజ్జ్ఞజనులు. 48
సీ. విను మహోరాత్రంబులును శుభాశుభములు
సత్యానృతంబులు సదసదాహ్వ
యములును నైసద్వంద్వములు ప్రాణాపాన
ములకు నామాంతరంబులు దదీయ
మధ్యవర్తిత నొప్పు మహనీయవహ్ని యు
దానంబు దాని నిర్ద్వంద్వభావ
మాంతరయోగవిద్యాప్రవీణులు గండ్రు
పరమశాంతి యనంగ బ్రహ్మ మనఁగ
తే. నరయ భేదంబు లేదన్నయట్టు లుండు, నమ్మహావస్తువును నుదానాకృతియ య
నంగఁ జెవి యార విందుము నలినగర్భు,చేత నని దివ్యమునియిట్లు సెప్పెఁగరుణ.
వ. అని చెప్పి యింద్రియమనసపవనంబులభంగులుగనుంగొనుట యాత్మత్త్వంబులకుఁ
బరమం బయినతత్త్వంబు గనుటకుఁ గతం బై యుండు నని పలికి యద్ధరామరుం
డారామారత్నంబును సదయంబుగా నవలోకించి యుత్తమరహస్యంబు సెప్పెద
నాకర్ణింపు మని యి ట్లనియె. 50

జీవాత్మస్వరూపనిరూపణప్రకారము

సీ. కరణంబు గర్మంబు గర్త యన్నేతద్విరాజితకారకత్రయముచేత
నఖిలంబు సంవ్యాప్తమైయుండుఘ్రాణాదులునుమనంబునుబుద్ధియును బ్రవరులు
గరణహేతువు లండ్రు గంధాదివిషయసంతతియు మంతవ్యబోద్ధవ్యములును

గర్మహేతువు లగుఁ గంపు గొనఁగ నానఁ గాన ముట్టఁగ వినఁగాఁ దలంప
తే. నిశ్చయము దగఁ జేయంగ నేర్పు [1]లేదు
గలవు జీవాత్మునకు నవి కర్తృహేతు
భూతములు [2]వాన విషయానుభూతి నతఁడు
దొలఁగునిష్టలు మోక్షహేతువులు సుమ్ము. 51

వ. కరణకర్మకర్తృకారకాత్మకుం డగుజీవాత్ముండు భోక్త యగుటఁ దక్కి వివిధ విషయమూర్తు లగుహావిస్సుల నుదాసీనత్వస్ఫురితంబులు సేసి వేల్చునిష్ట నాత్మస్వరూపం బగుననలంబు ప్రజ్వలితం బయి యవిద్యాధూమరహితం బగుచుం బొలుచు నది మోక్షప్రకారం బట్లు గాక భోక్త యగు నేని నట్టిద బంధప్రకారం బని నిర్దేశించి ముక్తభావంబునకు మూలం బయినయోగయజ్ఞంబునం దేను బ్రవృత్తుండనై యున్నవాఁడ దానికి సర్వపరిత్యాగంబు దక్షిణ దాన సకలాత్ముం డగునారాయణుండు ప్రీతుండై స్వీకరించు నద్దశ పేరు మునులు ముక్తి యని చెప్పుదు రని చెప్పి యవ్విప్రుండు వెండియు. 52

సీ. శాస్త్ర యొక్కండ తచ్ఛాసనంబునన యేఁ జరియింతు నొక్కండ గురుఁ డతండు
సెప్పినయర్థంబు చిత్తంబులో నుంతు శ్రోత యొక్కండ తజ్జాతబుద్ధి
నెగడుదు నొక్కండ పగవంగ విద్వేష్ట వాని [3]వ్రాల్చినదిక్క వ్రాలి యెదరఁ
గడపుదు గడవంగఁ గారణ మయ్యేదు తెఱఁగు పెద్దలచేత నెఱిఁగినాఁడ
ఆ. వినుము దేవతలును మునులును బరమేష్ఠి, యొద్ద కరిగి మాకు నెద్దిహితమొ
యనిన నావిధాత యక్షరోపాసన, మనియెఁ గాన దుర్గ మబల కడతు. 53

వ. ఇంక నెక్కడ గడచెద మున్న కడచితిఁ గ్రోధతిమిరంబును లోభవ్యాళంబును గామదస్యుదూషితంబును నగుదుర్గంబు గడచి యొకవనంబు ప్రవేశించితి ననిన విని యవ్వనిత యవ్వనం బెట్టి దని యడిగిన నమ్మహాద్విజుం డిట్లనియె. 54

ఉ. అంతకుఁ బిన్నలున్ వెదక నంతకుఁ బెద్దలు లేవు దుఃఖ మ
త్యంతముఁ జేయ సౌఖ్య మెస లార నొనర్పఁగ నొండొకంటియం
దంతటి నేర్పు లేదు వెఱ వన్నది యేమియు నవ్వనంబు ని
శ్చింతతఁ జొచ్చి యున్ననరుఁ జెందదు నిర్వృతి నెందు నుగ్మలీ. 55

తే. కొన్నిటికిఁ బంచవర్ణముల్ గుసుమఫలము,లందుఁ గొన్నిటి కేకవర్ణాంచితంబు
లవనిజములు గొన్నిటికి నవ్యక్తవర్ణ,కములు సౌరభ్యమాధుర్యసమధికములు.

వ. అవ్విపినంబున. 57

క. వృక్షంబులకుం గలుగును, దీక్షాగుణములును నతిథితృప్తికృతియుఁ బ
ద్మాక్షీ యతిథులు బ్రహ్మాస్యదృక్షులు సౌఖ్యంపునిట్టు దేలుదురు మునుల్. 58

---

[1] లేదు, కలదు జీవా. [2] వాని విషయానుభూతి. [3] వ్రాలినదిక్క.

ఆ. కెలఁకులకును మింటికిని మేర లివి యన, రాదు గాన యయ్యరణ్యభూమి
వెలుఁగు లొండ్లు సొరవు వినుము క్షేత్రజ్ఞుండు,రవి దదీయసేవ భవముఁబాచు

క. మృగనయన బ్రహ్మసంభవ, మగు జలము వహించుచుండు నందులనదులున్
నగములు విను దానఁ దప,స్విగణం [1]బవ్యయపదంబుఁ జెందం గాంచున్. 60

వ. అట్టి దవ్విపినంబు. 61

ఆ. మాననీయనియతిమహితతపోధన,వంతు లైనయట్టివారు శాంతి
దాంతినిస్స్పృహాతలు దలకొన సుసమాహి,తాత్ము లై వసింతు రందు సాధ్వి 62

వ. అని చెప్పి మఱియును, 63

సీ. వినుము మూర్కొనఁ జవిగొన దర్శనస్పర్శనము లాచరింప వినంగ నెలయ
నేమిసంకల్పంబు నెడఁ జేర్ప నిష్టార్థ[2]ములను ననిష్టార్థములను గోరు
టయును నొల్లకత్రోచుటయును స్వభావకృత్యములవి గనుఁగొంచు నబల వానఁ
బొరయ నెట్లన్న మేల్ దొరకొనుఁ గోరకయును బోదు కీడు ద్రోచినను దీని

తే. నెఱిఁగి యేను స్వభావంబునెడఁ బయోజ,పత్త్రగతజలబిందువుభంగిఁ దాల్తు
నని యెఱింగించి బ్రాహ్మణుఁ డతివతోడ,మఱియు నిట్లను శాత్త్రవమథనకల్య.

వ. ఒక్కయెడ నధ్వర్యునకు యతికిం గలిగినసంవాదంబు సెప్పెద నాకర్ణింపు మధ్వ
ర్యుండు పశువుం బ్రోక్షించుచుండ యతి నిరీక్షించి యిది హింసగాదే యనిన
నతండు. 65

తే. ఛాగ మిది యపయంగ నాశంబుఁ బొంద, దూర్ధ్వలోకసుఖంబుల నొందుఁగాని
శ్రుతులవాక్యముల్ నీకెక్కసూనృతంబు, లగునయేని నీ విట్లంట యనుచితంబు.

వ. అని వెండియు నప్పశువు నుద్దేశించి. 67

క. భూతములు నింద్రియంబులు, నాతతగుణ యాత్మయోనులందుఁ గలయఁ బిం
డేతరుఁ డగు జీవుఁడు స్వా,ఖ్యాతిశయం బొందు నధ్వరాతిశయమునన్. 68

క. అని పలుకుటయును యతి యిట్లను ఛాగము పుణ్యగతికి నరిగెడుఁ బో యి
ప్పని నీ కెవ్విధము ప్రయో,జనంబు సిద్ధించుఁ జెపుమ సమ్యక్ఫణితిన్. 69

వ. అనుటయు నధ్వర్యుం డతని కిట్లనియె. 70

క. ఆగమము పశువిధిం దగ, యాగ మొనర్చినఁ ద్రివిష్టపానేకమహా
భోగానుభూతిభవ్యస,మాగమ మది యనుట బొంకె యాగమువేదీ. 71

చ. అనవుడు హింస పాప మని యాగమువాక్యము లంద కాదె యేఁ
గని యిటు లంటి నన్న యతిఁ గన్గొని నీవు సమాధిఁ బ్రాణరో
ధనము మనోలయంబు సుకృతంబులు గా నొనరించి వెండి యో
గనిరతిఁ బొందె దత్తెఱఁగు గా దొకొ హింస దలంచి చూడఁగన్. 72

వ. అని పలికిన నయ్యధ్వర్యునకు నయ్యతిముఖ్యుం డిట్లనియె. 73

---

1 బవ్యక్తపదము. 2 మూలను గోరుచు నన్కి మొదలఁ గోరు.

లైనయస్త్రంబులు సంధింపు మనిన నతండు క్రోధంబు దక్కి యోగంబున శాంతి నొంది వానిం దద్దూరపతపఃఫలాస్త్రసాధితంబుల జేసి నిర్మలం బగుటను నంతశ్శత్రుజయసౌఖ్యం బనుభవింపుము బాహ్యశత్రుజయంబు జయంబుగాం గొనకుము. 31

క. అని నిశ్చించి పలుక నవ్వినుతపరిశ్రాంతు శాంతివిభవంబున సూ
నినమనసుతోడ మునిమూ,ననహాత్త్రం బైనతపమునన మే లొందెన్. 32

సీ. అని చెప్పి బ్రాహ్మణుం డయ్యింతి కిట్లను, దొడ్డిగుణములు గోష్ఠ కలవు
స్తంభాతిమానహర్షంబులు స్మార్త్త్యేకములు క్రోధసంరంభములును శోక
మును రాజసంబులుమోహతంద్రాస్వప్నములుదామసములిట్లుగలుగురిపులం
దునుమ నేమస్త్రంబు లను వగు వాన నయ్యంతరశత్రుచయంబు నెల్లం

తే. దునిమి యేనింద్రియంబుల మనము నోర్చి
శాంతి నొంది శ్రేయస్సిద్ధిసాధనం బో
నర్చునది ముఖ్యవైరనిర్ణయము జేయు
నంబరీషగీతలు విను మంబుజాక్షి. 33

వ. అంబరీషుం డనురాజు రాజనీతిపరత్వంబునం బరమప్రభుత్వంబు నొంది యరా తుల నెల్ల విగతాసులం జేసి పూజ్యం బగురాజ్యంబు పరిపాలించుచుండి యొక్కనాడు విద్వజ్జనంబులతో ని ట్లనియె. 34

తే. అరులనెల్లజయించియు నది జయంబు,గాఁగొనక యున్నవాఁడవగ్గలపుఁబగ జ యింపకున్కిఁ దద్విజయవిహీనుఁ డృష్ణ,జనిజరామృత్యువశగవ ర్తనుని జేయు.

క. [1]అంతటిలోభము గెలువక, శాంతి గలదె యని తదీయశక్తి నడచి ని
శ్చింతత్వ మొంది యాభూ,కాంతుఁడు సామ్రాజ్యమున సుఖస్థితి వడసెన్. 36

జనకునకు విప్రరూపధరుం డైనయమునితో నైనసంవాదము

వ. అని వెండియు నవ్విప్రుం డి ట్లను జనకచక్రవర్తికి నొక్కబ్రాహ్మణునకుం గలిగిన సంవాదంబు సెప్పెద నాకర్ణింపుము జనకుండు దనకప్రియముగ బ్రాహ్మణుండు గొఱగామి సేసిన నతనితో నీవు నావిషయంబున వసియింప వలదు పొ మ్మనిన నతండు. 37

క. నీవిషయ మెంతవ ట్టది, యే విని పరవిషయమునకు నేఁగెదఁ దెలియం
గా వినిపింపు మనుడు నా, భూవల్లభుఁ డూర కుండెఁ బుణ్యచరిత్రా. 38

ఆ. ఊర కుండి మూర్ఛ నూని యొక్కింతసేపునకుఁ దేఱి యిట్టు లనియె నాదు తాతతండ్రితరము ధరణి మద్వశ్యత, నుండ నాకు మమత యొలయ దందు

వ. మిథిల నెప్పుడు వసియించెద నిప్పురంబును మదీయం బని యంగీకరింపంబడదు కావున నిది నావిషయం బన లేమింజేసి మున్ను నీతో నాడినమాటం బుట్టినవగ

---

[1] అంతర్లోభము.

[illegible] నాలోకించి.

క. [illegible]
[illegible] 91

క. [illegible] 92

తే. [illegible]
[illegible]
[illegible]
[illegible]

వ. [illegible] గావున నాయవి యను కుండుటం జేసి భూమ్యాదిభూతంబులు నాచేత నిర్జితంబు
లై [2]మద్వశగతంబు నొంది యుండు. 94

చ. అనవుడు బ్రాహ్మణప్రవరుఁ డల్లన నవ్వుచు నిన్ను నారయ
న్మనమున వేడ్క పుట్టి నరనాయక వచ్చితి నేను ధర్ముఁడం
[3]బహుపదునిర్విశేషపరిపాకము గాఢనిరూఢభావ మొం
ది నిలుచుఁ గాత నీదగుమదిన్ సతతంబును శాంతికారి నై. 95

వ. అని ధర్మదేవత జనకునకు వరం బిచ్చి యంతర్ధానంబు నేసె నని చెప్పి మహా
ధరణీసురోత్తముం డయ్యుత్తమాంగనతో హితోపదేశంబు సేసెను నవహిత
వయి యాకర్ణింపు మని పలికి యిట్లను సంసారవర్తనంబు వదల విడిచి యే
నేకతంబ యున్న యెడ నీవు ముచ్చిలివచ్చి మదీయవైరాగ్యంబు మాన్పందలంచి
నాకు నధ్యాత్మబోధంబు గలుగం జేయు మని యభ్యర్థించిన నీతలం పెఱింగియు
నెఱుంగనివాఁడపోలె నధ్యాత్మవిద్యాబోధకప్రకారంబులైన వాక్యంబులు
సెప్పితి నే నింక లోకంబులం గలసి చరించువాఁడం గాను నిక్కువు బ్రాహ్మణుండ
నయితి బ్రహ్మచారినయితి జీవన్ముక్తుండ నయితి మీముబోంట్లకొలఁదిగా నన్నుం
జూచెద వది నాతెఱం గెఱుంగమి యేను జగంబు సమస్తంబును వ్యాపించి
యున్నవాఁడ నాయున్నభంగికి నాబుద్ధి సకలపృథ్వీరాజ్యంబును నాకలోకాధి
రాజ్యంబును సరిగా వని తలంచు నాబుద్ధియ నాకు ధనంబు వాయువుల నగ్ని
యున్నచందంబున సర్వజంతువులయందును నంతర్గతనై సిద్ధి యున్నది గురు
వాసగృహవాసవనవాసపరు లగుబ్రాహ్మణుల కెల్లను శ్రేయఃప్రాప్తికిం దెరు
వొక్కండ యందఱును సరిత్తులు సాగరంబుఁ బ్రాపించినతెఱంగునఁ బరతత్త్వం
బు నొందుదురు బుద్ధి నిష్కార్యంబు నధిగమింప నగుఁ గాని శరీరంబున వశంబు
గాదు కర్మంబు లాద్యంతవంతంబులు శరీరంబు గర్మబంధనకరం బింత
యెఱుంగుదుం గాన నాహృదయంబునం బరలోకభయంబు లేదు నా చెప్పిన

1 యెల్లఁ. 2 మద్వశగతంబు లై యుండు. 3 బహుపద యిన్నిలేక.

యథార్థాత్మవిద్యావిషయవాక్యంబులతాత్పర్యంబు చిత్తంబున నెలకొలిపి భావనానిరతవయి యుండుము [1]నన్నుఁ బోలేదు చెఱపకు మనినఁ బత్ని సాష్టాంగదండప్రణామం బాచరించి కేలు మొగిచి. 95

సీ. నీవు చెప్పినమహనీయవాక్యనికాయ మతిగహనం బకృతాత్ములకును
నర్థగ్రహణశక్తి యనఘ కల్గునె కృతాత్ములకైన [2]గ్రమ్మనఁ దెలియవచ్చు
నొండ దియ్యెఱుకకు నుదయింపఁ బట్టైన యట్టియుపాయంబు నాదరమున
నాకుఁ బ్రసాదింపవే కరుణాకర నావుడు నాతఁ డన్నాతితోడ

ఆ. నరణి బ్రాహ్మణుండు గురుఁ డుత్తరారణి, [3]దపము శ్రుతము నిర్మథన మొనర్ప
జ్ఞానవహ్ని పుట్టు మానిని యని చెప్ప, వనిత యట్టు లనియె వల్లభునకు. 97

క. జనవినుతచరిత బ్రాహ్మణుఁ, డనఁగా క్షేత్రజ్ఞుఁ డగుట యల్పము దోఁచెన్
మనమున నతని నరణిగాఁ, గొను టవ్వస్తువు నెఱింగికొని పిదపఁ గదా. 98

వ. అనిన నతం డిట్లనియె. 99

ఆ. అతనిఁ దోఁపఁ జేయునట్టిసాధనము లే, దింద్రియముల కందఁ [4]డేమి లక్ష
ణములు లేవు నిర్గుణత్వనిరూఢుం డ, హంత లేమిఁ దోఁచుఁ గాంత కనుము. 100

వ. అని నిర్దేశించుటయు క్షేత్రజ్ఞవిషయసంశయంబు వాసి యయ్యింతి శాంతి వొందె నని గోవిందుండు సెప్పిన గాండీవి యాబ్రాహ్మణుండు బ్రాహ్మణియు నిట్టివా రగుదురె వా రెచ్చటివారు వారల నా కెఱింగింపవే యని యడిగిన నద్దేవుం డతనియాననం బాలోకించి, 101

క. నామనమును బుద్ధియును గృపామహితా బ్రాహ్మణుండు బ్రాహ్మణియు హృషీ
కామేయమైన క్షేత్ర, జ్ఞామలవస్తు వన నేన యనియె నరేంద్రా. 102

గురుశిష్యసంవాదంబు గృష్ణుం డర్జునున కెఱింగించుట

వ. అనిన విని యర్జునుం డచ్యుతునితో భవత్ప్రసాదంబున మదీయమతి యతి విశదయును సూక్ష్మగ్రాహిణియు నయి యున్నయది పరమం బైనవేద్యం బగు బ్రహ్మంబు నెఱింగింపవే యనుటయు నాకృష్ణుండు గురుశిష్యసంవాదం బనునితిహాసంబు విను మది నీప్రశ్నంబునకు నుత్తరం బయి యుండెడు న త్తెఱంగున మేధావి యగునొక్కశిష్యుండు సంశితవ్రతుం డయినగురు నడిగిన నగ్గురుండు ప్రజాపతి భరద్వాజ భార్గవగౌతమ కాశ్యప వసిష్ఠాత్రి విశ్వామిత్ర ప్రముఖు లగుమునిజనంబు లాంగిరసుం బురస్కరించికొని విరించికడకుం జని తచ్చరణంబులకుం బ్రణమిల్లి హితం బెయ్యది తత్ప్రాప్తికి సుపథం బెట్టిది వివరింపవే యని విన్నవించిన నన్నలినాసనుండు గృపాధురీణం బైనచిత్తంబుతో న త్తపస్విసత్తముల కెఱింగించినతెఱంగు నీకుం జెప్పెద నవహితుండ వయి

1 నన్నుంబోలేదు. 2 గ్రమ్మఱ. 3 దపము చేతనిర్మథన. 4 డెలమిలక్ష,ణములులేమినిర్గుణత్వ.

వికృతిదుర్మానమాక్షేపపాపకృతిలోప
[1]శౌర్యమాత్సర్యములు దమస్సంభవములు. 116

ఉ. పాములుఁ జేళ్లనుం బసులుఁ బందులుఁ గుక్కలు మీలుఁ గోళ్లలుం
జీవులుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలు గొంకనక్కలు
ద్రోమలు ప్రాఁకులుం బొదలు నోప్రలఁ బీడలఁ బొందువారు మఱిం
తామసభాగు లట్టి మఱి తద్విధజంతువు లెన్ని యన్నియున్. 117

క. ఇవి తామసంబు లని గుణ, నివహములోఁ గీడు పాప నేర్పునతఁడు త
ద్వివిధవికృతినిరసనహే,తువివేకము గలుగఁ గా నధోగతి దలఁగున్. 113

చ. బలమును శౌర్యముం [2]మదముఁ బ్రాభవముం సుఖదుఃఖభాగితా
కలనముఁ జెల్మి సేతయును గాంక్షయు నొల్లమియుం బ్రతాపముం
గలహము నీర్ష్యయుం బహువికల్పప్రభాషలుఁ గామినీజనం
బులయెడ గాఢరాగతయు బొంకును నుబ్బు రజఃప్రభూతముల్. 119

చ. అవి దొలుబాముసం గలుగునట్టిజనంబులు నీతు లిట్టి వి
ట్టివి యనినీతు లన్మతిపటిష్ఠత గల్గి త్రివర్గ వర్తనం
బు వెరవు నొంది యర్థములఁ బొంపిరివోవుచుఁ గామసౌఖ్యవై
భవములఁ గ్రాలుచుం మనుజభావనిమోహితఁ బొల్తు రెంతయున్. 120

క. రాజసగుణములకుం గల నైజ మెఱుఁగువారు తజ్జనకవైకృతముల్
ధీజితములు గావింపఁగ, నోజ గలిగి శుభదవృత్తి నొందుదు రెందున్. 121

సీ. సంతోషమును బ్రకాశత్వంబుఁ బ్రియమును నానందమును గరుణాభిరతియు
క్షమయును సత్యంబు శౌచంబు ధృతియు నకార్పణ్యమును దితిక్షయునహింస
యునునార్జవంబును ననసూయయును నక్రోధరాహిత్యమును నసంరంభతయును
సమత దాక్షిణ్యంబు శ్రద్ధధానతయు నక్రూరభావంబు హ్రీగౌరవంబు

తే. సత్త్వజాలంబు లివి పూర్వజన్మసంక,లితము లైనట్టివా రహంకృతి మమత్వ
మర్థతృష్ణ గామార్తి లేకతులబోధ,భరితులై యూర్ధ్వలోకవైభవముఁ గంద్రు.

క. వినుఁ డాగుణంబు లన్నిటిఁ, గనుఁగొని తత్తదనుషక్తి గలుగనివాఁ డ
ప్పనిచే భుజింపఁ గాఁ బడఁ, డనఘాత్మకులార క్రింగు నతఁ డారాశిన్. 123

వ. అని చెప్పి యప్పరమేష్ఠి మఱియును, 124

సీ. వేర్వేఱ యుండవు వినుఁడు గుణంబు లన్యోన్యసంకలితంబు లగుచు బరఁగు
సంతతంబునన సంసారయాత్రాప్రవర్తనం బొనరించు వానిలోన
నెయ్యదిమిగులఁదోఁచిన దజ్జన్యంబులోలయుఁబాయుటయు నొక్కొక్కమాటు
గలుగు [3]దమం బెఱుఁగలి యధికం బైన స్రోతస్సధోముఖ స్రుతి రజస్సు

ఆ. వెరిఁగినపుడు మధ్యసరణి సత్త్వము వృద్ధిఁ, బొంద నూర్ధ్వవృత్తిఁ బొందు వీని

1 శౌర్యమాత్స. 2 ముదము. 3 దమంబు పేర్కొని.

నుకు ¹ప్రకాశభేదములఁ జెలంగించిన, నవి సుదుస్తరంబు లగుచుండు. 125

క. ప్రాకృత పుణ్య ²జనగమన, హేతువు లగుచు గుణావిశేష విభాగములఁ దా
[illegible] 126

వ. గుణత్రయంబునుం బ్రోచుట మేలది బ్రోవుచుండఁ గ్షితి సత్త్వంబు లేకుండు నేని. 127

క. సాత్త్వికులకు వనము రజో, వృత్తికలితభక్తులకు మన్ననగరవా
సిత్వముఁ దామసులకు నీ, వృత్త్యంతరాభోజనంబు సంప్రాప్త మగున్. 128

క. ధర్మార్థకామగోచర, కర్మములకు సాత్త్వికాదికప్రకరణికా
రోర్మలు హేతువు లగు నీ, మర్మజ్ఞత కీతద్విధూతి కారణము సుమీ. 129

క. క్రమమునఁ బ్రాణంబు సహ్యాసము సత్త్వంబును ³రజస్సు నాకుం జూడఁగా
యమినయలార యయానము, దమ మిట్టుల ప్రీతియు సువిహితంబుగఁ జెప్పన్.

క. జపమును దానము యజ్ఞముఁ దపమును గర్తృజనచిత్తదేశలను దత్త్వా
ద్యుపహితము లగుట నడచుం, ద్రివిధంబుల సాత్త్వికప్రకృతియ మేలౌటన్.

క. వినుఁ డెక్కువ దక్కువలే, కనయము నెనసినగుణత్రయంబును జూడే
వినుతావ్యక్తం బనఁగాఁ, జనుతత్త్వము శివ మచలము శాశ్వత మనయన్. 132

క. సదసత్ప్రకాశనిత్యం బది, దాని తెఱంగెఱుంగువాఁడు విజ్ఞా
నదశావధూతగుణుఁ డై, యపవర్గతిఁ బొందఁ గను నిరామయపదమున్. 133

వ. అని యుపదేశించి వెండియు. 134

మనోబుద్ధ్యహంకారాది తత్త్వప్రకారము

సీ. అవ్యక్తమునను మహత్తత్త్వ ముదయించు నది బుద్ధి మతి ధృతి ఖ్యాతి సంవి
దుపలబ్ధినామంబు లొంది యెందును గని విని చని కావించి విభుత నొప్పు
దాన నహంకారతత్త్వంబునకుఁగల్గుఁ బ్రభవంబు వినుఁడు తద్భావితాత్మ
కం బై ప్రవర్తించుఁ గార్యనీతుల లోక మఖిలంబు వర్ణత్రయప్రజనితు
తే. లధ్యయనమును వ్రతమును నధ్వరంబుఁ
దపము మొదలైనక్రియ లందుఁ దగిలి నడచు
జెల్లఁ దద్వ్యాప్తిఁ జేసియ తెల్ల మింత
జగము రంజిల్లు దాని తేజంబువలన. 135

క. వినుఁ డాతత్త్వంబుల సం,జనితము లగు మేదినియును జలమును దేజం
బును వాయువు నాకాశము, ననఁగ మహాభూతములు నిరతిశయమహిమన్.

తే. తద్గుణంబులు సూరె గంధంబు రసము, రూపసంస్పర్శశబ్దముల్ రూఢభంగిఁ
బరఁగునివ్విషయములపాల్పడ్డమనసు,గలుగుజంతువు మోహాంధకార మొందు.

---

1 ప్రకాశభేదముల సెలఁ...నవి సుదుస్తరంబు. 2 ద్రివిధగమన. 3 రజస్సునకుఁ జూడఁగ సం,యమి.

క. దేహ మ్మిది జంతుప్రజకు, నూహింపఁ గ నగుచుండుఁ దను నుర్వీశ్వర తద్దే
హాశ్రయమునఁ బొసఁగిర్చెల, మానవపమునఁ బొరయ నీవు మహితార్యజనుల్. 138

క. దేహములు నశ్వరములు, విషసన్నిభములు సమగ్రవికృతజనకముల్
దేహాగుణముల నెల్లఁ గలుషములుగాఁ జేయు మోహాలోభకరములై. 139

ఆ. మాంసశోణితాస్థిమయశరీరంబులఁ, దారు గాఁగ [1]లగ్గ దలఁచునట్టి
కృపణజనులు వీని కీడు గానఁగ లేక, చిక్కి చెడుదు రింత నిక్కువంబు. 140

వ. పండితులు వీనిచేతం జెడ రని పలికి పద్మసంభవుండు వెండియు. 141

తే. అంతరాత్మ యనంగఁ బ్రాణాదిపంచకమును వాఙ్మనోబుద్ధులుఁగా నిరూఢి
గలుగు నీయష్టకంబు లోకమున కెల్లఁ, దా నుపాదానకారణత్వము వహించు.

వ. ఇవ్విధంబునం గనుంగొనుట బోధంబునకు నిధానంబు. 143

సీ. వినుఁ డహంకారసంజనితంబు లగుచక్షురాదికబుద్ధీంద్రియములుఁ బాయు
ముఖ్యకర్మేంద్రియములును మనంబును నేకాదశేంద్రియానీక మీక
డింపసందడ బడి కుందక యం దెవఁ డుంపేనిఁ దనవంక కీడ్వఁజాలు
బుద్ధితత్త్వము గల్గుశుద్ధాత్మకుఁడు పరతత్త్వంబు గనుటకుఁ దా వలంతి

తే. యని యెఱింగించి మఱియు నిట్లనుచ జెండు, స్వేద ముద్భేద మండ మన్వీనఁ బుట్టు
నర్థముమధ్యమోత్తమదశలైన భూతరాసు లత్యుత్తమములు జరాయుజములు.

వ. భూతతారతమ్యజ్ఞానంబు మాననీయం బగుట నిట్లు సెప్పితి నధ్యాత్మాదులం జెప్పెదఁ దద్వైవిత్త్వంబు విద్యామూలం బై యుండు నవధానంబుతో వినుండు.

క. అంబర మాది యనిలతేజోంబుధరలు వరుసతోడ నగుఁ జూరె ద్వితీ
యంబుఁ దృతీయంబుఁ జతుర్థంబును బంచమము భూతతతి యట్లుండున్. 146

వ. అధ్యాత్మాదులు భూతాధిష్ఠానంబులు గావున భూతంబుల ము న్నుపన్యసించితి.

సీ. శ్రోత్రమధ్యాత్మంబు సూరె శబ్దం బధిభూతంబు దిశలు ప్రబుద్ధులార
యధిదైవతము చర్మ మధ్యాత్మ మందలిసంస్పర్శ మధిభూతసంజ్ఞకంబు
దానికి నధిదైవతంబు విద్యుత్తు నేత్రంబు దా నధ్యాత్మకంబు రూప
మధిభూత మాదిత్యుఁ డధిదైవతము జిహ్వ యధ్యాత్మకము రస మారయంగ

తే. దానియధిభూత ముడుపతి తదధిదైవతంబు ఘ్రాణమధ్యాత్మంబు దలఁప గంధ
మంచితాధిభూతము దదీయాధిదైవతంబు మారుతమండ్రు విద్వజ్జనములు. 148

వ. ఇవి బుద్ధీంద్రియప్రపంచంబు. 149

సీ. పాదపాయూపస్థపాణివాగ్వర్గంబు కర్మేంద్రియములు సత్కర్ములార
యధ్యాత్మములు వాని కగునధిభూతముల్ గంతవ్యమును విసర్గమును శుక్ర
మును గ్రమవృత్తిమై వినుఁడు కర్తవ్య వక్తవ్యంబులును నధిదైవతములు
బభ్రుమిత్రప్రజాపతిశక్రవహ్నులు మఱి యహంకారంబు మనసు బుద్ధి

1 నాత్మఁ దలఁచు.

తే. ప్రాణితావాప్తాత్మకము లధిభూతవృత్తి
వెలయు నభిమాన [1]మంతవ్యములును నిశ్చ
యంబు నధిదైవతము రుద్రుఁ డమృతకిరణుఁ
బ్రహ్మ యిది వేదవాక్యనిశ్చయము తెఱఁగు. 150

ఆ. ఇట్లు తెలియనేర్చి యింద్రియముల నింద్రియార్థములను భూతపార్థములను దె
మల్చి చిక్కకుండ మనసున నొదిఁగించు, ఘనుఁడు లాఁగ ఫలనిరాకులుండు. 151

వ. అని నిర్దేశించి నీరజాసనుం డాసంయమివరులతోఁ సూక్ష్మభావత్వసంపాదనియు శివయు నగునివృత్తితెఱం గెఱింగించెద నమ్మాట మున్నాడి యి ట్లనియె,

సీ. కమఠంబు దనయంగకముల నెట్లట్లు కామముల విద్వాంసుండు మరలఁ దిప్పఁ
గామంబుల మరల్పఁగా నోపుఁ దుండు విరజస్కుఁ డై ముక్తికెఱవు గాంచు
నింద్రియంబులు పఱియింటని గుదియించుకొక్కడుఁ బెర పడి యింధనముగ
నాత్మాగ్ని వెలుఁగు భూతావలి నాత్మఁ గాంచినసూక్ష్మతత్త్వదర్శనము గలుగు

తే. భూతపంచక జలధి రోగాతిశోక, సహితభోగలవాంశకాక్రయము దీని
విభులు గాముండుఁ గ్రోధుండు వీరి గెల్వ, వచ్చినప్పుడ యది గడవంగవచ్చు.

ఆ. మనసు మనసునంద మడఁచి యాత్ముని నాత్మయంద కాంచునట్టి యతఁడు సర్వ
విదుఁడు సకలభూతవితతియందును దనుఁ, గనుచు నుండు నిర్వికల్పకముగ.

తే. ఆత్మతత్త్వ మేకంబ దీపాంతరములఁ
[3]గలుగఁజేయు ప్రదీపంబుకరణి నావ
హించు రూపాంతరముల నయ్యేలమి యును బు
ధుండు గనుఁగొని భ్రమయక యుండు నొకట 155

తే. ఆపరంజ్యోతి వేల్పు లర్యముఁడు వరుణుఁ
డనిలుఁ డగ్ని సోముఁడు విష్ణుఁ డజుఁడు శివుఁ డ
నంగఁ బరఁగుశబ్దములు సన్మతులు దానిఁ
బ్రయతు లయి భజియింతురు నియతులార. 156

వ. అని చెప్పి యచ్చతురాననుం డమ్మానసీయులతో మఱియు ని ట్లను ధర్మంబునకు నహింస లక్షణం బధర్మంబునకు హింసయు దేవతలకుఁ బ్రకాశత్వంబును మనుష్యులకుఁ గర్మంబును నాకాశంబునకు శబ్దంబును వాయువునకు స్పర్శం బును జ్యోతిస్సునకు రూపంబును జలంబునకు రసంబును బృథివికి గంధంబును భారతికి శబ్దంబును మనంబునకుఁ జింతయు బుద్ధికి వ్యవసాయంబును దవియ మహత్తత్త్వస్వరూపంబునకు ధ్యానంబును నవ్యక్తంబునకు సాధుత్వంబును యోగంబునకుఁ బ్రవృత్తియును జ్ఞానంబునకు సన్న్యాసంబును లక్షణంబులు లక్షణజ్ఞానంబు పరతత్త్వపరిజ్ఞానంబునకు హేతుభూతంబు. 157

1 సంకల్పములును. 2 వేధ యమృత. 3 గనఁగఁజేయు.

ఆ. జ్ఞానపూర్వ మైనసన్న్యాసకలనంబు, పరమగతి నొనర్చు భవ్యులార
స్వాంతస్థ్రితహితుఁ డై నతని జరామృత్యుత్యాని, స్తరణకరణ మైన ధర్మ మెఱుఁడు. 158

అవ్యక్తనామకతత్త్వనిరూపణప్రకారము

సీ. అవ్యక్తనామకం బగుతత్త్వ మరయ నలింగంబు పురుషుఁ డలింగుఁ డతఁడు
క్షేత్రంబు నెఱుఁగుట క్షేత్రజ్ఞుఁ డనఁ జను క్షేత్రంబు నాఁగఁ బ్రకృతి యనంగ
నవ్యక్తమునకు నామాంతరంబులు గుణప్రభవమాతత్త్వమా ప్రభువు గుణము
లెఱుఁగవు చేతనాహీనముల్ గాన యత్యంతరాత్ముఁడు దత్క్రియాప్రపంచ
ఆ. మెఱుఁగు నిట్టు లగుట యోగి గుణమ్ముల, విడిచి నిలిచి తత్త్వవేది యంత
రాత్మవేశమున నచలనిరామయావ్యయపదంబు నందు ననఘులార. 159

వ. అని వెండియు. 160

సీ. జ్యోతిస్సులందు వరుఁడు రవి భూతంబులం దగ్ని వరుఁడు విద్యలఁ బ్రధాన
సావిత్రి దేవతాసమితిఁ బ్రజాపతి ఘనుఁడు వేదముల ముఖ్యంబు ప్రణవ
మనిలచయమ్మునఁ బ్రాణ [1]మగ్ర్యము ఛందములకు గాయత్రి యగ్గలము పశువు
లకు మేటి యజ మఖిలచతుష్పదములకు ధేనువు మిక్కిలి మానవులకు
తే. బ్రాహ్మణుఁడు వరిష్ఠుండు పక్షులందు, శ్యేన మధికంబు యజ్ఞవిధానముల హు
తంబు పెద్దయుగములఁ గృతంబు మేలు, ధాతువర్గములోన నుత్తమము పసిఁడి.

సీ. యవ లోషధులలోన నన్నంబు భక్ష్యభోజ్యములందు జలము పేయములలోన
నమరాచలము పర్వతములలోఁ బ్లక్షంబు దరువులలోన నూర్ధ్వంబు దిశల
జాహ్నవి నదులందు సాగరంబు సరస్సులందు గృహస్థత్వ మాశ్రమముల
నెక్కు డారయ నెక్కు డేను బ్రజాపతులం దచింత్యాత్మకుం డైనయట్టి
తే. విష్ణుఁ డెక్కుడు నాకంటె వినుఁడు తెలియ,నీశ్వరుఁడు దేవతావలి కెల్ల నెక్కు
డతఁడు నా నే ననఁగ విష్ణుఁ డనఁగ వస్తు,వొకఁడ మూర్తిత్రయంబున నుల్లసిల్లు.

క. నెఱయఁ బ్రధానపదార్థము, లెఱుఁగుట పరిబోధమూల మెఱుకల కెల్లన్
మెఱుఁ గిడుట మమ్ము మువ్వుర,గుఱుకొని యొకఁడుగ నెఱింగికొనుట దలంపన్.

క. దివసము రాత్రియునుం బోరిఁ, బ్రవర్తనముఁ బొందుచుండుపగిదిని సుఖసం
భవదుఃఖజననములు జంతువులకుఁ గలుగు వల దుబ్బ [2]దురపిల్లంగన్. 164

తే. పొదలుఁ దఱుఁగుటకై పొడ [3]వొదవుఁ బడుట
కై కడను జేరఁ బాయుటకై జనించుఁ
బొలియుటకు నై సుఖంబును బొందు దుఃఖ
మందుటకు నై పదార్థము లఖిలములును, 165

క. జ్ఞానము సవిశేషస్థితి, దానికి నాశంబు లేదు దానిఁ దెలియుటన్
మానాహంకృతిమమతలు, మానిననిర్మలుఁడు మోక్షమార్గముఁ గాంచున్. 166

1 మాద్యము. 2 దురపిల్లంగన్. 3 వెదుగు: ...కై కదుం జేరు.

వ. అని వివరించి [illegible] 167

సీ. గురుకులంబు ప్రియహితకరుఁ డయి [illegible]
[illegible]
[illegible]
[illegible]

తే. చారవిధములు సముచితా [illegible]
[illegible] బ్రహ్మచారి.

సీ. అర్హప్రకారసమావర్తనుం డయి నిజానురూపసతీకుండు నిర్మలప్ర
చారుండుఁ బంచయజ్ఞపరుండు నతిథిపోష్టాతియు శుక్లవస్త్రాన్వితుండు
శక్త్యనుగుణదానశాలియు నచపలేంద్రియుండును శుచియు మైత్రపరుండు
స్వాధ్యాయశీలుండు సద్వ్రతనిష్ఠుండు నై యాజనంబు నధ్యాపనంబు

ఆ. శక్య మైనఁ జల్పి తనకు గల్గ సత్ప్రీతి,గ్రహ మొనర్చి పిత్రు లమితు లనఁ
మాటకార్యమునను మధ్యస్థుఁడై గృహస్థుఁడు నడచు సుచితమాసఁ దగుచు,

సీ. గ్రామంబు వోఁజఁగి యరణ్యస్థలంబునఁ
బర్ణశాలావాసపరత నొంది
స్నానతంత్రము రెండుసంధ్యల నడపుచు
బ్రహ్మచర్యవ్రతభాసి యగుచుఁ
బూరిపంటలు ఫలంబులు మూలములు శాక
సముదయంబును నశనముగఁ గొనుచు
నజినంబు వల్కల మంబరంబుగఁ గొని
శయనకృత్యంబు భూస్థలి నొనర్చి

తే. యతిథులకు నెడ మిచ్చి యాహారములను
భక్తి నాత్మీయములలోనఁ బంచి పెట్టి
యధ్యయనహోమశీలుఁడై యన్నియింద్రి
యముల గెలిచి వానప్రస్థుఁ డతిశయిల్లు. 170

క. ఈమూఁడాశ్రమములలో, నేమిట వర్తించువార లేనియు ముక్తిం
గామించినఁ జొరఁ దగు వి,ద్యామూలాచార మైన యత్యాశ్రమమున్. 171

సీ. సర్వభూతదయానుషంగంబు గలిగి యతీతవస్తువులఁ జింతింప కెద న
నాగతంబులమీఁద నాస సేయక వర్తమానలబ్ధము లుపేక్షానిరూఢిఁ
గూర్పు చంగంబులఁ గూర్మ మె ట్లట్ల యింద్రియముల లోనికిఁ దిగిచికొనుచు
సముచితకాలభిక్షాచర్య దొరకొన్న యంతన నిజదేహయాత్ర నడపి

1 నన్ను మమల. 2 జరించుచు. 3 చారములుగ, నాచరించుచుస్త్రీజన త్యాగమొంది, ప్రే.

తే. గ్రాసమాచ్ఛాదనంబు దక్కంగ నెవ్వఁ, డర్థి నెయ్యది యిచ్చిన నంద కేక
వారభోజి యగుచు నమస్కారసఖ్య,నుతినిరాకృతిసహితుఁడై యతి వెలుంగు.

క. అనసూయయు నక్రోధం,బును దమమును బ్రహ్మచర్యమును ఋజుభావం
బును సత్యంబు నపైశున,ము నహింసయుఁ జూవె యతికి ముఖ్యవ్రతముల్. 173

తే. వృక్షమూల నదీతీర విజననిలయ, విపినగిరిగుహానిత్యవివిక్తదేశ
వనవాసి యై కౌటిల్య [1]సాధ్యవస్తు,సంచయసములుడిగి యతి సంచరించు. 174

క. తనమేలు ప్రకాశింపక, తనుఁ గనుఁగొనునట్టి జను లుదాసీనతమై
నునికికిఁ దగియెడుచందం,బున వర్తించుయతి సర్వముక్తత నొందున్. 175

వ. అని యొఱింగించి మఱియును. 176

సీ. సన్న్యాస మనఁ దపశ్చరణంబుపేరు తపోజ్ఞానముక్తిప్రబుద్ధు లైన
జనము లచింత్యం బజర మమృతంబు నావెలుఁగుతత్త్వము గండ్రు వీతతామ
సము నవధూతరాజసము నై శుద్ధసత్త్వాశ్రయం బగుహృదయంబు గలుగు
వారు తపోవృత్తివలన సుక్షేమమార్గంబున నడతు రేకత్వశోభి

తే. మహితనానాత్వ మనఁగ సమస్తభూత
సముదయస్థ మై యున్న తత్త్వము ప్రకాశ
మగుట నఖిలగతులఁ దోఁచు నవ్విధంబు
గలుగు బుధుఁడు నిర్ద్వంద్వుఁ డై కాంచు ముక్తి. 177

వ. అవ్యక్తప్రభవంబును బుద్ధిస్కంధంబును నహంకారవిటపంబును మహాభూతోపశాఖంబును నింద్రియకోటరంబును సంతతాశాపల్లవంబును శుభాశుభ ఫలంబును నై సంసారవృక్షం బొప్పుచుండు. 178

క. జ్ఞానాసి నది నఱికి యభి,మానాహంకార దూరమతి యగుపురుషుం
డానంత్యము ప్రస్ఫుటముగఁ, గానంగా నేర్చు విగతకల్మషులారా. 179

ఆ. నిమిష మైనఁ బరమనియతి నాత్మని నాత్మ
యంద కనినఁ దెలివు [2]నారఁ బడసి
బోధమహితమునుల పొందునవ్యయగతిఁ
బొందఁ గండ్రు ప్రకృతిపొందు వోఱఁగి. 180

ఆ. పరమనియతి యనఁగఁ బ్రాణసంయమనంబ, యది క్రమాభివృద్ధి నలవరింపఁ
గాఁ బ్రసాదసిద్ధి గలిమి ధ్రువం బవ్వి,శేషకలన మిష్టసిద్ధిఁ జేర్చు. 181

క. అవ్యక్తతత్త్వజాతము, భవ్యము సత్త్వంబు దురితపంకహరం బై
యవ్యయ మమృత మనింద్రియ, భావ్యం బగుతత్త్వ మొందఁ బ్రాఁకగుఁజూండీ.

వ. కావున. 183

తే. సత్త్వభావనకంటెఁ బ్రశస్త మైన, కృత్య మరయంగ లేదండ్రు నిత్యవస్తు

---

1 శాశ్యవస్తు. 2 నలరి వారు.

సమ్యగనుగమశీక్షకు సంయమిప్రశిక్షు [illegible] ప్రశిక్షులారా. 184

క. వినుఁడీ సత్త్వస్థుఁ బురుషుఁ, డనుఁగొను [illegible]
[illegible] సైనం, గనుఁగొను [illegible]

సీ. [illegible] సత్త్వంబు [illegible]
[illegible]
[illegible] కంబులు గాన తత్త్వవిజ్ఞానము [illegible]
బడయుట యొప్పెడుపదముం [illegible] సత్త్వంబుఁ [illegible]

తే. [illegible] యగు సుదూంబ
రమున మశకమ్ము వారి మీనము వసించు
నట్లు సత్త్వంబునం దంతరాత్ముఁ డుండుఁ
గాక యనియెడువారు పెక్కండ్రు గలరు. 186

వ. అనిన విని యమ్మును లమ్మహాత్మునితో ధర్మంబు లనేకవిధంబులు వీనిలో నెవ్వం డెయ్యది యవలంబించె నదియ వాఁడు మే లను నే [illegible] దనుం బరఁగినబుద్ధులు గలిగి యనిశ్చయవర్తుల మయి యుండుదు మది ప్రథానానుష్ఠేయం బని యుపదేశింపవలయు సత్త్వపురుషసంబంధప్రకారంబును బ్రస్ఫుటంబుగా నెఱింగింపు మనుటయు వారికి వారిజాసనుం డి ట్లనియె. 187

సత్త్వం బవశ్యాపేక్షణీయంబుగా నిరూపించుట

సీ. సకలధర్మములలో సర్వభూతాహింస మేటి యహింసానుమేతుఁ డైన
వానికి నుత్తమజ్ఞానోదయం బగు నది మోక్ష మొసరించు ననఘులార
కోరిక మొదలుఁ గర్మకారి యయ్యెడువాఁడు వొందు గతాగతంబుల ఫలాభి
లాషంబు లేక నిర్దోషత మే లాచరించిన ముక్తిఁ జెందు వినుఁడు

తే. విషయి పురుషుండు సత్త్వంబు విషయ మిట్లు
భోక్తృభోజ్యత్వసంబంధమునఁ బొసంగి
యుండియును బద్మపత్రపయోలవంబు
కరణి నతఁడు తత్సంగంబుఁ బొరయకుండు. 188

క. సత్త్వము ప్రదీప మాపర, తత్త్వముఁ గాంచుటకుఁ గాన తత్సాధనతా
[1]తత్త్వము వదలక చిత్తసుఖత్వాకలిత మగు నెలవు గండ్రు కృతాత్ముల్. 189

చ. అది సదుపాయ [2]మెందును నుపాయసమగ్రత లేమి నేర్పు ద
భ్యుదయము దూరమార్గమునఁ బొందెడుభద్రము వాహనాఢ్యుఁ డుర్గ
నది నెఱి నుత్తరించి కనునందము నౌసహితుండుఁ గాంచునొ
ప్పిదము వినాధనుం డయిన బెట్టెటు లొందఁగ నేర్చుఁ జెప్పుఁడా. 190

ఆ. ఇట్టు లగుట యెఱిఁగి యెఱిఁగియేనియును నెఱుంగకేని బలిమి బొచ్చు గడిగి

1 సత్త్వము...చిత్తవసు, ఖత్వా 2 మెందు ననపాయసమగ్రత.

చేయుచుని ఫలంబు చిక్కింప కుండుట; కొలఁదిఁ బోక సుకృతములును గలుగు. 191

క. స్థలపథమునఁ బోతమ్ము, జ్జలమార్గమునందు వాహనము వినియోజ్యం
బులు గా విప్రుండు సాధన, కలనవిభాగజ్ఞుఁ డైనఁ గడచు దురితములన్. 192

వ. అని చెప్పి. 193

తే. తటినిఁ దగ నుత్తరించునంతకును బోత
[1]మాదరించి తక్కొల్లనియట్లు పురుషు
దర్శనము సంభవించునంతకును సత్త్వ
మాఁది పిదపఁ దత్సంబంధ ముడుగుఁ డనియె. 194

వ. ఇట్లుపదేశించి మఱియు నిట్లను నవ్యక్తంబుగుణంబు మహత్తత్త్వంబు మహత్తత్త్వగుణం బహంకారం బహంకారగుణంబులు మహాభూతంబులు మహాభూతగుణంబులు శబ్దాదులం దాకాశంబునకు శబ్దంబు గుణంబు వాయువునకు శబ్దస్పర్శంబులు గుణంబులు దేజస్సునకు శబ్దస్పర్శరూపంబులు జలంబునకు శబ్దస్పర్శరూపరసంబులు గుణంబులు పృథివికి శబ్దస్పర్శరూపరసగంధంబులు గుణంబులు శబ్దంబు మృదుఖరాదిబహువిధభేదంబులు గలిగియుండు స్పర్శంబు శీతోష్ణముఖ్యవివిధప్రకారంబులం బరఁగు రూపంబు శుక్లకృష్ణప్రభృతినానావిధంబులం జను రసంబు మధురతిక్తాదిప్రచురభంగుల నడచు గంధంబు సురభితీక్ష్ణప్రముఖానేకవిధంబుల వర్తించు నిట్లు పెక్కుచందంబులం జెల్లువిషయంబుల తెఱంగెఱుంగుట వానిఁ దొఱంగుటకుం దోడ్పడంజాలు నని చెప్పి వెండియు.

ఆ. భూమిముఖచతుష్కమునకంటె దివి యహంకారతత్త్వ మంతకంటె దాని
కంటె బుద్ధి బుద్ధికంటెఁ బ్రకృతి యెక్కు, డన్నిటికిని బురుషుఁ డధికుఁ డరయ.

క. భూతములతారతమ్యము, చేతోగత మైనయట్టి శిష్టజనము ప్ర
ద్యోతితుఁ డగుపురుషుఁ గని నిరాతంకావ్యయపదంబు ప్రాపింపఁ గనున్. 197

సీ. పంచభూతంబులఁ బరఁగింపఁ గుదియింపఁ జాలుదక్షత వాని నేలుప్రభుతఁ
దనరు మనంబు రథ్యముల సారథి యెట్టు లట్లింద్రియంబుల నాఁగ నడప
నదియ వలంతి భూతాత్మకంబును బుద్ధి సన్నాహమును మనస్సారథికము
నింద్రియాశ్వము నైనయాద్యరథంబున నభిమతగతి నంతరాత్ముఁ డెందు

తే. నెలమివర్తించు నిట్లగు టెఱుఁగుబుధుఁడు, ఘోరసంసారమోహవాగురకులోను
గాక నిర్గుణపథమునఁ గ్రాలి కను నిరామయము నవ్యయంబును నగుపదంబు.

వ. అని పలికి మఱియు. 199

క. శరనిధితరఁగలభంగిం, బొరిఁబొరి నవ్యక్తమునన పుట్టు నడంగుఁ గ
సురనరధరణీరుహముఖ, చరాచరానేకభూతజాలము లెల్లన్. 200

క. అవ్యక్తాదికసకలము, నవ్యయుఁ డగుపురుషు డాశ్రయంబుగఁ బరఁగుఁ గా

---

1 ఆశ్రయించి.

ష్ఠానిత యగుగతి యది కృష్ణాను [1]గతివిరక్తజనపదమంచితె సుండీ. 213

వ. అని నిర్దేశించి వెండియు. 214

క. కోరికలకుఁ జొరక యసం,గారూఢత గలిగి యెల్లయెడలను సమతం
గూరినచిత్తంబులు గల, సారాత్ములు [2]లిపథమునఁ జనుటకు శక్తుల్. 2.5

క. చెప్పితి సర్వంబును నీ, చొప్పున నడవఁ డెడ నొందు సొర నీకుఁడు మిా
కొప్పెడు తెరు విడి పీనం, దప్పదు పరమపదసిద్ధి ధార్మికులారా. 216

క. అని యిట్లు కమలగర్భుఁడు, మునులకుఁ దత్త్వోపదేశమును జేసిన వా
రనవద్యసమాధికులై, యనితరసులభ మగుసౌఖ్య మందిరి వత్సా. 217

వ. అనిపలికి గురుం డా శిష్యునితోడ. 218

క. నీవును నివ్వాక్యంబులు, భావంబున నెలవుకొలిపి [3]పరమసమాధి
శ్రీవాటింపుము నిత్యప,దావాప్తి ఫలించు నీ కనాయాసమునన్. 219

క. అని గురుఁడు ప్రబోధించిన, మనమునఁ దెలి వొంది తత్సమంచితమార్గం
బున నడచి పొందె శిష్యుం, డనామయం బజర మమృత మనియెడిపదమున్.

చ. అని వసుదేవసూనుఁడు సమాదరమేదురచిత్తవృత్తిఁ జె
ప్పిన విని వారియుల్లములపెంపిటు లుండునె వార లెవ్వరో
వినుటకు నాదుడెందమున వేడ్క జనించె నెఱుంగఁ జెప్పవే
యనుటయుఁ బార్థుమోముఁ గృప నమ్మహితాత్ముఁడు సూచి నవ్వుచున్. 221

క. అనఘ విను మే గురుఁడ నా, మనంబు శిష్యుండు విమలమానస నీపైఁ
బనుపడు ప్రీతిం జెప్పితి, ననితరసులభాతిగుహ్య మగునిప్పదమున్. 222

క. విమలము నచలము నగుచి,త్తము నా దెస నేకభక్తితత్పరముగఁ జే
యుము నిత్యము నీయధ్యా,త్మము ననుసంధింపు పాసెదవు దురితములన్. 223

క. సమరమునప్పుడు నీ కీ,యమృతపదప్రాప్తిహేతు వగుసమ్యగ్బో
ధము వివరించితి నచలత, రమింపు మిం దెప్డు శమధురాధుర్యుఁడవై. 224

వ. అని యిట్లు కృష్ణుండు జిష్ణున కధ్యాత్మవిద్య వివరించె నని చెప్పినఁ బరమగురుం
డును విశిష్టశిష్యుండును నగునప్పురుషవరులు మఱియు నెవ్విధంబునం బ్రవర్తించి
రాకర్ణించుకౌతుకంబు నామనంబున నెసకం బెసఁగెడు మునీంద్రా యెఱిం
గింపవే యని యడుగుటయు. 225

చ. పరమదయానిధే యరిపాలితవేదకలాప పక్వని
గ్భరశమసూక్ష్మతాతనువిభాసిత పన్నగతల్పభూషణా
దరభరితా పవిత్రపదతామరసస్మరణా పరావర
త్వరహిత పద్మజాదిసురవందిత పశ్చిమనాళనందితా. 226

క. వినుతచతుర్వర్ణకసం,జనకముఖభుజోరుపాద సంవిద ఖేదా

1 మతివిరక్తి. 2 లిట్టి త్రోవఁ జనుటకు. 3 పరమసమాధిక్, శ్రీ.

మునిహృత్కమలమరాళా, జననమరణహరణచరణసరసిజలీలా. 227

మాలిని. పదనమదమరాళీ భక్తసంపోషశాలీ
విదళితసురవైరీ విశ్వలోకైకధారీ
మదరహితహితైషీ మాన్యయోగప్రతోషీ
సదవనపరచిత్తా సర్వనిర్మాణవేత్తా. 228

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున నశ్వమేధపర్వంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము

## అశ్వమేధపర్వము - తృతీయాశ్వాసము



క. శ్రీనగసుతాత్వమహితవి
ధానుతశశ్వల్లసల్లతావేష్టనహే
లానిత్యశాడ్వలతరు
త్వానుగుణఫలప్రదత్వ హరిహరనాథా. 1

తాను ద్వారక కరుగవలయు నని యర్జునునిఁ గృష్ణుఁ డడుగుట

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు ఫల్గును నఫల్గువిద్యావిశారదుం జేసి శౌరి యతనితోడ. 2

క. నాచిత్తము వసుదేవునిఁ, జూచుట కోరియును నీవు సుమనోవృత్తిం
జూచి యనుమతి యొనర్చుట, వేచినయది నన్ను బుచ్చవే ద్వారకకున్. 3

చ. అనవుఁడు నక్కిరీటి దగ నయ్యదువంశవరేణ్యుతోడ ని
ట్లను నటు లేనిఁ బోవలయు హస్తిపురంబున కత్తెఱంగు నె
ప్పిన నిను ధర్మనందనుఁడు ప్రీతిగ నందుల కన్పి పుచ్చు న
య్యనుమతి గల్గునట్లు దగ నాడెద నవ్విభుపాల నచ్యుతా. 4

వ. అనిన విని దామోదరుండు దారుకు రావించి రథంబు పూన్పు మని నియోగించె నదనంతరంబ ధనంజయుండు దమతోడం జనుదేరం దగుపరివారంబు సమకట్టం బడవాళ్లం బనిచె నొక్కింతసేపునకు దారుకుండునుం దే రాయితంబుసేసి తేరం బడవాళ్లునుం బరిజనంబుల సన్నద్ధులం గావించి సన్నిహితులం జేయ నాకృష్ణార్జునులు [1]ప్రయాణోచితాలంకారాలంకృతులై రథం బెక్కి కరినగరంబు పథంబు పైకొని చనుసమయంబున. 5

సీ. వినయ మారంగ గోవిందున కిట్లను గాండీవి దేవ నీకరుణఁ జేసి
కౌరవసైన్యసాగర ముత్తరింపంగఁ గంటిమి గురు భీష్మ కర్ణముఖ్య

1 ప్రయాణోచితాలంకృతులై.

[illegible] క్షత్రయోధుల [illegible] జేసి
[illegible] తేజంబును [illegible] నతుం

తే. [illegible]
[illegible] కాంతరంగ. 6

క. నీమహిమ వొగడఁ గొలఁదియె, [illegible] భవదీ
యామలతేజము [illegible] కృష్ణా. 7

క. భవదీయాశ్రయణము [illegible] ప్రసాదయోగంబును మృ
త్యుల్వ లక్ష్మియు నీవలనన, యస్మ ప్రీతియు మరణము [illegible]. 8

క. స్థావరజంగమమయజగ, దావిర్భావస్థితిక్రియావిలయంబుల్
నీవలనన యగు చుండును, దేవాకీతుఁగపద్మ [illegible] ముకుందా. 9

వ. అని వెండియు. 10

కృష్ణార్జునులింద్రప్రస్థమునకుం [illegible] వచ్చుట

క. నారదదేవలకౌశిక, పారాశర్యాదిమునులపలుకుల భీష్మో
దారవచనముల నిను నఘ్[illegible] నే నెఱిఁగి యుండుదును సకలముగన్. 11

వ. కావున.

క. నావలనికరుణపెంపున, నీవు ప్రసాదించినట్టినిరవద్యకవి
ద్యావిస్తారంబున వ్రన్న, తావిశదమతిఁ బమించెదం గ్రతుపురుషా. 13

వ. అని యిట్లు సభక్తికంబుగా సంభాషణంబు సేసిన వాసుదేవుండును వితతా
దరవాక్యంబుల నభినందించె నప్పురుషవరు లట్లు సల్లాపంబులు సేయుచుం
బోయి తమరాకకు సమలంకృతం బైనసాముజపురంబు ప్రవేశించి ధృతరాష్ట్ర
మందిరంబున కరిగి యక్కురువృద్ధుని గాంధారిని బ్రణామవినయవిశేషంబులం
బ్రీతులం జేసి కుంతీసమారాధనం బాచరించి విదురధౌమ్యయుయుత్సుసంజ
యులదర్శనంబులు సముచితప్రకారంబుల నడపి కౌంతేయాగ్రజు నత్యంతభక్తి
పూర్వకంబుగా సమంచితవిధంబునం గాంచి తదాలింగనాద్యాదరణంబులు
వడసి రప్పద్మనాభుండు నాఁడు సవ్యసాచిసదనంబున నతనిచేయుపూజావిధా
నంబుల మానసం బలర వసియించి మఱునాఁడు మహనీయాస్థానమండపంబున
నున్నయన్నరేంద్రుకడకు నయ్యింద్రసుతుండు దోడన చనం జని సుఖగోష్ఠినుండె
నట్టియెడనగ్గాండీవి యప్పాండవపూర్వజునాననంబునఁజూడ్కినిలిపి నిభృతుండై.

తే. కమలనాభుండు పెద్దయుఁ గాల మిచట
నున్నవాఁడు దండ్రియును సహోదరాది
సకలబంధులు నితనిదర్శనము గోర
కుందురే వారిఁ జూడ నీతండుఁ గోరె. 15

క. ద్వారకకు నమ్మహాత్ముఁడు, మీఁ దనుగతి సేయఁ జనియమేయగుణుల నా
సీరిని వసుదేవునిఁ గని, గౌరవ మెసఁగంగఁ దల్లిఁ గాంచి ముదమునన్. 16

క. తక్కటిసోదరుల సుతుల, నక్కనఁ బ్రియ మారఁ జేర్చి యప్పురజనులన్
మిక్కిలి మన్నన పెక్కువ, నెక్కొనఁ గా నాదరించి నిలువక మగుడున్. 17

సీ. దేవర యిప్పుని దివ్యచిత్తంబునఁ జూచి మీ కెట్టులు సూడఁ బోలె
నట్టుల యుత్తరం బానతి యిత్తురు గాక నావుడు నధికప్రియమున
మాతులుఁ గాంచి యిమ్మాధవదేవుండు మనమాఱ గాఁగ నమస్కృతులును
నాలింగనంబులు నాచరించి హలాయుధుని దేవకీదేవిఁ గనినయపుడు

తే. భక్తి మనకునై పూజించి బంధుజనుల, నందఱను దత్తదౌచిత్య మభిమతముగ
నాదరించి వారలకుశలానుయోగ, విధము నస్మత్కృతమ్ముగ విస్తరించి. 18

క. పరిజనయోగక్షేమము, లరసి పురజనమ్ములకుఁ బ్రియం బెసఁగఁగ వా
క్యరచనలుం గార్యసమా, చరణములు నొనర్చి నడపి సఖసత్కృతులున్. 19

తే. మఱియు వలయుకృత్యంబులుఁ దెఱఁగుపఱుప
వలసినన్నిదినంబులు నిలిచి యశ్వ
మేధమునకు బాంధవజనమిత్త్రభృత్య
వర్గసహితుఁడై చనుదెంచువాఁడుగాక. 20

క. అని ధర్మజుండు పలికిన, విని కృష్ణుఁడు సంతసిల్లి వినతుండై గొం
తిని ద్రౌపదిఁ దగుమెయి వీడ్కొని తాను సుభద్రఁ దోడుకొని పోవుటకున్.

వ. గొంతి యెంతయుం బ్రియంబున ననుజ్ఞ సేయుటయు నర్జుననుమతియుం గొని.

తే. వివిధవాహనారూఢులై విభవ మెసఁగఁ, బాండవేయులుఁ దక్కినబంధుజనులు
ననుప రాఁగ సాత్యకితోడ నరుగుదేఱఁ, బురము వెడలి యొక్కెడ నిల్చి కరము నెమ్మి.

క. సముచితభంగుల నందఱఁ, గ్రమమున వీడ్కొని పథంబు గైకొని తనచి
త్తము దృష్టియుఁ బాండవమ, ధ్యముపై నొలయంగ నల్లనరుగుచునుండెన్.

ఆ. అట్లు మరలి మరలి యర్జునుం జూచుచుఁ, జనఁగ నతఁడు సూడ్కి సనినయంత
దవ్వుఁ జూచుచుండె నవ్విధంబున సితాం, బురుహలోచనుండు వోవునపుడు.

క. [1]సరసన సాత్యకి రుచిరపుటరదంబునఁ జనియె వెనుక నలతిరథముపై
నరిగె సుభద్రయు నిమ్మెయి, నరుగఁగ హరిమీఁద నింద్రుఁ డలరులు గురిసెన్.

ఆ. పవనుం డనుకూలతమెయిఁ, బ్రవర్తితుం డయ్యె నతిశుభప్రదభంగుల్
వివిధములు మఱియు ధరణీ, ధవ తోఁచె నిమిత్తములు నితాంత [2]స్ఫుటతన్. 27

శ్రీకృష్ణుఁ డుదంకాశ్రమంబునకుఁ బోవుట

వ. ఇట్లు పోయి పోయి మార్గంబుకెలనం జేరువ నున్న యుదంకాశ్రమంబు గని యందుఁ జని వినయం బొప్ప నమ్మునిం గని యతనిచేయు నతిథిసత్కారంబులం బ్రియం బంది యతనిపాల నాసీనుం డయి యుండ నతం డప్పుండరీకాక్షున

1 వరుసన. 2 స్ఫురతన్.

కి ట్లనియె. 28

ఉ. భూరతులపాలి కేఁగి తగ బాంధవకోటియు బంధుభావమం
గరము దృఢంబు సేయుము యుధిష్ఠిరు రాజుల వారివారికి
న్బరితమహోధి రాజ్యములఁ బెద్దలఁ బ్రోవ్వఁగ నిల్పితే పతిపాలితా
పరితము లేనినీవు జగదేకవిధానవిశారదుండ వై. 29

వ. అని యి ట్లయ్యుంగనినాఁడయి యడిగెనుఁ దనట్లు పోలె నిందాగర్భంబుగాఁ బలికినం బద్మనాభుండు దానును దాని నెఱుంగమి భావించి యాభాష్యప్రసాదనం బాలోకించి. 30

చ. కరముచితంబుగాఁ బలికి గర్వపుమాట నదల్చి భీతిఁ గిం
జెరు వగునట్లు చెప్పి కడుఁ బేర్చి విరోధము మాని సంధి క
క్కురుపతిఁ దమ్ముఁ బ్రోత్ర మొగకొల్పఁగఁ జాలక నాకు భీష్ముఁడు
న్గురుఁడును ద్రోణుఁడు చెప్పిరి మునుల్ బహుళభంగుల నొత్తి క్రత్తఱిన్. 31

వ. అతిలోభంబునం జేసి వంశధర్మంబు విడిచి యెవ్విధంబులను సంధికిం జొరక కురుకుమారులు పాండవులతోఁ ఖండనం బొనర్చి సబంధుపరిజనంబుగా మరణంబు నొంది యుత్తమలోకంబుల కరిగి రిక్కడఁ బాండునందనపంచకంబు దక్కం దక్కటివారెల్ల నట్ల పోయిరి కాలనియతి గడవ నెవ్వరికిని శక్యం బగునే యనిన విని రోషకషాయితంబు లగుతారకంబు లుద్వృత్తంబులు సేయుచు నత్తపోధనసత్తముండు. 32

క. కౌరవకులమును మిథ్యా, చారుఁడ వై త్రుంచి తకట శక్తుఁడ వయ్యుం
నేరిమి మైఁ జేయవ పాం, డారుఁగ నిక్కిల్బిషమునఁ గంతుకకిఁ దగన్. 33

వ. ఘోరప్రకారం బగుశాపంబు నీ కిచ్చెద ననిన నచ్యుతుం డామునితో నామాటలు దేటపడ విని తగినయట్లు సేయుదు గాక యని పలికి యి ట్లనియె. 34

చ. కినియుట మాను మేలె మునికిం గుపితత్వము శాంతవృత్తి నా
యనునయ మాదరింపు విను మల్పతపంబులచేతఁ గోలుపో
దునె మఱి యట్లుఁ గాక యతిదుష్కర మైనతపంబు సంచితం
బనఁ దగుబ్రహ్మచర్యమును నాఱడి బోవె కటా శపించినన్. 35

వ. అనిన విని యుదంకుండు శ్రీవత్సాంకు నవలోకించి. 36

క. అగుఁ గాక నీవు సెప్పెడు, తగ వెయ్యది సెపుము వినియెదం [2]బోలిన నే
మగిడించెద శాపోన్ముఖ, మగుమన్మానసము ననుడు నల్లన నగుచున్. 37

చ. తమము రజస్సు సత్త్వము నుదంక మదీయవశప్రవర్తమా
నములు మరుద్వసుప్రభృతినాకిచయంబు మదుద్భవంబు స
ర్వమునను నేన నిల్తు సుఖవాసత నట్ల దగఁ జెంది నిల్చు స

1 c జొప్పున నిల్పితె. 2 బోనరిన.

ష్టమును విను మోక్షమార్గ మనఁ బరఁగు బరం బనఁ గల్గుతత్త్వముల్. 38

తే. ప్రణవమును వేదములుఁ జతుర్వర్ణములుఁ జ
తుర్విధాశ్రమములును దత్స్వకర్మ
జాతములును సమంచితస్వర్గమోక్ష
ములును మన్మయముల కాఁగఁ దెలిసికొనుము. 39

క. క్రతుపరులు నన్ను భగ సం,స్తుతించి ఫల మందఁ గంద్రు దోషయుతులు స
మ్మతిఁ బ్రాయశ్చిత్తంబులఁ, గృతాత్ము లగుదురు మదీయకీర్తనపరులై. 40

క. మానసు మదగ్రపుత్త్రుం, గా నెఱుఁగుము ధర్మునిని జగద్రక్షకు నై
యే నభిమత[1]కాలములను, మానితజన్మముల నొంది మనుతుఁ దపస్వీ. 41

క. భవవర్ధనవిలయంబుల, నవలీలఁ జరుప బ్రహ్మ యన విష్ణుఁ డనన్
శివుఁ డన నిర్వర్తింతును, భువనంబుల నేన చూవె భూరిమహిమలన్. 42

క. ధర్మంబు కలఁకఁ గాంచి య,ధార్మికులం బొలియఁ జేసి ధార్మికులను జే
పేర్మిని రక్షింతు నుచిత, కర్మాచరణముల నే జగద్ధితమునకై. 43

వ. అట్టివాఁడ నయి యుండియు నధర్మపరులగు ధార్తరాష్ట్రుల నత్యంతధార్మికులగు ధర్మనందనాదులతోఁ గలపుటకుం బలు దెఱంగులం బడితి నది దివ్యజ్ఞానదేదీప్యమానులగు పారాశర్యప్రభృతిమునివరులచిత్తంబుల కెక్కె నక్కౌరవులు దమ దౌరాత్మ్యంబున మాహాత్మ్యవంతులగు నాకౌంతేయులం దొడరి ధర్మసమరంబున సమసిరి నాచేసినపని యిట్టిది నన్ను నుదంక నీ వింక నేమనియెద వను మని పలికిన నతండు వినతుండగుచు ని ట్లనియె. 44

ఉ. ఇప్పుడు నీమహామహిమ యేర్పడ సమ్యగనుగ్రహంబునం
జెప్పినయీసమంచితవిశేషము లెల్ల నెఱుంగుదున్ మదిం
గప్పినయీదురాగ్రహపుగర్వము నీ వొసఁగంగ నాకు మున్
చొప్పడియెన్ సుధాసదృశసూక్తులఁ దేర్చితి వీవ యచ్యుతా. 45

వ. అని వెండియు. 46

ఆ. అతుల మైననీదయామహిమకు నేను, బాత్ర మగుదు నేని బద్మనాభ
యనుపమానతావకాకృతిఁ జూపవే, నాకుఁ జూడ్కియును మనంబు నలర. 47

కృష్ణుఁ డుదంకునకుఁ దనవిశ్వరూపంబుఁ జూపుట.

చ. అనుఁడు దయాళుఁ డై నహరి యర్జునుచూచినదివ్యమూర్తిఁ జూ
పినఁ గని సంప్రమోదమును భీతియు విస్మయముం బెనంగొనన్
మునిపతి పాణిపద్మములు మోడ్చి 'నమః పురుషోత్తమాయ తే'
యనుచు వినీతి నమ్ర మగునంగము నివ్వెఱ నిశ్చలంబుగన్. 48

వ. ఒక్కింత నిలిచి నిభృతస్వరంబున. 49

1 కాలముల,న్మానితజననముల నొంది నడతుఁ దపస్వీ,

సీ. పుండరీకాక్ష యీరూపునకు నంతయును భూవలయవ్యాపకం[1]బు సంవ్యాప్త మయ్యె
నంబరం బెల్లను నావృత మయ్యె నిమహితపరముజ్జ్వలమస్తకముల
నంతరిక్షము దావకావృతమహిమఁ దేఁజంబులచేత సంఛన్న మయ్యె
భవదీయమహనీయబాహార్గళానిచయా[illegible]హీరము లయ్యె నన్ని దిశలు
తే. బహుచరణముల బహుశిరోభాగములకు
బహుజఠరముల బహుభుజాప్రకరములను
దేవ యిట్లు సర్వంబును నీవ మై త
నర్చి తిరి నాదుకన్ను మనంబుఁ దనిపె. 50
వ. విశ్వరూప యీరూపం బుపసంహరించి నీదగు నెప్పటియాకారంబు నా కొసవే
యనిన నప్పరమేశ్వరుండు వరంబు గోరు మని యానతిచ్చిన నమ్మహాత్ముండు
సంక్రీతార్తిహార నీమూర్తిఁ గంటి నింతకంటె మిక్కిలి వరంబులును గలవే
యనుటయు. 51
క. ఆదేవుఁ డతనితో నటు, గాదు నను గనుట శుభము గావింపక పో
దేది ప్రియ మడుగు మిత్తుఁ బ్రమోదంబుగ నీకు ననిన ముని యి ట్లనియెన్. 52
వ. అవశ్యంబును నా కట్లు గావలయు నని యవధరించితేని దేవా యిక్క మరుదేశం
బిచ్చట జలంబు దుర్లభంబు నాకు జలసన్నిధి యెప్పుడుం గలుగఁ బ్రసా
దింపుము. 53
క. అనుటయు నంబుజనాభుఁడు, దనయెప్పటిలలితమూర్తి ధరియించి మునీం
ద్రునితోడ నమ్ముఁ దలఁపగ, ననఘా దొరకొను జలంబు లని పలికి తగన్. 54
వ. వీడ్కొని చనియెం బదంపడి యాభృగుసంశవరుం డొక్కెడ మెలంగుచుండి
తృషితుం డయి హృషీకేశుం దలంచిన. 55
సీ. కుక్కలు సుట్టి రా నొక్కరూతంగుండు బాణబాణాసనపాణియును ది
గంబరుండును మలినాంగుండు నగువాఁడు దోఁచె నచ్ఛజలంబు దొరఁగుచుండ
మేనితో నమ్ముని వానిఁ దప్పక చూడ వాఁ డోయుదంక యివ్వారి దప్పి
వోఁ ద్రావు మనుడు నాభూసురాగ్రణి యొల్లనని పల్కెఁ బల్కిన వినుము నీవు
ఆ. నీరుపట్టు శ్రమముఁ గూరిన నీమీఁది, కరుణ వచ్చినాఁడఁ గాదు నాక
యర్థిఁ ద్రావు టొప్పు ననియె నాచండాలు, నలుక మెయి నదల్చె న త్తపస్వి. 56
వ. అదల్చిన నతండు సారమేయంబులుం దాను నంతర్ధానంబు నేసె నాసంయమి
వెఱఁగుపడి యొక్కింతవిచారించి యిక్కపటప్రచారంబు కృష్ణసంపాదితంబు గా
వలయు నని యూహించుసమయంబున నయ్యెడకుం గృష్ణుం డరుగుదెంచు
టయుం గనుంగొని యమ్మహాత్మునితోడ నమ్మునివరుండు.
క. జలము నినుఁ దలఁపఁగా నిటు, గలుగునె చండాలునొడలఁ గాతేదనీ రే
నలఘుగుణ త్రావుదునె యే, కొలఁది శ్రమం బైన వరము గుచ్చిత మయ్యెన్.

1 పత్పాదపంకజవ్యాప్త.

చ. అనవుడుఁ గృష్ణుఁ డిట్లను నాఱడిఁబోయెఁ బ్రయత్న మెల్ల నీ
వనఘ యెఱుంగ నైతి సమయం బొకఁ డిమ్మెయిఁ గల్గె నేర్పడ
న్వినుము నిలింపవల్లభుని నీ కయి వేఁడితి నే సుధారసం
[1]బనితరసాధ్య మైనశుభ మయ్యెడుభూతి దొలంగ నక్కటా. 59

వ. అది యె ట్లంటేని. 60

క. ఏను సుధ యడుగుటయు హరి, మానవులకు నేల యగు నమర్త్యత్వము మే
లైనతెఱఁ గొండు గోరుము, దానిం దగ నిచ్చెదఁ ముదం బారంగన్. 61

వ. అనిన నయ్యనిమిషపతియాననం బాలోకించి. 62

క. నిను వేఁడుట మోఘము గాఁ, జను నే యొల్లైన నాదువచనవు నెఱప క
మ్మునిపతికి నమృతరస మి, మ్మని ప్రార్థించిన మహాత్మ యాతఁడు నాతోన్. 63

వ. సమయంబు సేసికొని వచ్చె నత్తెఱం గాకర్ణింపు మమ్మహితసౌజన్యధన్యుండు. 64

శా. మాతంగత్వము దాల్చి యే నరిగి సమ్మానించి యాభార్గవుం
బ్రీతుం జేసెద నట్లు లిచ్చిన సుధఁ హీనదూషితస్వాంతుఁ డై
యాతం డొల్లక యున్న నేమి విను నా కన్యాయ్యవృత్తంబు గా
దీతంత్రంబున కీవ సాక్షి యని తా నేతెంచె నీ కానఁగన్. 65

వ. నీవు ప్రత్యాఖ్యానంబు చేసిన నతం డంతర్ధానంబు సేసెం గా నిమ్ము దాని కేమి
సేయవచ్చు నాయిచ్చినవరంబు బొంకు గాకుండ నీకు జలం బెప్పుడుం గలుగం
జేసెద. 66

చ. అనఘ జలంబు నీవలసినప్పుడ మేఘము లీమరుస్థలం
బున నొసఁగుఁ భవద్వశము వొంపిరివోవ నుదంకమేఘనా
మనుతవిహారముల్ గలిగి మాన్యత నెప్పుడు నియ్యెడం జరిం
చును జలదంబు లింక నను సువ్రత దూఱకు పోయి వచ్చెదన్. 67

క. అనినం బ్రీతుం డయ్యెను, ముని యంతర్ధానకలనమునఁ గృష్ణుండుం
జనియె నని చెప్పి మఱియును, జనమేజయనృపతితోడ సంప్రీతి మెయిన్. 68

వ. వైశంపాయనుం డిట్లనియె. 69

ఆ. మనుజనాథ యెప్పుడును మరుదేశంబు,నందు నియతవృత్తి నద్భుతంబు
దలకొనంగ నయ్యుదంక మేఘంబు లా,శ్లోకపుణ్యాతిథుల నొలసి కురియు.

వ. అనిన విని జనమేజయుండు మునీంద్రా యుపేంద్రుని శపించుటకు నుత్స
హించినయుదంకుం డేమివిధంబుతపంబున నమ్మహానుభావంబు నొందె నెఱిం
గింపవే యనుడు నావిభునకు వైశంపాయనుం డిట్లనియె. 71

జనమేజయునకు వైశంపాయనుఁ డుదంకునిచరిత్రంబు సెప్పుట

సీ. అతనికి గురుభక్తికతనఁ జొప్పడియె నత్తెఱఁగు[2]సెప్పెం బది విను తెలియ నతఁడు

---

1 బనితరసామ్య మైన. 2 సెప్పెద విను.

దనగురుం డైనగౌతమునకు శుశ్రూష నియతిమైఁ జేయ నన్నేహభక్తి
కంబుగఁ బెద్దయుఁ గాలంబు సనిన నా సంయమిపతి శిష్యసమితి కెల్ల
వివిధవరము లిచ్చి వీడ్కొల్పి పుచ్చి యుదంకునిదిక్కును దలఁప కుండె

ఆ. నత్తపగపరాత్ముఁ డతినిష్ఠఁ బరిచర్య, నడపు చొక్కనాఁడు గడును బ్రేగు
గలుగునట్టివంట కట్టియమోపు, గుదియ మోచి తెచ్చెఁ గురువరేణ్య. 72

క. అటు మోచి తెచ్చి యందొక, జట పెద్దయుఁ దగిలి యుండ సరభసముగ వై
చుటయుఁ దెగి మోపుతో ముం, దట నది పడియెను జరాసితచ్ఛవి మెఱయన్.

సీ. దాన నన్నియతుండు దనవయఃపాకంబు నెఱిఁగి శోకంబున నేడ్వ నమ్మ
హాముని యశ్రువు లంజలిఁ బట్టంగ నిజపుత్త్రిఁ బనిచె నన్నీరజాక్షి
రయమునఁ బట్టి కరంబులు వేఁడిమి నెరసిన విడిచిన ధరయుఁ దలరె
నమ్ముని యాశిష్యు ర మ్మని చేరంగఁ బిలిచి నీ వేటికి నలఁతఁ బొందె

ఆ. దనిన నతఁడు శిష్యు లందఱుఁ బైఁ గల, కరుణ మీకుఁ బెద్దకాలమేని
మునివరేణ్య నావలన లేద దానికి, నుమ్మలింప కెట్టు లుండవచ్చు. 74

వ. అనుటయుఁ గృప చిగు రొత్తుచిత్తంబుతోడ. 75

క. ఎలప్రాయ మిచ్చితిని నీ, కలఘుమతీ యిచ్చెదను మదాత్మజ నుల్లం
బలరఁగఁ బెండిలి గ మ్మని, పలికి మఱియు నాతపస్విపతి యి ట్లనియెన్ 76

క. నీతేజంబు సహింపఁగ, నీతాయురసాక్షి దక్క నెవ్వరికిఁ దప
స్స్ఫీతా శక్యము గాదిది, చేతోగతిఁ జూచి తగవు సిద్ధించుటకై. 77

వ. ఇమ్ముద్దియకును. 78

క. తనువొండుగఁ జేసెద నది, జననాంతర మెట్టు లట్ల సజ్జనసుత నీ
వనుమానము దక్కుము యౌ,వనమును గైకొనుము కన్య వరియింపు తగన్.

వ. అధర్మంబు గాకుండునట్లుగా వరం బిచ్చితి నని యనుగ్రహించి యక్కన్యకా
రత్నంబునకును. 80

చ. తనులత యొండు సేసిన నుదంకుఁడు యౌవనలక్ష్మిఁ దాల్చి య
వ్వనిత వివాహ మయ్యె నృపవర్య పదంపడి యమ్మునీంద్రుతో
ననుఁ బని గొండు మీవలు మనంబున నెద్ది దలంచి వేడ్క సే
సిన నది దెత్తు మీకరుణఁ జేసియ కల్గెడు నాకు శక్తియున్. 81

క. అని విన్నపంబు సేసిన, విని దత్క్షణఁ బ్రీతి యగుట వే ఱొరులకుఁ గా
కనఘ భవదీయచరితం,బునఁ జూవే నాకు ననియె ముని మనుజేంద్రా. 82

తే. అంత నిలువక మునిపత్ని కతఁడు భక్తి, నెఱిఁగి తల్లి మీ రానతియిండు మీకు
వలయునట్టిపదార్థ మవశ్యమును న, మాహరింతు నే ననుటయు నయ్యహల్య.

చ. వలవదు లాఁతివాఁడవె భవద్గుణతోషితగౌతమాంచితో
క్తులు మది నూఁదు మన్నను నకుంఠితచిత్తత నొత్తి పల్కె న

యవ్వలఘుతపస్వి యాసబి ప్రియంబున మిత్రసహాఖ్య దేవికుం
డలములు దెమ్ము నాకుఁ బ్రకటంబుగఁ బెంపు వహింపు తమ్ముఁడా. 84

వ. అని యిట్లు పనిచిన నాతండు ప్రీతుం డయి యప్పనికిం జనియెఁ బదంపడి గౌతముం డుదంకునిం బోడగాన మెచట నున్నవాఁ డని యహల్య నడిగిన నాభృగువంశవరుం డరిగిన తెఱం గెఱింగించిన సద్దయాళుం డద్దేవియాననం బాలోకించి. 85

క. ఆసౌదాసనరేంద్రుం, డాసురచరితుండు శాప మాతని నటుకాఁ
జేసినయది మానుషమాం,సాసక్తుం డగు టెఱుంగఁ డమ్ముని యతనిన్. 86

సీ. *అకట యెట్లగునొక్కొ యనుపల్కు కృపదోఁపఁ బలికిన నమ్ముగ్ధ భయము గొనుచు
నెఱుఁగ నిట్లగుట మునీశ్వర నామీఁదిదయ చిగురొత్త నాతనికిఁ గీడు
రా కుండునట్లుగాఁ జేకొని కావవే యనిన నాసంయమి యంత వెఱవ
నేల యే నతనికి నెడరు రా నీ నని తగనూఱడించె నుదంకుఁ డరిగి

ఆ. మనుజరక్తసిక్త తనువును గోరమీసములు వృత్తలోచనములు నైన
యుగ్రమూర్తితోడ నొక్క ఘోరాటవి, నెలమి నున్న యన్నరేంద్రుఁ గాంచె.

క. ముని యిట్లు నెమ్మిఁ గాంచిన, గని యతఁ డాఁకొనుటఁ జేసి గాసిలి యెచ్చోఁ
గనువాఁడనొ తగుభక్ష్యం, బనుచుండఁగ వచ్చితివి ప్రియంబుగ ననుడున్. 88

వ. ఉదంకుం డతని కిట్లనియె. 89

క. గురుకార్యంబునకై భూ,వర నిన్నుం గాన నేను వచ్చితి గుర్వ
ర్థరతులు హింస్యులు గారి, ట్లరయక యాఁడుదె యధర్మ మగుమాట నృపా. 90

వ. అనుటయు. 91

క. దినమున మూఁడవయామం,బునయపరార్ధంబు యోగ్యముగ నాహారం
బునకుం గల్పించిరి నా, కనిమిషు లటుగాన మాన నాఁకలి వుత్తున్. 92

సీ. అని పల్కె సౌదాసుఁ డమ్ముని యట్లని నధిప మద్గురుకార్య మాచరించి
వచ్చెద మగుడ నవశ్యంబు నామాట నన్నృతంబు సొరదు నీ వర్థికోటి
కిష్టపదార్థంబు లిత్తు పాత్రమ యేను గురులకుఁ గాఁగ నాకోరుకోర్కె
నీవ తీర్తని కృతనిశ్చయత్వంబున నరుగుదెంచినవాఁడ ననుడు నృపతి

ఆ. యట్ల కాక యేమి యర్థించి వచ్చితి, చెప్పు మనిన నతఁడు చిత్త మలర
ననఘ నీదుపత్ని యర్థిమై ధరియించు, కుండలంబు లని యతండు సెప్పె. 93

---

*దీనికిఁ బాఠాంతరము.—

"వ. అక్కట యెట్లయ్యెడునో యనుచుం బలికిన నమ్ముద్దియ భయంబు గొనుచు.
సీ. ఎఱుఁగ నిట్లగుట...మనుజాశిరక్తంపుఁదనువును గోరమీసముఁలును వృత్తలోచనములైన
ఆ. యుగ్రమూర్తితోడ నొక్క ఘోరాటవి, నెలమి నున్న యన్నరేంద్రుఁ గాంచె
ఘోరవికృతభయదఘూకవిరావమై, ప్రచురమైనకోపరాశి యనఁగ."

వ. చెప్పిన విని యమ్మనుజవరుం డొరులధనం బిచ్చువారలుం గలరె కుండలంబు లడుగఁ గొం డెద్దేనియు నడుగు మనుటయు నాసంయమి నీవు నెపం బిడి త్రోవం గలవాఁడవు గా వే నన్యవస్తువు లొల్ల నని పలికిన నాభూవల్లభుం డమ్మాట కియ్యకొని యన్నాతి యున్నచోటికిం జను మేఁ బుత్తెంచితి నని చెప్పి నీవాంఛితం బెఱింగింపు మని నియోగించిన నమ్ముని యద్దేవి యెచ్చోట నున్నయది యని యడిగిన నప్పుడమితేఁ డల్లదె తన్నివాసప్రదేశం బని చూపినం బోయి. 94

సీ. అద్దేవిఁ గని యతం డట్లు చెప్పిన మునివల్లభ నా కానవాలు దెమ్ము
నృపుపాల ననియె నన్నెలఁత యుదంకుండు సనుదెంచి విభు నభిజ్ఞాన మడిగె
నాతఁ డీగతి సేమ మగు నని నిష్ఠింపరా దిది వెలి గాఁగ లేదు వేఱ
గతియును ననుపలు కతివకు నాయచ్చు[1]వర్ణితాభిజ్ఞాననిర్ణయముగఁ
ఆ. జెప్పు మనిన సంతసిల్లి యమ్మదయంతి, కడకు నరిగి తత్ప్రకారమునన
పలుకుటయును భర్తపనుపున నిచ్చెదఁ, గుండలములు నీకు గురుహితార్థి. 95

వ. అని యక్కొమ్మ యమ్మహాత్మునితో మఱియును. 96

సీ. సురలు గంధర్వులు నురగులు నిక్కుండలములకుఁ బెక్కుపాయముల వేచి
తిరుగుదు రెంగిలి వారసిన నేమఱి నీవు నిద్రించిన నేల నిడిన
నపహరింతురు భక్తి నర్చించి యివి దాల్ప నాఁకలి నీరువట్టగ్నిభయము
విషవికారము భూతవేతాళ బాధలు వారయవు వినుము బాలురకు నైనఁ
ఆ. బెద్దవారి కైనఁ బెట్టిన నయ్యయి, కొలఁది నమరి యుండుఁ గురియుఁ బసిఁడి
వీని నప్రమత్తవృత్తిమైఁ గొని చను, మయ్య గురులు నిన్ను నభినుతింప. 97

ఉదంకుండు మదయంతివలనఁ గుండలంబులు పుచ్చుకొనుట

వ. అని చెప్పి యప్పరమపతివ్రత భక్తిప్రీతివినయంబులు మనంబున నంకురింప నుదంకునకు నక్కుండలంబు లొసంగినం బ్రమోదం బెసంగ నాశీర్వాదంబు సేసి యాసంయమివరుం డబ్భామచేత నామంత్రితుం డై భూమీశ్వరుపాలికి వికాసలసితవదనారవిందుం డగుచు నేతెంచి యక్కుండలలాభంబు ప్రకటించి దీవించి దేవా నీవలనం గృతార్థుండ నైతి నని పలికి నాకానవాలుగా నీవు సెప్పిన వాక్యం బత్యంతగూఢంబు దదభిప్రాయంబు నెఱుంగ వలతుం జెప్పం దగి యుండు నేనిం జెప్పు మని యడిగిన నతం డతనితోడ. 98

సీ. బ్రాహ్మణజనముల రాజులు పూజింతు రటు గాన యేను విప్రార్చనంబు
సేయుదు విప్రునిచేఁతన యిక్కట్టి వెడదప్పునన యొండు వెరవు నాకు
దురితంబు వాపంగ దొరకొన దది కారణముగ భూసురపూజనంబు దుష్క
రము దీన మేలు గందు మనంగ రా దిది గా దన్న వేఱొండు గలదె మార్గ

1 వర్ణితాభిజ్ఞన నిర్ణ.

తే. ముని యభిజ్ఞానముగ మదయంతి కపుడు, సెప్పి పుచ్చితి నిట్లు విశిష్టరత్న
మయమహాకుండలము లిచ్చి మాన్పుఁ గీడు, నీకతన ననుతలఁపున లోకవంద్య. 99

వ. అనియె నాభృగువంశవరేణ్యుని పుణ్యసన్నిధిం జేసి యాసౌదాసనరేంద్రునకు [1]సంప్రాప్తసమాధాననూతనసత్త్వంబు గలుగుటకతంబునం గార్యదర్శనంబును గుండలదానశ్రద్ధయు శాంతవచనంబునుం గలిగెఁ దదీయవచనశ్రవణానంతరంబ యుదంకుం డతనితో మిత్త్రత్వంబు సంభాషణమాత్రసిద్ధం బగుట బోధవృద్ధులు సెప్పుదు రేను నీకలనం గృతార్థుండ నైతిఁ బోవుచున్న వాఁడ మగిడి వచ్చెద నని పలికితి బొంకు వడకుండ వత్తు ననినఁ జిత్తంబు కృపాయత్తం బగుచుండ నాభూపతి యత్తాపసోత్తమునాననం బాలోకించి. 100

ఉ. చంపెడునట్టినాకడకు సంయమివల్లభ వత్తురయ్య నీ
పెంపును నిక్కముం దెలిసెఁ బ్రీతుఁడ నైతి మదార్తి నీతప
స్సంపదఁ జేసి పాపు మని [2]సంస్తుతిఁ బల్కిన వీనులందుఁ జే
రం బొలయం బ్రసన్నత వహింపఁగఁ జిత్త ముదంకుఁ డిట్లనున్. 101

ఉ. ఏమిట నైన నొప్పమి నరేంద్ర సుచిత్తులఁ బొందెనేనియుం
వే మరలుం భవద్గుణము వీతకళంకునిఁ జేసె నిన్ను సాం
ద్రామలకీర్తి గౌతమమహాముని సల్లనిచిత్తవృత్తి నీ
పై మలఁగించెఁ గావలయుఁ బార్థివసత్తమ పొందు మున్నటిన్. 102

క. అని పలికి మఱియుఁ బలుదీవన లిచ్చి యతండు గారవమున నతని మేల్
దనకరముల నివిరి ప్రియం, బొనర్చె నిర్దురితుఁ డైన యుర్వీపతియున్. 103

వ. భక్తివినయసంభరితుం డయి యప్పరమమునిం బ్రస్తుతించి నమస్కరించి యామంత్రణంబు సేసిన నమ్మహాత్ముండు గుండలంబులు కృష్ణాజినంబునం బదిలంబుగా ముడిచికొని గౌతమాశ్రమంబునకు రయంబునం బోయి పోయి పక్వఫలంబులం బెరిగిన బిల్వంబుం గని యాఁకటివెల్లునం దదీయవిటపంబున సకుండలం బగునయ్యజినంబు దగిల్చి యమ్మహీరుహం బెక్కి ఫలంబులు గోసికొనుచుండె. 104

సీ. గాలి నవ్విటపమూలోల మగుడుఁ దగు లెడలి యయ్యజినంబు పుడమిఁ బడినఁ
గని యొక్కనాగంబు గ్రక్కునఁ జనుదెంచి వెసఁబుచ్చికొని కడు వేగ పఱవఁ
గాంచి యుదంకుండు గ్రమ్మన దిగఁ దాఁటి వెనుకొనునంతకుఁ గనపుట్టఁ
జొచ్చె నయ్యురగ మాసువ్రతపరుఁడు దీవ్రముఖకాష్ఠముఁ గొని త్రవ్వఁ దొడఁగె
తే. దాని సైరింపఁ జాలక ధరణి తల రె, విప్రుఁడై వచ్చి గీర్వాణవిభుఁడు గొయ్య
కోలఁ ద్రవ్వినమాత్రఁ బాతాళయాన, మేల సిద్ధింప నేర్చు మునీంద్ర వినుము.

వ. పాతాళభువనం బిచ్చటికి సహస్రయోజనంబుల నున్నది కుండలంబులు గొని

1 సంప్రాప్తసమాధానమానసత్వంబు. 2 సమ్మతిఁ.

పోయినభుజంగం బైరావతాపత్యం బనిన విని యమ్మునిశిష్యుండు. 106

క. పాతాళంబున నున్నను, వే తెత్తుం గుండలములు విను మప్పని నా
చేతం గా కున్న నసు,వ్రాతము విడువంబడు నిది ధ్రువం బని పలికెన్. 107

చ. పలికిన సత్తపస్విదృఢభావ మెఱింగి సురేంద్రుం డొండువ
ల్కలపని నిల్పి కాష్ఠమునకుం గులిశంబునం గల్గువాఁడియుం
బలువును నిచ్చి వజ్రి సనె బాంధవ మేర్పడఁ జెప్పి భీతిమై
నిల దెరు విచ్చె నమ్మునియు నత్తెఱం జొచ్చె భుజంగలోకమున్. 108

వ. చొచ్చి యనేకప్రకారప్రాకారపరిరక్షితంబును బహురత్నదీప్తిజాలదేదీప్యమానం
బును నైనయమ్మహనీయలోకం బాలోకించి దశయోజనాయామంబునుం
బంచయోజనవిస్తారంబును నగుతద్ద్వారంబు గని యతండు కుండలాహరణంబు
దుర్లభం బనుతలంపున డిల్లపడియె నయ్యెడ నరుణవదనంబును నసితాంగంబును
సితవాలంబును నై వెలుంగుతురంగం బతని కిట్లనియె. 109

ఉ. ఆతత మైననాదగునపానము నూఁదు మొకింతయుం జాగు
ప్సాతురవృత్తి నీదుహృదయంబునఁ జొన్పకు లోకవంద్యుఁ డ
గ్గౌతమునాశ్రమంబున నఖండితభక్తి నుపాస్తి సేసి నన్
బ్రీతునిఁ జేసినాఁడవు పరిష్కృతపోధన యట్లు గావునన్. 110

వ. నీకుం బొడసూపిరైరావతసుతుం డపహరించినసముచితకుండలంబులు మగుడం
జేరెడునుపాయం బుపదేశించితి ననిన నుదంకుం డేను నిన్ను నెఱుంగ నుపా
సించుట యెట్లు గలిగెఁ దెలుపు మనుడు నయ్యశ్వం బతనితోడ భవద్గురునకు
గురుండం బావకుండ నీవు శుచి వయి సభక్తికంబుగా నిత్యంబును నన్ను
నియతిం బూజించి తత్తెఱం గెఱుంగవే యని పలికినం బ్రీతి నొంది యతండు
తదీయోపదిష్టప్రకారం బాచరించిన. 111

సీ. ఘోటకోత్తమరోమకూపంబులం దెల్ల నొక్కట ఘనధూమ ముద్గమించి
కవిసి పాతాళలోకం బంతయును గప్పె వాసుకిప్రభృతినివాసభూము
లుపరుద్ధభావంబు నొందె నైరావతావాసంబు హాహారవంబుతోడ
నాకులం బయ్యె న ట్లతిదారుణం బైన పెనుఁబొగ నెంతయు భీతి నొంది
ఆ. యమ్మునీంద్రుకడకు నహివరుల్ రయమున, వచ్చి భక్తి నర్చ లిచ్చి వినతు
లై తదీయకార్య మడిగి యెఱింగి వే, తెచ్చి కుండలంబు లిచ్చి రధిప. 112

ఉదంకుండు గుండలంబు లిచ్చి యహల్యను సంతోషపఱచుట

చ. అతఁడును వారిఁ బోఁ బనిచి యగ్నికి భక్తిం బ్రదక్షిణంబు సే
సి తగ నమస్కరించి విలసిల్లఁగఁ దేజము ప్రీతచిత్తుఁ డై
యతలము నిర్గమించి రయ మారఁగ వచ్చి యహల్యఁ గాంచి తె
చ్చితి నివె కుండలంబు లని చే నిడి భూస్థలిఁ జాఁగి మ్రొక్కినన్. 113

తే. ఆయవసరము గౌతముండు నత్యాదరమునఁ, గౌఁగిలించుచు దీవించి గారవింప
నతఁడు నమ్మునిపతికిని నయ్యహల్యకును, జెక్కుమోడ్పులు భక్తిమై మ్రొక్కి నిలిచి.

క. మీకరుణఁ గాక తగునెయ్యె, నీకుండలములు బరిగ్రహించుట నడుమన్
వైకృత మొలసినఁ దలఁగుట, నాకొలఁదియె యనియె వినయనమ్రుం డగుచున్.

వ. అనిన విని వార లత్యంతసంతుష్టాంతరంగు లై రగ్గౌతముం డతని కి ట్లనియె.

ఉ. నీచరితంబు చిత్రమహనీయము మిత్రసహక్షితీశ్వరున్
నీచతఁ బాప నాగ మపనీతము సేసినకుండలద్వయం
బాచతురత్వ మాబలిమి యాదృఢనిశ్చయ [1]మట్టు లొప్ప ధ
ర్మోచితలీలఁ దేర నొరుఁ డోపునె యేను నిజంబ పల్కితిన్. 117

వ. అనియె నయ్యుదంకుం డట్లు దనమహాతపంబుబలిమిం బరాక్రమించి యనన్య సులభంబు లగుకుండలంబు లాహరించి గురుజనమనోరథసిద్ధి గావించె నా భృగువంశమహత్తరుమహానుభావం బిట్టి దనిన విని జనమేజయుం డమ్మహాత్ము నకు వరం బొసంగి చనిన వాసుదేవునినంతరవృత్తాంతంబు మునిసత్తమా యెఱింగింపవే యని యడిగిన నవ్విభునకు వైశంపాయనుం డి ట్లనియె. 118

సీ. ఆభార్గవోత్తము నట్లు వీడ్కొని కృష్ణుఁ డరిగి యలంకృత మైననిజపు
రము సొచ్చునప్పుడు రైవతకాచలయాత్రామహోత్సవ మఖిలజనులుఁ
గొనియాడుచుండి యగ్గోవిందుసందర్శనంబున నుత్సవోన్మత్తభావ
మిమ్మడి యై ప్రమోదమ్మునం దేలి రద్దేవదేవుఁడు వసుదేవుఁ గాంచి

తే. దేవకీదేవి బలభద్రదేవుఁ దక్కఁ, గలుగువృద్ధబాంధవులను గని వినీతిఁ
దత్తదుచితమనోజ్ఞవిధానమంచి,తాచరణములు నడపెఁ బ్రియం బెలర్ప. 119

వ. వార లందఱకు ధర్మనందనుచెప్పినచొప్పునఁ బ్రణామాదియోగ్యోపచారంబు లాచరించె ననుజతనుజామాత్యభృత్యులు దన్నుం గనినం బ్రీతివాత్సల్య సంభావనాబహుమానంబులు మెఱయ నాదరించె సాత్యకిసుభద్రలం దగు కెలంకులం దగినవారలం గానిపించె నట్లు సకలజనప్రమోదాపాది యైనదా మోదరు నత్యంతసమీపాసీనుం జేసినొని వసుదేవుండు భారతరణప్రకారంబు యాతాయాతజనంబులచేత వింటిం బ్రస్ఫుటంబుగా వినవలతుం జెప్పవే యని యడిగిన నచ్యుతుం డతని కి ట్లనియె. 120

క. అది యతివిస్తారము పెక్కుదినంబులు సెప్పఁ బట్టుఁ గొంత దగం జె
ప్పెద నేఁ బ్రధానపురుషస,ముదయసమరవిధము లఘుతరోక్తులఁ దెలియన్. 121

సీ. కౌరవసైన్య మేకాదశాక్షౌహిణీకలితంబు దానికిఁ గట్టె వీర
పట్టంబు భీష్ముఁ డాప్రభువున కెదు రొడ్డి రెలమిమైఁ బాండుపుత్త్రులు శిఖండి
నక్కడ సప్తసంఖ్యాక్షౌహిణీక మనీక మిమ్మాడ్కిఁ బన్నినబలద్వ
యంబును ఖేచరు లచ్చెరువడఁ బోరెఁ గాండీవి దోడ్పడఁ గా శిఖండి

---

1 మట్టు సూపి ధ,ర్మోచితలీల.

తే. యస్వసేనందనునిఁ బడియప్రసేనంబు,నందుఁ గూలిచె నుత్తరాయణమువచ్చు
నంతకును మృతిఁబొందక యాతఁ డుండె, నధిప శరతల్పమునఁ గడునద్భుతముగ.

క. గురుఁ డైదుదివసములు ని, ర్భరసమర మొనర్చి నతనిఁ బరిమార్చెఁగ నా
వెరవున నర్జును ప్రాపున, దొరకొనియె హలాస్త్రభవుఁడు ద్రుపదసుతులకున్.

క. గండున రాధాతనయుఁడు, రెండుదినంబులు పెనంగి గ్రీష్మసమయసూ
ర్యుండుంబోలె వెలింగెడు, గాండీవధరుశరకరోష్మఁ గ్రాఁగె నరేంద్రా. 124

చ. విను మఱునాఁడు శల్యుఁ డతివిక్రమతన్ సమరం బొనర్చి య
ద్దినము సగంబు సెల్లఁగ యుధిష్ఠిరుచేఁ దెగుడున్ బలంబు నై
కొని యని సేయఁగా శకునిఁ గూల్చె వడిన్ సహదేవుఁ డంతతో
మనమునఁ జేవ దక్కి తనమానము డిగ్గఁగఁ ద్రావి హీనుఁ డై. 125

వ. దుర్యోధనుండు దనతమ్ముల భీమసేనుండు సంగ్రామంబునం దెగటార్చి యుండ భంగంబున కోర్చి పలపలనిమూఁక విడిచి గద చేతం గొని పాదచారి యయి యొక్కండును బాఱి యొక్క మడువు సొచ్చి నీళ్లు (పాషాణమయముగా) మంత్రించికొని డాఁగి యుండెఁ బాండవు లెఱింగి పోయి పొడవికొని మర్మభేదంబు లగుదూషణభాషణంబుల నొప్పించిన. 126

ఆ. అతఁడు మడువు వెడలి యనిలనందనుతోడఁ, దగఁ బెనంగి తద్గదావినిహతిఁ
దొడలువిఱిగి కూలి విడిచెఁ బ్రాణంబు లి,ట్లంగి జయముగొనిరి పాండుసుతులు.

క. గురుసుతుఁడు పాండుతనయశి,బిర మారే యడరి పొడివి భీషణవృత్తిం
బొరిగొనియెం గరిఘోటక, నరనిచయము నెల్ల నే మనం గల దధిపా. 128

వ. ఆరాత్రి యేనును బాండుసుతులు నచ్చట లేమి నంత పుట్టెనిట్లు పదునెనిమిదిదివసంబులు సెల్లిన సంగ్రామంబున నే మార్వురము సాత్యకియును దక్క మా దిక్కున సమస్తజనంబులు నస్తమించిరి కౌరవులదెస నశ్వత్థామకృపకృతవర్ములు మువ్వురు బ్రదికిరి యుయుత్సుండు మున్న పాండవుల నాశ్రయించుటం జేసి చావునకుం దప్పె నిది భారతరణప్రకారంబు. 129

క. అని చెప్పెఁ గాని యభిమ,న్యునిచావేర్పడఁగఁ జెప్ప నొల్లఁడ వసుదే
వునకు వగ మిగులుటకు నె,మ్మనమునఁ దా నోర్వ కునికి మాధవుఁ డధిపా. 130

వ. దాని నెఱింగి సుభద్ర గద్గదస్వరంబున గోవిందునితోడ నీయల్లుండభిమన్యుండు దెగుట మీతండ్రికిం జెవులారం జెప్పు మన్నాయని వసుదేవుండు వినం బలుకుచుం బుడమిం బడిన వసుదేవాదియాదవజనంబులు మనంబులం గదిరినక్రొత్తనెవ్వగలం బలవించినం బద్మనాభుండు వారలనెల్ల నూరార్చి వారణపురంబున సుభద్రయు నుత్తరయు నభిమన్యునిదెసనెత్తినశోకంబున నాకులత్వంబు నొందిన చందంబును గొంతి దగుమాటల వారిఁ దేర్చినతెఱంగును నెఱింగించి పాండవులేవురును వేర్వేఱయభిమన్యునకై మణికాంచనగవాదివస్తువులు విప్రప్రకరంబుల

కొసంగుటయు మఱియుం దటాకకరణాదిధర్మంబు లాచరింపుటయునుం జెప్పి
మఱియు దురంబునం దెరలక మరలక యాసౌభద్రుండు రౌద్రమూర్తియై
దుర్యోధనద్రోణకృపద్రౌణికృతవర్మకర్ణాదివీరవ్రాతంబుఁ గలంచి యనేకనృప
లోకంబును జములోకంబున కనిచి యనిమిషులు వొగడ నుత్తమలోకంబున కరిగి
సుఖస్థుఁడై యున్నవాఁడు వానికి వగవ నేల యనియుం బలికి యిట్లు ప్రశాంతిగావించి.

ఆ. బాంధవలోకమునకుఁ బరమప్రియంబైన, యుచితవర్తనమున నుండెఁ గృష్ణుఁ
డని సవిస్తరంబు లగువాక్యములఁ బ్రీతి, చిగురులొత్త నిట్లు సెప్పి మఱియు.

వ. కరిపురంబునం బుట్టినవిశేషంబులు విను మని పలికి వైశంపాయనుండు జనమే
జయున కిట్లనియె. 133

### వ్యాసుఁడు పాండవుల నశ్వమేధయాగోన్ముఖులఁ జేయుట

సీ. చుఱచుఱఁ దనచెవుల్ సూఁడినయట్లుగ నభిమన్యుసంస్తుతి యైనవాక్య
యము ప్రసంగాధీనమై బంధుజనులందుఁ బొడముటయును ధృతియొడలి తలరి
యుత్తర విలపింప నత్తన్వియలమట గనుఁగొని పాండునందనులు వనట
గూరిన నచటికిఁ గారుణ్యమూర్తి వేదవ్యాసుఁ డేతెంచి తగినమాట

తే. లాడి వారలవగ మాన్చియశ్వమేధ,విషయవిధులు ప్రసంగించి వేగ తొడఁగుఁ
డని నియోగించి వారెల్ల నట్లకాక, యనిన నాతఁ డంతర్హితుం డయ్యె నధిప.

క. అన విని జనమేజయుఁ డమ్ముని యిట్లు హితోపదేశముం జేసినఁ బాం
డునృపాగ్రతనయుఁ డెమ్మెయి, ననఘ తొడఁగె నశ్వమేధయాగంబునకున్. 135

క. అని యడిగిన వైశంపా,యనుఁ డాతని కిట్టు లనియె నప్పుడు కుంతీ
తనయాగ్రజుండు దమ్ములఁ, గనుఁగొని యుత్సాహలక్ష్మి గనుఁగవ నొప్పన్. 136

సీ. వ్యాసమహాముని వత్సలత్వంబున నానతి యిచ్చిన మాననీయ
వాక్యంబు వింటిరె వసుధ యిత్తఱి వసుహీనయై యున్నది దానఁ జేసి
భూదేవనిహితధనాదాన మావశ్యకం బయ్యె దానిశక్యత్వమును హి
మాచలయాత్రాసమాచరణప్రకారమును విచారణీయములు గావె

ఆ. యనుడుఁ బవనతనయుఁ డతనితో నీశ్వరుఁ, బరమనియతిఁ గొలిచి కరుణవడసి
ప్రమథగణము నెల్ల భక్తిఁ బూజించి య,త్తలమునందు భూతబలులు లొనర్చి.

క. తెత్తము గాక నరేంద్ర మ,రుత్తకలిత మైనదానరూపము సుమహా
ద్రాత్తస్థితి నున్నకనక, మిత్తఱి నిల దెసఁ దలంప నేటికి మనకున్. 138

వ. అప్పనికి సముచితసైన్యసమేతంబుగా దేవరవిజయం చేయవలయు ననిన నర్జును
డును గవలును నట్ల పలికిరి దానికి ధర్మనందనుండు ప్రియంబంది కృతనిశ్చయుం
డయి ధృతరాష్ట్రుకడకుం జని యశ్వమేధయాగోపక్రమోత్సవశ్రవణంబునం
బుత్రులందలంచి శోకసంతాపసమాక్రాంతుం డయి యున్న యన్నరపతిచరణంబుల

కెఱంగి వేదవ్యాసువచనంబులు గాంధారియు వినుచుండ నతనికిం జెప్పి యతని
చేత నయ్యజ్ఞాచరణంబునకు ననుజ్ఞ వడసి యయ్యిరువురకు దండప్రణామపూ
ర్వకంబుగా వీడ్కొని గొంతిపాలికిం బోయి సంతోషవికచవదన యయియున్న
యద్దేవి యధ్వరవిధానంబునకు ననుమతిసేయం దదీయపాదంబులకుం బ్రణ
మిల్లి తదామంత్రితుండై యాస్థానమండపంబునకు నరుగుదెంచి యుయుత్సు
రావించి కార్యంబు తెఱం గెఱింగించి నీవు నగరరక్షకై నిలువు మని నెయ్యం
బలర విదురసమేతంబుగా నిలిపి బలంబులసంఘటింపం బడవాళ్ళం బనిచి నియతుం
డయి సురపితృపూజనంబులు దీర్చి మహేంద్రార్చనం బొనర్చి మహితా
వధానుం డై. 139

క. నానావిధబహుళాంచిత, దానము లొనరించి యర్చితం బగునగ్నిన్
దానియధికారి ధౌమ్యుం, డాను బ్రదక్షిణవిధాయితం గొలిచి తగన్. 140

క. సితలేపనసితభూషణ, సితమాల్యసితాంబరములఁ జెన్నుగ సమలం
కృతుఁ డై సితాతపత్ర, ప్రతతి మెఱయఁ బూర్ణచంద్రుపగిది వెలుఁగుచున్. 141

వ. షోడశశ్వే[1]తాశ్వవ్యూఢరథారూఢుం డై. 142

క. భూదైవతదత్తాశీ, ర్వాదంబులుఁ బుణ్యగానరవములు రోదో
మేదురమంగళతూర్యని, నాదంబులుఁ జెలఁగ బుధజనస్తుతు లెసఁగన్. 143

చ. వెడలుడు నమ్మహీవిభుని వేడ్క యెఱింగి వృకోదరుండుఁ గ
వ్వాడియును బిన్నతమ్ములును వైభవ మొప్ప నలంకరించి యొ
క్కుడు మెఱయం బ్రధానభటఘోటకదంతిరథప్రతానముల్
దడిగలుఁ గుంచెలున్ గొడుగుతండములున్ విలసిల్ల వచ్చినన్. 144

క. కని యానృపుఁ డలఁతినగవు, నిను పారెడుచూడ్కి వారినెమ్మొగములపైఁ
దనుపారుచుఁ బొలయం జనఁ, జన రాజులు గూడుకొనిరి సైన్యంబులతోన్.

వ. ఇవ్విధంబున నరిగి యక్కురువంశవరుండు సముచితప్రయాణంబుల గిరిసరిదర
ణ్యంబులు గడచి హిమశైలంబుసేరి ధౌమ్యాదిపురోహితులఁ బురస్కరించికొని
తదీయతలం బధిష్ఠించి యొక్కయుచితప్రదేశంబున విడిసె నట్టియెడ. 146

వ్యాసుఁడు హిమవత్పర్వతంబున నున్న పాండవులకడకు వచ్చుట

శా. బాలార్కద్యుతిపుంజపింజరజటాభారంబుఁ బ్రావృడ్ఘన
శ్రీలీలం బ్రహసించునంగమును రోచిస్స్ఫారదండంబు ను
న్మీలన్నీలమృగాజినాంబరము నై నిర్వాణదానక్రియా
శీలుం డైనపరాశరాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁ డై. 147

వ. ఇట్లు సన్నిహితుం డయినవేదవ్యాసమునీశ్వరునిఁ బాండవులు పరమభక్తిం
బ్రణామపూర్వకంబుగాఁ బూజించి కర్తవ్యం బెయ్యది యానతిం డనిన నమ్మాన

1 తాశ్వంబులం బూన్చినరథంబున నారూఢుం డై.

నీయుం డెల్లి మీ రెల్లవారును ద్రష్టలై పూజలు సల్పింపవలయు నేఁటిరాత్రి
నియతులై దర్భసంస్తరణంబుల శయనించునది యని నియోగించిన. 148

ఆ. రమ్యమైనచప్పరంబుల దర్భసంస్తరణములను యోగసదనమునఁ బ్ర
భాసమానము లగుపంచాగ్నులును బోలె, నమ్మహాత్ము లుండి రధిపముఖ్య. 149

వ. అట్లుండి యవనీసురాశీర్వాదంబుల నాచరించుచు నారేయి గడపి కల్యంబగు
టయుం గాలోచితకరణీయంబులు నిర్వర్తించి సర్వక్రియాకలాపనిర్వహణధుర్యుం
డగు పారాశర్యుండు ననుప ధౌమ్యప్రముఖపురోహితసహాయమహనీయసమా
చారు లగుపాండవేయులు పరమస్థండిలంబునం బార్వతీపతి నావహించియుత్కృ
ష్టంబులును బహుళంబులు నగుగంధపుష్పధూపదీపంబులం బూజించి సముచిత
మనోహరిభూరిపాయసాది [1]భవ్యద్రవ్యభారమహోదారం బగు నైవేద్యంబు
సమర్పించి వేఱువేఱ ప్రధానప్రమథులకుఁ దద్గణంబులకు నర్చ లిచ్చి
కుబేరమాణిభద్రప్రభృతిభూతయక్షజనంబులను సభక్తికావాహనకలితులం
గావించి పూజనంబు లాచరించి. 150

క. రక్షాకరమంత్రకలన, దక్షాత్మకులైనయట్టి ధౌమ్యముఖోదా
త్తక్షోణీసురులు సేరయ, నక్షయపుణ్యుఁ డగుకౌరవాధిపుఁ డెలమిన్. 151

క. అనుజులుఁ దానుఁ బరాశర, తనయపురస్సరముగా నిధానస్థలికిం
జని యరుణగంధకుసుమము, లను మాంసాపూపములను లాజములుఁ దగన్.

ఆ. భూతతృప్తిఁ జేసి భూరిబలాఢ్యులఁ, బరిజనములఁ ద్రవ్వఁ బనుచుటయును
నతికుతూహలమున నార్చి వారలు ద్రవ్వి, రన్నిధానదేశ మధిపముఖ్య. 153

క. త్రవ్వినఁ బ్రభ లెల్ల దెసల, నివ్వటిలఁగ వెలుఁగుచుండె నిధి యనిలజాఁడుం
గవ్వడియుఁ గవలు నలరఁగ, నవ్వసుధాధిపుఁడు దాని కర్చన లిచ్చెన్. 154

వ. అట్లు వివిధవిద్యానిధి యగువేదవ్యాసుండు సన్నిధి సేసి సాధించినధర్మనందనుం
డాపరాశరనందనుపాదంబులకు దండప్రణామంబు సేసి నిలిచి కేలు మొగిడ్చి
ఫాలతలంబునం గదియించి వినయావనతుం డై యున్న నన్నరేంద్రు నమ్ము
నీంద్రుం డాలింగనాశీర్వాదంబుల నాదరించి యామంత్రణంబు సేసి యంతర్హితుం
డయ్యె నమ్మానవనాథుండు. 155

సీ. శకటఖరోష్ట్రఘోటకకుంజరంబు లనేకసహస్రంబు లెలమి సంఘ
టించి భారంబు లెత్తించి భారవహత్వదక్షజనుల్ పెక్కు లక్షలర్థిఁ
గదిసి యే నే నని కడఁగి మోవఁగ యాగనిలయంబుఁ గలయఁ గల శమను
నలఁకులు గాఁగులు నాదిగాఁ గలభాండములును బీఠములు శయ్యలును బోళ్లు
తే. రోఁకళులుఁ జట్టువంబులు స్రుక్స్రువాజ్య, పాత్రదండకమండలు [2]దాత్రములును
లోనుగాఁ గల్గువస్తువుల్ శుద్ధహేమమయము లొక్కట నడపించె మనుజనాథ.

1 భవ్యద్రవ్యభారమహోదాత్తంబగు. 2 వేత్రములును, నిఖిలం బోనుగాఁగలిగినయుద్ధహేమ.

చ. మఱియును సన్నిధిం గలసమంచితకాంచనరాశి బండులం
బెఱికల మోపులం గొలఁది పెట్టఁగఁ జెక్కగు బారువుల్ జనుల్
వెఱఁగుపడంగ భేసరులు పెక్కుగ మందఁగ శత్రుకోటికిన్
వెఱ పొనరించువార్త పృథివిం బరఁగన్ నడపించె భూవరా. 157

ఆ. పరు నేలకొలఁది నెడనెడ విడియుచుఁ, బోవ వలసియుండె భూరిభార
వహులఁ దప్పి యొఱుఁగు వాఁ డగునాధర్మ, నందనునకు ధరణీనాథవర్య. 158

వ. అంత నక్కడఁ గృష్ణుండు. 159

తే. ద్వారకానగరమునకుఁ దన్నుఁ బుచ్చు, నపుడు ధర్మజుఁ డశ్వమేధాధ్వరంబు
సమయమగుటఁ బ్రతిష్ఠించి సకలబంధు,యుక్తముగ రమ్మనిన మధురోక్తి యాఁది.

కృష్ణుండు సకలబంధుసహితుం డై కరినగరంబునకు వచ్చుట

వ. అరసికొనియుండి యప్పాండవాగ్రజుండు యాగంబున కుద్యోగంబు సేయుట చారులు సెప్ప నాకర్ణించి కుతూహలోన్నిద్రుం డై బలభద్రసాత్యకికృతవర్మ ప్రద్యుమ్నచారుదేష్ణసాంబాదియాదవసమేతంబుగా వసుదేవదేవకీసమనుజ్ఞాతుం డై సుభద్రం దోడ్కొని కరినగరంబున కరుగుదెంచిన ధృతరాష్ట్రుండును గాంధారియు గొంతియుం బనుప నుత్సుకుండై యుయుత్సుండు విదురుం బురస్కరించికొని యప్పాంచజన్యధరు నెదుర్కొని పరమభక్తిం దోడ్కొని వచ్చిన.

తే. మున్ను ధృతరాష్ట్రుకడకు నా వెన్నుఁ డేఁగి
యతని గాంధారిఁ బ్రణతిపూర్వాతిమధుర
వాక్యములఁ బ్రీతి నొందించి వచ్చి గొంతిఁ
గాంచి ప్రణమిల్ల నద్దేవి కౌఁగిలించి. 162

వ. పెక్కుభంగుల దీవించె బలదేవాదులుం దగిన తెఱంగున నప్పాండురాజమహిషిం గని రక్కులపాలికాతిలకంబుపులకలంబులం బెడఁగిన మేనితో మాననీయచరిత్రం డగునద్దేవకీపుత్త్రు సంభావించి. 163

క. ప్రమద మెసఁగ విదురుఁ బనిచి, సముచిత మగునర్చనంబు సంకర్షణపూ
ర్వము గాఁగ నడపి యదునిక,రమునర్చలు సంభృతాదరంబున నడపెన్. 164

వ. సుభద్ర దన్నుం గనినం బరమప్రియంబున గారవించి యభ్యంతరమందిరంబునకుం బుచ్చెఁ బద్మనాభప్రభృతు లగునాబంధుజనంబు నెల్లను నగరిచేరువ శోభిల్లు మందిరంబుల విడియింప యుయుత్సు నియోగించె న ట్లయ్యుందఱు నభినందితు లై యున్నసమయంబున. 165

ఉ. ఉత్తరపుణ్యగర్భమున నుండి భవజ్జనకుండు పూరువం
శోత్తరుఁ డాదిరాజగుణయోగి పరిక్షితుఁ డుద్భవించినం
జిత్త మెలర్పఁ బుత్త్రుఁ డని చెప్పిరి వెల్పలివారి కేంటిలో
నత్తఱి నున్న వృద్ధసతు లార్చె జనం బఖిలంబు నుబ్బునన్. 166

క. బాలుఁడు మృతజాతుం డని, యాలోచన యేడ్పు బెరయ నలమట నచ్చో
నాలలన లుగ్గడించిన, దేలిరి శోకమున జనులు ధీరవిచారా. 167

వ. అత్తఱి రోదనధ్వనులు గలయం జెలంగిన విషాదవేదనాయత్తంబు లయిన చిత్తాంగంబుతో శౌరి సాత్యకి యనుగమనంబు సేయ సత్వరంబుగా గొంతియు న్నేడకుం జనుదెంచె నప్పు డాకుంతిభోజనందనయు ద్రౌపదియు సుభద్రయు నార్తనాదంబు లెసంగం దనకడకు రయంబున రా నెదుర నయ్యదువీరుండు గాంచి శోకసమాకులమానసుం డయ్యె నప్పాండురాజపత్ని పురుషోత్తముతో డగ్గుత్తిక నెలుంగు దగుల ని ట్లనియె. 168

పరిక్షిత్ప్రాణదానంబునకై కుంతీసుభద్రలు కృష్ణుఁ బ్రార్థించుట

క. గతి నీవు నాకు మత్సం,తతికిని నీయల్లుఁగుఱ్ఱతనయుఁడు పుట్టెన్
మృతుఁ డై క్రూరుం డగుగురు, సుతునియిషీకాస్త్రవహ్నిఁ జూఁడినకతనన్. 169

సీ. దేవకీపుత్త్ర సంజీవితుఁ జేయవే యబ్బాలునద్దారుణాస్త్రసంప్ర
యోగంబునపుడు కృపాగరిష్ఠుండ వై చేసితి ప్రతిన గాచెద నవశ్య
మును నుత్తరాగర్భజనితు నే నని బాలుఁ బ్రదుకుతో డిద నాదుబ్రతుకు ద్రుపద
తనయాసుభద్రలు ధర్మజుం డనుజు లా శిశువు సంజీవితుఁ జేయ కున్న

ఆ. బ్రదుక రన్వయమున కుదకపిండప్రదానంబు లెడలు మత్స్యనందనయును
నూఱడింపఁ బడియె నొకనాఁడు నీచేత, దానియార్తి గరుణఁ దలఁగవయ్య.

వ. దేవా నీ విక్కులంబు గలిగించినవాఁడ వింకను నీవ వీని బ్రదికింపవే యని పల్కుచుం బుడమిం బడిన గొంతి నగ్గోవిందుం డనునయవచనంబుల నూరార్చి యెత్తె నట్టియెడ సుభద్ర యమ్మహాత్మునితో ని ట్లనియె. 171

క. గురుసుతుఁడు భీమునకునై, పరమాస్త్రం బెత్తె దానిఫల మందంగా
నరుఁడును దత్పత్నియుఁ గాం,చిరి తుది నే నీకు నేమి సెప్పుదుఁ బ్రభువా. 172

క. నీమఱఁది యాకొడుకుపైఁ, బ్రేమం బెప్పుడును బెంపఁ బ్రేలెడి మనుమం
డీమెయి నమ్మయిపోయిన, నేమి యగునొ యెఱుఁగ నీవ యెఱుఁగుదు దీనిన్.

సీ. ధర్మజుం డిమ్మెయి [1]ధరియించు నెవ్వగ పవననందనుఁడును గవలు నేమి
వెరవున నుపశమింతురు దీని విను దేవయస్త్రప్రయోగంబునపుడు నీవు
గురుసుతు నదలించి కుచ్చిత నిన్ను మోఘాస్త్రునిఁ జేసెద నంటి దాన
నూఱడి యుండుదు ముజ్జ్వలతేజ నీ మహితానుభావత మాకు నెల్లఁ

ఆ. దెలిసియుండుఁ గాన [2]యులుకము సత్యద,యాశ్రితాభిరతుఁ లనఘ నీకు
నైజములు శిరఃప్రణతి నేను వేఁడెదఁ, గరుణ నిక్కులంబు గాచికొనుము. 174

తే. ఏవిధంబునఁ గోలుపో నీవు నీవు, పాండవుల నీదుసన్నిధిఁ బాపకర్మ
శీలుఁ డై నయశ్వత్థామ గోలుపుచ్చె, కాని నేమనఁ గలదు దుర్వారతేజ. 175

---

1 దరియించు 3 యలుకము.

వ. అని వెండియు. 176

చ. భువనము లొక్కపెట్ట మృతిఁ బొందిన జీవము లావహింప నే
ర్తు వలచినట్టు లైన గుణరూఢుఁడు మేనమఱందిపౌత్రుఁ జా
వ విడుతె వంతపెంపున నవారణ నీయెదురం బ్రలాపముల్
వివిధము లే మొనర్చితిమి వెట్టుల మై యిటు భక్తవత్సలా. 177

తే. అనినఁ గృపయును శోకంబు నగ్గలింప, వనజనాభుండు జను లర్థి వినఁగఁ బిన్న
వాని బ్రదికింతు వగవంగ వలవ దనియె, నెలుఁగు జలదస్వనమ్మున గ్లొసక మెసఁగ.

వ. ఎల్లవారును బ్రమోదంబు నొంద నట్లు పలికి సూతికాగృహంబునకుం గుంతీ
ప్రభృతులు దోడ రా నతండు వోవునప్పు డది ధవళకుసుమసితసర్షపలాజపూర్ణ
కుంభప్రముఖమంగళవస్తువులను బ్రజ్వలితపావకప్రదీప్త శస్త్రపిచుమందపల్లవాది
భూతపరిహారకపదార్థంబులను జతురవృద్ధాంగనాచికిత్సకదక్షపరిచారికాముఖ్య
హితకారిపరివారజన ప్రవర్తనంబులను బరిశోభితం బయి యుండె నమ్మందిరం
బాగోవిందుండు ప్రవేశించె నట్టియెడ నంతకు మున్న. 179

సీ. కడచి ద్రౌపది సని యడలునఁ బడియున్న మాత్స్యనందనతోడ మాధవుండు
సనుదెంచె వీఁడె సవినయంబుగాఁ గను మనవుడు నుత్థిత యై వికీర్ణ
వేణీభరంబుతో వినతి యొనర్చి భక్త్యార్తి వాపుట నీకు నతిదృఢవ్ర
తంబు కదే దేవ దయ వెలయంగ నీశిశువు సంజీవితుఁ జేయ వయ్య

తే. [1]నీవు గూర్తేని మేనల్లునికిఁ దదీయ,పుత్త్రు ద్రోణునిపుత్త్రుండు, బొలియఁ జేయు
వాఁడె పతిహీన యగుపాపవతికిఁ బుత్త్రు, హీనతయును బాటిల్లిన నెట్లు బ్రదుకు.

ఉ. నందనుచావు నిక్కమయినం జను టప్పుడ కల్గు దేవకీ
నందన యెల్లభంగి నరనందనుపాలికి నాజి కేచి పో
వం [2]దనతోడి తెంపునకు వారక యిచ్చినబాస దప్పె నిం
కం దనుఁ గన్న దెప్పు నొడికాఁ డని కొంకెడఁ గాని యచ్యుతా. 181

తే. పద్మనాభుండు వచ్చిన బాలుఁ జంకఁ, బెట్టికొనిపోయి మ్రొక్కింతుఁ బ్రీతి యెసఁగ
నని తలంచుచు నుండితి నమ్మనోరథంబు విఫలంబుగాఁ జేసె ద్రౌణి పేర్చి. 182

వ. అని యంత నిలువనివలవంతపెంపున బాలశవంబు నెత్తికొని యంకతలంబున
నిడికొని తదాననం బాలోకించి. 183

ఆ. తాత లోకగురుఁడు దామోదరుఁడు వచ్చి,యుండ లేచి మ్రొక్కవుజ్జ్వలాంగ
ధర్మవేది యైనతండ్రికిఁ బుట్టి య,ధర్మపరుఁడ వగుట తగునె నీకు. 184

క. కను విచ్చి గొంతిఁ జూడుము, ననుఁ జూడుము ద్రుపదనృపతనయఁ జూడుము నీ
జనకునితల్లి సుభద్రం, దనయా చూడు తల యెత్తి దరహాసముతోన్. 185

చ. అని పలవించి యాసపసిజానన మూర్ఛ మునింగి నేల వ్రా

---

1 నీవు గూర్తు నీమేనల్లు. 2 దనతోడిపెంపునకు.

లినఁ గరుణాంబుపెంపున విలసితంబొందుమనంబులుఁ సబా
ష్పనయనయుగ్మకంబులును బాడఱుమోములు నైనకౌరవాం
గనలయలంతఁ గాంచిన వగల్ మిగులుం బగవారి కేనియున్, 186

వ. ఒక్కింతసేపునకుం దెలివొంది విరాటనందన ధరాతలంబునం బడి యున్నభంగిన ఫాలతలంబునం గేలు మోగిచి గోపాలదేవునకు మ్రొక్కుచు వెక్కుచు శరణు శర ణని పలికిన నప్పరమకృపాకరుం డోడ కోడకు మనుచుం బాదప్రక్షాళనోప స్పర్శనంబు లాచరించి యశ్వత్థామప్రయుక్తంబును బ్రహ్మశిరోనామకంబును నగు నమ్మహాస్త్రం బుపసంహరించి యబ్బాలశవంబు శయ్యాతలంబునం బెట్టం బనిచి వరోల్లసితు లైన యొల్లవారలం గలయం గనుంగొని. 187

కృష్ణుండు మృతజాతుం డైనపరిక్షితు లబ్ధజీవితుం జేయుట

తే. మీఁదఁబొంకకుమాటయేమీరు వినఁగ,నాఁడ నిబ్బాలు బ్రదికింతుఁజూఁడుఁడఖిల
జనులు నిప్పుడ తేలుండు సంతసమున, దీని విని పాండవులు ప్రీతినూనువారు.

వ. అని ప్రతిజ్ఞ సేసి యిట్లనియె. 189

తే. పగఱయెడ నైన నేబొంకు వలుక నేని, సమరముఖమున నెన్నఁడుఁ జలితవృత్తిఁ
బిఱుఁది కడు గిడ నేని యిప్పిన్నవాని, యంగమున జీవ మీ ప్రొద్ద యావహిల్లు.

క. ధరణీసురకులమునెడం, గరమెక్కుడు ప్రియము నాకుఁ గలదేని సధ
ర్మరతుఁడనయేని నిక్కువ, త్తరాసుతుఁడు లబ్ధజీవితత్వము నొందున్. 191

క. నరునియెడ నామనంబున, విరోధ మెన్నఁడును నేమివిధమున నైనం
బొరయమి నిజమేనియు సుస్థిరముగ నిబ్బాలుమేన జీవము సెందున్. 192

క. నిక్కపుధర్మువునన యే, నక్కంసాదుల వధించుటారసి చూడన్
నిక్కువమై యార్యజనుల, కెక్కెనయేని నసువర్గ మీశిశువు గనున్. 193

తే. మహితసత్యంబుఁ బరమధర్మంబు గాఢ, నిర్మలబ్రహ్మచర్యంబు నిత్యసుప్ర
తిష్ఠితంబు లై నాయందుఁ దేజరిల్లు, నేని నిబ్బాలునకు జీవ మిపుడవచ్చు. 194

వ. అని యిట్లప్పురుషోత్తముండు వలికిన. 195

సీ. బాలునిమేనికిఁ బ్రాణముల్ వచ్చిన నల్లన కదలెఁ దండగకములు
మఱి కను విచ్చె నత్తెఱఁగు దెల్లంబుగాఁ గని గొంతి మొద లైన కౌరవాంగ
నలు మనంబులు నిండి [1]యలువులఁబాఱెడు నానందపూరంబు లనఁగఁ బొల్చు
హర్షబాష్పములు రోమాంచకంచుకితదేహంబులునై యలరార నఖిల

తే. జనసమూహమ్ములును సంతసమునఁ దేల, గగనమునదివ్యవాణియక్కమలనాభుఁ
బొగడె మీతండ్రియున్నయప్పుణ్యగృహము,గరముశోభిల్లెనప్పుడు కౌరవేంద్ర.

ఉ. ఉత్తర బిడ్డ నెత్తికొని యొయ్యన మోము మలరంగ వచ్చి [2]య
త్యుత్తమతేజుఁ డైనపురుషోత్తము నంఘ్రులపొంత భూస్థలిం

1 యలవుల దిగఁబాఱు నానంద. 2 య, య్యుత్తమ తేజుఁ డైనపురుషోత్తము.

జి_త్త మెలర్పఁగాఁ దనదుచెన్నగుఫాలము [1]సేర్చినట్టి ముదా
య_త్తమనస్కుఁ డై యతఁడు సాదరభాషల గారవించుచున్. 197

క. వినుతబహురత్నవిస్ఫుర, దనేకభూషణనికాయ మర్చ్యాలున కి
చ్చినఁ దక్కటియదుపీరులు, జననాయక యొఱఁగి కక్కజం [2]బగుతోడవుల్. 198

వ. అప్పుడు. 199

తే. ఆత్మకులము పరిక్షీణమైన జనన, మొందెఁ గాన యియ్యభిమన్యునందనునకు
నర్థమగుఁ బరిక్షిన్నామ మనియెఁ గృష్ణుఁడఖిలజనములు వినఁ గౌరవాధినాథ.

వ. అట్లు పుండరీకాక్షుండు పాండవసంతానంబు గలిగించె న ట్లప్పరమపురుషు
చేతం బ్రత్యుజ్జీవితుం డైన భవజ్జనకుం దేథమాసవయస్కుం డగుకొలంది
నొక్కపుణ్యదివసంబున. 201

సీ. ధర్మసుతుండును దమ్ములు నమ్మహాకనక మ ఖ్లిప్తించికొని యుదా_త్త
వైభవ మెసఁగంగ వచ్చినఁ గృష్ణనియు_క్తు లై విదురయుయుత్సు లర్థిఁ
గస్తూరినీళ్లల కలయంపులను గప్పురంపుమ్రుగ్గుల బహురత్నతోర
ణములఁ దోరపుముత్తియముల నొనర్చిన ప్రాలంబమాలికాపంక్తులను బ

తే. సిండిపూర్ణకుంభముల విశిష్టమరక,తప్రకరమయకదళీకా_స్తంభములను
గరము దోరంబుఁ జిత్రరేఖంబుఁ గా నలంకరించిరి పురముఁ గులప్రదీప. 202

వ. సకలజనంబులుం గయిసేసి కలయం బొరయ నవు డప్పురంబు చంద్రోదయ
ఘూర్ణమానం బయినయర్ణవంబు ననుకరించె నయ్యచ్యుతుండును బలదేవ
సాత్యకి ప్రద్యుమ్నప్రముఖులు ప్రమోదంబునం బొంపిరివోవుచుం బెంపారు
నలంకారంబుల నభినవోదారచారుత్వంబు వహించి యెదురు చని పాండవులం
గని రయ్యిరుదెఱంగులవారలు సౌహార్దంబును సౌముఖ్యంబును సౌజన్యంబును
నత్యంతంబును మెఱయ నర్థంబు లగునాచారంబులు నడపి రట్లు కృష్ణ
సమేతు లై మిూతాతలు హర్షోల్లాసభాసమాను లగుచు నాసమగ్రకాంచన
సంచయంబుఁ బురస్కరించుకొని పురప్రవేశం బాచరించి. 203

క. తొలుత ధృతరాష్ట్ర గాంధారులఁ గని మఱి గొంతిఁ గాంచి ప్రోన్మీలచ్ఛ
త్రులుఁ బ్రమదసంభరితచిత్తులు నయినయుయుత్సునిన్ విదురునిం బ్రీతిన్. 204

వ. కానిపించికొని సంభావించి సంభృతాహ్లాదు లగుచుం గృష్ణాదియాదవలోకం
బునుం దారు నొకరమ్యమండపంబున నుండి రట్టియెడ. 205

వ్యాసుఁడు కృష్ణసహితులై యున్న పాండవులయొద్దకు వచ్చుట

సీ. తగువారిఁ గాంచి యత్యద్భుతం బగుభవజ్జనకుతెఱంగు విస్తార మొప్పఁ
జెప్పిన వార లచ్చెరువాటు సంతసంబును నెమ్మనంబులఁ బెనఁగొనంగఁ
బద్మనాభు ననేకభంగుల వినుతించి యిట్టివి వింతలే యెల్లనాఁడు
నిట్టుల కాక మాయెడ నీదుకరుణ యెం పని యభినందించి రట్లు గలసి

1 సేర్చ నమ్ముదా, యత్త. 2 బుగఁ దొడవుల్.

తే. నెమ్మిఁ దారును గృష్ణుండు సమ్మదమున, నుచితవర్తనకలితులై యుండఁ గొన్ని
దివసములకు సంప్రీతి నేతెంచె బోధ, భాసితుం డైన సత్యవతీసుతుండు. 206

క. ఏతెంచిన గోవిందస, మేతంబుగ నెదురుకొని మహితపూజాసం
ప్రీతునిఁ గావించి యతని, మీఁతాతలు గొలిచి యుండి మృదువచనములన్.

వ. సముచితగోష్ఠి నడపి రప్పాండవాగ్రజుండు మునిజనాగ్రణితో భవత్ప్రసాదం
బునం బడసినయమ్మహాధనంబు మహానీయంబుగా నశ్వమేధయాగంబునం దుప
[1]యోగంబు నొందింపఁ గోరెద ననుజ్ఞ యీవే యనిన సంతసిల్లి యాసంయమి
వరుం డి ట్లనియె. 208

ఆ. తురగమేధ మఖిలదుష్కృతహరము నీ, వది సమగ్రదక్షిణాన్వితముగఁ
జేసి నిర్మలత్వభాసమానుండ వై, వెలయు మమృతకిరణకులవరేణ్య. 209

చ. అనవుడుఁ బ్రీతి నొంది యతఁ డచ్యుతుఁ గన్గొని భవ్య మైనయి
ప్పని దగ నిట్లు సేయు మని పన్పుచు తల్లియుఁ దండ్రియుం గురుం
డును సచివుండు నిష్టసఖుఁడుం గరుణాకర నీవ మాకు నీ
[2]యనుపమముఖ్యవృత్తి జగ మంతటికిం గతి వేయు నేటికిన్. 210

వ. అనిన విని యంబుజనాభుం డతని కి ట్లనియె. 211

ఉ. వ్యాసులు పంచినట్లు నియమాఢ్యతఁ జేయుద మశ్వమేధముం
జేసి కృతార్థతం బొరసి చిత్తము నెవ్వగ యెల్లఁ బాచితో
మ్మా సుకృతంబు ధర్మనిచయ[3]ప్రవరం బని యేన చెప్పి కా
దే సుగుణాభిరామ నిను దీనికిఁ జొన్పితి మున్ దృఢంబుగన్. 212

చ. అనుమతి యింక వేఱ పడయం దలఁ పేటికిఁ గౌరవేంద్ర న
న్ననుపుము వాజిమేధకరణంబున కేపని సేయువాఁడ నీ
యనుజులు నల్వు రే నొకఁడ నధ్వరకార్యము లెల్ల నీదు నె
మ్మనమున కెక్కఁ జేయుదుము మాన్యచరిత్ర తొడంగు మర్థితోన్. 213

సీ. అన విని సమ్మోదమారిన చిత్తంబుతో నభినందించి యానరేంద్ర
వరుఁడు పారాశర్యువలను గనుంగొని దీక్షకు నయ్యెడుదినము మీరు
సూచి యాసంస్కార మాచరింపుఁడు దయ ననవుడు నమ్ముని యాజ్ఞవల్క్యుఁ
జేర్కొనిఁ పైలునిఁ బ్రీతి నెఱింగించి వారును నేనును వసుమతీశ

ఆ. నడపవలయుపనులు నడపువారము చైత్రమాసకలితపౌర్ణమాసి నిష్ప
డరయఁ బనుపు మేధ్య మగుతురంగముఁ దజ్జ్ఞులైన యట్టిజనుల నంచితాత్మ. 214

క. వేదోక్తవిధిసహితభ, వ్యాదరమున విడువఁ బడిన యయ్యశ్వం బీ
మేదినిఁ గలయం దిరుగును, నీదగు నిర్మలయశంబు నెఱయ మెఱయఁగన్. 215

వ. సర్వసంభారంబులును సమకట్టింపుము స్రుక్స్రువాదిక్రతుసాధనంబులు స్రొత్త

1 యోగం బొనరింపం గోరెద. 2 యనితరసౌఖ్యవృత్తి. 3 ప్రభవం బని యేను జెప్పి.

లుగాఁ గనకంబునం గావింపం బనుపు మని చెప్పిన నప్పాడమి తేఁడు. 216

క. తురగపరీక్షావిదు లగు, పురుషులఁ బిలిపించి యశ్వపుంగవుఁ గని తెం
డరయుండు మనకొదములలో, నిరుపమలక్షణముఁ గీర్తనీయంబును గాన్. 217

వ. అని పలికి కర్మాధికారులం గలయం గనుంగొని యజ్ఞంబునకు వలయునట్టిభాండ ప్రముఖంబు లయినసాధనంబులును స్రుక్స్రువాద్యుపకరణంబులును సువర్ణ మయంబులు గా వేగంబ చేయింప వలయు నని నియోగించిన నట్ల కాక యని చని వారును బదంపడి. 218

క. తురగంబును సంభారో,త్కరమును గొని వచ్చి చూప ధర్మజుఁడు పరా
శరసుతునకు వాని వినయ,పరత సమర్పించెఁ గురునృపాలవరేణ్యా. 219

క. ముని యశ్వముఁ జూచి కరం, బనురాగముఁ బొంది మేధ్య మగు నిది దీనిన్
వినుతవిధానమున విడుత, మనవుడు నతఁ డతనితోడ నాదర మలరన్. 220

తే. దీని రక్షింప నర్హుండు మానవీయ, బోధ యెవ్వండు [1]నీదుసద్బుద్ధి నరసి
యిట్టివాఁ డని యానతి యిమ్ము నాకు, ననిన న మ్మునినాథుఁ డయ్యధిపుతోడ.

క. దివ్యాస్త్రవిదుఁడు ధిషణా, భవ్యుఁడు శౌర్యోత్తరుండు పార్థుఁడు దగు న
శ్వవ్యాపనక్రియకు నితఁ, డవ్యాహతి నాచరించు నకార్యంబున్. 222

వ. భీమసేనుండును నకులుండును మనరాష్ట్రంబు రక్షించువారు భవదీయకుటుంబ కార్యంబులు సహదేవుండు నడపువాఁ డని నిర్దేశించిన. 223

ధర్మజుం డర్జును యజ్ఞాశ్వరక్షణంబునకు నియోగించుట

సీ. అమ్మహీవల్లభుఁ డర్జునుఁ బిలిచి యధ్వరయుక్త మైనయిత్తురగరత్న
మనఘ సంరక్షణీయంబు నీ కొరులకు నిప్పని శక్యంబె యెల్లభంగి
నిక్కార్యమునకు నీవేఁ గంకవలయు నీ యంచితాశ్వము చరియించుచుండ
నెడనెడ రాజుల కే నశ్వమేధదీక్షితుఁడ నై యుండుట సెప్పు ముచిత

తే. కరణనియతి నిరోధంబు గాకయుండ, నడపు మని చెప్పి భీముని నకులు రాష్ట్ర
గోపనమునకు సహదేవుఁ గులకుటుంబ,సమితిరక్షకుఁ బనిచి యుత్సాహ మెసఁగ.

వ. మఱియునుం గలయలంతిపనుల కర్హజనంబుల నియోగించి గాంధారీధృత రాష్ట్రులయనుమతి వడసి కుంతీసమనుజ్ఞాతుం డయి యశ్వమేధమఖంబున కున్ముఖుం డయ్యె నని యిట్లు ధర్మపుత్త్రుపుణ్యచరిత్రంబు సెప్పిన నప్పరమ ధార్మికుండు సకలలోకమనోజ్ఞం బగుయజ్ఞం బెవ్విధంబున నిర్వహించె విను వేడ్క నాచిత్తంబునం జిగురొత్తెడుఁ జెప్పవే యనుటయు. 225

ఉ. మానమదాదిదోషపరిమార్జననిర్మలచిత్తభక్తస
న్మానసలోల వీతపరిమాణవిభూతివిశాల శాంతతా
హీనవిదూర విశ్వహితహేలవిచార నిరామయావ్యయ

[1] నిదియసద్బుద్ధి.

స్థానకసిద్ధిమంగళవిధాయక వేదసభైకనాయకా. 226

క. అనపేక్షితఫలతాశో,భనమహనీయక్రియావిపాకాత్మకరూ
ప నితాంతధూతసంశ్రిత,జనపాపా పరమమిత్రసత్యాలాపా.

మాలిని. తరుణజరఠభావద్రావణోదారమూర్తి
హరణకరణనిర్మూలానతాభ్యంతరార్తి
మరణజననదుఃఖోన్మాదహృత్పుణ్యకీర్తి
చరణకమలపూజాశాలిచిత్తానువర్తి. 228

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున నశ్వమేధపర్వంబు నందుఁ దృతీయాశ్వాసము.



శ్రీ ర స్తు.

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆశ్వమేధపర్వము - చతుర్థాశ్వాసము

---



విద్యాశాంతికృతి
ప్రావీణ్య[1]నిరూఢిగణ్యపాదసతతసం
సేవనతత్పరహృత్కమ
లావాసకృతప్రమోద హరిహరనాథా. 1

### ధర్మజుం డశ్వమేధదీక్షం బూని హయంబుం బుడమిం దిరుగ విడుచుట

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లశ్వమేధయాగోద్యోగ ప్రద్యోతితుం డయినపాండవాగ్రజు దీక్షకు నర్హం బయినదినంబు సంప్రాప్తం బగుటయు మౌహూర్తికదత్తశుభముహూర్తంబున గృష్ణద్వైపాయనాదులైన ఋత్విజులు వేదవిహితవిధానమహితంబుగ నక్కురుక్షితిపతి దీక్షితుం జేసి రవ్వసుంధ రావల్లభుండు సంవీతక్షౌమకృష్ణాజినుండును దండపాణియు నయి ఋత్విగ్జనంబులు బలయం బరమసంయమిపరివృత ప్రజాపతి[2]ప్రఖ్యుండును గనత్కాంచనాభరణభూషితుండు నయి బహుళప్రభలు నిగుడ సందీప్తపావకసన్నిభుండును నగుచు వెలింగెఁ దత్తుల్యకల్పకల్పనంబున ఋత్విగ్జనసమాజంబునుం దేజరిల్లె నా వేదవ్యాసమహామునిచేత శాస్త్రోక్తప్రకారంబున ముక్తం బయి హయోత్తమంబు వెడలె నప్పుడు. 2

సీ. వివ్వచ్చుఁ డాగమవిధివంతముగ ధర్మనందను నామంత్రణంబు వడసి
గాండివపాణి యై కవదొనల్ ధరియించి తేజోవిశేషంబు రాజితముగ
నయ్యశ్వరత్నంబు ననుసరింపఁగఁ బ్రజ బాలురు వృద్ధులు భామినులును
లోనుగాఁ బఱతెంచి లోలత [3]నతని నాహయమును గనుఁగొనునప్పు డగ్గ

తే. లంపుసందడి నూష్మ జనింప సాజ్యనంబు లవ్వీరునకు దీవనలఁ బొగడ్త
లను బ్రమోద మొనర్చిరి వనధిరవము, ననుకరించె నయ్యులివు నృపాగ్రగణ్య. 3

---

1 నిరూఢగణ్యపాతసతత. 2 ప్రతిముండును. 3 నతని వా, హమును గనుంగొను.

వ. ఇవ్విధంబునం జనునాకవ్వడితోడ యజ్ఞకర్మకుశలుం డైనయాజ్ఞవల్క్యశిష్యుం
డర్హవిధానంబులకయి మాననీయవిప్రజనసహితంబుగాఁ జనియె నప్పరమ
తురంగంబు ధరణిం బ్రదక్షిణరూపంబునం దిరిగి యుత్తరాభిముఖం బై యల్ల
నల్లన యరుగుచుండ నర్జునుం డనుసరించి పాలనపరుం డగుచుం బ్రవర్తింపం
ద్రిగర్తదేశంబునందు. 4

## అర్జునుతోఁ ద్రిగర్తదేశాధిపతులు యుద్ధము సేయుట

సీ. ఉద్ధతు లై త్రిగర్తోర్వరాపతిపుత్త్రపౌత్త్రు లయ్యశ్వంబుఁ బట్టువారు
గాఁ బూని తేరులు గడురయంబునఁ దోలికొని యడ్డముగ వచ్చి కోలుతలకు
నలుగక నరుఁ డన్నయానతి దలఁచి యా రాజకుమారవర్గంబుతోడ
ధర్మజునశ్వమేధంబున కపకార మాచరించుట పాప మదియుఁ గాక
తే. యేము మీరును బాంధవ మెసక మెసఁగ, నడచు టొప్పదె పగయే లనంగ వారు
సూర్యవర్మ నామకుఁ డగుశూరతమకుమారుఁ డగ్రణి గాఁగ నుదారలీల. 5

చ. కవిసిన వారితో మఱియుఁ గవ్వడి యిట్టు లను న్ దయాధురా
ప్రవణుఁ డజాతశత్త్రుఁడు దురంగమరక్షకు నంపునప్డు భూ
పవితతి యెల్లనుం దెగియె భారతయుద్ధమునందు బాలురం
దివిరి వధింపఁ గాదు కృపఁ దిన్నఁదనం బెసఁగం జరింపుమీ. 6

చ. అవినయవృత్తి నశ్వమున కడ్డము వచ్చిరయేని నీవు బాం
ధవము దలిర్పఁ బల్కి యని దప్పఁగఁ బ్రోవుము కిన్క మాను మ
న్నవచనవృత్తి నాదగుమనంబున నెక్కొని యున్కిఁ జేసి యా
హవమున గొల్ల నయ్యెదఁ బ్రియంబులు గావొకొ మీకుఁ బ్రాణముల్. 7

చ. వలవదు పొం డనంగ నిలువంబడ కేపున సూర్యవర్మ య
బ్బలియునిమీఁదఁ గ్రూరశరపంక్తి నిగిడ్చినఁ ద్రుంచెఁ జిష్ణు య
మ్ముల [1]నది యెట్టనవ్వు తన మో మనుతమ్మికి లేఁతయెండ యై
చెలువము చెన్ను వింతలుగఁ జేయఁగ నావిజయుండు భూవరా. 8

వ. అట్టియెడ. 9

తే. సూర్యవర్మునితమ్ముండు శూరవరుఁడు, గేతువర్మ గాండీవిపై శాతబాణ
వృష్టిఁ గురియుచు నుద్ధురవేగ మొప్ప, నన్నఁ గడచి పె ట్టడరిన నన్నరుండు.

చ. అతని నొదుంగ నేయుటయు నాతనితమ్ముఁడు చండవిక్రమో
ద్ధతి ధృతవర్మ నాముఁ డతిదారుణసాయకపంక్తి సత్వరా
తతగతిఁ బర్వఁ జేయుచుఁ బృథాసుతుఁ దాఁకిన మెచ్చు వచ్చి య
య్యతిరథవర్యుఁ డప్పు డతఁ డంగము లేయఁగ నొల్ల కుండుటన్. 11

చ. శరములు ద్రుంప నాతఁడు వెస న్ బలునారసముల్ నిగిడ్చె న

---

1 నవి యెట్ట నా తనదు మో మనుతమ్మికి.

స్వరుపయి నాబలిష్ఠుఁడు మనంబునఁ గొండొక యల్క పుట్టి య
స్వరవరసూతివేరరమునం బడితూపులు గ్రుచ్చె దానికిం
దెరలక యక్కుమారుఁడును దీవ్రశరంబులఁ జేయి నొంచినన్. 12

ఆ. ముష్టి సడలి చోద్యముగను గాండివ మిలఁ, బడిన నాత్రిగర్తబలము దెసలు
సెలఁగ నార్చె [1]నందుఁ జేయంగఁగలయోధు, లక్కుమారవర్యునవులఁ ద్రోచి.

తే. ఇంద్రధనువుచందంబున నెసక మెసఁగు
గాండివముపాటు గంటిరే చండవిక్ర
మాభిరాముండు గాండివి యన్న పలుకు
లకు మహోగ్రత సూప నొల్లండు గాక.

ఉ. నిక్కపుఁగిన్క వచ్చిన ననిక్ నొసలం గను సూపు [2]వింటిపా
టక్కట రిత్త వోవునె నృపాత్మజులం దెగటార్చు నీతఁ డిం
దొక్కఁడుఁ ద్రిక్క కుండ మనమొప్పమి సూడఁగ నేర మున్న పే
రుక్కునఁ దాఁకు టొప్పు నని యొక్కట నర్జును నాక్రమించినన్. 15

క. అట మున్న గాండివం బు,త్కటరయమున నెత్తి కోపదహనుం డత్యు
ద్భటమూర్తిఁ దాల్చె నన ని,క్కట మై కడగంటికెంపు గొమరారంగన్. 16

వ. ఆబీభత్సుండు. 17

క. పిడుగులు వడఁ బెక్కొక్కటఁ,బడియెడు ననఁ దొరఁగఁ జేసెఁ బటువిశిఖముల
ప్పుడు మేదిని దోఁపద చె,ప్పెడుకోలఁచియె రథికవరులపీనుఁగుపెంటల్. 18

శా. ఆయుగ్రోద్ధతి సూచి పెల్కుఱి త్రిగర్తానీకముల్ సల్గడం
బాయం బాఱెఁ దదాప్త లేము దగ నీపం పోపి సద్భక్తిమైఁ
జేయంగాఁ బనిగొమ్ము పేర్మి గ మమ్ముం జేకొమ్ము సమ్యగ్దయా
శ్రీయుక్తా యనినన్ ధనంజయుఁడు గాచెన్ వారి నెల్లం గృపన్. 19

వ. అట్లు వెనుకొనక నిలిచి యెలుం గెత్తి వారలతో మీ రిట్లు ప్రాణంబులు గాచి
కొనుండు నాపంచినపని సేయం బూని బుద్ధి గలిగి సుఖుల రై యుండుం డని
పలికి యయ్యశ్వంబు ననుసరించె నది క్రమగతిం బ్రాగ్జ్యోతిషపురపరిసరంబు
నకుం బోయిన దాని తెఱం గాకర్ణించి, 20

సీ. భగదత్తతనయుండు బాహుగర్వంబున బాల్యసిద్ధం బగులౌల్యమునను
బురి నిర్గమించి యత్తురగంబు వెలిపించికొనిపోవఁ గాంచి యర్జునుఁడు గాండి
వము సజ్యముగఁ జేసి వాలమ్ములొక్కటనక్కుమారునిమీఁదఁ బెక్కుగురియ
నవ్వజ్రదత్తుండు [3]నొవ్వ దన్కిన దాని నచ్చట దిగఁ ద్రావి చొచ్చెఁ బురము

తే. సత్వరంబుగ నటుసొచ్చి సామజంబుఁ, బన్నఁగాఁబంచి వెసనెక్కి బలముఁజలము
మీఁకయును నొప్ప నన్నరుఁ దాఁకి శాత,ఘనశరంబులు వరఁగించెఁ గౌరవేంద్ర.

1 నందు సేయంగఁ. 2 వింటివాఁ, డక్కట. 3 నొవ్వడరిన దాని.

క. నడుమన వానిం బార్థుఁడు, పొడిగా నేయంగఁ గనలి భూపకుమారుం
డడరించెఁ దోమరంబులు, గడుఁ బెక్కవి మిడుతకదుపుగతిఁ గవియంగన్. 22

ఆ. అనలశిఖలువోని యమ్ములగమి వాని, రూపుమాపి యన్నరుండు వాఁడి
లేనిదొడ్డతూపు లేనింటఁ దొడి రాచ, కొడుకు నేసెఁ దూలి పుడమిఁ గూల. 23

క. కూలియు నీడం బోవక, బాలుఁడు రయ మార దంతిపైకిం జని దో
ర్లీల మెఱయ నరుఁ బటుశర, జాలంబులఁ బొదివె గగనచరు లగ్గింపన్. 24

చ. అతఁడును దీప్రబాణముల నాభగదత్తతనూజుదంతి నా
వృతముగఁ జేసెనట్లు పృథివీవరనందన యేమి సెప్పుదుర్
శతమఖపుత్త్రుతోడ [1]దివసత్రయ ముగ్రరణం బొనర్చె న
ద్భుత మెసఁగం జతుర్థదినముం దెగునంతకుఁ బోరె ధీరతన్. 25

వ. తెగియెడుసమయంబున. 26

ఆ. అక్కుమారుఁ డేచి యర్జున యర్జున, యేను గలుగ నీకు నెందుఁ బోవ
వచ్చు వృద్ధుఁ డైనవాఁడుగావునఁ దండ్రి, సమసె [2]నట్లు నన్ను సమతె వేల. 27

వ. అని యదల్చి. 28

క. పెనుసెలయేఱులు వాఱఁగఁ, దనరుగిరియుఁ బోలె బహుమదంబులు దొరఁగం
గనుపట్టుకుంజరము సిం,హనిభుం డగుపార్థుమీఁద నడరం జేసెన్. 29

క. అది ఫూత్కారము సేసిన, నొదవినకరశీకరముల నుర్వీవర యం
బుదముక్తసలిలధారలు, వొదివినగిరివోలె నింద్రపుత్త్రుం డొప్పెన్. 30

చ. కరి యిటు లేపునం గవియఁగా భగదత్తసుతుండు దీప్తని
ష్ఠురశరపంక్తినాహవపటుత్వము సూపిన నల్పకోపసుం
దరుఁ డగుచుఁ గా నరుండు శతధారనిభం బగునారసంబు భీ
కరగతి నేయఁ గూలె నది కౌరవనాయక పర్వతాకృతిన్. 31

క. కూలిన నేలకు వచ్చిన, బాలుం గని నాకలోకపతిసుతుఁడు దయా
లోలుం డై మార్దవహృ,ద్యాలాపము లొప్ప నిట్టు లను నాతనితోన్. 32

వ. ధర్మతనయుం డశ్వమేధదీక్షితుం డయి యిత్తురంగంబుపజ్జ నన్నుం బుత్తెంచు
నప్పుడు. 33

క. చంపకుమీ రాజుల నను,కంపాతిశయంబు మెఱయఁగా నడపుము నీ
పెంపునకుసుమమునకు నా,కం పొనరించుటయ సౌరభముగ నెఱుఁగుమీ. 34

క. అనిరోయుం గావున నీపైఁ, గినుక వొడమ దలుక విడువు గీతయశుం డా
జనపతియాగంబునకుం, జనుదేరఁగ వలయు బంధుజనములు నీవున్. 35

ఆ. అధిపతనయ నిన్ను నామంత్రితునిఁ జేసి, పోవుచున్నవాఁడ నీవు హస్తి
పురికి భావిచైత్రమునఁ బున్నమకు ముద, మొదవ నరుగుదెంచు టొప్పుఁ జేయు.

---

1 దివసద్వయ...ద్వితీయదినముం. 2 నన్ను మిగులఁ జనుదె జేల.

క. అనిన నతఁ డట్లు తా కని, వినతుం డగుటయును బ్రీతి విజయుం డభవం
దన మాచరించి యశ్వము, వెనుకఁ జనియెఁ బూరుకులపవిత్రచరిత్రా. 37

అర్జునుండు సింధుదేశాధీశులతోడ యుద్ధంబు సేయుట

వ. అది సింధుదేశవర్తి యగుటయు భారతరణహతు లయినసైంధవయోధులపుత్త్ర
పౌత్త్రులు పూర్వవైరంబు వాటించి యాటోపంబున ననేకసహస్రసంఖ్యల
రథికులు రాజనందనులుం గూడుకొని క్రీడిపై నడచి కట్టియెడ. 38

సీ. అరుణాంబుదంబులు వరఁగి పెన్నెత్తురుఁ గండలుఁ గురిసె మార్తాండబింబ
మసితారుణచ్ఛాయ మయ్యె నుల్కాతతు లెల్లదిక్కులఁ బెల్లు డుల్లె నశ్వ
సహితంబుగా సవ్యసాచిఁ జుట్టును ముట్టి యతనిపై నయ్యోధనితతి యొక్క
పెట్ట శస్త్రాస్త్రముల్ బెట్టుగాఁ గురిసిన నప్పాండవుఁడు వెను దప్పి సోలె

తే. నేమి సెప్పుదు నీకు నుద్దామవిక్ర
మాభిరాముండు నాఁ జనునక్కిరీటి
[1]కరము గరము బెం డగుటయు గాండివంబు
వడియెఁ బుడమిపైఁ గురునరపతివరేణ్య. 39

చ. అనిమిషులున్ మునీశ్వరులు నప్పుడు శోకమునన్ మునింగి య
ర్జునజయకాంక్షు లై నియతి శుద్ధి వహించి సవీర్యమంత్రసా
ధనపరు లైరి తెప్పిఱి యతండు ధనుర్ధరుఁడున్ సముల్లస
త్తనువిభవోజ్జ్వలుండు సముదగ్రమనస్కుఁడు నయ్యె భూవరా. 40

వ. ఇట్లు దెలివొంది విజృంభించి. 41

శా. నారాచప్రముఖాస్త్రజాలపటువిన్యాసంబు దీవ్రత్వరా
ఘోరం బై విలసిల్లఁ జేయ సమరక్షోణీతలం బంతయున్
వైరివ్రాతశవావృతం బగుడు గీర్వాణుల్ మునుల్ సిద్ధు ల
వ్వీరుం బ్రస్తుతి సేయుచుం బొదలి రుద్వేలప్రమోదంబునన్. 42

వ. హతశేషం బైన యాసింధురాజకుమారసైన్యంబు దైన్యంబునొంది నలుదిక్కుల
వచ్చియు నొచ్చియు వివ్వచ్చుండు రణధరణిం బొలిచి నిలుచుటఁ జూచి మాత్సర్య
ధుర్యం బై మగుడం బోరికిం బూని యడరిన నప్పురందరనందనుం డందలి
రథికముఖ్యులతోడం దమయన్న చెప్పినవాక్యంబు లుపన్యసించి మీ రేల
జాలిం బడియెదరు ప్రాణంబులు మీ కింత సేఁ దయ్యెనే యని పలికినను నిలువక
పైపయి వా రురవణించిన. 43

క. నవ్వుచు నానాశరముల, నవ్వీరుల, బొలియఁ జేయ నంతయు విని తా
నెవ్వగతో దుశ్శల యా,కవ్వడిఁ బౌత్త్రాన్వితముగఁ గానఁగ వచ్చెన్. 44

సీ. వచ్చి కన్నీళ్లు వదనంబుపై వెల్లిగొన రోదనంబు సేసిన నతండు

1 కరయుగము బెండు పడుటయు.

దయ నిల నిడియెఁ గోదండ మప్పుడతఁడుక పౌత్త్రుని: జూపి యిబ్బాలుఁ గాన్ప
మితఁడు మీరాయల్లునిసుతుఁ డన్న నప్పార్థుఁ డిప్పుడు నాయల్లుఁ డెచట నున్న
వాఁ డని యడిగిన వనిత వెక్కుచు నతం డాత్మయజనకుఁ డుగ్రాహవమున

తే. నసఘు నీచేతఁ దెగుట దా విని నితాంత,శోకమగ్నుఁ డై యుండి నీరాక బెట్టు
వినుట బెగ్గిలి ప్రాణముల్ విడిచె ననుచు,నెలుఁగుగడలుకొనంగఁ [1]బెన్నేడ్చె నధిప.

వ. అప్పుడు శోకాక్రాంతుం డయి గాండీవి వదనంబు వాంచి యుండ నయ్యుగ్గలి
యతని నుద్దేశించి. 46

సీ. ధార్తరాష్ట్రులకీడు దలఁపక సైంధవుకొఱగాము లెల్లను మఱచి తండ్రి
లేనియీశిశువుపై మానితం బైననీ యక్కటికంపుఁజూ పడరఁ జేయు
మాశ్రితవత్సల యనుచు నబ్బాలునిఁ జరణానతునిఁ జేసి శరణు శరణు
కృప నన్ను రక్షింపు కీర్తియు ధర్మంబుఁ జేకొను మనవుడుఁ జిత్త [2]మడల

తే. రాచకొల మిది గాల్పనే క్రౌర్యమూల,మని తలంచుచు నాతఁ డయ్యతివతోడ
నధమవృత్తిసుయోధనుం డంతకంబె, నేముఁ గొఱగాము మాచేత నింతపుట్టె.

క. అని పలుకు పలికి బహుసాం,త్వనముల నూరార్చి యాసుదతిమస్తకముం
దనయక్కునఁ జేర్చి యబల, చనుము వగపు దక్కి యని ప్రసాదభరితుఁ డై.48

వ. వీడ్కొలిపిన దుశ్శల దనమనుమనిం దమబలంబులం గొని ప్రియంబునం జనియె
నయ్యనిమిషపతిసుతుండును గ్రతువిషయంబు లయిం వలయుననుష్ఠానంబులు
విధివంతంబులుగాఁ జలుపుచుఁ దురంగంబువెనుకం దా రా మృగానుసారి
యయిునపినాకపాణియుంబోలెఁ బోవు చుండ నదియును నిజేచ్ఛ నఖిలదేశంబుల
సుఖసంచారంబునం బ్రవర్తిల్లుచుఁ గ్రమంబున మణిపూరపురంబునుపాంతం
బున కరిగిన నప్పురంబుపతి యైనబభ్రువాహనుండు నిజజనకుం డయినయర్జును
రాక యాకర్ణించి. 49

ఆ. వినయ మెసఁగ నార్యజనసమేతంబుగా, నరుగుదెంచి యతనిచరణములకుఁ
బ్రీతి నెఱఁగ నక్కిరీటి యన్నరపతి, నాదరింప కుండె మేదినీశ. 50

వ. అట్లుండి తనయునాదరంబునకుం గారణం బెఱుంగక సవిచారుం డై యూర
కున్న యక్కుమారునితో ధనంజయుం డిట్లనియె. 51

ఉ. యాగవిముక్తమై చనుహయంబున కడ్డము వచ్చి పట్టి కా
కీగతి మెత్తఁబాటు దగునే నృపధర్మవిహీనతక్ రణో
ద్యోగము లేక తక్కి భయ ముల్లముఁ జేరఁగ నిచ్చురాజు రా
జే గుణహీన పామ్మనిన నేమియుఁ బల్క కతండు గ్రమ్మఱన్. 52

సీ. అరిగి పట్టణవీథి నల్లన చనుచుండ నర్జునుం డతనితో నాడినట్టి

1 బె ట్టేడ్చె. 2 మురిలి, మురియం.

తెఱఁ గెల్లఁ దన దగుదివ్యబోధంబునఁ గని భుజంగోత్తమతనయ సదయ
వృత్తిఁ బాతాళంబు వెలువడి యన్నరాధిపునిపాలికిఁ జనుదెంచి యేను
మీతల్లి నాగేంద్రసూతి నులూపి నాపేరు హితంబు సెప్పెదు మనీష
తే. నరుగుదెంచితి వినుము మీయయ్య పనుపు
దలకొనుము రాజులకు నర్హధర్మ మైన
యని యొనర్పుము దనతోడఁ బెనఁగు టధిక
సమ్మదము సేయు నక్కురుసత్తమునకు. 53
క. అనిన సభక్తికముగ నవ్వనితకుఁ బ్రణమిల్లి యాహవము జనకునితోఁ
జనునె యొనర్పఁగ నని యప్పనికిఁ జొరక వచ్చితిని శుభప్రదమూర్తీ. 54
క. నీ వింత దెలిపి పలికెద, వావిభుఁడును మున్ను నన్ను ననుమతుఁ జేసెం
గావునఁ దల్లి మీకుం, గావించెద నిద్దఱకు నఖండప్రియమున్. 55

బభ్రువాహనుం డర్జునునితో యుద్ధంబు సేయుట

చ. అని నిజమందిరంబునకు నయ్యెలనాఁగఁ దగంగఁ బుచ్చి య
మ్మనుజవరుండు సాధనస[1]మంచిత మైనరథం బుదాత్తరే
ఖ నెఱయ నెక్కి యర్హపరికల్పితభూషణలేపనాంబరం
బును సమరోత్సవోద్ధతవిభూతియు నై తనమే నెలర్పఁగన్. 56
ఆ. ఎక్కి హంసకేతు వేడ్తెఱఁ గ్రాలంగ, నరిగి యశ్వమునకు నడ్డపడఁగఁ
జూచి మెచ్చి సవ్యసాచి మార్కొనుటయుఁ, గురిసె నతఁడు నిశితశరచయంబు.
శా. వానిం దా నవలీలమైఁ దునిమి దుర్వారోద్యముం డద్రిభి
త్సూనుం డొక్కట నాత్మసూనునొడలం దూపుల్ నిగిడ్చెం బదా
ఱానిశ్శంకుఁడు బాహుసారమద మేపారంగ నవ్వీరు మేఁ
కే నారాచము లై దునాలుగులు పృథ్వీనాథ నాటించినన్. 58
చ. మదిఁ గొనియాడి యారిపువిమర్దనుఁ డంచనిడంబు ద్రుంచి యే
పాదవఁగ మేను నొంప [2]నచలోద్ధతి నాతనిజత్రు వేసె బె
ట్టిద మగునారసంబునఁ గడిందిమగం డగుబభ్రువాహనుం
డది వడిపేర్మి శోణితజలార్ద్రిత నొందక యుచ్చి పోయినన్. 59
క. అమ్మేటిమగఁడు దనచాప మ్మూఁతగ నిల్చి సోలి పడపడి తెలి వు
ల్లమ్మున నొలసిన నౌరా, యిమ్మడి యని పొగడెఁ గొడుకు నెంతయుఁ బ్రీతిన్. 60
తే. పొగడి యేఁ దీవ్రశరములు నిగుడఁ జేయు
నుద్ధతికి మంచిబంట వై యోర్వ వలయుఁ
జుమ్ము రా యని పలికి వాలమ్ము లధిక
రయము మెఱయంగఁ బరగించె రాజముఖ్య. 61
ఆ. మొనసి వాని నతఁడు ముత్తునియలు గాఁగఁ, జేయ మత్సరంబు చిత్తవృత్తిఁ

1 మన్విత మైనరథంబు. 2 రభసోద్ధతి.

దనికి సత్వరముగఁ దద్గాత్రమున నించె, నరుఁడు పక్కున మెఱుఁగునారసములు.

ఉ. దానికి నీడఁబోవక యుదగ్రపరాక్రమ మొప్ప వజ్రకీ
లానిభతీక్ష్ణ మెఱుంగులవిలాసము నింగి వెలుంగ నుద్భటుం
డై నిగిడించెఁ బార్థుహృదయస్థలి నారస మస్త్రశస్త్రవి
ద్యానిపుణత్వశాలి యగునన్నరపాలసుతుండు భూవరా. 63

అర్జునుఁడు బభ్రువాహనుని శరంబుచేతఁ బుడమిం ద్రెళ్లుట

క. వడి నది వీపున వెడలినఁ, బడియెఁ బుడమి నర్జునుండు పదపడి ద్రెళ్లం
గొడుకును మున్నతఁ డేసిన, బెడిదపుటేటులయలంతఁ బృథ్వీనాథా. 64

వ. అట్లు దనపతియును సుతుండును ఖండనంబునం బడుట విని శోకాక్రాంత యగుచుఁ జిత్రాంగద యులూపియుం దోడన చనుదేర నచ్చటికి వచ్చె నట్లు వచ్చి యచ్చెలువ యయ్యిరువురం గనుంగొని యుల్లంబు జల్లనఁ దల్లడిల్ల మూర్ఛమునింగి మేదినిం బడి కొంతవడికిం దెలిసి యులూపి నాలోకించి. 65

సీ. నీకతంబునఁ బతి నాకుమారునిచేత నని బడి యున్న వాఁ డతివ కంటె
నీవు పతివ్రత గావె ధర్మజ్ఞవు గానిదానవె యేమి కారణమున
నిది కార్యముగఁ జెప్పి తిపిన్న వానికిఁ గొడుకుదిక్కైన నాకు నడలు లేదు
వరుఁ జూచి పొక్కెద వామాక్షి నీదెసఁ దప్పు నేసినను నీతనిఁ గృపార్ద్ర

తే. చిత్తవై యెల్లభంగి సంజీవితుఁడుగఁ, జేయవమ్మ యక్కట నాథు నేయఁ బనిచి
చావు సూచియు వగవవు సాహసమున, కొలఁది లేదు నిన్నేమందుఁ గులవరేణ్య.

వ. అని పలికి పార్థుం జేరం బోయి. 67

ఆ. మహితకీర్తిలోల మత్ప్రాణవల్లభ, యన్యజనులప్రాణ మరసి కావఁ
జాలునట్టినీకు నేల ప్రాణంబుల, నిట్లు వదలి పోవ నిచ్చి యుండ. 68

సీ. నాథ నీ వెప్పుడు నన్ను మన్నింతువు కను విచ్చి చూడక యునికి దగునె
హయమున కెవ్వరు నడ్డంబు రాకుండ [1]నాఁగితి వగ్రజునధ్వరంబు
వమ్మయి పోకుండ లెమ్మిత్తురంగంబు వెనుకొన వలవదే యనఘ నీకు
నని యార్తిఁ బలవించి యహిపుత్త్రి దెసఁ జూచి సుతుఁడెట్టులుండినఁ బతికి నిమ్ము

తే. జీవ మాండ్రురఁ బెక్కండ్రఁ జేసికొనుట
పురుషులకుఁ దప్పె భార్యలి త్తెరువునందు
[2]నడవరే యోర్చి నీదుమనమున నింత
యొజ్జేఁగి కలిగింపు వరు వేయు నేల తల్లి. 69

వ. అని యంత నిలువక. 70

ఆ. కొడుకుచేతఁ జచ్చి పడి యున్నయిక్కురు, కులవరేణ్యుఁ గరుణ గూరి నీవు
బ్రదుకఁ జేయ కున్నఁ బ్రాయోపవేశన, మాచరింతు నహికులాగ్రగణ్య. 71

1 నాఁగి నీయగ్రజునధ్వరంబు. 2 నడతురే.

వ. అని పలికి పతిచరణంబులు శిరంబు సోఁకం బ్రణమిల్లి యాసీన యై యూర
కుండె నట్టియెడ బభ్రువాహనుండు దెప్పిఱి లేచి యప్పాలంతిం జూచి, 72

ఉ. ఇంచుకయేనియున్ వనట నెన్నఁడుఁ బొందనితల్లి నేఁడు నా
మంచితనంబునం బలుకుమాలిననాథుని నుగ్రశత్రులన్
మించు నినుండువోలెఁ బరిమార్చుమహాబలుఁ జూచి యిట్లు దుః
ఖించుచు నుండఁ జూచితి సకిల్బిషచిత్తున కింత పెద్దయే. 73

క. గాదిలితనయుఁడ నగునే, గా దన కిక్కురుకులాగ్రగణ్యుని నిమ్మై
మేదినిఁ గూల్చితి మణికిరణోదాత్తం బైనమకుట ముర్విం బొందన్. 74

వ. అని విలాపంబు సేసి విన్వాచ్చుతోడం గూడ యజ్ఞతురంగానుసారులై వచ్చిన
యాజ్ఞవల్క్యశిష్యప్రభృతిబ్రాహ్మణజనంబులు నయనపథప్రాప్తు లగుటయు. 75

సీ. అధ్వరహయవిషయంబుగా వీ రేమి పని సేయువారొక్కొ పార్థుఁ డిట్లు
పడి యున్నవాఁ డని పలవించి జనకుని నిట్లు సేసినపాపుఁ డెవ్విధమున
నాచరించునొకో ప్రాయశ్చిత్త మని పల్క పండ్రెండుపక్షముల్ భైక్షవృత్తి
నిమ్మహాత్మునికపాలమ్మున నడపంగ వలయుఁ గా కొం డెద్ది గలుగ నేర్చు

ఆ. నని యులూపి దిక్కు గనుఁగొని నీవు వ, ప్పంగఁ దండ్రి నిట్లు భండనమున
విగతజీవితుఁడుగఁ దెగఁ జేసితివి నింక, నెలమిఁ బొందు భరతకులపవిత్ర 76

వ. అని వెండియు. 77

క. జనకునిఁ దెగటార్చినపాపునకుం బ్రాణంబుతోడి [1]పొత్తు మనంగా
మనమునఁ దాలిమి గలుగునె, చనుఁ గాక యతండు సనినసద్గతిక తగన్. 78

వ. అని యుగ్గడించి స్థావరంబులు జంగమంబులు నగుభూతంబులు విన భుజంగ
పుత్త్రియు నాకర్ణింపఁ జెప్పి [2]వ్రతంబు నిష్ఠం బూనెద మాతండ్రి లే కునికి
నిజం బగునేనిఁ బ్రాయోపవేశంబ యుత్తమకృత్యంబు వీరవధంబు పాపం బంత
కంటెను రాజవధం బెక్కు డంతకంటెఁ గడునగ్గలంబు ధార్మికవధంబు జనక
వధపాతకం బింత యని కొలంది యిడ రా దిట్టుండ వీరుండును రాజును
ధార్మికుండును జనకుండును నైనయిమ్మహాత్ముని వధియించినమహాపాతకుని
కేతద్వ్రతానుష్ఠానంబు దక్క నొండుమెయి నిష్కృతి గల్గునే దీని నడపెద నని
పలికి యప్పురమనియతుం డుపస్పర్శనం బాచరించి పలుకు లుడిగి కూర్చుండె
నప్పుడు. 79

### ఉలూపి సంజీవనమణిచేత నర్జును బ్రదికించుట

ఆ. అట్లు దెంపు సేసి యాసీను లైనయా, తల్లిఁ గొడుకు నవనిఁ ద్రెళ్ళి యున్న
విజయుఁ జూచి పాఁపవెలఁది సంజీవన, మణి దలంచెఁ గురుసమాజముఖ్య. 80

వ. తలంచిన భుజంగమంబులకుఁ బరాయణం బైనయమ్మణి యమ్మహాభాగహస్త

1 పొత్తున మనఁగా. 2 వ్రతం బనుష్ఠింపం.

తలంబునకు వచ్చిన నాభాగుని బభ్రువాహనునాననం బాలోకించి. 81

సీ. విజయుండు సచ్చునే వేఁదుఱులార యింద్రునిచేత నైన నీతనికి నొక్క
ప్రియము సేయంగఁ గోరియును నీకోలఁదియారయుబుద్ధి నీతండు రణమొనర్పఁ
దలఁచిన నిర్వీరుతలఁపు సిద్ధింపంగఁ జేయుటకును నింత సేయ వలసె
నాకుఁ గావున మోహనం బగుమాయాప్రయోగంబు నడపితి నుజ్జ్వలాత్మ

తే. నరుఁడు నారాయణుఁడు మహాత్తరము సువ్వె,యితని తేజమెవ్వరికిని నెట్లు దాని
నార్పవచ్చు మీావగపెల్లఁ దీర్ప నిపుడ, యుత్థితుం డగు నీకౌరవోత్తముండు.

వ. మాయాప్రయోగంబ వేఱొండు గాదు నీకు మీాతండ్రితోడ భండనంబు సేయబుద్ధి పుట్టించితి నింతమాత్ర యని తత్ప్రదేశంబున నున్న యెల్లజనంబులు నుల్లంబుల నానందంబు నొందఁ బలికి యమ్మణిపూరపురపతికరతలంబున నమ్మణి యిడి దీని నిమ్మహాత్ముని హృదయదేశంబు మోపు మనవుడు నతం డట్ల చేయుటయుం బార్థుండు ప్రత్యుజ్జీవితుం డై. 83

తే. లేచి కూర్చుండి కలయంగఁ జూచి యొఱ్ఱ
సెరలకాంతియు దంతరుచియును బెరయ
నతిమనోహరముగఁ దనసుతునితోడ
మనుజనాయక కుశలమే యనుడు నతఁడు. 84

సీ. వినయ మారంగ నాతనిచరణంబుల కెఱఁగి భవత్పుణ్యవీక్షణమున
నఖిలంబుఁ గుశలంబ యనిన నిజ్జనముల మొగములయందెల్ల నగవు దోఁచి
యచ్చెరువాటును హర్షంబుఁ గదిరెడు నిది యేమి సెప్పవే యెఱుఁగ దేని
నాచెప్పినట్ల రణంబున కేతెంచి తీవు చిత్రాంగద యేల వచ్చె

ఆ. నిచ్చటికి నులూపి [1]యేమిటి కిపుడు స
న్దెంచె ననుడు భక్తినిర్భరముగ
నతఁడు సాఁగి మ్రొక్కి హస్తముల్ మొగిచి య
య్యహితనూజఁ జూపి యతనితోడ. 85

వ. అంతయు నిమ్మహానుభావ నడుగుం డనిన గాండీవి యాయింతివదనం బాలోకించి కురువంశనిస్తారకా నీరాకకుం గారణం బేమి యిమ్మణిపూరపురనాథుని దెస నావలన భవదీయచిత్తంబు ప్రసన్నం బయి యున్నయదియె యిన్నరపతియును నేనును జిత్రాంగదయును నీ కేమియు నపరాధంబు సేయము గదా యనుటయు. 86

ఉలూపి యర్జునునితో వసువులకోపప్రసాదంబుల నెఱింగించుట

సీ. అల్లన నవ్వుచు నయ్యింతి నతనితో నాథ నీయం దొకనాఁడు నెగ్గు
గలదె నాపుత్త్రునివలనఁ గీ డెక్కడియది వినీతాత్మ చిత్రాంగదయును

1 యేటికిఁ జను దెంచె, ననుడు నచలభక్తి వినయగతుల.

గినియక నీకు మేను వినతోత్తమాంగ నై చెప్పెద నీసుతుచేత నీకు
నావహిల్లె నశుభ మాహవంబున నీవు గంగాతనూజు శిఖండి నెపము

తే. గాంగుఁ దెగటార్చి తది పాతకంబు గాని, కనఘు నిష్కృతి సేయక తనువు విడిచి
తేని నరకవాసమునకుఁ బోవ వలయుఁ, గాన నిష్కృతి సేసితిఁ గడఁగి వచ్చి. 87

వ. అది యెట్లంటేని నాకర్ణింపు మే నొక్కనాఁడు సఖీసమేతంబుగా సురనదీస్నానం
బునకు వచ్చి యుండ వసువు లక్కడ కేతెంచి యింత నంత లొక్కరేవునం
దోఁచి కృతస్నానులై నిజరూపంబున సన్నిహితయైన గంగాదేవితోడ గాండీవ
ధరుండు శిఖండిం బురస్కరించుకొని గాంగేయుం డేయ కుండం బరమసాయ
కంబుల నతనిం గూల్చె నట్లు కుత్సితజయార్జనం బొనర్చిన యయ్యర్జును నేము
శాపసంతాపితుం జేయుదు మని చెప్పిన నప్పరమానుభావయు దాని కొడం
బడినపలుకు వలికె నంతయు విని తత్క్షణంబ. రడ8

సీ. అరిగి యేఁ దండ్రికి నత్తెఱం గంతయు నెఱిఁగించుటయు నతం డెసక మెసఁగ
భయమున రయమునఁ బఱతెంచి వసువులఁ బెక్కువిధంబులఁ బ్రియము పుట్టఁ
దెలిచి ప్రార్థించిన నలుక వో విడిచి వా రతనితో విను సమయం బొకండు
సేసెద మనిలోన వాసవిఁ దత్సూనుఁ డగుబభ్రువాహనుం డస్త్రవితతిఁ

ఆ. బఱపి గూల్చె నేనిఁ బాయు నక్కిల్బిష, మనిన మగిడి వచ్చి యాభుజంగ
నాథుఁ డెల్లఁ జెప్పె నాకు నిప్పని దగ, నిట్లు దీర్చితిని సమిద్ధతేజ. 89

వ. తీర్చిన తెఱంగు నెఱింగించెద నని పలికి బభ్రువాహను నుపలక్షించి యిక్కు
మారుండు నీతో సమరంబు సేయ నొల్లక నమస్కరించి మరలి మందిరంబు
నకుం బోవుచున్కి బుద్ధిం గని సమయకార్యంబునకు నిది యవసరం బని
యూహించి రయంబున నితనికడకు వచ్చి రణంబు మీతండ్రికిఁ బ్రియంబును
ధర్మంబు నని చెప్పి యితనిం బోరికిం బురికొల్పి యివ్వీరునియందు వసువులు
సెప్పినవిధంబు గలుగునట్లుగా విక్రమవిశేషం బావహించితి. 90

క. అనినఁ బ్రియ మంది దేవీ, యనఘుం బగునీచరిత్రమస్మత్కులవ
ర్ధనకారి యగుట యెప్పుడుఁ, [1]గనినది గాదె యని పలికె గాండీవి నృపా. 91

ఆ. పలికి సాదరముగ బభ్రువాహనుఁ జూచి, మానితాగమిష్యమాణచైత్ర
మాసపౌర్ణమాసి మహితాశ్వమేధకా,లంబు దాని దెసఁ దలంపు గలిగి. 92

క. నీవును దల్లులు బంధుజ, నావళియుం బరిజనములు హాస్తినగరికిన్
రావలయు ధర్మజునిసం, భావనముం బడయు [2]టొసఁగుఁ బరమశుభంబున్. 93

చ. అనవుడు నట్లు చేసెద నుదాత్తచరిత్ర పురంబు సొచ్చి యి
వ్వనితలు నీవు నావలనివత్సలతం [3]గొనియాడు చియ్యెడన్
మన మలరంగ నిల్చి జనమాన్యునిఁ గా నను జేసి ప్రీతి నే
ననుపఁగ వచ్చి చేయు మనుయానము యజ్ఞతురంగరక్షకై. 94

1 గనిన యదియ యనుచుఁ బలికె. 2 డెసఁగు...సుఖంబుల్. 3 గొనియాడుఁ డయ్యెడన్.

వ. అనుచుం బ్రణతుం డై బభ్రువాహనుండు ప్రార్థించినం బార్థుం డప్పార్థివుతో నేను దీక్షితుండ నగుట యెఱుంగవె నాకుం బురప్రవేశంబు సేయం జనదు పోయివచ్చెద మీరును సుఖుల రయి యుండుం డనిన నట్లకాక యని యతం డుచితప్రకారంబునం బూజించి యామంత్రణంబు సేయ నబ్బాపలచేత ననుజ్ఞాతుం డై యమ్మహాత్ముండు యజ్ఞాశ్వంబు ననుసరించె నదియు నిజేచ్ఛ నఖిల దేశంబులం బ్రవర్తిల్లె నట్టియెడ. 95

క. రాజగృహపురముకడ న, వ్వాజి యరుగు టెఱిఁగి యాహవమునకుఁ బిలిచెన్
రాజత్కీర్తిధనుం డగు, నాజిష్ణుని మేఘసంధి యనురా జధిపా. 96

వ. అట్టు లప్పురంబుపతి యగుజరాసంధపౌత్త్రుండు బాల్యంబునం దన్ను నెదిరి నెఱుంగమిం గవ్వడిం గయ్యంబునకుం బిలిచి పుచ్చి తోడన కల్పితరథారూఢుం డై వెడలి యవ్వాసవికి నడ్డపడి. 97

సీ. వనితలలోపలఁ జనియెదుచాప్పన నివ్వాజిఁ గొని యించుకేని శంక
లేకపోయెదవు పో నీక యేఁ బట్టిన దీనిఁ గయ్యమున నేసె దేనిఁ జేయు
మనుడు నవ్వుచు నతం డమ్మగధేశుతో విఘ్నకర్తల నేను వెరవుతోడ
మాన్పింతు వినుము నాయనమునఁ గిన్క లే దది యెట్టు లనిన మదగ్రజుండు

తే. సామమునన కర్జము నీవు సక్కఁబెట్టి, కొందుగాని యెవ్వరియెడఁ గ్రూరవృత్తి
వలవ దని నాకుఁ జెప్పినవాఁడు గాన, యట్లు సేయుదు నీ యిష్ట మాచరింపు.93

అర్జునుఁడు జరాసంధపౌత్త్రునితో యుద్ధంబు సేసి యోడించుట

చ. అనవుడు నేమియుం బలుక కానృపపుత్త్రుఁడు నిర్జరేంద్రపు
త్త్రునిపయి నుజ్జ్వలంబు లగుతూపుగముల్ వరఁగింప వాని నె
ల్ల నతఁడు శాతభల్లతతులం దునుమాడియు నొల్లఁ డయ్యెఁ ద
త్తను వొకబాణ మేనియును దాఁకఁగ నేయ నరేశ్వరోత్తమా. 99

వ. అగ్గాండీవికృప యే మని చెప్పుదు. 100

క. తనమీఁద మగధుఁ డేయఁగ, జననాయక రథ్యములను సారథి నైనన్
గొనకొని నొప్పింపక యు,ల్లన శరనికరంబు పైఁ గలయ నిగిడించెన్. 101

క. అది బలహీనతగాఁ గొని, మద మేపారంగ నక్కుమారుఁడు లీలం
గడిసి బలునారసంబులు, తదంగమునఁ గ్రుచ్చె నతఁడు దానఁ నలిగియున్. 102

వ. ఆసహదేవపుత్త్రుగాత్రంబు దాఁక కుండునట్లుగా శరంబులు నిగిడించి. 103

ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి రథంబుఁ బగిల్చి కేతువుం
జీరి శరాసనంబుఁ బొడిచేసిన నమ్మగధుండు ధీరతో
దారగతిన్ సముజ్జ్వలగదాభ్రమణంబున బాహు వొప్ప న
వ్వీరవరేణ్యుపైఁ గవిసె విక్రమ మాకృతి దాల్చి పొల్చె నాన్. 104

వ. అట్లు గవియుటయు. 105

తే. అప్పుడును మత్సరంబున కతఁడు భాజ
నంబు గా కుండెఁ గాన యన్నరుఁడు వెడఁద
వాలియమ్ముల గద పలువ్రయ్యలై మ
హీతలంబునఁ దొరఁగంగ నేసె నధిప. 106

వ. అ ట్లేసిన. 107

సీ. నివ్వెఱపడిన యా నృపనందనునితోడ నయ్యతిబలుఁడు మాయన్న యొకని
ప్రాణంబులకును దప్పకు మయ్య యని [1]యానతిచ్చినకతన నే నేయ కున్న
నీ వింతవడి పోర నిలువఁ జాలితె విను మది యట్టు లుండె రాజార్హమైన
ధర్మంబు పాటించి తాఁకితి నన్ను నింతియ చాలు నింక శాంతియ నరేంద్ర

తే. తగినయది యనిపల్కె నతండు నిజము, నట్ల కాకని యూహించి యమ్మహాత్ము
పాదపరిసరమున భక్తిఁ బ్రణతుఁడైన, గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి యక్కురువిభుండు.

వ. వచ్చుచైత్రమాసంబునం బున్నమనాఁడు పాండవాగ్రజునశ్వమేధం బను
సంధించుటకై బంధులు నీవును రావలయు ననిన నవ్వసుమతీపతి యట్ల చేసెద
నని యత్యంతవినయంబున నవ్విజయుం బ్రియపూర్వకంబుగాఁ బూజించి
యామంత్రితుం జేసిన నాతండు ప్రీతుం డయి యభినందించి యమ్మగధపతిం
బురంబునకుం బోవం బనిచి యశ్వరత్నంబు ననుసరించె నదియును వంగపుండ్ర
మ్లేచ్ఛదేశంబులం జరియింప నయ్యైరాజులు సెనకినం దేజోధనుం డగు నాధనం
జయుండు జయించుచుఁ జన నత్తురంగంబు. 109

సీ. చేదిదేశంబు సొచ్చిన శిశుపాలునితనయుండు శరభుండు దనదుశుక్తి
పురము వెల్వడి యుద్ధపూర్వకంబుగఁ జేరి యమ్మహావీరున కర్చ లిచ్చె
నతని వీడ్కొల్పి యయ్యతులతేజుఁడు ఘోటకము వెన్కఁ జనుచుఁ డెంకణకిరాత
ముఖదేశనృపతులు ముట్టినఁ దగ గెల్పుగొనుచు గ్రమంబునఁ గోసలులను

ఆ. గాశులను జయించెఁ గ్రమ్మఱి యత్తురంగము దశార్ణదేశగామి యయ్యె
జిష్ణుఁ డనుసరింపఁ జిత్రాంగదుం డని, సేసి యోడి పూజ సేసె నధిప. 110

వ. ఇట్లు దశార్ణపతి పార్థునిం బూజించి యాతనియాదరణంబు వడసి పోయెఁ బదం
పడి తురంగంబు నిషాదాధీశదేశంబునకుం జనిన నేకలవ్యనందనుండు పాక
శాసననందనుమీఁద నైషాదసేనాసమేతుం డై తోఁతెంచిన. 111

చ. అతనిబలంబుఁ గ్రూరవిశిఖార్చుల నేర్చిన బాహు[2]సారగ
ర్వితుఁ డగునన్నిషాదపతి వీఁక నెదుర్కొనినం గిరీటి యా
తతపటుబాణదీధితులఁ దన్మదసంతమసం బడంచె వాఁ
డతివినయంబునన్ వినతుఁ డై తగ నర్చితుఁ జేసె నాతనిన్. 112

1 యప్పగించినకతన నేఁ గినియకున్న. 2 గర్వద, ర్పితుఁ డగు.

వ. ఆ యేకలవ్యనందనుం దనవశంబు సేసికొని ధనంజయుండు హయంబు ననుగ
మించె నది మరలి మఱియును దక్షిణాభిముఖంబయి చని తిరుగఁ జోళాంధ్ర
ద్రవిళకేరళకర్ణాటదేశాధీశుల ననాయాసంబున వశగతులం గావించికొనియా
క్రమంబున సౌరాష్ట్రంబు సొచ్చి గోకర్ణసమీపంబునం బ్రవర్తించి పదంపడి. 113

సీ. ద్వారకానగరంబుచేరువ ఘోటక మరుగంగఁ బ్రీతులై యదుకుమార
బాలపుటాలంబు ననువున నయ్యింద్రనందనుఁ గని పూజనం బొనర్ప
నభినందనముసేసె నవ్వీరుఁ డపరాబ్ధితీరదేశంబులఁ దిరిగి పంచ
నదముపైఁ జని[1]మావు నరనాథ గాంధారదేశంబు సొచ్చి వర్తింప శకుని

తే. నందనుఁడు బాల్యకలితదుర్నయము పేర్మిఁ
దనదు సేనలఁ గూర్చి యుద్ధాముగతిఁ గి
రీటిఁ దాఁకిన నతఁడు వారించి పాండ
వాగ్రజునియాజ్ఞ దెలుపంగ నంతఁ బోక. 114

క. పోదివినఁ గనుఁగవ వెడకెం, పొదవఁగఁ జతురంగముల శరోత్కరములఁ దాఁ
బోదివె విజయుఁ డవి వడియుం, జెదరియు సన్నంబు లైనఁ జిత్తములోనన్. 115

ఉ. మత్సర మెక్కఁగా సుబలుమన్మఁడు దుర్దమలీలఁ గిట్టి బీ
భత్సునిపై నిశాతశరపంక్తి నిగుడ్పఁ దదీయబాహుసం
పత్సముదీర్ణతం దనదుభావమునం గొనియాడి యెంతయున్
వత్సలుఁ డైనయన్నరుఁడు వానికి నిట్లనుఁ గౌరవోత్తమా. 116

క. రాజులఁ జంపకు మని మా, రా జానతి యిచ్చె నుద్ధురత నే నని న
య్యోజ విడిచిన బ్రైనఁ బ, రాజితుఁ గా నన్ను నద్ధరాపతి దలచున్. 117

అర్జునుఁడు గాంధారదేశాధీశుతో యుద్ధంబు సేసి జయించుట

ఉ. కావున నేఁ గడంగ విను కయ్యము నీకిది యేల తమ్ముఁడా
నా వినియున్ వడిన్ శకునినందనుఁ డయ్యమరేంద్రనందనుం
దా విశిఖంబులం బొదివె దానికి [2]నవ్వుచు వానిశీర్షకం
బావిజయుండు బల్మెడఁదయమ్మున నేలఁ బడంగ నేసినన్. 118

వ. అచ్చిత్రము సూచి యచ్చోటం గలయట్టి. 119

క. ఎల్లజనులు నివ్వీరుం, డొల్లఁడు గా కుత్తమాంగ ముర్వి నిటుల వే
డొల్లఁగ నేయఁడె వలసినఁ, జెల్లం బో యితనికరుణచెలు వి ట్లున్నే. 120

వ. అనుచు నక్కుమారుం జేరి యతనితేరు మరల్చికొని పోవం బోవ. 121

తే. దురభిమానము పేర్మి నన్నరవరుండు
మరలి నరుమీఁద నడవ మున్ దెరలి చనిన

1 మావ్య నరనాథ. 2 నవ్వుడు తచ్ఛిరస్త్రకం.

బలము గ్రమ్మఱి యయ్యింద్రుపట్టిఁ జుట్టి
బలసి శస్త్రాస్త్రచయములు వరఁగఁ జేయ. 122

చ. అవి నిశితాస్త్రపంక్తిఁ దునుమాడి రయం బెసఁగంగఁ గప్పె నా
హవతల మంతయుం దఱర నప్పటువిక్రమశాలి యమ్మహో
గ్రవిహరణంబునం గలఁగి కన్కనిఁ బాఱె బలంబు లక్కుమా
రవరునిఁ గాంచికొంటకు ధరావర మంత్రులు వానితల్లియున్. 123

వ. అర్ఘ్యంబు గొని రయంబున శరణు శరణనుచు వచ్చిన నవ్వివ్వచ్ఛుండును నవ్వేలంది నభినందించి మంత్రులకు మాననీయవచనంబులం బ్రియం బొనర్చి యబ్బాలునితో సాంత్వనస్వరంబున ని ట్లనియె. 124

ఉ. నీ విట వన్ని నాపయి ననింద్యపరాక్రమ రాక సూచి మ
ద్భావము ఖేద మొందుటయు ధర్మజుపం పిది రాజకోటి నే
నేవిధి నైనఁ జంప నని యెల్లజనంబు వినంగఁ జెప్పనే
కావున నీబలంబులన కాని నినుం దెగటార్ప కుండితిన్. 125

వ. విశేషించి గాంధారీధృతరాష్ట్రులం దలంచి నాకు నీదెస నిట్లు గా వలసియుండె.

ఆ. అట్టు లగుటఁ జేసి యవనీశనందన, యింత ప్రొద్దుఁ బోరి యింక శాంతిఁ
బొందు టొప్పు ధర్మపుత్త్రునితోడి పొం,దొప్పదయ్య నీకు నుదితశౌర్య. 127

వ. అని చెప్పి యాగామి యయిన చైత్రంబుపున్నమనాఁ డన్న రేంద్రచంద్రు నశ్వమేధయాగంబున కనురాగం బెసంగ రమ్మీ యనియునుం బలికి యప్పాండవ మధ్యముండు మేధ్యాశ్వంబు ననుసరింప నది కరిపురంబు దిక్కు మొగం బయి యరుగం జొచ్చె నట్టియెడ నతండు వివిధదేశంబులం దిరిగిన తెఱం గెల్లనుం జారులచేత విని యజాతశత్రుం డప్పురుహూతపుత్త్రుం డశ్వరక్షణం బట్లు ధర్మప్రకారంబున నిర్వహించుటకుం బ్రీతి వహించె నద్దివసంబు. 128

ఆ. మాఘమాసపౌర్ణమాసి యై యుండె నా,ధర్మనందనుండు పేర్మి వెలయ
నెలమి మిగులఁ బెద్ద కొలువున నుండి తమ్ములఁ సగౌరవముగఁ బిలువఁ బనిచి.

వ. అనిలనందనునాననం బాలోకించి. 130

క. నీతమ్ముఁడు తురగముఁ గొని, యేతెంచుట వింటిఁ జైత్ర మింకఁ దడవు లే
దీతఱి మునులను నృపసం,ఘాతంబును బిలువఁ బంపఁగా వలయుఁ దగన్. 131

వ. యాగశాలయు శిల్పిజనులం గొని కల్పింపుము తగువారలకు విడియం దగియెడు వివిధగృహంబుల నొనరింపు మని పనిచిన నతండు. 132

ఆ. యజ్ఞవాటమును జనాధిపులకు ముని, వ్రాతములకు విడియ వలయునట్టి
మందిరములుఁ గనకమణిమయంబులుగా నొ,నర్చెఁ దజ్జ్ఞమగుజనంబు వొగడ,

క. ధరణీసురులను బసచెను, ధర నేఁడును దిరిగి కుడుల ధాత్రీశుల న
ధ్వరమునకుఁ బిలువఁ డని యుష్మత్సుతుఁడు వారుఁ జని సముంచితభక్తిన్. 134

ఉ. పిలిచిన రాజులుఁ మునులుఁ బ్రీతి నెలర్ప బహోత్కారంబు శి
ష్యులుఁ దమతోడ రా మనము లుర్వీశు లూరంగ యజ్ఞవర్తనం
బులుఁ గనుఁగొంటకై సకలభూవలయంబునఁ గల్గునట్టి వా
రలు సనుదెంచినం గురుధరాపతి చిత్తము వేడ్క నూనఁగన్. 135

క. ఎదురుకొని వీడుఁబట్లకు, ముద మూరఁగఁ దాన యునిచి మొక్కలములు నిం
పొదవించునట్టివియుఁగాఁ, బదార్థములు [1]ప్రజదలమునఁ బాటించి తగన్. 136

క. భోజనశయనాసనములు, రాజిల్లెడునట్లు గాఁగ రాజుల కెల్లం
దేజోధనుఁ డా ధర్మతనూజుం డిడఁ బనుచు జనవినుతసుచరిత్రా. 137

చ. మునులకు నెల్లఁ గంధములు మాలములుం ఫలకోట్లునుం బ్రియం
బొనరఁగఁ దాన పోయి మధురోక్తులతోడ సమర్పణంబు సే
యు నిటుల సంవిధానము లనూనము లై విలసిల్లఁ జేయు న
య్యనిమిషనాథవైభవుఁ డహంకృతివర్జనసంస్తుతంబుగన్. 133

తే. యజ్ఞవాటంబుఁ దక్కటియాలయములు
లలితభంగి రమ్యములు సలక్షణములుఁ
గా నొనర్చిన శిల్పికి కాయమునకుఁ
బసదనం బిచ్చె సంతసం బెసక మెసఁగ. 139

సీ. పాండవాగ్రజుఁ డట్లు పవననందనుఁ బంచి యజ్ఞశాలాకరణాదు లైన
కృత్యముల్ నడపుటఁ గృష్ణుండు గనుఁగొని కడుఁ బ్రీతిఁ బొందె నాగతనృపాలు
రచ్చెరు వొంది రయ్యమృతాంశుసంశనిస్తారకుం డర్థిమైఁ దేరఁ బనుప
ననవద్యపశువుల నఖిలజాతులవానిఁ గొని వచ్చి రత్యంతకుశలపరిజ

ఆ. నంబు లన్నపర్వతంబులు నాజ్యవాహినులుఁ గల్గి విప్రజనపరంప
రలు భుజించు పేర్మి యొప్పసి యాగారంభసమయ మద్భుతప్రజనకమయ్యె. 140

క. విను లక్ష భూసురులు గుడిచిన నొకమారి మోయు భేరి సెలఁగుచునుండున్
జననాయక యెప్పుడు నే, మని చెప్పుదు నశ్వమేధయజ్ఞవిభూతిన్. 141

చ. శరధిపరీతభూమిఁ గల సర్వజనంబును దోఁచె నమ్మహా
ధ్వరమున భూపతుల్ మకుటపంక్తులు భూషణరాజిఁ జక్కఁగాఁ
బోరిఁ బోరిఁ ద్రోచికొంచు మదిఁ బొంపిరివోయెడు వేడుకం బనుల్
వెరవులు లావులున్ మెఱయ వేయువిధంబులఁ జేయు టొప్పఁగన్. 142

సీ. కలయంగ రాజులఁ గనుఁగొని ధర్మనందనుఁడు భీమునిఁ బిల్చి మనుజపతుల
కెల్లను వే పూజ లిమ్మన్న నమ్మరుత్తనయుండు దగఁ దనతమ్ముఁ దోయి

---

1 పసదనములఁ.

నెలమిఁ గూర్చికొని మహీశుల సబహుమానంబునఁ బూజించె నలిననాభుఁ
డప్పుడ సిరిసాత్యకిముఖయాదవసమూహంబు గాఁగఁ బ్రసన్నవదన
తే. కమల మెప్పంగఁ బాండవాగ్రజునికడకు
వచ్చుడును బ్రియ మరల నవ్వసుమతీశుఁ
డాబలుండును నతఁడును సాదిగా స
మస్తయాదవులకు నధికార్చ లిచ్చె. 143

వ. నారాయణుండు నరునిం బ్రసంగించి పాండవాగ్రజుమొగంబు గనుంగొని ద్వారవతి నుండి యాప్తుండును విచక్షణుండును నగువాఁ డొక్కరుండు వచ్చె విప్పవ్చుం డప్పురంబుపరిసరంబునఁ బోవం జూచితి ననియె వివిధసంగరంబులం దదంగంబు కృశంబై యున్నయది యనియుం జెప్పె నప్పార్థుండు నేరుపకు నరుగు దెంచెం గాలోచితక్రియాకలాపంబునకుం దొడంగు మనవుడు నప్పు డమితేఁ డప్పురుషోత్తమునితోడ.

క. నీపంపునఁ బోవుట నుద్దీపితబలశౌర్యధైర్యతేజోయుతుఁ డై
యాపార్థుఁడు యోగక్షేమోపేతుం డయ్యె నడపు ముచితంపుఁబనుల్. 145

కృష్ణుఁడు ధర్మజునితో నర్జునసందేశంబు సెప్పుట

వ. అనిన నవ్వారిజనాభుండు ద్వారకనుండి వచ్చినవాఁ డగ్గాండీవి దనతోడం జెప్పె నని చెప్పినమాటలతెఱం గాకర్ణింపుము. 146

ఆ. నాదు విన్నపముగ నరనాథునకు విన్నవింపు రాజులెల్ల వేడ్కతోడ
జన్నమునకు వచ్చుచున్నారు ము న్నట్టివార లైనఁ బూజనలయు ననుము. 147

వ. విశేషించి మదీయపుత్త్రుండు. 148

క. మణిపూరపురాధీశుఁడు, గుణగణవిభ్రాజితుండు గురుహితుఁడు విచ
క్షణపరుఁడు బభ్రువాహనుఁ, డణుమాత్రముఁ గీడు లేనియట్టిం దెందున్. 149

క. మీచరణసరసిజంబులు, సూచుటకై రాక దనకు సువ్రతముగ మున్
వేచి యునికి వచ్చుఁ గృపా,[1]గోచర మగుచేఁతకుం దగును మీ కనుమీ. 150

వ. అని చెప్పె ననిన విని యవ్వాక్యంబు లభినందించి ధర్మనందనుండు గోవిందుని తోడ 151

సీ. ఏ వింటి విజయుఁ డనేకయుద్ధంబుల నలజడి వడుట య ట్లతఁడు నాఁడు
నక్కట ద్రోణభీష్మాదులతోడియెక్కుడుఁబోర నిడుమలఁ బడియె నేఁడు .
నిత్తెఱంగునఁ బడియెడు నాకుఁగా నిన్నిపాటులు వడునె యప్పరమసౌఖ్య
యోగ్యదేహుండు ని [2]న్నొక్కటి నడిగెద నతనిమేను సులక్షణాన్వితంబు
తే. నామదికి నెక్క నీవు గన్వఱపి కన్న, యట్టికీడు తదీయంబు లైనయవయ
వముల నెందేనిఁ గలిగెనే యమితదుఃఖ,భాగియగుటకు మూల మై పద్మనాభ.
క: తెలుపఁ దగు నేనిఁ గరుణం, దెలుపుము నా కనుడు వాసుదేవుఁడు నీకుం

1 గోచరుఁడుగఁ జేఁతకుం. 2 న్నొకటి నే వేఁడెద.

వెలుపుటయుఁ గృత్యమే విను, తెలిపెదఁ గలమాత్ర వసుమతీవరముఖ్యా. 153

తే. సర్వగాత్రంబులందును సవ్యసాచి
కధికశుభలక్షణంబుల యతిశయిల్లు
దనువుమాత్రకు నించుక ధరణినాథ
యెక్కుడై యుండుఁ జిఱుదొడ లిడియ కొఱఁత. 154

క. అలజల్లి దీనివలనం, గలిగెడునో కాని తక్కు గలుగ దరిష్టం
బలఘుశుభలక్షణాన్విత, విలసితతనుఁ డైనగాండివికి నెయ్యెడలన్. 155

వ. అట్లున్నరూపు సెప్పినవెన్నునివచనంబులు విని యవ్వసుంధరావల్లభుం డతని యాననం బాలోకించి యది యట్ల కాక యని పలికె నప్పుడు పాంచాలి పద్మనాభుం బ్రీతిస్మితం బగుచూడ్కి నాలోకించిన నాలోకనాథుం డది యర్జున విషయం [1]బైనప్రేక్షణంబుతెఱం గగుట యెఱింగికొనియె నట్టియెడ భీమాదులును యాదవకుమారులును నక్కిరీటిగుణంబు లగ్గించుచు నాప్రొద్దున కదియ గోష్ఠిగ సల్లాపంబు సేయుచుండ నగ్గాండీవిపాలనుండి కాలరి సనుదెంచి 156

సీ. పాండవాగ్రజునకుఁ బ్రణతి యొనర్చి విన్వచ్చుఁ డిప్పురి సేర వచ్చె నెల్లి
వచ్చు మీశ్రీపాదవనజంబులకు మ్రొక్క ననవుడు హర్షాశ్రు లడరఁ బులకి
తాంగుఁ డై వానికి నన్నరేంద్రుఁడు పసదన మాభరణవస్త్రకనకములు స
మగ్రంబుగా నిచ్చె నందఱు నానందరసమునఁ దేలి యారాత్రి పార్థుఁ

ఆ. జూచువేడ్క నూనుచును వేగు టెప్పుడో
యనుచు నుండ [2]నుదయ మయ్యె నినుఁడు
క్రీడి సమయవిహితకృత్యముల్ సలిపి హ
యంబు మున్న గాఁగ నరుగుదెంచె. 157

వ. అప్పుడు. 158

### అర్జునుఁడు యజ్ఞాశ్వంబుతోడ హస్తిపురంబునకు వచ్చుట

క. విను మింద్రతురగసముఖ్యేలనమున నవ్వాజి జనములకు నెల్లను లో
చనపర్వ మయ్యె వారివ,దనముల సంతోషమధురతరభాషణముల్. 159

సీ. కలయంగ నిట్లని చెలఁగె నిగ్గాండీవి దక్క నిమ్మాడ్కి నొండొక్కరునకు
నశ్వంబు దనయిచ్చ నఖిలదేశములకు నరుగంగ ధరణీశు లచట నచట
బలములతో వచ్చి బలసి తదీయరోధం బాచరింపఁ దృణంబు గాఁగ
గొని లీలమై గెల్చు గొనుచోట్ల నుగ్రత వాటింప కగ్రజుపలుక యెట్టి

తే. దశల నైనను బాటించి తా నొకండ, ననుతలం పెద్ద నుల్లంబునందు లేక
తనువు గవుసెనఁ బెట్టి పుచ్చినవిధమున, [3]నరుగుదేవచ్చునే యిది యక్కజంబు.

---

1 బైనప్రణయంబు తెఱం; మైత్రిప్రియంబు తెఱం. 2 నుదితుఁ డయ్యె నినుఁడు. 3 నరుగుదెంచునె యిది గడు నక్కజంబు.

క. సగరాదులఁ జెప్ప వినమె, మగఁటిమియును బలము ని ట్లమానుషభంగిన్
నెగడు నె యింకను బుట్టరు, జగతిని గాండీవితోడ సరి వచ్చుమగల్. 161

క. మానుషము దైవమును సరి, నే నే నని కార్యసిద్ధి నెఱయింపఁగ ని
త్యానందుఁ డయ్యె ధర్మజుఁ, డీనిర్మలభాగ్యమహిమ యేరికిఁ గలదే. 162

క. విను మట్లు నెలంగఁగ ఘూ, ర్ణన మొందినయర్ణవం బనఁగఁ బొం గారెన్
జననికురుంబం బా పెం, పనఘా చూడ వినఁ బడయ మఖిలజగములన్. 163

వ. మఱియును. 164

సీ. నృపు లోహటింప జంత్రపుమీను నేసి చేకొనియెఁ బాంచాలినిఁ గాంతు నితఁడె
సురసేనతోఁ బురందరు గెల్చి భుజగర్వ మేపార ఖాండవం బేర్చె నితఁడె
యెక్కటిబవరాన నీశాను మెప్పించి పాశుపతాస్త్రంబుఁ బడసె నితఁడె
యొంటిమై భీష్మాదియోధుల కురుపతిభృతిఁ బాపి గోవులఁ దెచ్చె నితఁడె
తే. ప్రతినసేసి విషమసమరమునఁ బ్రొద్దు
గ్రుంక నీ కాఁగి సైంధవుఁ గూల్చె నితఁడె
యనుచు సందడి గాఁ గ్రమ్మి యఱ్ఱు లెత్తి
చూచె జనలోక మాసవ్యసాచిఁ బ్రీతి. 165

క. ఆవాక్యము లెల్ల వినుచు, భావ మలర నర్జునుండు భాసుర మగున
మ్మా వగ్రేసరముగ యజ్ఞావాసంబునకు వచ్చె నంచితలీలన్. 166

వ. అట్టియెడ ధర్మనందనుండు భీమాదులును గృష్ణుండును బలదేవప్రభృతులును ధృతరాష్ట్రుం బురస్కరించికొనుచు నప్పార్థు నెదుర్కొని రతండు వారల నెల్ల సముచితాచారసంప్రీతులం గావించి గాంధారిని గుంతినిం గాంచి యీఁత కాఁడు తీరంబు గనినచందంబు నొంది యందఱు నభినందించుచుం బొదివికొని యుండ నొక్కరమ్యప్రదేశంబున నుండె నాసమయంబున. 167

సీ. బభ్రువాహనుఁడు వైభవ మొప్పఁ జిత్రాంగ
దయు నులూపియుఁ బ్రమదంబుతోడఁ
దోడ రా ధర్మపుత్త్రునిమందిరమునకు
నరుగు దెంచుటయు నక్కురువరేణ్యుఁ
డును దమ్ములును గృష్ణుఁడును బలభద్రాది
యాదవులును బ్రీతు లై తదీయ
సందర్శనము నర్హసత్కారచరితార్థ
ముగఁ జేసి రతఁడును దగినవిధుల
తే. నందఱకుఁ బ్రియ మొనరించి యాంబికేయు
పతనిభార్యను గని నమస్కృతు లొనర్చి

గొంతిఁ గాంచి యాయమయదుగులకు నెఱఁగి
[1]పలుదెఱఁగుదీవనలును గౌఁగిలియుఁ బడసి. 168

వ. ధర్మపుత్త్రుం గొలిచి కూర్చుండ నతని కతండును ననుజులును వేర్వేఱ సర్వరత్నరాజీవిరాజితంబు లగుభూషణంబులును బరమాంబరములును నొసంగిరి సీరపాణిశౌరిప్రభృతులు ప్రభూతాభరణంబులను భాసురవాసోవిశేషంబులను నతని నర్చించి రయ్యవసరంబున. 169

సీ. చిత్రాంగదయు నాగపుత్త్రియు, నొలితొలి గాంధారిఁ గని గొంతిఁ గాంచి చెలిమి
దీవించి గాఢసంభావనఁ గౌఁగిటఁ జేర్చి యద్దేవి రత్నార్ఘ్య లెసఁగు
తొడవుల నర్చించె ద్రోవదియును సుభద్రయు వారు దమ్ముచితప్రకార
మునఁ గన్న నమ్మెయి వినుతపూజనముల నతులసమ్మోదము నావహించి
ఆ. యోగ్యపీఠములను నునిచి తత్సల్లాప,సౌఖ్య మొంది రట్లు సకలవర్త
నముల నశ్వమేధసముపక్రమం బుదా,త్తాభిరామ మయ్యె నధిపముఖ్య. 170

వ. పదంపడి యర్హదివసంబు సంప్రాప్తం బగుటయు సాత్యవతేయమునిపతి కురుపతిపాలికిం జనుదెంచి నేఁడు యజనంబునకుం దొడంగుము యాజ్ఞికులు శుభముహూర్తం బాసన్నం బయ్యె ననుచున్నవారు నీమఖంబు మహనీయంబు నీవు మహాధనవంతుండ వైతి దక్షిణలు ముమ్మడుంగులుగా నిడి మూఁడుమఖంబుల ఫలంబు నొందు మశ్వమేధావభృథంబు పరమపావనంబు సమస్తదురితపరిహరణనిపుణంబు నీకు భారతరణకృతజ్ఞాతివధంబు పాతకం బనుమెరమెర మనంబునం గలిగియుండు నట్టివియెల్లను దీన [2]నిస్తుషంబు లగు సమస్తశుభంబులు నావహిల్లునని యాజ్ఞాపనంబు సేయుటయుఁ బ్రాజ్ఞపరుం డైనయాంభూవరుండు. 171

ధర్మరా జశ్వమేధయాగంబు సుప్రయోగంబుగాఁ జేయుట.

క. ప్రయతుం డై హయమేధ,క్రియాకలాపంబునకుఁ బ్రకీర్త్యముగాఁ జొ
చ్చి యుదాత్తభంగి జనమే,జయభూవర నడపె గాఢసంప్రీతిమెయిన్. 172

క. క్రమయుక్తము యుక్తముఁగా,నమరగురుప్రతిము లైనయాజ్ఞికులు క్రియా
సముదయము నడపఁగా స్ఖలి,తము లేకపహుతము సొరక తత్క్రతు వొప్పెన్.

చ. అవహితు లై ప్రవర్గ్యము బుధాభినుతంబుగఁ జేసి ఋత్విజుల్
సవనము లుక్తమార్గము ప్రశంసకు నెక్క నయించి వేదవా
క్యవిహితవృత్తిమై నభినవాభ్యుదయం బొనరించి రర్థి మా
ధవుఁ గొనియాటలం దమకృతంబులకున్ మెఱుఁ గిడ్డయట్లుగన్. 174

వ. అట్టియెడ. 175

సీ. [3]వివిధభోజ్యపదార్థవిభవంబు వలనను సంతృప్తిఁ బొందక చనునరుండు
ధనధాన్యవస్త్రసంతతిలబ్ధి దారిద్ర్య మపనయింపక యేఁగునట్టివాఁడు
గోరి యొయ్యది యైన గారవ మెసఁగంగఁ బడయక రిత్తపోయెడు మనుష్యుఁ

1 పలుదెఱఁగు దీవనయును. 2 నిశ్శేషం బగు సమస్త. 3 సారాన్నముల మనోహారిపానములను.

పెద్దయేనియు దురగము మెలసినఁ జనుదెంచి యది నిస్తరింపక యదుసనతఁడు

తే. మందునకు వెదకినను లేఁ డంచ నెంచ, నరసి కుశుప్రఁడు కట్టుఁ డుచ్ఛ్వాసరూప
వస్తువులు నైకొనుఁడు దురవస్థ తెలిసి, పాఁకొనుఁ డని భీముఁడు పలుకు చుండ.

ఉ. ఆయతులాధ్వరంబున క్రతాభిరతత్వముఁ జేసివాఁ డుపా
ధ్యాయుఁడు గానివాఁడు నిగమాంగకషట్కముఁ జేనివాఁడు లేఁ
డేయెడఁ జూచినన్ సభ నరేశ్వర యట్టిసదస్యు లెప్పుడు
న్నాయకుఁ గొల్వుదివ్యమునినాథులు దక్కఁగఁ గల్గ రెచ్చటన్. 177

వ. అట్లుం గాక. 178

సీ. కనుఁగొనుకౌతుకంబునఁ గూడి చనుదెంచి దివ్యమునీంద్రు లతిప్రియమున
నభినందనము సేయ నఖిలగంధర్వులు నానందనము లగుగానములను
నప్సరఃస్త్రీలు హృద్యము లైననృత్యవిశేషంబులను నుల్లసిల్లుచుండ
సిద్ధవిప్రజనంబు సేసలు సల్లుచు బహువిధాశీర్వాదపరతఁ బరఁగ

తే. [1]నాద్యులై పేరు గలుగుపదార్వ రవని
వరులయాగంబులకు సరి వచ్చు మిగులఁ
గాని యిది వత్రపడ దనఁ గా వెలుంగు
ధర్మతనయుని యశ్వమేధము నరేంద్ర. 179

వ. పసిఁడియిట్టికలం జతుశ్చిత్యంబు నష్టాదశకరాత్మకంబును గరుడాకృతియును గా యజనం బొనర్చి మహనీయం బై యొప్పు చుండు యూపక్రియాసమయంబున ఖాదిరంబు లాఱును బైల్వంబు లాఱును బాలాశంబు లాఱును దేవదారుమయంబులు రెండును శ్లేష్మాతకతరుకల్పితం బొకండును గా నిరువదియొక్కయూపంబులు దక్కను శోభనార్థంబుగా ననేకకాంచనయూపసంచయంబును శాస్త్రోక్తప్రకారంబున యాజకులు నిలిపి వానియందు. 180

క. నలుగాలివానిఁ బక్షుల, జలచరముల విధియుతముగ సంయోజింపం
బొలిచెం బశువులు మున్నా, యలఘుయశోమహిత యమ్మహాయజనమునన్. 181

క. వరయూపసుయోజిత మగు, తురంగమును చుట్టుఁ బశుతతుల నిల్పిన సుం
దరభావము దక్షమఖ, స్ఫురణం బిట్టి దని చూపుపోలిక మెఱసెన్. 182

తే. ఆగమోక్తంబు దర్శనీయంబు నైన, యాసుతంత్రంబు నొనరించుయాజకోత్త
మావలికిఁ దా నలంకార మై పరాశ, రాత్మజునిశిష్యకోటి యొప్పారె నధిప. 183

ధర్మరాజు వ్యాసునకు యజ్ఞదక్షిణగాఁ దనరాజ్యం బంతయు నిచ్చుట

వ. సర్వపశు [2]శ్రపణంబు లాచరించి ఋత్విగ్జనంబు లశ్వాలంభసమయంబున యాజ్ఞసేని సన్నిహితం జేసి యశ్వంబునవయవంబుల మాంసంబు లయ్యైదేవతలకు నాహుతు లిడునప్పు డమ్మహాదేవి నిజహస్తంబునం జేయం దగియెడు

---

1 నాఢ్యులై. 2 విశసనంబు లాచరించి.

హుతంబులు సేయించిరి తదనంతరంబ యశ్వవపాహోమంబునం బరఁగు
గంధం బాఘ్రాణించి ధర్మనందనుండు దమ్ములుం దాను బరమానందంబునం
బొందె శేషించినయశ్వావయవంబు లర్హప్రకారంబున యాజకులు వేల్చి రిట్లు
సాత్యవతేయుండు యుధిష్ఠిరునశ్వమేధం బఖిలలోకహితంబుగా నిర్వహించి
యాతనిగుఱించి యుదాత్తనాదం బెసంగ నాశీర్వాదంబు సేసె సమస్తదేశ
మునులును దీవన లిచ్చి రప్పుడు కౌరవవంశపావనుం డగు భూవరుండు. 184

తే. అలఘుభక్తి సదస్యుల కెలమి యొసక, మెసఁగఁ గోటివేల్ నిష్కములిచ్చి తనదు
వసుధ యంతయు నొసఁగె దివ్యప్రబోధ,ఘనత నొప్పు వేదవ్యాసమునివరునకు.

క. విను ఋత్విగాధ్యుఁ డగున,మ్మునిపతి యట్లు కురువంశముఖ్యుఁ డొసఁగ మే
దిని సంప్రమోదమునఁ గై,కొని యి ట్లను నానరేంద్రకుంజరుతోడన్. 186

ఆ. జగతి ఋత్విగర్థముగ నిచ్చి తేము వి,ప్రస్వభావకలనఁ బసిఁడిఁ గొనఁగఁ
గోరెదము కరంబు గారవంబున బ్రాహ్మ,ణాభిలషితదాయి వగుట మేలు. 187

వ. అని వెండియు. 188

క. ఇలకు వెలగా హిరణ్యం,బలఘుమతీ మాకు నొసఁగు మనుటయు ధరణీ
శులు వినఁగా నప్పౌరవ, కులపతి యావేదరక్షకున కి ట్లనియెన్. 189

ఆ. అశ్వమేధమునకు నార్యులు దక్షిణ, ధరణి యండ్రు గాన నరునిచేత
విజిత యైనధరణి ప్రజనితకీర్తిమై, ఋత్విగర్పనముగ నిచ్చినాఁడ. 190

వ. అని మఱియును. 191

చ. వనమున కేఁగి యందు సుఖవాసత నుండఁ గలాఁడఁ గాక యే
ననఘవిచార బ్రహ్మధన మక్కట కొందునె యన్నఁ బ్రీతిమై
ననుజులు యాజ్ఞసేనియును నట్టిద యాపని యొండు సెప్ప కుం
డనుటయు హర్ష బాష్పపులకాంకురముల్ ధరియించి రందఱున్. 192

వ. అప్పుడు. 193

తే. దివ్యవాణి గీర్తించెఁ గౌరవ్యవరుని
నఖిలజనములుఁ బ్రస్తుతిముఖరు లైరి
తానుఁ బొగడి వేదవ్యాసుఁ డానరేంద్ర
చంద్రునకు నిట్టు లను విప్రచయము వినఁగ.

క. ఏ మమ్మెద మనినఁ బృథివి, యోమనుజాధీశ కొనుట యొప్పెదు తెరు విం
దేమియును నెగ్గు లే దీ, భూమిసురుల కోర్కి దీర్చి పుచ్చుము ప్రీతిన్. 195

క. అని పలికినఁ గృష్ణుం డి,మ్మునినాయకుపనుపు సేయుము నరేశ్వర నీ
వని చెప్పిన నొడఁబడి తన, యనుజులతో నట్ల కాక యని యతఁ డర్థిన్. 196

తే. కోటికోటులు మాడలు గుప్పవోసి, ధరణివెల యని చెప్పి యప్పరమసంయ
మాధిపతికి సమర్పించె నతఁడు ఋత్వి,గావలికిఁ బంచి పెట్టె నయ్యతులధనము. 197

వ. మఱియును, 198

తే. అతులకనకమయము లైనయజ్ఞవాట, వేదికాయూపతోరణవివిధభాండ
దండశయ్యాసనాదులఁ ధరణినాథుఁ, డొసఁగె విప్రచయంబుల కుల్ల మలర. 199

తే. అట్లు విప్రుల కిచ్చి యనంతరంబ
రాజులకు వైశ్యులకు శూద్రరాజికన్య
జాతులకు మ్లేచ్ఛులకును బ్రభూతధనము
ద్రవ్వి తండంబు లిచ్చె నాధరణివిభుఁడు. 200

క. ఇమ్మెయి సకలజనులు హేమమ్మునఁ బరితృప్తులై యమంద మ్మగుమో
దమ్మునఁ దేలుచు నిజవాసమ్ములకుం జని రజాతశత్రుఁ బొగడుచున్. 201

క. రెండవమరుత్తుఁ డై య, ప్పాండవముఖ్యుండు సేయుపరమవితరణం
బొండొకరియెడఁ గల్గునె యెన్నండును జూడ విన సజ్జనస్తుతచరితా. 202

క. తనయంశ మైనకనకము, విను కుంతీదేవి కిచ్చె వేదవ్యాసుం
డనఘా యది యంతయు న, వ్వినుతచరిత ధర్మకృతుల వినియోగించెన్. 203

తే. సకలబాంధవభూపతిసంయుతముగ, నానరేశ్వరుఁ డవభృథస్నానపూత
గాత్రుఁ డై చిత్తగతసర్వకల్మషములఁ, బాచి నిర్జితస్వర్గత్వభాసి యయ్యె. 204

వ. అట్లొప్పి యప్పుడమితేఁడు పరాశరనందనుచరణారవిందంబులు దనవెడంద
నొసలు సోఁకఁ జాఁగి మ్రొక్కి యక్కులపతిం బెక్కుభంగులం బ్రస్తుతించి యా
మంత్రితుం జేసిన నామునిశ్రేష్ఠుండు శిష్యసంఘసహితంబుగా నంతర్ధానంబు
నేసె నట్టియెడ. 205

ధర్మజుఁడు యజ్ఞంబునకు వచ్చిన రాజుల నెల్ల సత్కరించి పంపుట.

క. అనుజులు నఖిలనృపాలురుఁ, దనుఁ బరివేష్టింప నొప్పెఁ దారలలోనం
బెనుపొందు చంద్రుగతి నమ్మనుజాధీశ్వరుఁడు గురుకుమారప్రవరా. 206

తే. క్రతువుఁ జూడ నేతెంచినరాజవరుల, కందఱకు మణిభూషణహస్తివాజి
వారకాంతాచయముల నవ్వసుమతీశుఁ, డొసఁగె ధనదునికై వడి నెసక మెసఁగ.

ఆ. బభ్రువాహనునకుఁ బరమవిశేషంబు, మెఱయ గారవించి మేలివస్తు
కోటు లొసఁగి ప్రీతిఁ గూరినమనముతో, నతని దత్పురమునఁ కరుగఁబనిచె. 208

క. చిత్రాంగదయు నులూపియు, వృత్రారితనూజుపాల విభవమహిత లై
గోత్రావర నిలువఁగ నద్ధాత్రీశుఁడు సనియె సమ్మదం బెలరారన్. 209

తే మున్న చనుదెంచి ప్రీతిమై నున్నయట్టి
దుశ్శలకుఁ బెంపు గలుగఁ దత్పౌత్రపుత్త్రు
సింధుదేశంబునకు నభిషిక్తుఁ జేసె
దోహలమున నజాతశత్రుఁడు నరేంద్ర 210

క. తమతమదేశంబులకు భూ, రమణుల నెల్లను విభక్తరాజ్యులఁ గాఁగ న
[1]య్యమము నెఱయ నిలిపెఁ బాండు, కుమారాగ్రణి పెద్దకొడుకు కౌరవముఖ్యా.

వ. ఇత్తెఱంగున నెల్లరాజులయుల్లంబులు ప్రమదంబునం బొందం జేసి వీడుకొలిపి కృష్ణునకు నత్యుత్తమవస్తువిస్తారమహోదారం బగునుపహారం బిచ్చి దేవోపచారంబుల నారాధించి కృతార్థత్వంబు నొంది యశ్వాధ్వరోత్తముండు బలభద్రునకు భక్తియుక్తంబును వివిధరత్నవిరాజితంబును నగుపూజావిశేషంబునం బరమసంతోషం బావహించి సాత్యకిప్రభృతియాదవలోకంబున కతిలోకంబు లగునానావిధపదార్థంబు లొసంగి యయ్యందఱుం దనచేత సుచితప్రకారంబుల నామంత్రితులై ద్వారకానగరంబున కరుగం దాను మఱియు ననేకదేశాగతులైనజనంబుల నన్నపానంబులం గనకవస్త్రాదిదానంబుల ననురక్తులం గావించి మహారావంబుల దిశలు పిక్కటిల్లం జెలంగుమంగళతూర్యంబులు మొరయం బుణ్యపాఠకరవంబులు నానందగానంబులు వినుచు మందిరంబునకుం జను దెంచె నని చెప్పిన వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె. 212

ఆ. అనఘ మత్పితామహునియశ్వమేధయా,గంబునయము నగరంబు విస్మ
యంబుఁ జేయఁ జాలనట్టిది యే మేనిఁ, గలిగె నేని వినఁగ వలతుఁ జెపుము. 213

వ. అని యడిగిన యమ్మహీనాయకునకు వైశంపాయనుం డిట్లనియె. 214

క. ఆమ్మెయిఁ బ్రభూతధనలా,భమ్మున భూమిఁ గలయట్టిబ్రాహ్మణు లెల్లన్
సమ్మద మొందఁగ హయమే,ధమ్ముజ్జ్వలభంగి నొప్పెఁ దత్సమయమునన్. 215

తే. అఖిలజనములు నచ్చెరువంద ధర్మ,నందనునిమానసమున నానంద మొలయ
నతనిపై మకరందధారాభిశోభి, కుసుమవర్షంబు పెల్లుగఁ గురిసె నధిప. 216

వ. అట్టియెడ. 217

సక్తుప్రస్థచరిత్రంబు నకులంబు బ్రాహ్మణులకుం జెప్పుట.

సీ. ఒక్కబిలంబుననుండి వెల్వడి యొక్కనకులంబు విప్రజనంబునడుమ
నిలిచి సక్తుప్రస్థునల్పుధర్మంబు నేమియుఁ బోల దీయశ్వమేధ మనిన
నవ్విప్రు లతివిస్మయం బంది యమ్ముంగిఁ గనుఁగొని మంత్రవర్తనముఁ దంత్ర
గమనికయును వివిధములైనదానవిధులు బహుళత్యాగములును లోక

తే. సంస్తుతము లయ్యె భక్తియు శ్రద్ధయును బ్రి
యంబు వినయంబు సురమునిహర్షమావ
హిల్లఁ జేసె నీ వేమిట నిమ్మహాధ్వ
రంబుఁ గీడంటి చెప్పుమ ప్రస్ఫుటముగ. 218

వ. అనుటయు నన్నకులంబు వారల కిట్లనియె. 219

---

1 య్యమున నిలిపెఁ బాండుతన్మా, రమణుని పెద్దకొడుకు కురురాజప్రవరా.

సీ. వినుండు ధర్మక్షేత్ర మనఁ బూన మైనకు
రుక్షేత్రమునయందు కోషకాపు
విరహితుం డొకపుణ్యద్విజుఁ డుంఛవృత్తిపైఁ
నుండు భార్యయుఁ దనయుండు నతని
పత్నియు సహచరభావంబు నొంది వ
ర్తింతు రట్టులు తపశ్శ్రీ వెలుంగ
నున్నెడఁ[1]బులుసంట లన్నియు నత్యంత
వికలంబుగా ననావృష్టిదోష

తే. మావహిల్లిన నతని కాహార మొనరఁ
జేసికొనుట దుర్ఘట మయి చెల్లు చుండఁ
దారు నలువురు జని తృణధాన్య మల్ప
మేఱికొని వత్తు రాఁకలి చీఱ కుండు. 220

వ. అట్టియెడ నొక్కనాఁ డయ్యందఱును చేపు దోడంగి పడమటిజామునకు వెదకి తెచ్చినపూరికొలుచు ప్రస్థమాత్రంబు సక్తు వయ్యెం గర్తవ్యానుష్ఠానంబులు నడపి యనంతరంబ యాకుం జెడుపేలపిండియుఁ జెఱు మూనెండు (నలువురును సమంబుగాఁ) బంచికొని యుపయోగించువారై యున్న సమయంబున. 221

యముఁడు సక్తుప్రస్థునికడ కతిథి యై వచ్చుట

తే. అతిథి యొక్కధరామరుం డరుగుదెంచెఁ
గని ప్రియంబున వా రెదుర్కొని సభక్తి
కముగఁ బర్ణశాలాభ్యంతరమున కతనిఁ
దోడికొనిపోయి యాసనస్థుఁడు గఁ జేసి. 222

చ. అడుగులు గడ్గి ప్రీతి యొసలారఁగఁ దద్దయు నెమ్మిఁ బల్కి ర
ప్పుడు మది పల్లవింప మునిపుంగవుఁ డాతని కాత్మభాగ మె
క్కుడగువినీతిఁ జూపి బుధకుంజర నిర్ధరితార్జనంబునం
బడసిన యట్టిసక్తువు గృపారతి నాఁకలి దీఱఁ దీర్పవే. 223

వ. అని సమర్పణంబు సేసిన నమ్మహీసురోత్తముం డాసక్తు వుపయోగించె దాన నతండు తృప్తిం బొంద కునికి యమ్ముని గనుంగొని యేమిట నితండు తృప్తుం డగు నెట్లు సేయుదు నొకో యనువిచారంబు నొందమి డోలాయమానమానసుం డయ్యెం దదీయభార్య దదింగితం బూహించి యతనితోడ. 224

క. నాపాలిసక్తు విచ్చెద, నీపురుషునిఁ దృప్తుఁ జేయు మీ వనిన నతం
డాపాలఁతిడప్పియును సం,దీపితజఠరాగ్ని యైన తెఱఁగును గనుచున్. 225

వ. ఇట్లనియె. 226

---

1 బలుపంట.

క. మృగములుఁ బక్షులు లోనుగఁ, దగునాహారములు దెచ్చి తమప్రియులకు నిం
పుఁగ నిచ్చు నాకుఁ గొనఁగాఁ, దగునె భవదోజ్ఝ్య మైనద్రవ్యము సాధ్వీ. 227
క. స్త్రీ సంతోషించు తెఱం, గాసపడనిమనసు గలుగు నట్టియధముఁ డి
చ్చో సడిఁ గనుఁ జని యచ్చోఁ, గాసింబడు జమునిభటులు గాఱియ వెట్టన్. 228
వ. అనిన విని యవ్వనిత యతనివదనంబునం జూడ్కి నిలిపి. 229
తే. పతియ చుట్టంబుఁ బక్కంబుఁ బతియ చెలియుఁ
బతియ తల్లియుఁ దండ్రియుఁ బతియ గురువుఁ
బతియ దైవంబుఁ గావున నతనిపని యొ
నర్చుటయ చూవె ధర్మంబు నాతి కరయ. 230
వ. అట్లుంగాక. 231
క. మానితగుణ నీవాఁకలి,తో నుండఁగ నేటిపాలు దోషం బిది యి
ట్లే నాహారము గొందునె, యీనిర్మలమతికి దీని ని మ్ముచితవిధిన్. 232
చ. అని తనసక్తు విచ్చినఁ బ్రియమ్మున నమ్మునియమ్మహాద్విజుం
గనుఁగొని దప్పివోదిదియుఁ గైకొనుమన్న నతండు ప్రీతి నె
క్కొన భుజియించి వెండియును గూరఁడ తృప్తిఁ దదంతరంగముం
[1]గనుఁగొని యత్తపస్విపతి గ్రమ్మఱ నెమ్మదిఁ జింత నొందినన్. 233
వ. తదీయతనయుండు వద్దశావిశేషం బెఱింగి. 234
సీ. తనపాలిసక్తువుఁ దండ్రికిఁ జూపి యీ యతిథిఁ దృప్తునిఁ జేయు మనఘ దీనఁ
దనయుండు దండ్రిచిత్తమున నెక్కొనినకృత్యం బాచరించుట యర్హధర్మ
మన విని యమ్మహాముని యొంతప్రాయంబు సనినను విను జనకునకు సుతుఁడు
బాలుండ యాఁకలి బాలుర కగ్గల మట్లు గావున నిది యనుచితంబు
తే. నావుడును దాన పుత్త్రుఁ డనంగ విందు
నన్నుఁ గాచుట యరయంగ నిన్నుఁ గాచి
కొనుట యిప్పిండి యిమ్మహాత్మునకు నిచ్చి
కావవే నన్నుఁ గారుణ్యభావితాత్మ. 235
వ. అనినంగొడుకుమాటలకు నమ్మహితాత్ముండు ప్రీతాత్ముండై యాసక్తు వాయతిథి
కిచ్చినం బుచ్చికొని యతం డుపయోగించె దానను నాఁకలి వోని తెఱంగు దోఁ
చిన నయ్యుంఛవ్రతునిడెందంబు గుందు నొందినఁ గోడలు తదాకారప్రకా
రంబు గని తనయంశం బైనపిండి మామముందటికిం దెచ్చి. 236
సీ. ఇదియును నతిథికి నిం డన్న నక్కట యాఁకట దలరి నీయంగకములు
శిథిలంబు లైనవి సేడ్పడి యున్నది చిత్తంబు దీనిఁ బుచ్చికొని నిన్ను
దప్పితో నుండంగ నెప్పాటఁ జూడఁ గలాఁడ నే ననుడు నాలలన మీరు
మద్గురుగురులరు మహితశుశ్రూషకుఁ గాదె ప్రాణములు నంగములుఁ గలిమి

1 గనికొని.

తే. విహిత [1]మిటు నేత నా కనువృత్తిశీలఁ
గాఁగఁ జేయుండు నన్ను మీకరుణ యలర
ననిన సంయమివరుఁ డియ్యకొని యతనికి
నచ్చెలువపాలిసక్తుప్ర నర్థి నిచ్చె. 237

ఉ. ఇచ్చినఁ బ్రీతిఁ బుచ్చికొని యిం పెసలార భుజించి తృప్తి మై
నచ్చుపడంగ మెచ్చున ముఖాంబురుహం బలరంగ నిట్లనుం
బొచ్చెము లేక యయ్యతిథి భూరిగుణోత్తర నిన్నుఁ జూడఁగా
వచ్చితి నేను ధర్ముఁడ భవద్వ్రతశీలతఁ జూచి మెచ్చితిన్. 238

క. భక్తియు వినయము శ్రద్ధాయుక్తియునుం దాల్మితోడియొప్పును గరుణా
సక్తియు నతిథులయెడ నను, రక్తియు నీయంద సుస్థిరత్వముఁ బొందెన్. 239

క. నీదానంబున విస్మితు, లైదైవతయక్షసిద్ధు లభివర్ణన ము
త్పాదరమునఁ జేసెద రిదె, రోదసి సమ్మర్దముగ నరుగుదెంచి తగన్. 240

క. అని చూపి పల్కునవసరమునఁ బర్జన్యుండు గురిసెఁ బుష్పాసారం
బనవద్యహృద్యనాదంబున మ్రోసెను దేవదుందుభులు గగనమునన్. 241

వ. అప్పు డయ్యతిథి వెండియు. 242

యముఁడు సక్తుప్రస్థుని బ్రహ్మలోకంబునకుఁ బో నియోగించుట

క. నినుఁ జూచువేడ్క నేడ్వురు, మునులమునంబుల సమగ్రముగఁ గదిరెడు స
జ్జనకీర్తనీయ దివికిం, జనుదెమ్ము ప్రియాసుతస్నుషాసహితముగన్. 243

తే. క్షుధ హరించుఁ బ్రజ్ఞాపరిశోభనతలఁ, దృష్ణ గుందించుఁ గృప నీవు దెలిసి వాని
ననఘ నిర్జించి తాలు బిడ్డనక యతిథి పూజనం బిట్లు నడపినపుణ్యమునకు. 244

క. తగుప్రియమున సకుటుంబంబుగఁ దనసభ [2]కీవు రాక బుద్ధిం గని బ్ర
హ్మ గడుఁ వేడ్క విమానంబు గురువ్రతశీల శీఘ్రమునఁ బుత్తెంచున్. 245

చ. వినుము ప్రభూతదానములు విశ్రుతయజ్ఞములుం సధర్మతా
వినుతికి నెక్కుఁ జాలవు వివేకనిధీ పరిశుద్ధిశోభితా
ర్జనమునఁ దెచ్చికొన్నది వరం బగుఁ బాత్రము నర్హకాలముం
గని లఘువస్తు వేని నొసఁగం గను టుజ్జ్వలధర్మ మారయన్. 246

క. అని పలుకుచు దివ్యం బగు, తనయాకారంబు సూపె ధర్ముండు గన
త్కనకమణిమయవిమానము, వినువీథిం దోఁచె మునులు విస్మయ మందన్. 247

వ. అప్పుడు సక్తుప్రస్థుండు పరమప్రీతిం దానును దనవారును ధర్మదేవతకు దండ
ప్రణామంబు సేసి నిలిచిన. 248

తే. ధర్మదేవత యతనితో ధర్మనిరత
కంటె బ్రహ్మ పుత్తెంచినఘనవిమాన

1 మీచేత. 2 కిపుడ రాక.

మనుఁగ నదె భూమి కవతరించినఁ బ్రమోద
మెసఁగ నాకస్థుఁ డాతని కీర్తిఁ బలికె. 249

క. వేడుక నాలుం గొడుకును, గోడలు నీవును బ్రభూతగుణ మెక్కుడు సం
క్రీడమెయి నివ్విమానము, నీడితగతి బ్రహ్మసభకు నేఁగఁగ వలయున్. 250

క. అనవుడు సక్తుప్రస్థుఁడు, దనవారును దాను నెక్కి ధర్మం డనుపం
జనియె నది యంతయును నేఁ, గనుఁగొనుచు బిలంబు వెడలఁగా నామేనన్. 251

సక్తుప్రస్థుఁడు సకుటుంబముగా బ్రహ్మలోకంబునకుఁ బోవుట

వ. ఆసక్తువు గంధంబును నతిథిపాద్యజలక్లేదంబునుం బొరసి సక్తుప్రస్థకృతంబైన పరమధర్మంబుమహిమంజేసి మదీయము స్తకంబును నొక్కపార్శ్వంబునుం గనకమయంబు లయ్యె నాఁడు దొడంగి యేను దానవిధిస్థలంబులకును బుణ్యాశ్రమభూములకును వివిధాధ్వరప్రదేశంబులకుం జను చుండుదుఁ దక్కటి ప్రక్కపసిండి యగు ననుతలంపున నెన్నిచోట్లకుఁ బోయినను గా కుండు లోకోత్తరచరితుం డజాతశత్రుం డశ్వమేధంబు సేయుచున్నవాఁడయ్యెడ నాకోర్కి సిద్ధించు నని పెద్దయునాసతో నరుగుదెంచితి నించుకవిశేషంబునుం గాన విసుం డది కారణంబుగా నయ్యుంఛవృత్తివిప్రునిధర్మంబు నీయజ్ఞంబు వోల దంటి నని పలికి యన్నకులంబు దా నెక్కడఁ బోవుటయు నెఱుంగ కుండం బోయెఁ బాండుకులపవిత్ర యమ్మఖంబునం గలిగిన యాశ్చర్యంబు తెఱం గెఱింగించితి ననిన విని జనమేజయుండు. 252

సీ. జన్నంబునందు రాజన్యులుఁ దపమున మునిజనంబులు శాంతి ననఘ విప్రు
లాసక్తు లగుదు రట్లగుటఁ గాదే పల్వు రవనీశ్వరులు దొల్లి యాగకృతుల
నతులకీర్తులను సద్గతులను బడసిరి ధర్మనందనుఁ డత్యుదాత్తభంగిఁ
దొంటిభూనాథులకంటె సత్యమునను శౌచమునను భక్తి శ్రద్ధ [1]నీగి

తే. నతిశయిల్లె వేదవ్యాసుఁ డాది గాఁగఁ,గలుగునార్యజనులచిత్తములకు నెక్క
నరురవల్లభుచంద మందముగఁ జేసె, నశ్వమేధంబు మెచ్చుల కాకరముగ. 253

వ. అట్టిపరమధర్మం బౌనకులంబుచేత గర్హితం బగుటకుం గారణం బేమి యని యడిగిన వైశంపాయనుండు ధర్మపుత్త్రునధ్వరంబు నీచెప్పిన యట్టిద యైనను నొక్కటి సెప్పెద నవహితుండ వగు మన్నకులంబు హింసాత్మకం బైనపశుయజ్ఞంబుకంటె [2]నహింసామహితం బైనతపోమయయజ్ఞం బధికం బని చెప్పిన యది యయ్యె రిత్తచెప్పుట గాక తనశిరంబును శరీరార్ధంబును సువర్ణమయంబు లైనకతంబునుం బలికెం గాన దానివచనంబులు ద్రోపువడ వేతద్విషయం బైనది యొక్కయితిహాసంబు గల దది యాకర్ణింపు మని యమ్మనుజనాథున కిట్లనియె. 254

---

1 గలిగి, యతిశ. 2 నహింసాభినుతం బైన.

సీ. అసురాధిపతి దొల్లి యాగంబు సేయంగఁ దొడఁగ మహామునిస్తోమములును
సురసంఘములుఁ గూడి కురుముఖ్య ఋత్విగ్గణముల నేర్పఱిచి సొం పమర వేదిఁ
గల్పించి తగ నగ్నికార్యంబు నడపంగ నద్ధ్వరాల పశునిచయంబుఁ దేర
నమ్మునుల్ గనుఁగొని యధికదయార్ద్రంబు లగుచిత్తములతోడ నమ్మహేంద్రు

ఆ. నాననంబు సూచి యక్కటా హింస ధర్మంబు గాదు కృతయుగంబు సొచ్చె
ననఘ వత్సరత్రయము [1]ప్రాఁతగిలినబీజంబు లిపుడు యజనసాధనములు. 255

క. వేదోదితప్రకారం, బాదర మెసఁగంగ నడపు మది యుత్తమధ
ర్మోదయము సేయు నీకు ద, యాదృష్టిం జూడు పశుగణార్తి మహాత్మా. 256

ఆ. అనిన వారిమాట లాదరింపక యుండె, వాసవుండు దాన వాదు పుట్టె
నమ్మునీశ్వరులకు నతనికి సురసంఘ, మతనిఁ గూడ వాద మతిశయిల్లె. 257

వ. అట్టియెడం గర్మకాండవిదుం డగునుపరిచరవసువు సన్నిహితుం డగుటయు
నయ్యిరుదెఱంగులవారును నారాజున్యుని సాక్షిఁగాఁ గోరిన నతండు దేవతా
పక్షపాతంబునఁ బశువిశసనంబు గర్తవ్యం బని పలికి యధఃపాతంబు ప్రాపించెం
గావున హింసారహితం బయినయజనంబు పూజనీయం బగుటకు సంశయింప
వలవ దట్లుం గాక. 258

ఆ. ఉంఛవృత్తి యైనయుర్వీసురోత్తముం, డట్లు ప్రాణరక్షకై ఘటించి
స్వజనములును దాను భుజియింపనుండి యా,సక్తు నతిథి కిచ్చెఁ జనదె పొగడ.

వ. అనిన విని జనమేజయుం డిది యట్టిద మునీంద్రా నీవచనంబుల కొడంబడితి
ధర్మమార్గగతం బైనద్రవ్యం బెంత భవ్యంబు గదే యవ్వస్తువు దానంబునకుం
బ్రధానం బగుట యింకనుం బ్రస్ఫుటంబుగాఁ బ్రకీర్తింపు మనవుడు నాసంయమి
యవ్వ్యాసపౌత్రపౌత్త్రు నాలోకించి యి ట్లనియె. 260

అగస్త్యమహామునిద్వాదశవార్షికయజ్ఞప్రభావము

సీ. ఇవ్విషయంబున నెందుఁ బ్రసిద్ధతం బరఁగెడునట్టిది ధరణినాథ
విను తేతిహాసంబు వినుము చెప్పెద నగస్త్యుండు పండ్రెండేండ్లు సువ్రతాభి
రతిఁ జేయుమహితాధ్వరమునకు దివ్యానుభావంబుగలయట్టిపరమమునులు
వేడ్క ఋత్విజు లయి వెలయ నిజప్రౌఢి నఖిలతంత్రంబులు నాచరింప

తే. నాసమయమున వర్షింపఁ డయ్యె నింద్రుఁ
డోషధులు వికలత్వంబు నొందె దానిఁ
జూచి యుత్తపోధను లగస్త్యునకు నన్న
దానవిధు లెట్లు సెల్లునో తగువిధమున. 261

---

1 ప్రాఁతలయిన బీజంబు.

వ. ఇతండు ద్వాదశవార్షికం బైనదీక్షావిశేషంబు నొందినవాఁడు ధర్మమార్గా
గతం బయినద్రవ్యంబు దక్క నొండు వినియోగింపండు వానయుం గురియదని
ముచ్చిరి తమలోఁ [1]బలుకుపలుకులు ప్రతాపదీపితుం డగునక్కుంభసంభవుం
డాలించి వారలతో ని ట్లనియె. 262

ఉ. న్యాయము గల్గి యధ్వరమునందు విఘాతము పుట్టకుండఁ దాఁ
దోయదకోటిఁ బన్చి హరి దుష్టిగ వృష్టి యొనర్పకున్న నే
[2]నాయమరేంద్రతం గొని మహాద్భుతవృత్తి జగంబుఁ బ్రోచెదన్
మీయెడఁ జింత దక్కుఁడు సమిద్ధతపఃపరులార నా దెసన్. 263

క. కాదేనిఁ ద్రిజగముల బహుళోదారద్రవ్యకోటు లున్నయునికి మీ
పాదములపరిసరమునకుఁ, దే దొరకొను నశ్రమమునఁ దెచ్చెద వానిన్. 264

తే. అంత సేయంగ వలయునే యన్న ననఘు
లార యుత్తరకురుభూము లారఁ బండి
యున్నయవి యాగకాలోచితాన్నమునకు
వలయుధాన్యముల్ దలఁపున వచ్చు నిందు 265

వ. అని పలికి వెండియు. 266

క. ఆజాలి యేల నిర్మలబీజహవిస్తంత్ర మేను బ్రీతి నొనర్పం
గా జగతి వఱపునం జెడు, నే జన్నము విఘ్నపడునె యేటికి వగవన్. 267

సీ. అన విని నీవు ధర్మాగతిసంసిద్ధవస్తుదాయివి నిరవద్యతపము
వ్యయముగా నీ కేల వాసవుపై కిన్క నఖిలజగద్ధనమాహరించి
కొననేల యుత్తరకురుభూములందలిధాన్యంబు లేల సన్మాన్యబీజ
హుతములందు ఫలేచ్ఛ యోజింప నేల మాకై యున్ని దెఱఁగులయందుఁ బాతె

తే. నీదుచిత్తంబు దీని వినిశ్చయముగఁ
జేసి సుఖి వగు మేము మా చేసినట్టి
సుకృతములఁ దెచ్చికొందుము సులభములుగ
వలయునాహారములు లోకవందనీయ. 268

మ. అని సల్లాపము సేయుచుండఁగ ననేకాంభోదజాలంబులం
బనిచెం బెల్లుగ వర్షముల్ గురియఁగాఁ బర్జన్యుఁ డాప్రొద్ద తా
నును నాచార్యుఁ బురస్కరించికొని నన్నుం గావవే యంచు న
మ్మునిశార్దూలునిఁ గాన వచ్చె వినయంబుల్ భక్తియుం దోఁపఁగన్. 269

ఉ. వచ్చిన గారవించి యనవద్యఫుటర్చన లిచ్చి సంయము
ల్మెచ్చఁగ శాంతసద్వచనలీలఁ బ్రమోద మొనర్చి యాతనిం
బుచ్చె సురేజ్యయుక్తముగఁ [illegible] గ్రమ్మఱ వేల్పువీటి కా

1 బలుకుపలుకులకుఁ బ్రతా...సంభవుండు రోషించి. 2 నాయమరేంద్రు రీతిని.

సచ్చరితుండు లోకమును సంతస మందె వెలింగె జన్నమున్. 270

తే. క్రతుసమాప్తిసమయమున నతఁడు వినయ
భరితుఁడై యోగ్యభంగి నప్పరమమునుల
కర్చ లిచ్చి యామంత్రణ మాచరింప
వారుఁ బ్రీతి నేఁగిరి నిజావాసములకు. 271

జమదగ్నిమహాముని పితృదేవతలశాపంబున నకులం బై పుట్టినకథ

వ. ఇవ్విధంబున హింసారహితంబుగా మహితయాగంబు సుప్రయోగంబు సేసి యగస్త్యుండు పరమప్రశస్తి నుజ్జ్వలుం డయి వెలింగెంగావున ధర్మమార్గాగత ద్రవ్యకృతం బై తపోమయం బగుయజ్ఞంబు ప్రాజ్ఞజనమనోజ్ఞం బై వెలయు నని చెప్పిన విని జనమేజయుం డి ట్లనియె. 272

తే. అనఘ నకులరూపంబున నట్లు దోఁచి
బ్రాహ్మణులతోడ మానవభాషణముల
నెవ్వఁ డేనియు నొక్కయహీనబోధ
ఘనుఁడు సల్లాప మొనరించె నని తలంచి. 273

తే. ఆతఁ డెవ్వఁడో యని నిన్ను నడుగఁ జూచి
వెండియును బ్రస్తుతోక్తుల విందు ననుమ
నంబుతో నూర కుండితి నాకు నతని:
జెప్పఁ దగునేని బోధనశీల చెపుము. 274

క. అనుటయు వైశంపాయనుఁ, డనూనపుణ్యప్రదీప్తుఁ డగునీ కెందుఁన్
వినఁ దగనియదియుఁ గలదే, వినిపించెద ముంగివిధము విను తెలియంగన్. 275

సీ. జమదగ్నిపితృకార్యసంకల్ప మత్యంతనియతాత్ముఁ డై జేసె నిష్ఠ యొప్పఁ
జారుమాతనకలశంబున హోమధేనువుఁ దాన పిదికి గారవముతోడ
ని మ్మైనయెడఁ బదిలమ్ముగా డించిన నతనిచిత్తము తెలియంగరయుబుద్ధి
సాకారవృత్తిఁ గ్రోధాధిదైవము వచ్చి ప్రామాదికం బనుభంగి దోఁపఁ

ఆ. గుండతోడిపాలు గూల్చినఁ గినియక, యూరకుండె నాసముజ్జ్వలాత్ముఁ
డప్పు డాత్మ మెచ్చి యద్దైవ మతనికి, నిట్టు లనియెఁ గురుమహీశవర్య. 276

క. భృగువులు క్రోధను లనఁగా, జగతిఁ బరఁగు వాద మది [1]మృషాపరికలితం
బగుట దెలిసె నోడితి నీ, కగణిత మగునీతపమున కలికెద ననఘా. 277

వ. అని వెండియు. 278

క. నాదెసఁ బ్రసన్నుఁడవు గ, మ్మాదరమునఁ జూడు మైఁపు మపరాధము వి
ద్యాదయిత యనిన నమ్ముని, యాదైవముఁ జూచి శాంతి యలవడ నెమ్మిన్. 279

వ. నాయెడ నిప్పుడు. 280

---

1 మృషాపరికల్పం, బగుట.

క. నీ వేమితప్పు సేసితి, క్రోధము శంకాభయంబు దొలఁగఁగ సంక
ల్పావిలతకు నలుగుట పిత్రుదేవతలకుఁ గలుగుఁ బొమ్ము దీర్చెద ననుచున్. 281

వ. భీతి నాభూతం బంతర్ధానంబు సేసెం దదనంతరంబ యాజమదగ్నిం బిత్రుదేవతలు గోపించి పాడసూపి యతనితో నీవు శ్రాద్ధంబునకు సంకల్పించియుండి త్వద్వైకల్యంబు వుట్టిన నూరకుండితని పలికి ముంగి వయి పుట్టుమని శపించిన నతండు వారలకు దండప్రణామంబు సేసి తపస్వికి నలుగం దగదని యపరాధంబు గనియును క్రోధాధిదైవంబునకు నలుగ నైతి. 282

ఆ. తప్పు సైఁచి నన్ను దయఁ జూచి శాపమోక్షము ననుగ్రహింపుఁ డమితతేజు
లార యని వినీతిలంపటుం డగుచుఁ బ్రార్థించుటయును వారు దెలివి నొంది.

వ. విదగ్ధవిప్రసమూహంబు బొడంబడునట్టియుచితవాక్యంబుల నీ వెన్నఁడేని మహాధర్మంబు గీడని యాడితి నాఁడు నీకు శాపమోక్షం బగు నని నిర్దేశించి రన్నకులంబును సక్తుప్రస్థనికతంబునం దగినమాటల నాతెఱంగున సదస్యులతో ధర్మనందనునశ్వమేధంబు నధిక్షేపించి విగతశాపత్వానందంబునొంది యంతర్హితం బయ్యె నని యిట్లు జనమేజయునకు వైశంపాయనుండు పాండవాగ్రజునశ్వమేధంబువిధంబు విస్తారప్రస్తవనీయంబుగా వివరించుటయును. 284

శా. భక్తిస్మేరమునీంద్రచిత్తకమలప్రస్ఫీతసౌరభ్యసం
యుక్తా రూఢతరప్రకాశతనురూపోల్లాస రాగాదిని
ర్ముక్తా కాంతిజనైకతారసిక చిన్ముద్రాసదోన్నిద్ర ధీ
శక్తిస్వైరవిహారదూర లలితా సద్భావనోన్మీలితా. 285

క. అజరామరపదకరపద, భజనా సంసారజలధిపారీణస్తో
త్రజనా స్వమూర్తివైదిక, యజనా పాశ్చాత్యనాడికార్ద్రివ్యజనా. 286

మాలిని. త్రియుగకమలవీథీదీప్తసంచారలీలా
నియమితపవనాత్మాగ్ని ప్రభాస్నిగ్ధసంగా
స్మయవికచమహాబ్జస్వైరమాధ్వీకధారో
దయమయ మధురాత్మా దర్శితానందవర్త్మా. 287

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున నశ్వమేధపర్వంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

అశ్వమేధపర్వము సమాప్తము.



శ్రీరస్తు.

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆశ్రమవాసపర్వము - ప్రథమాశ్వాసము



సాదనపదపద్మో
పాసనవిద్యాశమైకపరతానిత్యా
భ్యాసజనహృద్య వేద
వ్యాసవచోవిభవవేద్య హరిహరనాథా. 1

### యుధిష్ఠిరాదులును గాంధారీధృతరాష్ట్రులును నొండొరులయెడల నడచికొనిన ప్రవర్తనము

వ. దేవా జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె నట్లు పితృపితామహక్రమప్రాప్తం బయినసామ్రాజ్యంబు జగత్ప్రాజ్యప్రకారంబునం గైకొని మహాధ్వరప్రముఖధర్మకార్యధుర్యులును సముపాసితార్యులును దయావిధేయులు నగు పాండవేయులు ధృతరాష్ట్రునివలన నెవ్విధంబువారై నడచిరి హతపుత్త్రమిత్త్రామాత్యుండును గతైశ్వర్యుండు నగునారాజును యశోమహిత యగుగాంధారియు నెట్టిభంగి వర్తించి రత్తెఱంగు నాకెఱింగింపుము. 2

సీ. అనవుడు నమ్ముని యమ్మహీపతికి ని ట్లనుఁ బాండునందను లాంబికేయు
నెడ భక్తివినయంబు లెసఁగంగ వర్తింతు రతనియోగక్షేమ మరసి యెపుడుఁ
దత్సమీపంబునఁ దగ నిల్చి తమకు నెయ్యది యైన నెఱిఁగించు నట్లు గాఁగ
నుందురు విదురయుయుత్సుసంజయులు దారును నిత్యమును వచ్చి వినతిఁ జేసి

తే. కొలిచి కూర్చుండి యానృపు నలఘుకార్య
విధము లేర్పడ నడిగి యవ్విభునిచెప్పి
నట్ల చేయుదు రతఁడును నాదరంబు
గాఢవత్సలత్వంబును గలిగి యుండు. 3

ఉ. కౌరవనాథ కుంతియును గౌరవ మొప్పఁగ వచ్చి కొల్చు గాం
ధారి నతిప్రయత్నమున ద్రౌపది తాను సుభద్రయుఁ గా ముదం

బోరఁగి నిత్యముం [1]గొలుచు నక్కురువంశమహత్తరక మహో
దారము లైన వస్తువు లుదాత్తత నిత్తురు వార లందఱున్. 4

క. చిత్రాంగదయుఁ సులూపియు, ధాత్రీశ్వర వత్తు రెపుడు ద్రౌపదితోడన్
గాత్రములు భూరివినయా,మాత్రములుగ సుబలసుతఁ బ్రమదమునఁ గొలువన్.

క. ఆతల్లికిఁ దంత్రికి సం,ప్రీతి యలరఁ గుడువఁ గట్టఁ బెట్ట నుదాత్త
స్ఫీతంబు లైన వస్తు,వ్రాతంబుల నిచ్చు ధర్మరాజనుదినమున్. 6

తే. గుళ్లఁ జెఱువులుఁ గట్టించుఁ గోరి యూళ్ల
నగ్రహారములఁ గావించు నాంబికేయుఁ
డధిప ధర్మతనూజుఁ డత్యంతహర్ష
చిత్తవృత్తియై యనుమతి సేయుచుండ. 7

క. జనవర ధర్మజుఁ గొలువం, జనుదెంచినయట్టివివిధజనపతు లెల్లన్
మును ధృతరాష్ట్రునిఁ గొలుతురు, విను మాకొడుకుమది పల్లవించును దానన్.

క. సూనులు లేమిం గలిగెడు, దీనత్వము దోఁప కుండఁ దేజస్స్వాఖ్యా
నూనులుగఁ జేయు ధర్మజుఁ,డానరపతి నతనిదేవి నతులితభక్తిన్. 9

సీ. వంశవృద్ధులు పుత్త్రవర్గవియుక్తులై యున్నవా రేమిట నుమ్మలింతు
రో యనుపుయిలోట నాయుధిష్ఠిరుఁడు దమ్ములకును దగునమాత్యులకు నిష్ట
భృత్యులకును మీరు ప్రీతియు భక్తియు నాంబికేయుని దెస నతిశయిల్ల
నారాజు పంచినయట్ల చేసి చరింపుఁ డతని నారాధించు టస్మదీయ

ఆ. చిత్తమునకుఁ బ్రియము సేయుట యతనికి, మనసు గానియట్టిపని యొనర్చు
టగ్గలంపుదుఃఖ మావహించుట యని, యనుదినంబుఁ జెప్పు మనుజనాథ. 10

క. విను మెల్లవారు నతనివ,చనములు మది నూఁది యట్ల చరియింప మరు
త్తనయుండును నమ్మెయివ,ర్తనము నడపుచుండు మనసు దద్దయు నెరియన్. 11

క. ద్యూతంబున దుర్యోధను, చేతం దమపడినపాటు చిత్తంబున క
త్యాతురతఁ జేయుచుండుట,నాతఁడు ధృతరాష్ట్రుఁ జూచి యలుగుమనమునన్.

తే. శ్రాద్ధదివసంబులందుఁ బుత్త్రవ్రజమున
కాంబికేయుండు గోకనకాదిదాన
కీర్త్యముగఁ బారలౌకికక్రియలు సేయ
నట్లుగా సంఘటించు ధర్మాత్మజుండు. 13

సీ. అతులభోగంబును నంచితత్యాగంబుఁ బొల్లింటియట్టుల చెల్లఁ జేయు
ధృతరాష్ట్రునకు ధర్మసుతుఁడు గాంధారికిఁ బూర్వప్రకారసంపూజ్యదాన
నిరతిఁ జెల్లించు నక్కురువృద్ధుఁ డిమ్మెయిఁ బాండుపుత్త్రులు దన్నుఁ బరమభక్తి
శిష్యవర్తనమున సేవింపఁ దానును గురునట్లు వాత్సల్యపరత నెపుడు

---

1 గొలుతు రక్కురువంశమహాత్తరక.

తే. వారలకు శ్రేయు నాయువు వైరిజయము
మానసమున నాశాసించు మానవేంద్రు
యతనితో నంటివర్తనముఁ దత్సుతునికీడు
నాత్మఁ దలఁపఁ డెన్నండు ధర్మాత్మజుండు. 14

క. విను మతని తెఱఁ గెఱింగి పరిజనములతో నాంబికేయుచరితము దుర్యో
ధనుకొలఁగామియు నెవ్వారును వాక్రువ్వంగ వెఱతురు కురుప్రవరా. 15

సీ. రాజ్యాధిపత్యసంపూజ్యత్వమున ధృతరాష్ట్రపాండుసుతాంతరంబుగాన
రాకళులు జానపదోత్కరమునఁ బౌరవర్గంబునందును వసుమతీశ
యొమ్మెయి నడపెడునప్పాండవాగ్రజువలన నిజాత్మజువలనకంటె
నక్కురురాజు ప్రియం బందు నట్లున్న యక్కాలమునఁ బవనాత్మజుండు

తే. సన్నిహితుఁ డైనయప్పు డజ్జనవిభుండు
దనతనూజులఁ దలఁచి సంతాప మందు
నతనిఁ గనుఁగొని [1]యబ్భీముఁ డతనిసుతులు
దిమ్ముఁ బఱవినపాటులు దలఁచి యలుగు. 16

తే. హృదయముల నొండొరుల దెస నిట్టివార
లయ్యు నతఁడు నతండు నన్యోన్యభాష
ణములయప్పుడు మృదులవిన్యాస మొప్ప
నాడుదురు చుట్టములు మెచ్చునట్లు గాఁగ. 17

వ. ధృతరాష్ట్రుం డేకతంబ యున్నయెడ వృకోదరుం డతనికి నింత నంత నుండి
గాంధారియు వినుచుండ. 13

సీ. అంధునికొడుకులయం దొకరునిఁ దప్పి పో నీక త్రుంచితి భూరిశక్తి
దర్పితం బైనమద్బాహుపంజరము సొచ్చినరిపురాజన్యసింహములకు
వెడలంగ వచ్చునే వెంగలు లై వారు గయ్యంబు నేసిరి గాక నన్ను
నెఱింగిన వాడరుదు రెట్టులు దుర్యోధనాదుల నని దెగటార్చినట్టి

తే. నాదుదోర్దండములఁ జందనం బలంది
కుసుమదామముల్ సుట్టి మ్రొక్కుదు మహాప
కారు లరయంగ దైవముల్ గావె యనుఁ ద
దీయమర్మంబు లెల్ల భేదిల్ల నధిప. 19

వ. దీని ధర్మనందనుండును ధనంజయుండునుం గుంతియు ద్రౌపదియు నెఱుంగరు
గవ లొక్కొక్కమా ఱిమ్మాటలు విని సంతసిల్లుదురు ధర్మనందను తెఱం గెఱుం
గుటం జేసి వుయిలోడి తా రేమియు నాడరు ధృతరాష్ట్రగాంధారులుం గాల
పర్యాయంబు గనికొని డెందంబులు గంద నూర కుండుదు రట్టిభంగిఁ బంచ

---

1 భీముండు నతనిసుతులు.

పదేవత్సరంబులు చనియె నంత నొక్కనాఁ డయ్యంధనృపతి బంధుజనంబులం
గూర్చి ధర్మనందను రావించి యతండు వినుచుండ గద్గదకంఠుం డగుచు
వారలతోడ. 20

ధృతరాష్ట్రుఁడు ధర్మజునితోఁ దనమనోరథంబు దెలుపుట

సీ. నాకతంబునఁ జేసి యాకౌరవులకు నాశంబు వాటిలుట యెల్లంబు మీకు
ఎఱుఁగ గ్రూరు సతిలోభి జ్ఞాతిజనద్రోహకరు రాజుఁ జేసితిఁ గురుధరిత్రి
కచ్యుతుఁ జెప్పినయమలవాక్యంబులు విన నేర నైతి నాతనయువలని
ఘనతరస్నేహంబునను మొగమోటను దగియెడుమాటలఁ దఱిమి యొత్తి
తే. యాడకుండితి భీష్ముండు నస్త్రగురుఁడు
విదురుఁడును సంజయుండును వేవిధముల
నాకుఁ జెప్పిరి గాంధారి నన్నుఁ దూఱి
చెప్పె నమ్మాట లేఁ జెడచెవుల నిడితి. 21

వ. ఇత్తెఱం గంతరంగంబున శల్యం బై యున్నయది యని చెప్పి వెండియు. 22

క. సుతులు సమరమునఁ దిరుగక, మృతు లై సద్గతికిఁ జనినమేలిమి యస్మ
న్మతిఁ దలఁచి వరక్షత్త్రచరిత మని యప్పనికి నగవఁ బ్రీతియ కలుగున్. 23

వ. అని పలికి పాండవాగ్రజుఁ జేరం బిలిచి యతనితోడ. 24

సీ. నీ వరయంగ సుఖావాప్తిఁ గొఱఁత లేకుండితిఁ జనవును నుజ్జ్వలంపుఁ
దేజంబుఁ గలిగి వర్తించితి దానంబు లంచితములుగఁ బెక్కాచరింపఁ
గంటి శ్రాద్ధంబులు గాంధారిసుతులకుఁ బలుమాఱుఁ జేసితిఁ బరమధర్మ
శీల పాంచాలికిఁ జెట్ట సేసి రగణ్యపుణ్యుం డవగునీదుభూరిలక్ష్మి
తే. నపహరించి రద్దుర్యోధనాదు లట్టి
కష్టచరితులఁ బాడిమైఁ గయ్యమునన
నిహతులుగఁ జేసి తక్కురునికర మూర్ధ్వ
భువనగతిఁ గాంచి సుఖ మందె భూపవర్య. 25

క. కావున నేమియుఁ జేయం, గా వలవదు వారికయి యకారణకరుణా
శ్రీవిలసితుఁ డగునీతో, నావిధముం జెప్పవలసె నరవరముఖ్యా. 26

సీ. ఏకార్య మైనను నెవ్వఁడేనియుఁ జేయఁ దొడఁగునప్పుడు విను పుడమితేని
చే ననుజ్ఞాతుఁడై కాని తొడంగఁ గా దట్లు గావున వార్ధకాభిలీఢ
మైనమదీయకాయమునకు సంస్కార మాచరింపఁగఁ దప మాచరించు
పనికి భూపాల నీయనుమతి వడయంగ వలసి చెప్పెద రాజవంశజనక
ఆ. సమరమరణ మొండె విమలతపమునకుఁ, జొచ్చి యందు నిలిచి చచ్చు టొండె
వలయు నస్మదీయకులముఖ్యు లిట్టుల, నడపి రనుపు నన్ను నడవి కనఘ. 27

క. రాజు గురుఁ డెల్లవారికి, రాజోత్తమ గురునియాజ్ఞ రంజిల్లఁగఁ జే

ప్రోజం జేసినకృత్యము, సూ జగములు రెంటియందు శోభన మిచ్చున్. 28

తే. ఏను గాంధారియును దపోమానసీయ, మునులచేరువ వల్కలములు ధరించి
కందమూలఫలముల నాఁకలి హరించి, నిన్ను దీవించుచుండెద మన్న నతఁడు. 29

క. ధరణీరాజ్యము నాకును, నరవర సౌఖ్యంబుఁ జేయునా నీ విమ్మై
దురపిల్లి దుష్కరం బగు, నరణ్యవాసమున కేఁగినట్టిద యైనన్. 30

తే. గూఢబుద్ధి వై నమ్మించి కురువరేణ్య, యే నెఱుంగక యుండంగ నిట్లు శోక
వనధిఁ దేలుచునుండి తివ్వనట గంటి, నింక రాజ్యంబు నా కెట్టులింపుఁ జెపుమ.

ఉ. తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవము నా కరయంగ నీవ భూ
వల్లభ నీవు కాననివాసము గోరి చనంగ నెట్టు లే
నుల్లము వట్టి హస్తిపురి నుండఁగ నేర్తు యుయుత్సుఁ బెంపు శో
భిల్లఁగ రాజుఁ జేయు నిసుఁ బ్రీతి యెలర్పఁగఁ గొల్చి వచ్చెదన్. 32

క. అతఁ డౌరసుండు నీ కీక్షితి కొడయుఁడు దుర్యశంబుచేఁ గుందుట భూ
పతివర కని కని మీ రి, ట్లతిమాత్రము సేయఁదగునె యక్కట నాకున్. 33

సీ. నీవు రాజవు గాక నీ కేను రాజనే గురుని మహారాజుఁ గురువరేణ్య
నిటు సేయు మని పంప నే నొడయండనే దుర్యోధనాదులదుష్కృతములు
నామదిలో నిల్ప నేమును వారును, [1]విధిమోహమున నైనవిరసభావ
మావహిల్లినఁ బుట్టె నంతలుపనులు గాంధారియును గొంతియు గారవమున
ఆ. నాకు నొక్కరూప మీకుఁ గాననవాస, మెల్లభంగిఁ గలుగు నేని యేనుఁ
దగిలి తోన వత్తుఁ దగుమాటగా నాట, గాదు నాదుహృదయగతియు నిట్ల. 34

క. పలికెద నే సత్యము నా, కిల ప్రీతిం జేయ దధిప యీ వి ట్లయినం
గులముకలఁక దైవకృతం, బలఘుమతీ విడువు శోక మరయుము నన్నున్. 35

తే. నీకు శుశ్రూష యొనరించి నృపవరేణ్య,చిత్తతాపంబు మానంగఁజేసికొందు
ననితలంచునన్ విడువంగనగునె యవన,తుండనై నిన్ను వేఁడెదఁ దొఱఁగు వగలు.

క. అనుచు నతనిచరణంబులు, దనఫాలతలంబు సేర్చె ధర్మతనయుఁ డా
తని గ్రుచ్చి యెత్తి కౌఁగిట, నెనయంగాఁ జేర్చి యాతఁ డి ట్లను నధిపా. 37

తే. నీవు శుశ్రూషచిరకాలనియతిఁ జేసి,తేను వృద్ధుండ నైతి నా కింకఁ దపము
వలవదయ్య రాజును బాలివాఁడ యెవ్వ, రెమి సేసిన ఫలములయెడ నృపాల.

వ. అని పలికి విదురకృపసంజయులనుద్దేశించి తనకు ముఖశోషయుం దనుగ్లానియుం గలిమి సుగ్గడించి నాలుక దొట్రుపడ వారలతో మీర లనునయవచనంబుల నజాతశత్రుం దెలివొందం జేయుం డని చెప్పి దప్పి యెక్కుడు గదిరినగాంధారి తనువున మేను సేర్చి మూర్ఛిల్లుటయు నార్తి నొంది యక్కుంతీనందనాగ్రజుం డి ట్లని పలవించె. 39

---

1 విధిమోహితుల మయి విరసభావ.

క. కరిదశసహస్రబలవి,స్ఫురితుఁ డగునిచిత్రవీర్యపుత్త్రుఁ డొకతఱిలో
దరి నూఁతగొనియె విధి యె,వ్వరి హీనులఁ జేయఁ డకట వక్రుం డైనన్. 40

చ. అనిలజు మేనిచంద మగునాయసరూపము చూర్ణితంబు సే
సినబలమానసీయుఁ డొకచేడియ నక్కట యాశ్రయించె నే
మనఁ గల దవ్విధాత్మ నని [1]యాతనికిఁదను మానసంబునం
జొనుపమి లావ పేరుకొని శోకము ధర్మజుఁ డొందె భూవరా. 41

సీ. అప్పుడు గాంధారి యల్లన ధర్మజుతోడ మీతండ్రి యతులతపంబు
తోడిసంతతచింతఁ గూడు దొఱంగి తా నుండుటఁ గూర్చుండ నోప కునికి
నిట్లయ్యె ననవుడు నెవ్వనికతమున నిమ్మహాత్మున కిట్టియెడరు పుట్టె
[2]నట్టినామనువు నే మనఁగల దంచు నాతఁడు శీతజలము హస్తమునఁ బుచ్చి

తే. కొని యతనిమోమునందు నక్కున విదిర్చ
సమయమున విదురుండును సంజయుండు
నఖిలభరతభార్యలు నేడ్చి రవ్విభుండు
నివిరెఁ జలికేల నానృపునవయవములు. 42

క. నివురంగఁ బిలిసి యతనిం, గవుఁగిటిలోఁ జేర్చి మస్తకము మూర్కొనుకొ
వవృద్ధు నతఁడు నాశ్లే,షవిశేషంబున నొనర్చె సంప్రీతునిఁగన్. 43

వ. అట్లు దెలి వొంది ధృతరాష్ట్రుండు ధర్మరాజుతో నా కెట్లును దపంబునకయి కాననంబునకుం బోవవలయు ననిన నజ్జనపతి నీ వారగింపు మప్పని మఱి సెప్పెద నని త్రోపుమాటగాఁ బలికిన నయ్యాంబికేయుండు పెక్కుమాట లాడ శక్తి లేదు న న్నింక నలజడిఁ బెట్టకుము తపశ్చరణంబునకు నీయాజ్ఞ వడసి కాని కుడువ ననియె నయ్యవసరంబున సాత్యవతేయుండు కృపావిధేయుం డై యచటికి వచ్చి సకలజనంబులవినతులు గైకొని దీవన లిచ్చి యాధర్మతనయునాననం బాలోకించి. 44

వ్యాసుఁడు ధృతరాష్ట్రువనవాసంబున కనుజ్ఞ యిచ్చుట

సీ. అంబికేయుఁడు సెప్పినట్టుల చేయుము వృద్ధుఁడు నాత్మజవిరహితుండు
నై యీతఁడు తప మాచరింపఁగఁ గోర కున్నె గాంధారి శోకోపశమము
దాలిమి నొదవి యుండఁ బ్రవర్తించె నింక నియ్యమకును నిదియ తలఁపు
గావున నీకు నీకార్యంబు సెప్పంగ వచ్చితి వీరిఁ బో నిచ్చు టొప్పు

తే. ననఘ పూర్వరాజన్యులు సనినయట్టి,సౌఖ్యపథమున నీరాజు సనుట మేలు
గాన యీతనికాననగమనమునకు, ని మ్మనుజ్ఞ విచారంబు లెల్లఁ దక్కి. 45

క. నీవినయము భక్తియు సం,భావనమును వీరివగలఁ బాపఁగ శుశ్రూ
షావశవర్తిత నడచితి, భూవర చిరకాల మింకఁ బో నిమ్ము తగన్. 46

1 యాతనికిం దనమానసం. 2 నట్టినామనము నే మనఁ.

చ. అని విని యాకురుప్రవరు డమ్మునివల్లభు మోముఁ జూచి యి
ట్లను మహితాత్మ మాకు గురుఁ డన్నను ధర్మవిధోపదేష్ట య
న్నను బరదైవ మన్నను ననఘప్రియకార్యకలాపకర్త య
న్నను నిను నీవ నీదువచనంబున కడ్డము పల్కువాఁడనే. 47

ఆ. అనిన సమ్మహాత్ముఁ డను రాజులకు రణ,మరణ మొండె దృఢసమాధిఁ దనువు
విడుచుటొండెఁ గాక వృద్ధులై రోగత,ల్పములఁ జావు మేలె భరతముఖ్య. 48

వ. అనిన విని ధర్మతనయుం డొండు పలుక వెఱచి యి ట్లనియె. 49

క. అనఘా యిక్కురుముఖ్యన,కనుజ్ఞ యే నిచ్చితిని మహాత్తర మగు మీ
యనుమతియుఁ బడసెఁ జనుఁ గా,క నిజేచ్ఛను నాకు విఘ్నకరణము దగునే. 50

సీ. అనుటయుఁ బ్రియమంది యమ్మహాముని యమ్మహీశ్వరుతోఁ బాండుఁడీనృపాలు
గద్దియ నిడికొని క్రతువులు సేయించి యవిరళభోగానుభవము నడపి
యీతనివారలఁ బ్రీతి నీక్షించి తా శిష్యుండపోలె సంసేవనంబు
భక్తిమై నొనరించెఁ బదపడి నీవును దిగ్విజయాదులఁ గేజ మితని

తే. నొందునట్లుగఁ జేసితి వొకటఁ బిదపఁ, బానపడుమూఁడువర్షముల్ ధరణి యేలె
నీవు శుశ్రూష యుత్తతి నియతి నడపి,తితనిమది లేదు కలఁక యొక్కింతయేని.

క. కేవలతపఃక్రియాసం,సేవనతాత్పర్య మిప్పుడు చిత్తంబునయం
దావేశించినయది యీ, భూవరునకు నితని ననిచి పుచ్చు మడవికిన్. 52

ఆ. అనిన ధర్మతనయుఁ డట్టుల కాకని, పలికెఁ దక్షిణంబ పరమయోగి
వంద్యుఁ డయినసత్యవతికొడుకు కాత్మత,పోవనమున కరిగె భూపవర్య. 53

సీ. తదనంతరము ధర్మతనయుండు ధృతరాష్ట్రుతోడ నీ కెట్టులు సూడఁ బోలె
విదురుండుఁ గృపుఁడు నెయ్యదికృతమని వినిశ్చయ మొనరించిరి సంజయుని యు
యుత్సునిమనముల నొలసినకర్తవ్య మెద్ది దానిన చేయు టెంతయేని
నాకుఁ బ్రియంబు భూనాథ యానతుఁడ నై వేఁడెద నొకటి నీవిశదబుద్ధి

ఆ. నేమి సేయఁ దలఁచితేని నీ వక్కట, యారగించి చేయు మయ్య యనుఁడు
నరిగె నానృపాలుఁ డభ్యంతరావాస,మునకుఁ దోన సుబలతనయ ననఁగ. 54

వ. ఇట్లు కురువృద్ధుండు వృద్ధసామజంబుచందంబునం జనునప్పుడు విదురుండును యుయుత్సుండును గృపాచార్యుండును సంజయుండును వెనుకన చని రజ్జన పతి దివసకృత్యంబు లాచరించి భూమిసురులం బూజించి యాహారతంత్రంబు నిర్వర్తించె గాంధారియుం గుంతీప్రముఖభరతభార్య లనునయింప భోజనవిధి యొనర్చెం దదనంతరంబ విదురాదులం బాండవేయులును వనితాజనంబులుం గృతాహారు లయి యావైచిత్రవీర్యుం బరివేష్టించి యుండఁ బాండవాగ్రజు నప్పాండునృపాగ్రజుం డేకాంతస్థానంబునకుం దోడ్కొనిపోయి యతని

తోడ సప్తాంగం బయిన రాజ్యంబు పూజ్యం బగు ధర్మంబుతో నెనయ నడ
పుట దుష్కరంబు గావున నాయెఱింగినంత బోధించెద నాకర్ణింపు మని పలికి
యి ట్లనియె. 55

ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు రాజనీతివిశేషంబులు సెప్పుట

సీ. నీవు నిచ్చలును విద్యావృద్ధజనములఁ దగ నుపాసింపు మర్థముల వారిఁ
ప్రీతులఁ జేయుము నీతులు వా రుపదేశింప వాని నూఁదినమనంబు
గలిగి [1]వర్తింపుము కార్యంబు సింద్రియంబుల రాజ్యతంత్రంబుఁ బోలె నరసి
రక్షింపు మప్పుడు రక్షితం బైన శుభంబులం గావించు భావశుద్ధి

ఆ. ధామములును బితృపితామహక్రమసమా,గతులు విశదమతులుఁ గాఁగవలయు
సచివు లతివిదగ్ధచారులఁ బనుపుము, పరుల యాప్తజనులభంగు లరయ. 56

క. పురరక్షణము దృఢంబుగ, నరవర చేయంగవలయు నమ్మఁ గలుగున
త్పురుషులనిడఁ దగుఁ గుడుపు ని,దుర మొదలగులోనిపనులతోడరువు లరయన్.

సీ. ఆప్తవృద్ధులఁ బెట్టు మంగనాజనులసంరక్షకు నెల్లకార్యముల మంత్రి
జనములతోడ విచారించి చేయంగవలయును గుప్తనివాస మొండె
మాడుపుమీఁద నొండె మాటు లేనియరణ్యతల మొండె మంత్రవిధానమునకు
నర్హములు గేవల మైనట్టిమంత్రంబు గోపనం బొందినఁ గురువరేణ్య

ఆ. యఖిలకర్మములు ఫలావాప్తి నొప్పుఁ బం,గ్వంధజడులు చీకు లైన నీర
హాస్యభాషణముల యప్పుడు సేరువ, నునికి యొప్ప దార్యవినుతచరిత. 58

క. విను మంత్రభేదమున వ,చ్చినకీడున కనఘ శాంతి సేయు టరిది గా
వున మంత్రులతో మంత్రా,వననియమం బూఁది చెప్పవలయుం జుమ్మీ. 59

సీ. వ్యవహారములు శుచు లైనవిద్వాంసులఁ దోడుగఁ గొని తీర్పు దుష్టజనుల
దండించునెడ వారి తప్పులకొలఁదులు మదిఁ [2]దూఁచి చూచి తన్మాత్రదండ
మాచరింపుము విను మాయవ్యయములు సంక్షేపరూపంబున రేపకడలు
దానికి మును దేవతాపూజనము భూసురార్చనమును జేయు మమలబుద్ధి

తే. ప్రొద్దు సాలంగ నెక్కినప్పుడు సమర్హ,భోజనక్రియ నిర్వహింపుము సుశీల
మాన్య తదనంతరమ గంధమాల్యభూష,ణాంబరములు నిజేచ్ఛమై ననుభవింపు

క. కొలు విమ్ము మాపుకడ యో,ధుల కెల్లను సంధ్య వడ్డ దూతలనుం జా
రుల సంభావింపుము రా,త్రులఁ గాంతాభోగతత్పరుఁడ వగుము నృపా. 61

తే. ఏమి గ్రొత్తగఁ బుట్టిన నించుకేని, నలసుఁడవు గాక దాని నీ వరసి తీర్పు
[3]మిది దెఱంగుగ నేప్రొద్దు నింతవట్టు, నర్హములు గౌరవక్షితిపాగ్రగణ్య. 62

క. న్యాయంబుతోడ వివిధో,పాయంబుల నర్థముల నుపార్జింపుము భూ
నాయక రాజ్యవిఘాతము, సేయుజనుల నెఱిఁగి చంపఁ జెఱపన వలయున్. 63

---

1 నిర్వర్తింపు కార్యంబు. 2 నూఁది. 3 మిట్టి తెఱఁగునకే ప్రొద్దు లింతవట్టు.

క. వసులయెడ మేలు గాంచిన, మనుగడ యగ్గలము సేసి మన్నింపుము రా
జనయజ్ఞ భృత్యకోటిం, గొనియాడుము సేత పేరు క్రుచ్చి కొలువునన్. 64

క. నీవలనను భక్తిస్నేహావేశము గలిగి శూరు లై యలజడికిం
బా విసువనిసత్కులజుల, గావింపుము సైన్యవిభులఁ గా గురుముఖ్యా. 65

సీ. ఆత్మరంధ్రము లించుకైనను నొరులకు నెఱుఁగ రాకుండఁగ మఱుఁగుసేయు
మన్యరంధ్రంబుల నారసి కనుము శత్రులకడ బుద్ధియు బలువుఁ గలుగు
వారల నెఱిఁగి భూవర యొక్కమై నీగి మన్నన నెఱపి తన్మానసములు
నీయెడ నార్ద్రంబులై యుండఁ జేయుము చెడునృపులకు వైరబంధ

ఆ. మెట్లు గలుగు దాని నేమఱ కుండుము, వారియవుల నున్నవారు మిత్త్ర
లగుదు రెల్లభంగి నధిప యుదాసీను, లట సమీపవర్తులైనవిభులు. 66

క. వీరల సప్తాంగంబులు, నారసికొని యునికి కార్య మవనీశ సదృ
క్సారబలుఁ డైననృపుతోఁ, గారవమున సంధి సేయఁగావలయుఁ దగన్. 67

తే. దైవమానుషబలములు దఱిఁగియుండు
నెవ్వరికి నెప్పు డప్పుడ యొసక మెసఁగ
వైర మతనితోఁ బాటింపవలయుఁ జెఱచు
టప్పనము గొను టర్థత్వ మరసి నడపు. 68

క. నడపునఁ గోల్పుచ్చఁగ నగు, నెడయు విడిసి యుండి చెఱచు నిక్కయు నీ వే
ర్పడఁ గనుఁగొని యం దర్థము,నడపుము నిజసైన్యరక్షణమువలయుఁజుమీ.

క. ప్రెగడలమనసులు విరసము, లగుగతి నడపురిపురాజ్య మరసి విభిన్నం
బుగఁ జేసి కలఁచి పైకొని, జగతీవర కొనఁగవలయు సౌకర్యమునన్. 70

ఆ. బలము లెసఁగ దైవబలమును గలిగి లో, గుట్టుచేటు లేని యట్టినృపతి
వలన మత్సరంబు వల దాశ్రయంబు చం,దంబు పొందు వడయఁదగు నృపాల.

ధృతరాష్ట్రుఁడు ధర్మజునకు శత్రురాజుల జయించుతెఱంగు సెప్పుట

ఆ. కుడువ నిచ్చుతఱియుఁ గుడువర[1] క్రక్కించు, నవసరంబు నెఱిఁగి యరినృపాలు
నీవు ధీరవృత్తి నిడుఁద్రాటఁ బోనిమ్ము, క్రమ్ము కపిల యనఁగఁ గ్రమ్మి [2]చెఱుపు.

సీ. ఉత్సాహశక్తియు నుర్వీశ మంత్రశక్తియుఁ బ్రభుశక్తియుఁ గెలనివాని
కిని నీకు నిట్టివి యని తారతమ్యముల్ వెరవునఁ బరికించి వేఱ మెత్త
వలయుట నెఱి గల్గి పలుకక యుండంగఁ దగుట యూహించు టుత్తమవిధంబు
మూలబలంబును మొత్తాలవారును మిత్త్రబలంబును శత్త్రుబలముఁ

ఆ. గానఁ బలముఁ గైజీతగాండ్రును, నైనయట్టిబలము లాఱు నరసి
యుచితకాలదేశయుక్తంబులుగఁ బన్ని, కొనఁగ వలయు వానికొలఁదు లెఱిఁగి.

---

1 శంకించు. 2 చెఱుము.

తే. సంపదల నాపదల నొక్కచంద మగుట
వికృతి నొందుట యాబలవితతులందుఁ
గాంచి యెల్లప్పుడును హితకారి యైన
బలము నెక్కుడుగాఁ బ్రోవు భరతముఖ్య. 74

క. [1]పరుల గెలిచి నిర్భయముగ, ధరణిఁ బ్రజం గాచువెరవు ధర్మపథమునం
బరిపాలించిన వెలయుం, గురువర కృపఁబెంపు వదలకుము ప్రజలయెడన్. 75

క. వినికి గలిగి రక్షించుచు, ననువున దయతోడఁబాడి నాయతు లెల్లం
గొనుచుఁ దగ వేలి పొగడొం,దినరాజున కుర్వి గామధేనువ కాదే. 76

సీ. ధర్మమార్గంబున ధరణిఁ బాలించిన నైహికసుఖములు నగ్గలంపుఁ
బొగడును బరలోకభూరిసౌఖ్యములును సిద్ధించు విప్రులదక్షిణలు వెట్టి
యశ్వమేధప్రముఖాధ్వరంబులు పెక్కు లాచరించుటకంటె నధిక మండ్రు
మేదినీప్రజల నత్యాదరంబును గరుణాతిశయంబు మధ్యస్థతయును

తే. గలిగి బిడ్డల నరసినకరణి గాఢ, రక్షణం బొనరించుట రాజవర్య
వినుము తమ్ముల నీగియున్నవల ననుది,నంబుఁగొనియాడు మానందనంబుగాఁగ.

చ. నరవర రాజనీతులు జనస్తుతుఁ డైననదీతనూజుఁడుఁ
హరియుఁ బరాశరాత్మజుఁడు నాదిగఁ గల్గినపెద్ద లెల్ల నీ
కరయఁగఁ బెక్కు సెప్పిరి మదాత్మయు నీదెసఁ బ్రీతి [2]పెద్దయుం
బొరయుట నేనుఁ గొన్ని యిటు వొలినభంగి నెఱుంగఁ జెప్పితిన్.

క. నిత్యవిధి సద్వివేకము, సత్యవ్రతశీలధర్మసారజ్ఞ భవ
న్మత్యాకలితమ యైనను, నిత్యంబును వృద్ధసేవ నిష్ఠఁ జలుపుమీ. 79

సీ. అన విని ధర్మజుం డంబికాపుత్త్రుతో నాపగాసుతుఁడు లేఁ డబ్జనాభుఁ
డాత్మపురంబున కరిగె [3]వాత్సల్యత నీవు దక్కఁగ నాకు హితము సెప్ప
నొడయుఁ డెవ్వఁడు భవదుపదిష్టపథమున నిష్ఠమై నడచెద నెమ్మనమున
నీవు ప్రీతిని బొందు నృపముఖ్య నావుడు నాతఁడు సంతస మంది యతని

ఆ. నధిప విశ్రమింపు మధికశ్రమంబు న్యాతనువునందుఁ జెందె నని తగంగఁ
బోవఁ జెప్పి బాంధవావళి కభిముఖుఁ, డయి నిజాలయముల కరుగఁ బనిచి. 80

వ. తాను నభ్యంతరగృహంబున కరిగి సుఖాసీనుం డై యున్ననమ్మానవనాథుతో గాంధారి దేవా వనంబున కెప్పుడు విచ్చేయువాఁడ వని యడిగిన నాభూవల్లభుం డద్దేవి కిట్లనియె. 81

క. మాతండ్రి పరాశరసుతు,చేతం బడసితి ననుజ్ఞ శీలపరత్వో
పేతుఁ డగుధర్మతనయుఁడు, ప్రీతి నొడంబడియె బంధుబృందయుతముగన్. 82

ఆ ఇంకఁ దడయ నేల యింతి వే వెడలుద, మట్లు గల్లజూద మాడి పాప

1 అరుల. 2 బద్ధముం; బంధముం. 3 వత్సల నీవు దక్కంగ నాకు హితంబు సెప్ప.

భాగు లైన నీవు[1]పట్టుల సుగతికిఁ, జనుచువాఁడఁ దపమునతిశయమున. 83

ధృతరాష్ట్రుండు వనవాసంబునకుం బురజనులచే ననుజ్ఞగొనుట

వ. అని పలికి యమ్మగువదిక్కు మొగం బయి వారికి సుగతి గల్గునట్లుగా నిప్పుడును గొన్ని పుణ్యక్రియ లజాతశత్రుననుమతితో నాచరించి పోదము గాకయని నిశ్చయించి తనకుఁ దపోవనగమనంబునకై పౌరులయనుజ్ఞ గొనవలయు నని పాండవాగ్రజునకుం జెప్పం బనిచిన నతండు దగుపురజనుల నెల్లను [2]బడి సేసి వెలార్చికొనుచు నఖిలబంధుమిత్త్రులునుం దానును వచ్చి ధృతరాష్ట్రుమందిర ద్వారపురోభాగంబున నిలిచె నయ్యాంబికేయుండు గాంధారియుం దోడ రా వెడలి వారిసన్నిధికిం జని బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రసంకులం బైనయన్న గరజనప్రకరంబు నుద్దేశించి. 84

సీ. కౌరవకోటియు మీరుఁ బెద్దయుఁ గాల మనఁగి పెనంగి యన్యోన్యసంభృ
తాధికస్నేహులరై ప్రవర్తించితి రనఘవర్తనులార వినుఁడు నాదు
పలుకు వృద్ధునకుఁ దపశ్చరణంబునకై వనంబున కేఁగు టగ్ర్యకర్మ
ముచితకృత్యంబుల యోజ మీ రెఱిఁగిన యదియకా మది ముదమార మీర

ఆ. లెల్ల నాకనుజ్ఞ యిచ్చి కానకుఁబుచ్చుఁ, డనుడు సర్వజనులు నశ్రుపిహిత
దృష్టు లగుచు గద్గదిక నెలుం గెడలఁగ, నార్తి దోఁప నేడ్చి రధిపముఖ్య. 85

వ. విని ధృతరాష్ట్రుండు వారి కిట్లనియె. 86

సీ. ప్రజ ముద మొందంగఁ బాలించెఁ బుడమి శం
తనుఁ డనంతరము శాంతనవుచేత
రక్షితుఁ డగుచు మీరలు ప్రీతిఁ బొందఁ[illegible]
చిత్రవీర్యుండు నిర్ధాత్రి యేలెఁ [illegible]నుము
బదపడి పాండునృపాలుండు మీరు హ[illegible] లేవు
ర్షింపంగ భూమి రక్షించెఁ బిదప
ధర్మనందనునిచందము మీ రెఱింగిన
యది సత్యధర్మాత్ముఁ డైనయితని

తే. ననుసరింపక యన్యాయ మాచరించి,దుర్ణయంబున నిలయేలి త్రుంచెఁ గులము
నుర్విఁ గలభూపతులను దుర్యోధనుండు,వానిదుశ్చేష్టలకు మూల మేన కాదె.

వ. అది మీమనంబులం బెట్టక. 88

క. మహి లెస్సఁగ రక్షించిన, మహితగుణులయన్న కొడుకు మనుమం డని నా
కు హితంబు గోరి కరుణా,సహితుల రై యిం డనుజ్ఞ సద్వ్రతమునకున్. 89

వ. అని యప్పు డజ్జనంబులమనంబుల లేకున్నను దనకేల్మొగిడించి యరణ్యగమనాను
జ్ఞాకరణంబునకుం బ్రార్థించి యవ్విభుండు వెండియు. 90

1 పట్ల సద్గతికిని. 2 బిందుసేసికొని వెలార్చి

ఆ. వృద్ధ కృపణ పుత్రవిరహిత గాంధారి, యీనెలంతఁ జూచియైన మీర
లకట కానవమున కరుగుట మేలని, మాకనుజ్ఞ యిండు మాన్యులార, 91

వ. అని పలికి పాండవాగ్రజుం జూచి. 92

సీ. తమ్ములనడుమ నీతండు దిక్పాలక మధ్యభాసితుఁ డైనమఘవుఁ బోలి
మహనీయవిభవసమగ్రత వెలిఁగెడు నేమిట నేమఱ కెపుడు మీర
లితనిఁ బోడివి సుప్రీతిగ వర్తింపుఁ డయ్య యిల్లడ యిమ్మహానుభావు
నిడితి మీకడ మిమ్ము నెల్లభంగులఁ దనపరిపాలనంబునఁ బరమసుఖులఁ

ఆ. గా నొనర్చువాఁడు గా నప్పగించిన, వాఁడ నేను మీకు వేఁడి దాఁకు
నట్లుగాఁ జరింప నస్మత్కులీనుల, కధికదుఃఖకారి నైతిఁ గాని. 93

క. ఆరయ నెన్నం డైనను, మీరలు నా కెగ్గు గాఁగ మెలఁగుట లే దో
పౌరవరులార నన్నుఁ, గారవమున ననుప రయ్య కాననమునకున్. 94

వ. అనినం బౌరజనంబు లేడ్పులు మ్రింగికొని యొండొరులం జూచుచు నూర
కున్న నమ్మహీశ్వరుండు మఱియును, 95

సీ. సాధుచరిత్రయు శాంతయు నైనయిగ్గాంధారియును నేను గాఢవినయ
మార మీ తెలివిట్లు గోరుచున్నార మఖిలధర్మాభిజ్ఞుఁ డగుపరాశ
రాత్మజుండును ధార్మికాగ్రణి పాండవాగ్రజుఁడును నాకు నరణ్యగమన
మునకు నిచ్చి రనుజ్ఞ మోడ్పుఁగేలొదలఁగదియించి మిమ్ము వేఁడెదఁ గృపాధుర్య

తే. లార యనుమతి సేయుఁడు మీరు ననుడు, వార లుత్తరీయంబులు వదనవినిహి
తములుగాఁ జేసికొని రోదనము రవంబు, లెసఁగఁ జేసిరి విను ధరణీశవర్య. 96

వ. అట్లేడ్చి యుడిగి తమయుత్తమవృద్ధులుం గూడికొని కార్యవచనంబు లార్యచరితుం
డును జతురాలాపకపుత్త్రుండు నగు[1]శంబుఁ డనువిప్రోత్తమునకుం జెప్పి యుత్తె
అంగున ధృతరాష్ట్రునితో నుచితంబుగాఁ బలుకుఁడు మని నియోగించిన నాతం డారాజు నగ్ర
భాగంబునఁ జేరి సవినయంబుగా నిట్లనియె. 97

ధృతరాష్ట్రునితో శంబుఁ డనువిప్రుఁడు పౌరజనసమ్మతి సెప్పుట

సీ. భరతవంశోత్తమ పౌరజనంబులు మమమాటలుగ భవత్సన్నిధాన
మున నన్నుపన్యాస మొనరింపఁ బంచిన యట్టిభాషణము లేకాగ్రబుద్ధి
నవధరింపుము మీమహాన్వయంబున మహీపాలకులయం దొప్పమి వెదకియైనఁ
గానము మము మీరు గన్నట్టిప్రజల నెట్లట్ల రక్షించితి రాదరమున

తే. వినుము దుర్యోధనుండు సేసినయనర్హ
మొక్కటియు లేదు నినుఁ ద్రిలోకోత్తరుండు
సత్యవతికొడుకే మని సమ్మతించి
పంచె దానిన చేయుము పరమనియతి. 98

---

1 శాకల్యుం డను.

క. అడ లడిఁ బడఁగా మమ్మును, విడిచితి గురు వైనశోకవేదన నే మిం
కుడిపికొనునప్పటికిఁ దోడ్పడు నీ వగుసద్గుణములు బంధులు వోలెన్. 99

ఆ. ధాత్రి శంతనుఁడు విచిత్రవీర్యుఁడుఁ బాండు,రాజు నెట్టు లట్ల రాజరాజు
ప్రజకు సంతసముగఁ బాలించె నీయందు, నతనియందుఁ గలదె యధిప యొగ్గు.

వ. భీష్మద్రోణకృపద్రౌణికర్ణకృతవర్మశల్యు లొక్కదిక్కును భీమార్జుననకులసహదేవ
ద్రుపదవిరాటసాత్యకు లొక్కదెసయు నై విధిప్రేరణంబునం బోరిరి వారివలన
నఖిలక్షత్త్రియసంక్షయం బావహిల్లె నది యొక్కదుర్యోధనుచేతన యయ్యెనె
యట్లుం గాక రణంబు రాజుల కుత్తమధర్మంబ కావె యందులమరణంబును
సుగతికరణకల్యంబు నీసుతుండు సహాయులుం దానునుం బుణ్యలోకసౌఖ్యం
బునం బొంది యున్నవాఁడు ధర్మాచరణశాలి వగునీకును సుగతిప్రాప్తి సులభంబ
యగు నిట మీఁదటికి మాభాగ్యంబునం జేసి పరమకృపాభరితు లైనపాండవులు
మాకు రక్షకులు గాఁ బడసితి మాకర్ణింపుము. 101

తే. స్వర్గ మైనను బాలింపఁ జాలువారు, వీరలకు భూమిపాలనవిధి యనంగ
నెంతపని వీరిచేతికి నిచ్చి తిపుడు, మమ్ము నెల్లవిధంబుల మనిచి తధిప. 102

సీ. ధర్మపుత్త్రుఁడు దీర్ఘదర్శి మహోదాత్తసచివుండు బంధురక్షణపరుండు
రిపునెడ నైనను గృప పెద్ద భావసంశుద్ధియుఁ బ్రతిభయు సువ్రతంబు
నితనికి వెన్నతో నిడినవి యొరులను దనయట్ల కాఁ జూచుఁ దమ్ము లెల్ల
సన్నుతి కెక్కినసకలగుణముల నిమ్మహాత్మచందాన మమ్ముఁ బ్రోచు

తే. మాత్ర యే దేవవిషయసముచితాగ్రహారసజ్జనమాన్యంబు లైనగ్రామ
ములు దగంగ రక్షింతురు వెలయఁ దారు, నిత్తు రూళ్లను దేవమహీసురులకు.

క. మృదువులకుఁ జాలమృదువులు, విదితయశా వినుము పాండవేయులు గడుబె
ట్టిదులు బెడిదంపువారికి, మదలోభిత్వములు లేవు మందున కైనన్. 104

క. శూరులు శాంతస్వాంతులు, పౌరజనప్రకరజానపదచయనిత్యా
పారప్రమదాపాదన, పారగు లతులగురుభక్తిపరతంత్రాత్ముల్. 105

తే. గొంతిదేవికిఁ గోడండ్రకును మనములఁ, గరుణ యగ్గల మైయుండు ధరణినాథ
పౌరులందును జనపదప్రజలయెడను, నాఁడుదురు మేలు దమకగ్గ మైనయపుడు.

తే. వీర లెప్పుడు మము నీవు గారవించు
టెఱిఁగి మన్నింతు రమలినహృదయ కలఁక
దక్క ధర్మజుపై రాజ్యతంత్రభార
మిడి మనంబున నూఱడి యిచ్చ సలుపు. 107

వ. అని చెప్పె ని ట్లవ్విప్రముఖంబునం బౌరులభాషణంబులు విని ధృతరాష్ట్రుండు
ప్రీతుం డయి సముచితప్రకారంబుల నజ్జనంబులం గ్రమంబున వీడుకొలిపి కొంతే
యాదిబంధువులను మిత్త్రులను నిజనివాసంబులకుం బోవం బనిచి గాంధారి

సమేతుం డై యభ్యంతరమందిరంబున కరిగి యద్దిన శేషంబును రాత్రియుం దగు
వర్తనంబులఁ గడపి మఱునాఁడు విదురుని రావించి మృతులయినబాంధవుల
కెల్లను సవిశేషశ్రాద్ధంబులు సేయుతలంపు పుట్టి కొన్నిదివసంబులు పయనంబు
మానితి మానితమాననీయచరిత్రుం డగుధర్మపుత్త్రుపాలికిం బోయి నీవికా
ర్యంబు సంఘటింపు మని పనిచిన నతం డట్ల చేసెద నని యనుజసహితుం డై
యున్న యన్నరేంద్రునిం గాంచి. 108

సీ. మీతండ్రి సురనదీసూతిబాహ్లికులకు సోమదత్తునకుఁ దత్సూనునకును
దుర్యోధనాదిసుతులకును దక్కను గలుగుబంధులకు నుత్కర్ష మెసఁగ
శ్రాద్ధముల్ సేయువిచారంబు దోఁచిన మసలెఁ గార్తికపౌర్ణమాసిదాఁక
వనమున కరుగఁ దప్పని నీకుఁ బోలినయట్టులు గావింపు మనిన నాతఁ

తే. డెంతయును వేడ్క నమ్మాట కియ్యకొనియె
నర్జునుండును బ్రీతుఁ డై యహ్హ మనియె
భీముఁ [1]డప్పుడు గమర్చినమోముతోడ
విదురువదనంబు సూచుచుఁ బెదవు లదర. 109

వ. ఏమేనిం బలుకం జూచిన బీభత్సుండు మెలుపున నతని వారించి యల్లన యి
ట్లనియె. 110

సీ. రాజు వృద్ధుఁడు ధృతరాష్ట్రుండు భీష్మముఖ్యజ్ఞాతులకు శ్రాద్ధకర్మ మాచ
రింపఁ దలంచి యర్థించె [2]భవదర్జితధనధాన్యములు నీవు దాని కియ్య
కొనమి యశంబునకును ధర్మమునకు విధ్వంసంబు సేయదే ధర్మతనయు
తలఁచినపని విఘ్నితముసేయఁ దగునయ్య మనకు నయ్యంబికాతనయుఁ దొల్లి

ఆ. వేఁడికొందు మతఁడు వేఁడెడుఁ గానకు, నేఁగుచుండి మనల నిప్పు డింత
సూడవలదె యొండు లాడక యప్పని, సలుపు టొప్పు బాహుశాలి నీకు. 111

క. అని చెప్పఁగఁ జెవి [3]దాఁటిచి, విని ధర్మతనూజుఁ డంత విజయునిఁ బొగడెన్
మనమున నమ్మాటల కయ్యనిలతనయుఁ డిట్టు లనియె నన్నరుతోడన్. 112

భీముఁ డర్జునితో ధృతరాష్ట్రునుద్యోగంబునకుఁ బ్రతికూలించి చెప్పుట

క. మును చేసినయవి చాలవె, విను గాంగేయాదిబంధువితతికిఁ దగ నిం
కను శ్రాద్ధంబులు వలసిన, మనము దగనె చేయ దుష్టమతి యతఁ డేలా. 113

క. మఱచితె యాతఁడు మనలం, బఱచినబన్నములు భీష్మబాహ్లికముఖు ల
త్తఱి నెట వోయిరి వారల, నెఱుఁగమె మన మట్టిబంధు లేటికి మనకున్. 114

వ. వారివిషయం బైనమేలునకు మాఱాడుట యొగ్గు గా దాకర్ణింపుము. 115

తే. కర్ణునకుఁ జేవలసినగారవమున, గొంతి యింకను శ్రాద్ధ మత్యంతవిభవ
ముల్లసిల్లంగఁ జేయుఁ గా కుచితనిరతి, యావిధమునకు మాఱాటసూవె యొగ్గు.

1 దప్పుడు గనలిన. 2 భవజ్జాత ధన. 3 వాలిచి.

వ. అని పలికి వెండియు. 117

సీ. పాంచాలి నవమానపఱిచిన తెఱఁగును నయ్యింతి వెనుకరా నడవిఁ గలయ
ధర్మజుచన్నచందంబును మది గీఱి[1]యుండక మఱి పెట్టు లొలనె నీకు
నాంబికేయుఁడు దండ్రి యగుట నాఁడెట వోయె భీష్ముండుమొదలగుపెద్దవారి
బాంధవం బే మయ్యెఁ బార్థ యీవిదురుఁ డెఱుంగఁడే వారలభంగి యనిన

ఆ. ధర్మజుండు భీముఁ దగువచనముల న,దల్చె నరుఁడు మఱియుఁ దగఁడె పూజ
కాంబికేయుఁ డిట్టు లనకుము మనకు న,గ్రజునిపనుపుసేఁత వ్రతము గాదె. 118

క. అని భీము నదిమి విదురునిఁ, గనుఁగొని మాతండ్రి పుణ్యకర్మము లెమ్మెఁ
దనబంధులకై చేయఁగ, మనంబునం దలఁచె నాసమంచితభంగిన్. 119

క. నాయింటిధనము గైకొని, చేయఁ గలాఁ డమ్మహీశుచిత్తము సంతో
షాయత్తంబుగ వేగమ, పోయి యనఘ చెప్పు మవ్విభుఁడు ప్రియమందన్. 120

చ. అన విని మెచ్చి ధర్మసుతుఁ డర్జునునిం గొనియాడి యాదరం
బున విదురుం గనుంగొని ప్రభూతవిధానములన్ నిజేచ్ఛ నా
ధనమును నర్జునార్థమును దాఁ గొని శ్రాద్ధము లాచరించువాఁ
డనఘ కురూద్వహుం డిది మదాత్మకు నిం పని విన్నవింపుమీ. 121

వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 122

క. వనవాసాయాసంబుల, ననయంబును నలఁగి దాని నాత్మ నిడి మది
త్తనయుండు పెక్కు లాడెఁ ద,గనిమాటల దీన రాజుఁ గనలకు మనుమీ. 123

క. ఇతఁ డేమి యన్న నే మగు, ధృతరాష్ట్రుఁడు మాకుఁ బరమదేవత విను స
మ్మతిఁ దత్ప్రసాదముం బడ,సితి మేమును దత్కృతాభిషిక్తుల మనఘా. 124

వ. అని పలికి యప్పుడమిఱేఁడు వికచవదనుం డగుచు. 125

క. మాతండ్రినిష్టవిధములఁ, బైతృకవిధు లాచరింపఁ బంపుము [2]రథ్య
వ్రాతకనకగోరథములఁ, జేతి కొదవ నర్జునుండు సేర్చుచు వచ్చున్. 126

క. గ్రామములు దేవతలకును, భూమిసురులకును గురుప్రభువు నిమ్మనుమీ
పో మసలితి చెపు మాతని, కీమాటలు వలయుపనుల కీవు మెలఁగుమీ. 127

క. అనినఁ బ్రియ మంది విదురుఁడు, సని యానృపుతో నజాతశత్రుకడకు నీ
పనిచినపనికిం బోయితి, వినిపించితిఁ దెఱఁ గతండు విని మోదమునన్. 128

క. నరువలను సూచె నతఁడుం, బరమప్రియభరితుఁ డయ్యెఁ బార్థివవర య
య్యిరువురుఁ బ్రాణంబులు డ్రా,పదు నీకును ధనము దాఁచుపని గలిగెడినే. 129

క. చేయుము విచ్చలవిడి గాంగేయప్రముఖులు నిరస్తకిల్బిషులై మో
దాయత్తచిత్తులుగ భూ,నాయక శ్రాద్ధములు జగమునం బొగ డెసఁగన్. 130

చ. కనకము మేలిరత్నములు గ్రామములున్ హయగోవ్రజంబులుం

1 యుండఁగ. 2 రత్న,వ్రాతకనకగోహయములఁ, జేతోరతి నర్జునుండు.

పనియుఁగ నిన్ను సర్వవసుధాసురకోటులకుం దనిచెచ్చ నీ
తనయులు పుణ్యలోకసుఖధాములు లై విలసిల్లునట్లుగా
ననుటయు నాంబికేయుహృదయంబున మోద మెలర్చె భూవరా. 131

చ. కడపడి భీముమాట లొకభంగి నెఱుంగఁగ జెప్పి వాఁడు దు
ష్టుఁ డవి పాటి గావు కురురాజమహాత్తర పెట్టుకుండు నీ
హృదయమునందు వాని నని యేర్పడ ధర్మజపార్థవాక్యముల్
విదురుఁడు సెప్పె సంతసము వెల్లిగొనంగ ననేకభంగులన్. 132

ఆ. అట్లు సంతసిల్లి యధిప కార్తికపౌర్ణమాసి నవ్విభుండు మహితభూమి
దేవకోటి నెల్ల రావించి యంచితశ్రద్ధఁ జేయఁ దొడఁగె శ్రాద్ధవిధులు. 133

సీ. కనకాదివస్తువుల్ గడువేడ్కఁ ధర్మనందనుఁడు పుత్తెర సుదాత్తభంగి
బాహ్లికునకు గంగపట్టికి సోమదత్తునకుఁ దదీయపుత్త్రునకుఁ దొలుత
[1]నంచితశ్రాద్ధంబు లాచరించె సుయోధనాదికుమారుల కందఱకును
వేర్వేర క్రియా[2]లు నీప్సితవిధంబులఁ దగ నొనరించె సింధురాజునకుఁ దక్కు

ఆ. గలుగుబంధులకును వలయురాజులకును, ద్రోణునకును బుద్ధిఁ దోఁచినట్టి
యిష్టజనములకు నహీనభవ్యప్రకారములఁ బారలౌకికము లొనర్చి. 134

చ. అతులితరత్నకాంచనగవాశ్వవిభూషణవస్త్రకన్యకా
క్షితిముఖవస్తుదానములు కీర్తన కెక్కఁగ నవ్విభుండు సు
వ్రతుఁ డయి చేసెఁ బంచదశవాసరముల్ నిజదానలౌల్య ము
ప్రతిహతవృత్తిఁ జెల్ల విని పాండుసుతాగ్రణి ప్రీతిఁ బొందఁగన్. 135

ఆ. భూమిదానవిధులు భూవర యొకమాత్ర, నంబికాతనూజుఁ డాచరింప
నంతఁ బోక యాళు లగ్రజన్ములకు నీ, నతనిఁ బనిచెఁ బాండవాగ్రజుండు. 136

### ధృతరాష్ట్రుఁడు గాంధారీసహితుం డై వనంబునకుఁ బోవుట

వ. పనిచినం బ్రియంబు పెంపున హృదయంబు పల్లవింప నా భూవల్లభుం డనేక గ్రామంబు లగ్రహారంబులు గావించె గాంధారరాజు మొద లయిననిజబంధువులకు బహులదక్షిణలు గాఁ బారలౌకికక్రియలు సేసి యిట్లు ధృతరాష్ట్రుండు భారతరణంబున మరణంబు నొందిన బంధులోకంబునకుం బుణ్యలోకసౌఖ్యాతిశయపదంబు లగుపరమశ్రాద్ధంబులు నిర్వర్తించి కృతకృత్యుం డై సర్వకృత్యంబులుం జలిపి పాడ్యమినాఁడు రేపకడ ఋత్విక్సమేతుం డై యిష్టి నడపి పాండవులను దక్కటిబంధువులను మిత్త్రులను రావించి వనవాసంబునకు సంకల్పంబు సేసి సకలభృత్యజనంబులకు నర్థధనంబు లిచ్చి గాంధారీసమన్వితుం డై వల్కలాజినంబులు ధరియించి యక్షతగంధపుష్పంబుల గృహంబుఁ బూజించి సర్వపదార్థంబులుం బరిత్యజించి [3]య[illegible]సన్యుఁ గదిసి నడవ యాజకు

1 నర్థిమై శ్రాద్ధంబు. 2 లభీప్సితవిధంబుల నొనరించె. 3 [illegible]దేవియుఁ.

లగ్నులు నుపకరణంబులును ధరియించి ముందటం జేరువ నరుగ నగరు వెడలె నట్టియెడ నేతెంచి. 137

క. గొంతి మొదలైనకౌరవ, కాంతాజను లెల్ల నెవ్వగలఁ బొగులుచుఁ బ
[1]ర్యాంతంబుల బాష్పసలిల, సంతానము లురులఁ దోన చనుదేరంగన్. 138

వ. అజ్జనపతి సనుచుండె. 139

తే. పాండవాగ్రజుఁ డక్కురుభర్తవలను, [2]శోకదీనుఁ డై తప్పక చూచి యేడ్చి
హామహారాజముఖ్య యెందరిగె దనుచు,నొడలు కంపింపఁ జదికిలఁబడియె నధిప.

క. నరుఁ డనునయించె వెస న, న్నరపతి నెత్తుచును దాఁ జనయము గా వనటం
బురపురఁ బొక్కెం గురుభూ,వర యద్దెస తెఱఁగు రాదు వాక్రువ్వంగన్. 141

వ. భీమసేననకులసహదేవులును గృపయుయుత్సుసంజయులును ధౌమ్యాదిధరణీసురులును శోకవ్యాకులత్వంబు నొందిరి గొంతి యడలుచు గాంధారికరంబు నిజస్కంధంబున నిడికొని నడవ నయ్యంధనృపతి గాంధారీస్కంధభాగకలితబాహుండై పోవుచుండె నప్పుడు పాంచాలియు సుభద్రయుఁ జిత్రాంగదయు నులూపియు సపుత్త్ర యగునుత్తరయు మఱియుం గలయట్టిమగువలుం గురరీనిచయనాదంబులచందంబు దోఁప నాక్రందనంబు సేసి రయ్యవస్థ జూదంబు నాఁడు పాండవులు పురంబు వెలువడినప్పటిదశం బోలి యుండె నట్లు ధృతరాష్ట్రకాననగమనంబు నిశ్చితం బగుటయు నాబాలవృద్ధంబుగాఁ బురజనంబు గనుంగొనం జనుదెంచిన 142

ఆ. వచ్చి రెండకన్ను వానకన్నును నెఱుం,గనిపురంధ్రు లెల్లఁ గరము వంతఁ
దలరునంతరంగములతోడ నక్కురు, వృద్ధుఁ జూడ నార్తివికలగతుల. 143

క. నేలను హర్మ్యంబులపై, నోలి నిలిచి చూచుమానవోత్కరములశో
కాలాప [3]విలాపంబులు, నేలకు మింటికిని నడుము నిండి చెలంగెన్. 144

వ. ధృతరాష్ట్రుండును బురద్వారంబు నిర్గమించుచుండి సకలపౌరజనంబుల నిలువం బనిచె విదురుం డక్కురువృద్ధునితోడ వనంబున కరుగుటకు దృఢనిశ్చయుండై వలికె సంజయుండు నవ్విధంబువాఁ డయ్యెఁ గృపాచార్యుండును యుయుత్సుఁడు నత్తెఱంగుమాట లాడిన నాంబికేయుండు వారిని వారించి ధర్మనందనున కప్పగించి నిలిపి కోడండ్ర నెల్లను సముచితవచనంబుల మరల నియమించిన వార లావైచిత్రవీర్యునకు గాంధారికిం బ్రణమిల్లి బాష్పంబులు వదనంబున వెల్లిగొనుచుండ వీడ్కొనియును బాండురాజమహిషిం జూచికొని వెనుకం జనుచుండి రాసమయంబున నజాతశత్రుం డాగొంతి కిట్లనియె. 145

క. మాయయ్య కాననమునకుఁ,బోయెడు నే నితనితోడఁ బోయెద శుశ్రూ
షాయత్తుఁడ నై యుండెద, నీయువిదలఁ గొనుచు మగిడి యేఁగుము తల్లీ. 146

చ. అనుటయు గొంతి యక్కురుకులాగ్రణి కిట్లను నీవు దోడఁ గా

---

1 క్షాంతముల బాష్పజలకణ, సంతానము. 2 శోకలీనుఁ డై. 3 విరావంబులు.

వనమున కేఁగు దెంచుట జనస్తవనీయచరిత్రుఁ డివ్విభుం
డనుమతి సేయునే యుడుగు మాపని యియ్యమ యత్త నాకు నీ
మనుజవిభుండు మామ గరిమంబుగ వీరలఁ గొల్చి పోయెదన్. 147

తే. ఇతని కియ్యకొనుము విను మేన చువ్వె, వలఁతి శుశ్రూషసేయంగ వత్స మీర
లావనికి నేర్తురే వీర లడవి కరుగ, నింట నుండఁగ నాయన మియ్యకొనునె. 148

వ. అనిన నాధర్మపుత్త్రుండును దమ్ములు నుచితవచనంబుల వేఁడికొనిన నద్దేవి
యగ్రతనయుం గనుంగొని. 149

క. వీరలయెడఁ గొడుకా[1]యప,చారంబులు వలుకుదునె విచారము విడు మే
నేరూపంబున నిలువన, గారవమున నిది వ్రతంబు గాఁ గైకొంటిన్. 150

వ. అని పలికి నిజస్కంధంబున నున్న గాంధారికరంబుఁ గరంబు నయంబునం బాపి
యతనిదిక్కు మొగం బై. 151

క. నీ వేమియు ననకుము సహ,దేవుని నేమఱక యరయు దినకరసుతునిఁ
భావమునఁ దలఁపు మేనా, దేవసమునిపుట్టు వడఁచితిం గపటమునన్. 152

క. అది పాపము దానికి నా, మది నెప్పుడు వగతు విమలమానస యక్కీ-
డు దొలంగునట్లుగా స,త్పదార్థదానములు సేయు తాత్పర్యమునన్. 153

ఆ. అవ్విధమునఁ గర్ణుఁ డాఱడిఁ బోయిన, నాదుమానసంబు వోదు నూఱు
పఱియ లై తలంప బలుబాతఁ జేసిన, వారు గాఁగ వలయు వంశవర్య. 154

క. నీవును దమ్ములు భక్తిభ,రావేశముతోడఁ దలఁపుఁ డమ్మహితాత్మున్
ద్రోవది నెప్పుడు దృఢసం,భావన మన్నింపు మయ్య పౌరవముఖ్యా. 155

క. భీమార్జుననకులమునగి, కామంబులు సఫలతాప్రకాశంబులు గా
భూమీశ యరసి యొనరుపు, మే మిట నేమఱకుధర్మ మిల యరయునెడన్.

వ. అని పలికి నానిశ్చయంబు శిథిలంబు గాదు మీరు మరలుం డని పలికినం బాండ
వాగ్రజుండు విషాదం బంది యూరకుండె భీమాదులు డెందంబులు గొంద
లం బంద నశ్రు లొలుకం దలలు వాంచి రిట్లమ్మొత్తంబుగ మనంబు [2]గుదివడుచు
మందం బై చెల్ల ధృతరాష్ట్రుండు [3]గొండొకయెడ గలుగం జనియె నాధర్మతన
యుండు దల్లియాననం బాలోకించి, 157

ధర్మరాజు కుంతిని వనంబునకుఁ బోనల దని ప్రార్థించుట

సీ. ఇది యేమి సేయంగ నెత్తికొంటి మ్మాట యాడకు మేను నిన్నడవి కేఁగఁ
బనుతునే మముఁ దొల్లిపనిచి పనుల్ గొనుభంగిన సామ్రాజ్యభారనిర్వ
హణము తెలుంగులు నప్పటి కప్పటి కిట్లని యానతి యిచ్చి నడపఁ
బంపక యున్న నొప్పమి రాదె మాకు ము న్నీవును గృష్ణుండు నేవిధమున

తే. నడపితిరి కార్య మెఱుఁగవే యడలు వెల్లి

1 యపు, చారంబులు. 2 సుడివడుచు. 3 గొండుక యెడ.

మిమ్ముఁ బాలించి నిటు ముంచి యమ్మ యడవి
నెట్లు లుండెద వనఁగ నయ్యింతి బాష్ప
పూర్ణనయన యై యూరక పోవుచుండె. 158

ఉ. అయ్యకులాత్మతోడఁ బవనాత్మజుఁ డిట్లను ధర్మపుత్త్రనీ
వెయ్యది యుక్తహేతువుగ నిమ్మెయిఁ బాసెదు నీదుపన్నునం
గయ్యము సేసి భూపతినికాయములం బరిమార్చిఁ దల్లి నీ
కియ్యన లక్ష్మి నూఁది [1]చరియింపక యిప్పుడు వాయఁ బాడియే. 159

క. మనమునఁ దోఁచినదానము, లనుదినమును జేయుచును సమాశ్రితజనులం
బెనుచుచు బంధులఁ బ్రోచుచు, జననుతచరితమునఁ బరగు సౌజన్యనిధీ. 160

క. వనమున మాద్రీపుత్త్రులు, వెనుఁబడుటకుఁ దలరి తల్లి విక్రమమునఁ కుగ్
గొనకొల్పి లిట్లు వీరల, ననూనదుఃఖముల ముంచి యరుగం దగునే. 161

వ. అనియె నట్టియెడ. 162

క. ద్రోవదియు సుభద్రయు శో, కావేశం బడర మోము లశ్రులఁ దోఁగం
గా వెక్కి వెక్కి యేడ్చిరి, భూవర పాండుతీశపుత్త్రిలు నేడ్వన్. 163

క. పరిజనములు గన్నీళ్లు, దొరఁగఁగ [2]నడ లొంది వారితోఁ జని రి
ప్పురుసునఁ దనదుతనూజులు, మరలమికిం బాండురాజమహిషి మఱుఁగుచున్.

వ. తెగ నాడ కున్నఁ బోవ రని కన్నీరు దుడిచికొని వారలం గలయం గనుంగొని
వారలు వినుచుండం దత్పరిజనంబులతోడ. 165

సీ. దుర్ద్యూతమునఁ దారు దూలపోవుటయును నాసభ నపకీర్తి యగుతెఱంగు
వాటిల్లుటయుఁ బెక్కుభంగుల నడవుల నిడుమలఁ బడుటయు నే సహింపఁ
జాలక కార్యంబు చర్చించి సంధి మై నొవ్వని వారెల్ల నవ్వఁ దలలు
వంచి కౌరవులలో వర్తింప నే లని హరితోడ నాడితి నవ్విధమున

ఆ. మాననీయు ధర్మసూను నాగాయుత, బలుని భీము శత్రుభంజనైక
శీలుఁ బార్థు శౌర్యలోలురఁ గవల దై, న్యంబు నొందఁ జూచు టర్హమగునె.

వ. అని ధర్మతనయువదనంబు వీక్షించి పాంచాలిం జూపి. 167

సీ. గౌరవంబున సుకుమారత్వమున నొప్పు నిప్పొల్తిఁ దల వట్టి యీడ్చి తెచ్చి
సభలోన నట్లు దుశ్శాసనుం డవమాన పెట్టంగ నచ్చటి పెద్ద లెల్లఁ
బలుకక యుండ నబ్బన్నంబునకు నోర్వ వలనె మీ కప్పటి కలఘుతేజ
నీతేజ మట్టులు నీ అయి పోయినఁ బాండునికులము నెప్పంగఁ జూప

తే. లేక [3]పోదె యబ్బంగిఁ బల్కితి ముకుందు,తోడ నేను మీ రెమ్మెయి రూఢి కెక్కి
వెలుగఁ గోరుటకతమునఁ దలఁచి దాని, ననిలసుతుఁ డెత్తిపెట్టె నేమనఁగఁగలదు.

1 చరియింపఁగ నిప్పుడు. 2 నడలాడ వారి. 3 పోక కబ్బంగిఁ.

వ. అనిన విని ధర్మసుతుండును భీముండును సిగ్గువడి రిట్లు పలికి గొంతి యి
మ్మాటకు భీముచిత్తం బెట్లగునో యనుతలంపున ధర్మసుతున కతనిం జూపి. 169

ఉ. నాకది నొండు లేదు విను నవ్వితి నీతనితోడ నీదుల
క్ష్మీమహిమన్ మనం బలరఁ జేసితి నుత్తమదానముల్ జన
స్తోమనుతంబు గా నడపఁ జూచితి జన్నము గన్నులార నిం
కేమికొలంత నా కుడుగ నెట్లును బోదు నరణ్యవృత్తికిన్. 170

తే. రాజ్యఫలము గామింపఁ బుత్త్రా సమగ్ర,తపమునకు ఫల మైనయుత్తమగతిప్ర
సిద్ధి గోరుదు నదిఁ గల్గఁ జేత కిట్టి,తోడు మఱి నాకుఁ గలుగునే దురితదూర.

క. కురురాజునకును దేవికిఁ, బరిచర్య లొనర్చుచుం దపంబునఁ గృశతం
బొరయుతనువుతోఁ గడపెదఁ, గరమునియతి నింకఁ గలుగుకాలము వత్సా.

వ. మీరు మరలుం డనియె నట్టియెడ నప్పాండురాజమహిషి దమతోడ వన
వాసంబునకై వచ్చుటకుం గడంగుటయు దాని కొడంబడక పాండవులు దగు
పలుకులం బ్రార్థించుటయు నెఱుంగుం గావున ధృతరాష్ట్రుండు ధర్మతనయుం
డెట్లు సెప్పె నట్లు సేయు మని విదురసంజయులచేత నద్దేవికిఁ జెప్పి పుత్తెంచిన
వార లేతెంచి యబ్భంగి సెప్పినను వదలక వారిపలుకు లాయమ వారించి దృఢ
నిశ్చయంబునఁ గొడుకులఁ గోడండ్రను దక్కటిబంధుజనులను సర్వభరత
భార్యలను బరిజనంబులను గలయం గనుంగొని యిట్లేల వచ్చెదరు నిలువుండు
సుఖులరై యుండుం డనుటయు. 173

క. హృదయములు దలర నందఱుఁ, బ్రదక్షిణముగాఁగ నేడ్పుఁ గ్రందు టెలుఁగు లె
ల్లదెసలఁ జెలఁగఁ దిరిగి త,త్పదంబులకు నెఱఁగి వంతఁ దనువులు దూలన్. 174

వ. నిలిచి రంతఁ బాండవు లేవురుం బాండురాజమహిషి ననుప మఱియుం జని
యాయమను ధృతరాష్ట్రగాంధారులను గలపి వారల నిరువుర నుద్దేశించి మీరు
వనంబునకుం బోయి తానును లే కున్న మాకెట్లు కాలంబు గడప వచ్చు
ననుతలంపునం దన్ను నెంత ప్రార్థించినను గొంతి నిలుచుట కొడం బడ దయ్యె
నీసాధ్వికి బుద్ధి సెప్పికొనుచుం బరిచర్య సేయించుకొం డని యప్పగించి యా
రాజునకు నద్దేవికిం గుంతికిం బ్రదక్షిణంబు సేసి దండప్రణామంబు లాచరించిన
దీవించి వా రామంత్రణంబు సేయ నాధర్మపుత్త్రాదు లశ్రుప్లావితంబు లగువద
నంబులతోడ మరలి వనితాజనంబులం దోడ్కొని.

తే. పొగులుచును నల్లనల్లన పురికి నరిగి
[1]రదియు నుమ్మలికంబు ప్రోవైనయట్లు
సూడఁ గూడక యుండంగఁ జొచ్చి రాత్మ
మందిరము లందఱును బుధమాన్యచరిత. 176

1 వ్యథయు నుమ్మలికంబు.

వ. అట్లు పురప్రవేశంబు సేసి ధర్మనందనుండును దమ్ములుం దగినవర్తనంబుల నుండి రట యక్కురువృద్ధుండు నిశ్చితుండై గాంధారియుం గుంతియు విదుర సంజయులు నగ్నిహోత్రంబునకు వలయుఋత్విగ్జనంబులతోడ నరుగుదేర నలయక భాగీరథీతీరంబునకుం బోయి యొక్కయోగ్యప్రదేశంబున విడిసెఁ దదనంతరంబ యతండు. 177

క. స్నానాదికవిహితానుష్ఠానంబులు నడపి శ్రుతివిశారదభూదే
వానీకప్రణయనమున, మానితరుచి వెలుఁగుచున్నమహితాగ్నులకున్. 178

తే. అర్చ లిచ్చి హోమంబు సమంచితముగఁ, జలిపి యెల్లవారలకు భోజనము సంఘ
టించి యాహారవిధి యాచరించి విదుర,సంజయులయొనర్చినదర్భశయ్య నుండె.

ధృతరాష్ట్రుండు శతయూపరాజర్షి యాశ్రమంబున వసియించుట

వ. ఆశయ్యకు ననతిదూరంబునం గల్పితం బైనతల్పంబున గాంధారియుం దదనం తరసన్నిహితశయనంబున గొంతియు నింత నంత విదురసంజయులును జొల్లం దముకుఁ జూడం బోలినచోటుల యాజకజనంబును విశ్రమించి ర ట్లద్దిన శేషంబు సనిన సాయంతనకృత్యంబులు సలిపి రయ్యామిని యచ్చటఁ గడపి సూర్యో దయసమయంబునం గాలోచితకరణీయంబులు నిర్వర్తించి యాంబికేయుండు దనవారును దానును గంగానది యుత్తరించి చని కురుక్షేత్రంబుఁ బ్రవే శించి యొక్కపుణ్యాశ్రమంబునుపాంతంబునం దరుచ్ఛాయాశీతలం బైనసికతాతలంబున నాసీనుం డయ్యె న ట్లక్కురురాజు నిజాశ్రమప్రదేశంబునకు వచ్చుట శతయూపనామధేయుండును గేకయవంశవర్యుండును దపోధుర్యుం డును నైనరాజర్షిసత్తముండు విని యయ్యెడకు వచ్చి. 180

క. కని గారవంబునం దోడ్కొని చని యర్ఘ్యాదివిధు లకుంఠితవినయం
బున నడపిన నయ్యాశ్రమ,మున నతఁడు వసింపఁ గోరె భూపవరేణ్యా. 181

క. కోరిన విదురాదులు నా, కౌరవపతితలఁపు మేలుగాఁ గొని తగ న
చ్చేరువను బర్ణశాలలు, వే రచియించి రుచితంపువిధమున నధిపా. 182

వ. అం దక్కురువిభుండు దానును గాంధారియుఁ జీరాజినవసనులును సువ్రత పరులు నగుచుఁ గుంతీవిదురసంజయులతో వసియించి తపం బాచరింప యాజకులు నిజకృత్యంబులు నడపు చుండి రిట్లు నియమనిష్ఠ లతిశయిల్ల నాభూ వల్లభుం డచ్చటిమును ల(చ్చెరువంద న)చ్చెరువ నతితీవ్రతపశ్చరణంబున నిజాంగంబు నిర్మాంసత్వంబునం జర్మాస్థులు గదియునట్టి కార్శ్యంబు దనకు నొప్పుగా వర్తిల్లె నని యిట్లు ధృతరాష్ట్రువృత్తాంతంబు సెప్పిన విని యవ్విచిత్రవీర్యనంద నుండు పదంపడి యెట్టివాఁ డయ్యె మునీంద్రా యెఱిఁగింపు మనుటయు. 183

శా. ఆశాపాశవిమోచనోపకరణవ్యాకోచవ్యాధామ సం
క్లేశోత్సారకదివ్యనామ వరదృగ్లీలాప్తనిస్సీమల

త్రీశుంభత్స్మరలోకచక్రపరశుచ్ఛిన్నాసురానీక వి
ద్యాశోభాస్ఫురణాకృతీ శమదమానంతర్యభాస్వీకృతీ. 184

క. మునిహృదయనిలయపాదా, వినతజనావనవినోద విద్యావిద్యా
ఘనచింతాంతిఃదూరల,సన పీతక్షితసామజత్వగ్వసనా. 185

మాలిని. అపరిమితవిభూతీ యప్రమత్తానుయాతీ
లపననిభృతవేదా లక్షణస్వైరనాదా
జపపరవరదాయీ సర్వవిద్యావిధాయీ
విపులకృపకటాక్షా విశ్వసంహ్లాదదక్షా. 186

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున యాశ్రమవాసపర్వంబు నందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీ ర స్తు.

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము

## ఆశ్రమవాసపర్వము - ద్వితీయాశ్వాసము



సంబంధాయుర్గురు
తాసిద్ధిదచరణపద్మ దాంత్యస్మిల
ద్గేసద్మ శాంతిసేవ్యా
వ్యాసాదిమునీంద్రభావ్య హరిహరనాథా. 1

ధృతరాష్ట్రుపాలికి నారదుండు మునులతో వచ్చి యత్తపోవనమహిమ సెప్పుట

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు వైచిత్రవీర్యుండు పరమ తపోధుర్యుం డయి యుండె నంత నొక్కనాఁడు నారద పర్వత దేవల మాంజా యను లమ్మహీనాయకుం జూచువేడ్క నయ్యాశ్రమంబునకుం జనుదెంచిన. 2

క. శతయూపుఁడు నయ్యెడకుం, గుతుకంబున వచ్చె వారిఁ గుంతె వినయసం
భృత లైరి యందఱును సమ్మర్చితులుగఁ జేసినఁ బ్రహృష్టచేతసు లగుచున్. 3

వ. ధృతరాష్ట్రుకడకుం బోయిన నతండు వినయసంభ్రమంబులతో వినతుం డైన దీవన లిచ్చి యతని పెట్టించినదర్భాసనంబుల నాసీను లై యుచితసల్లాపంబులు సేయుసమయంబున నారదుం డన్నరనాథుతో [1]శతయూపనామధేయుం డయిన ధరాధిపుపితామహుం డగుసహస్రచిత్యుఁ డనుమహారాజు దనపెద్దకొడుకైన శతచిత్యునందు రాజ్యభారం బిడి యియ్యాశ్రమంబునకు వచ్చి తపశ్చరణంబున దుశ్చ్యవనసఖత్వంబు వడసె మఱియును బృషధ్రిందును శైలాలయుండును బురుకుత్సుండు నిందుఁ దపంబు సేసి యింద్రలోకంబు వడసి రారాజర్షిసత్తముల నెల్లను నే నీలోకంబున మెలంగుచుండి యియ్యెడం గంటి నయ్యెడం జూచితి నిది యితరదుష్ప్రాపంబయినపుణ్యప్రదేశంబు నీకుం గృష్ణద్వైపాయను ప్రసాదంబున నిచ్చట వసియింప సంభవించె నని పలికి వెండియు. 4

సీ. ధరణీశ యిచ్చటితపమున నీవు నానృపులయట్టుల విశిష్టపుఁబదంబుఁ

1 శతజిన్నామ...ధరాధిపునప్త యగుసహస్ర.

గందు నీతోడన గాంధారియును వచ్చి మీకు శుశ్రూష యమేయభక్తిఁ
జేసి కుంతియుఁ బతిఁ జేరంగ నరుగు నప్పాండుభూపతి సురపతిసమీప
మున నుండి యెప్పుడు నినుఁ దలంచు నతండు పోఁడిమి సేయఁగలాఁడు నీకు
ఆ. ధర్మమూర్తి యైనధర్మసూనుఁడు దన,యాత్మ గాన విదురుఁ డన్నరేంద్ర
వినుతతనువుఁ దగఁ బ్రవేశించు సంజయుఁ, డతులనాకలోకగతి వెలుంగు 5
వ. అనిన విని యాంబికేయుండు గాంధారీకుంతీసమేతంబుగా సంతోషంబు నొందె
నచ్చటియందఱును బ్రీతాత్ములై రప్పుడు. 6
క. శతయూపుఁడు నారదుతో, నతులజ్ఞానాభిరామ యడిగెద నిన్నుం
గుతుకంబున నొక్కటి నీ, వితతకృపం దెలియఁ జెప్పవే నా కనుడున్. 7
వ. ఆదేవముని నీయడుగఁదలంచినది యెయ్యది యడుగు మనిన నతం డిక్కురుపతి
సుగతి గను నని నిర్దేశించితి తద్విశేషంబు విన వలతు వివరింపు మనుటయు 8

నారదుఁడు శతయూపునితో ధృతరాష్ట్రాదులు సుగతిఁ బొందెడు తెఱంగు సెప్పుట

సీ. ఆసంయమీశ్వరుం డాతని కిట్లను నిచ్చలు నేను మహేంద్రుకడకు
నరిగి సంభాషణ మాచరించుచునుండ నాసభ నిక్కురవాధినాథు
వలనివార్తలు పుట్టె యలఘుతపోవృత్తినిష్ఠాతిశయము వర్ణించి రప్పు
డవ్వాసవుఁడు సెప్పె ననఘ నాతో మునిజాతుఁడు ధృతరాష్ట్రజనవిభుండు
తే. తపము మూఁడేఁడులొనరించి తాను సతియు, దేహముల్విడ్చి చని ధనాధీశుచెలిమి
నతిశయిల్లు దివ్యాభరణాభిరాముఁ,డై విమానవిహారహృష్టాత్ముఁ డగుచు. 9
క. అని పాండునిమది ప్రమదం,బునఁ దేలఁగఁ జెప్పె ననుడు మోదము ధృతరా
ష్ట్రునినెమ్మనమున నిండా,రె నఖిలజనచిత్తములను బ్రియము దలిర్చెన్. 10
వ. ఇట్లు సద్గోష్ఠి నడపియత్తాపసోత్తము లక్కురుపతిసత్తము నభినందించియామంత్ర
ణంబు సేసి నిజనివాసంబులకుం జని రక్కాలంబున. 11

సీ. పాండుపుత్త్రులు దల్లిఁ బలుమఱుఁ దలఁచుచు వగతురు ధృతరాష్ట్రువలన సుబల
నందనదెసను మనం బిడి చింతింతు రట్లు పౌరులు వంత నారఁ గూరి
వృద్ధుండు ధృతరాష్ట్రవిభుఁడు సుఖార్హుఁడు విగతజనం బైనవిపినభూమి
నెత్తెఱంగున వసియించు గాంధారియుఁ గుంతియు నత్యంత కోమలాంగు
తే. లడవి [1]నుండంగ నెట్లోర్తు రకట యిట్టి
కొడుకులను రాజ్యసౌఖ్యంబు విడిచి యట్లు
సనునె యక్కుంతిభోజునితనయ జనని
దొఱఁగి పోవుట కెంత గుందుదురో వీరు.
క. ఆయాసంబున విదురుని, కాయము సంజయుని మేనుఁ గందక యున్నే
పోయిరి ధృతరాష్ట్రమహీ,నాయకుపై భక్తిఁ గాననమున వసింపన్. 13
క. అని యొండొరువులతోడ, న్వనట యెసఁగ బలుకుదురు మనంబులఁ గుంతీ

1 పాలైన నెట్లోర్తు...ఘనరాజ్యంబు విడిచి.

తనయులు మాతృవియుక్తత, కనయము నడలుదురు కౌరవాన్వయముఖ్యా. 14

సీ. ధర్మపుత్త్రాదులందఱు నొక్కచో నుండి ధృతరాష్ట్రు నాతనిదేవిఁ జేరు
కొని వారికొడుకు లెల్లను ద్రుంగి రని వార లతివృద్ధు లిమ్మెయి నడవిఁ గలసి
యున్నా రనియు నింక నెన్నాళ్లు లుండెడి గొంతి వనంబునఁ గూర దినుచు
ననియును బంధుల నదయతఁ దునిమితి మనుక ధైర్యంబున నడఁప మైతి

తే. మనియు నభిమన్యు వీరుని నతనితమ్ముఁ
గుఱ్ఱలను గన్న నాఱడి గోలుపోయి
యొంటి పడితి [1]మనియుఁ గడు సమ్మలంపు
మాట లాడుదు ర్పరిజనుల్ మఱుఁగుచుండ. 15

వ. ఇట్లనుదినంబును ఘనచింతాక్రాంతులై యలంత నొందుదురు. 16

చ. విదురుని సంజయుం దలఁచి వేదనఁ బొందుదు రట్లు నెవ్వగల్
హృదయముఁ గుందఁ జేయఁ జెలు వేది మనోజ్ఞము లైనభోగము
ల్వదలి వినోదముల్ సలుపులాలసితం బెడఁబాసి రాజ్యసం
పద నరయం దలం పెడలి పాడఱి యుందుదు రేమి సెప్పుదున్. 17

క. ద్రౌపదియు సుభద్రయు సంతాపం బందుదురు పాండుతనయులు దలరన్
భూపాల భవజ్జనకుని, చూపంద ఱమానసముల శోకము నదుమున్. 18

ఆ. పరమధీరు లైన పాండుతనూభవు, లిట్లు ధైర్యసార మెడలి వికల
బుద్ధు లగుచు నుండి పోవం గడంగి ర,య్యంధనృపతిఁ జూడ నధిపముఖ్య. 19

వ. అట్టియెడ సహదేవుండు పాండవాగ్రజునకుం బ్రణమిల్లి భరితవినయుం డై. 20

క. ఏను మును చెప్ప వెఱచితిఁ, గాని యధిప గొంతిఁ జూడఁగాఁ జను టర్హం
బైన పని యింత కేదెస, దా నొందునొ విపినవాసదౌస్థిత్యమునన్. 21

తే. గొంతి ప్రాణంబుతో నుండఁ గురువరేణ్య
యచ్చటికిఁ జని యొకమరి యమ్మహాను
భావ దర్శింప వలవదె బావ నప్ప
ననుసరించుచు నె ట్లున్న యదియొ సాధ్వి. 22

క. ధృతరాష్ట్రుఁడు గాంధారియు, నతిమృదులాంగకులు వల్కలాజినధరు లై
వ్రతచర్యల వన్యాహారత నలఁగుచు నున్నవారు రాజవరేణ్యా. 23

ఉ. వారలఁ జూడఁ బోఁ దగు నవశ్యము దుర్దశ వుట్టకుండ ముం
మీ రని చెప్ప నప్పుడు సమీపమునం జెవి దార్చి నెవ్వగం
గూరుచు నున్న ద్రౌపది యగుం గరణీయము బంధుదుఃఖసం
తారక మీకు నీతఁ డుచితంబుగఁ జెప్పినకార్య మెమ్మెయిన్. 24

తే. గొంతికోడండ్రు రెల్లను గురువరేణ్య, యత్తినడుగుల నున్నవా రత్తపస్వి

---

1 మ యనియును సమ్మలంపు.

నీవరిష్ఠ దర్శింపంగఁ బోవఁ గోరి, యనియె నట్టు లయ్యిరువురు నాడుటయును.

పాండవులు బంధుసహితంబుగా ధృతరాష్ట్రుఁ జూడఁ బోవుట.

వ. అమ్మానవనాథుండు గాననగమనంబు నిశ్చయించి పడవాళ్లం బిలిపించి ధృతరాష్ట్రు దర్శింపం బోవ మనతిబహుళంబును బ్రధానచతురంగసముదీర్ణభంగికంబునుం గా బలంబుల సమకట్టుం డందలంబులునుం బాటబండ్లునుం గాఁ బెక్కాయితంబు సేయుం డనేకశకటంబులుం బటకుటీరప్రకరంబును నానావిధభక్ష్యభోజ్యంబులునుం గొనివచ్చునట్లుగా నిపుణపరిచారకుల నియమింపుఁడు పౌరజనంబు లారాజుం జూచువేడ్క నెవ్వరు వచ్చినను వారల యోగక్షేమంబు లరసి సురక్షితంబుగా నడపింపం దగువారి నియోగింపుం డెల్లిపయనం బని చాటింపుం డని పనిచిన వార లట్లు సేయ మఱునాఁడు యుయుత్సునిం గృపాచార్యుని ధౌమ్యుని రావించి మీరు పురరక్షణంబునకు నిలువుం డని యత్యాదరంబునం జెప్పి. 26

సీ. [1]ఏనికగములతో నేతెమ్ము నీ వని బాహుదర్పోజ్జ్వలుఁ బవనతనయుఁ
దేరులగమి నెలువారు నీచే నని దేవసమాను గాండీవధరుని
గుఱ్ఱపుదళములకొమరు నీ కలవడు నని చారుతనుమనోహరు నకులుఁ
గాల్బల మమరు నీ కలసివచ్చుట నని సన్నుతచేష్టితుఁ బిన్నతమ్ముఁ

తే. బనిచె వార లమ్మెయిఁ దూర్యనినద మెసఁగ, నాతపత్త్రావళిధ్వజవ్రాతకలిత
రత్నరోచులు రోదోంతరంబు నిండ, నరుగుదెంచిరి వైభవ మతిశయిల్ల. 27

వ. ద్రౌపదీప్రముఖవధూజనంబులసుం దక్కునుం గలభరతభార్యల నందలంబులను [2]గుడకంబుబండ్లను నిడికొని రండని యంతఃపురాధికారుల నబ్భూరమణుండు నియమించిన వార లట్ల చేసిరి తానును మణిభాసమానంబును నీలవాలశోభితషోడశశ్వేతాశ్వప్రౌఢంబును నైనరథం బెక్కి మౌక్తికప్రాలంబమాలికాద్యోతితంబు లగునాతపత్త్రంబు లుల్లసిల్ల. 28

తే. వేణువీణారవంబులు వివిధగాన, నాదములుఁ [3]బాఠకారావమేదురంబు
లగుచు వందిబృందములవాక్యాలి బెరసి, దిశలు దీటుకొనంగఁ బ్రదీప్తలీల. 29

వ. వెడల వివిధవాహనారూఢులయి పౌరు లప్పురువంశవరు ననుగమించి రి త్తెఱంగున మెఱయుమహిమ నుజ్జ్వలుం డగుచుం జని భాగీరథి యుత్తరించి పాండవోత్తముండు కురుక్షేత్త్రంబు ప్రవేశించి చనుచుండ. 30

సీ. సంయమివరుఁ డైనశతయూపమునిపతియాశ్రమంబునఁ దదుపాంతభాగ
మునఁ గదలీశోభియును మృగాకీర్ణంబు నగుధృతరాష్ట్రునియాశ్రమంబు
నెఱిఁగినవా రదె యిదె యంచుఁ జేర్కొని చూపి చెప్పిన ధర్మసుతుఁడు దేరు
డిగిన భీమాదులు డిగ్గిరి వాహనంబులు సర్వజనులు నప్పురుషవరుల

1 ఏనికఘటలతో. 2 బాటబండ్లను. 3 బారుకాహళమేదు.

ఆ. ననుసరించి రాజనాథుఁ డయ్యాంబికేయునాశ్రమంబు డాయఁ జనుచుఁ
నచటిజనుల [1]నడిగె నయ్య వేఁడీ యని, గద్గదిక నెలుంగు గడలుకొనఁగ. 31

వ. అనిన వార లప్పుడమిఱేనితోడ. 32

క. యమునాస్నానంబునకును, సుమతోయాహరణమునకు సువ్రతుఁ డాసం
యమి సనియె ననుచుఁ దన్మార్గము సెప్పిరి నెమ్మిఁ దెలియఁ గౌరవముఖ్యా. 33

పాండవులు కురుక్షేత్రంబుననున్న ధృతరాష్ట్రగాంధారీకుంతుల దర్శించుట

సీ. చెప్పినఁ బాండవు లప్పథంబున భక్తి నరుగుచు నెదురుగ నరుగుదెంచు
నంబికానందనుఁ డాదిగాఁ గలవారిఁ గని యప్పు డన్నలఁ గడచి శీఘ్ర
గామి యై చని తల్లికాళ్లపైఁ బడి యేడ్చె సహదేవుఁ డధికబాష్పప్లుతాస్యుఁ
డగుచు నబ్భామిని వగచుచు నాతని నెత్తి తాఁ గౌఁగిట నిఱియఁ జేర్చి

తే. పేరుకొని చెప్పె నతని గాంధారి కంతఁ
గూడి యతఁడును దారు నక్కురుకుమారు
లక్కురూద్వహు నన్నియతాత్ము దేవిఁ
గాంచి [2]రనుజీవు లెఱిఁగింపఁ గౌరవేంద్ర. 34

చ. కని మఱి తల్లిపాదములఁ గ్రందుగఁ జేర్చిరి మస్తకంబు ల
వ్వనితయు నందఱం బొదివి వత్సలతన్ మన మార్ద్రభావ మొం
ద నురులునశ్రుబిందువులదందడిఁ జిక్కఁగఁ గౌఁగిలించి వా
రినయనవారి చేఁ దుడిచి ప్రీతిగ దీవన లిచ్చె భూవరా. 35

తే. అట్టియెడఁ బాండవాగ్రజునధికవినయ, భరితుఁ డై కాంచి భీమునిఁ బార్థుఁ గవలఁ
గనియె సంజయుఁ డెంతయు గారవమున, నాదరించి రయ్యేవురు నతనిఁ బ్రీతి. 36

సీ. ద్రోవదిఁ దొట్టివధూజనంబులుఁ దక్కఁ గలయట్టిభరతభార్యలుఁ గ్రమమునఁ
గాంచిరి కురువృద్ధు గాంధారి గొంతిని వారలు గొని వచ్చువారికలశ
ములు పాండురాజపుత్త్రులు పుచ్చికొని భరియించిరి పురజను లెల్ల నధిక
వినయత సమ్ముఖ్వురను గని రవ్వేళ నందఱు ముదమంది రట్లు దగిన

ఆ. వారు బలసి యునికి వారణపురమున, నున్నయట్లకాఁగఁ దన్నుఁ దలఁచె
మదిఁ గురూద్వహుండు దదనంతరంబ నిజాశ్రమమున కెలమి నరుగుదెంచి. 37

ఉ. తారకశోభితాంబరవిధంబునఁ బొల్పెసఁగంగ నాశ్రమో
దారతలంబు బంధుజనతాకలనంబునఁ దాను జంద్రునొ
ప్పార వహించి విస్ఫురితుఁ డై తనరెం గురుభర్త వచ్చి ర
చ్చేరువఁ గల్గు తాపసులు సెచ్చెరఁ బార్థులఁ జూచువేడుకన్. 38

వ. వచ్చినం గని వారలనెల్లను సవినయప్రణామంబులం బ్రీతులం జేసి పాండవు
లలరుమొగంబులతో ధృతరాష్ట్రుం బరివేష్టించి యుండిరి వనితాజనంబులు

1 నడిగె నయ్య యేఁడీ యని; నయ్య యెచట నున్నాఁ డని. 2 రనుచరు లెఱిఁగింపఁగా నరేంద్ర.

నొక్కపలన నిలిచి రుచితాసనంబుల నున్నయమ్మునులు సంజయు నాలోకించి
ధృతరాష్ట్రబంధుజనంబుల నందఱం బేరువేర నేర్పడ మా కెఱింగింపవే
యని యడిగిన నతండు వారల కి ట్లనియె. 39

సీ. జాంబూనదచ్ఛాయ చందంబువర్ణంబు గలిగినపలుచని గనపమేను
నుచితదీర్ఘత్వసమున్నతఘ్రాణంబు నిడుద లైనవిశాలనేత్రములును
గంతిరవంబు రేఖయు నొప్పఁ జూడ్కికిఁ నెంతయుం బ్రేఁ గైన యితఁడు ధర్మ
తనయుఁ డిట్టిదనంబుఁ దనరినమూఁపులు నాయతస్ఫీతంబు లైనబాహు
తే. వులును వెడఁదయురంబు నై పొలుచునితఁడు
భీముఁ డుజ్జ్వలసుందరశ్యామతనువు
[1]వారణేంద్రుని కైవడియును వారిజముల
యట్టికనుదోయిఁ గలయితం డర్జునుండు.
తే. సుందరాకారమునఁ దమ కెందు సదృశు
లొరులు లేమి దెల్లం బగు చుండ గొంతి
యుభయపార్శ్వంబులందుఁ గూర్చున్నవిష్ణు
శతమఖోపముల్ వినయభూషితులు గవలు.
సీ. నీలోత్పలచ్ఛాయఁ బోలుమైచాయయు నవపద్మదళములఁ దెవడు మెఱుఁగుఁ
గనుదోయి మధ్యాత్వమునకుఁ బ్రవేశించు ప్రాయంబు నత్యభిరామమూర్తి
యలవడఁ గైకొన్న యతులితసంపదచందంబు దోఁపించు చారుగౌర
వంబును గలుగునివ్వనిత పాంచాలి యియ్యింతిపార్శ్వమునఁ గట్టెఱ్ఱమేను
తే. వనజసన్నిభముఖము నై యునునిచుహిమ, యుజ్జ్వలాకృతి దాల్చినట్లున్నయాల
తాంగి నారాయణుని చెలియలు సుభద్ర, నరునివల్లభ సంయమినాథులార 42
ఆ. వీరికెలనఁ గనకగౌరమధూకాభ
తనువు [2]లొప్పుచున్నవనిత లురగ
పాండ్యసుతలు నరునిభార్య లులూపి చి
త్రాంగద యనఁ బరఁగు నాహ్వాయములు.
సీ. ఇందీవరచ్ఛాయ కెన యైనచాయ నొప్పినమేను గలుగునీభీతహారిణ
నయన భీమునిభార్య నవ్యచంపకదామ గౌరాంగి యైనయిక్కమలవదన
సహదేవుగృహిణి మేచకనవకువలయవర్ణంబునకు సరి వచ్చుకాంతిఁ
జెలు వైనతనువునఁ బొలుచునిన్నలినాయతాక్షి మాద్రీదేవియగ్రతనయు
తే. పత్ని వీరలకెలనఁ బాపటలు లేక, ధౌతసితవస్త్రపరిధాన లై తనువుల
నీభృతి దోఁపఁగ నున్నయిన్నెలఁత లాంబి,కేయుకోడండ్రుకరుణావిధేయులార.
తే. వీరిచందంబ యైయి కడుగారవమునఁ, దను సుభద్ర వొదువ నున్న తరుణి ద్రోణ

1 వారణేంద్రునికైవడి వారిజాక్షి. 2 లొప్పు నున్న.

కర్ణముఖయోధవీరులఁగలఁచి తెగిన, యట్టియభిమన్యుప్రియ యుత్తరాభిధాన.

వ. అని చూపి చెప్పె నప్పు డాంబికేయుండు గౌంతేయాగ్రజున కిట్లనియె. 46

సీ. కుశలివై యుండుదే కురువంశసత్తమ పౌరజనులు జానపదులుఁ దేఱఁగు
తో నిన్ను ననుసరింతురె తమ్ము లందఱు సుఖ ముందురే నీదుసఖులు సుఖులె
బంధులు సంతోషభరితులే యిష్టభృత్యులు దమకైనకోర్కులు ఫలింపఁ
గ్రాలుదురే హర్షలీలలఁ బూర్వరాజన్యులనడవడి సలుపఁబడునె

ఆ. నయముతోడియప్పనముల భండారంబుఁ, జెనుతె యగ్రహారజనులమీఁద
గాలి యైన సుడియఁగా నీక యరయుదే, యనఘ పుణ్యకీర్తు లతిశయిల్ల. 47

క. మిత్రనరపతుల శాత్రవ,ధాత్రీశుల నెమ్మిఁ బరుసఁదనమున వశతా
పాత్రములుగఁ జేయుదె సుచ,రిత్ర యుదాసీననృపపరీక్ష నడచునే. 48

క. దేవతల కతిథులకుఁ బితృ,దేవతలకుఁ బూజనములఁ దృప్తి యొనర్తే
యీవసుధఁ జతుర్వర్ణజ,నావలులు నిజోచితక్రియలఁ దగ మనునే. 49

తే. బాలురకును దుర్బలులకు భామినులకు, వృద్ధులకును మనంబుల వెఱపు లేని
యట్టి మెలకువగలిగెడునట్లుగాఁగ,నడచునే యాజ్ఞ పురమునఁ బుడమియందు.

క. అనిన విని యానృపతి య,జ్జనపతితో నిట్టు లనియె జగతీశ్వర నీ
వినుతోపదేశమున భవ,దనుయుక్తము లెల్ల నడచు నవికలభంగిన్. 51

వ. అని పలికి యి ట్లనియె. 52

క. ఆయాసము [1]సాత్మింపని, మీయొడలు తపక్రియలకు మెయికొనియెనె భూ
నాయక శుశ్రూష దగం, జేయునొకో గొంతి డప్పిఁ జెందక మీకున్. 53

క. మా పెద్దతల్లి యలజడి, కోపి తపోవృత్తి గడపుచున్నదియె సుత
వ్యాపాదనకారుల మముఁ, బాపాత్ములఁ దలఁచి యెట్లు వలుకునొ మీతోన్.

ఆ. సంజయుండు దపముజాలికిఁ జాలి న,ర్తిల్లు చున్నవాఁడె ధీరచిత్తుఁ
డిచట లేఁడు విదురుఁ డెచటి కేఁగినవాఁడొ, యతనిఁ జూడవలయు నధిప నాకు.

వ. అనుటయు ధృతరాష్ట్రుఁడు ధర్మతనయుతోడ. 56

సీ. ఏఁ దపంబున కోర్తు నెంతయు శుశ్రూష యలయక గొంతి మా కాచరించు
వినుము గాంధారియు ననఘచరిత్ర దపోనిష్ఠ కోర్చు నిమ్మానసీయ
మిముఁ దలంచినయప్పు మెచ్చి దీవించు సంజయుఁడు ప్రాజ్ఞుఁడు దపశ్చరణమునకు
విసువఁడు మముఁ బాసి విదురుఁ డెచ్చటనేనిఁ జరియించు మునిజనాశ్చర్యకారి

ఆ. యగుచు జలము లనిల మాహారముగఁ గొను
నవియు నదియుఁ గొనక యయిన నుండు
శూన్యవిపినమున విదైన్యస్వాతంత్రసం
చారి యై వసించుఁ గౌరవేంద్ర. 57

క. ఒక్కొకమరి [2]డబ్బాటీ, చక్కటిఁ గాన నగు ననియె జనవర తోఁచెన్

1 సైరింపని. 2 డబ్బాటం, జక్కటిఁ.

గ్రక్కున నప్పుడ విదురుం, డక్కౌంతేయాగ్రజున కనతిదూరమునన్. 58

వ. కాంతారఘూర్ణిమలినాంగుండును జటీభూతకేశపాశుండును దిగంబరుండును విదురుం డట్లు దోఁచి యయ్యాశ్రమంబున నున్నజనంబులం గని మగిడి పోవం జూచి ధర్మతనయుండు దనయనుచరుల నిలువుం డనుచుఁ దా నొక్కరుండును సత్వరంబుగా నవ్వినుతప్రభావుని వెనుకం జనియె నతండు గుల్మాంతరితుం డగుచుం దోఁచుచుఁ బోవం బోవ నప్పాండవాగ్రజుం డెలుంగెత్తి యోవిదుర యోవిదుర నిలు నిలు మేను యుధిష్ఠిరుండ నిన్నుఁ గాన వచ్చితి ననిపలుకుచుం బాఱిన నమ్మహాత్ముండు మరలి కనుంగొని వివిక్తప్రదేశంబున నొక్కపాదపంబు సేరి నిలిచిన. 59

విదురుఁడు యోగమార్గంబున ధర్మరాజునందుఁ గలయుట

సీ. ధర్మతనూజుండు దత్సమీపంబున కేఁగి యయ్యోగికట్టెదుర నిలిచి
యాతండు నయనంబు లర్ధమీలితములై యుండంగ నూరకయున్నఁ గాంచి
నిర్మలాత్మక యేను ధర్మసూనుఁడ నన్నుఁ గను విచ్చి చూడవే యనుఁడు నతఁడు
ఱెప్పల నెగయించి యప్పాండవోత్తముఁ దప్పక చూచి యుదాత్తయోగ

తే. బలము గైకొని యింద్రియములను బ్రాణ
ములను నింద్రియములఁ బ్రాణములును గలపి
నిజశరీరంబు విడిచి యానృపతితనువు
సొచ్చెఁ దేజోమయత్వవిస్ఫూర్తి మెఱయ. 60

ఆ. వినుము ధర్మపుత్త్రు తనువునఁ గాంతియు, లావు నప్పు డగ్గలంబు లయ్యె
నొలసె బుద్ధి యధికబల మట్టు లగు టతఁ, డెఱిఁగి చోద్యమంది యెలమినొందె.

క. తదనంతరంబ యప్పతి, విదురశవము మ్రానుసెంది వికృతరహితమై
నిదుర మెయి నొఱగి యున్నపగిది నుండం జూచి యగ్నికృత్యము నడపన్. 62

చ. తలఁచిన మింట నొక్కయెలుఁగు ధర్మతనూజ యతిత్వగౌరవో
జ్జ్వలునికళేబరంబునకు వహ్నివిధాన మొనర్పు టర్హమే
వల దని మ్రోసె నమ్మనుజవల్లభుఁ డప్పని దక్కి పోయి భ్రా
తలకును దండ్రికిన్ సువిదితంబుగ నంతయునుం గ్రమంబునన్. 63

వ. ఎల్ల వారును వినుచుండం జెప్పిన నందఱు నద్భుతరసంబున మునింగిరి పదంపడి ధృతరాష్ట్రుం డామంత్రణంబు సేయ మునిజనులు నిజనివాసంబులకుం జనిరి తదనంతరంబ యాంబికేయుండు ధర్మనందనునితోడ. 64

సీ. భరతకులోత్తమ ఫలమూలముల నుపయోగింపు యొసఁగెద మొదవి తనకు
నెయ్యది యాహార మయ్యె నాతిథ్యంబు దానన నడపుట ధర్మసరణి
యనవుడు నట్ల కా కని ఫలంబులు మూలములు నుపయోగించె మోదభరితుఁ
డగుచు నప్పాండుసుతాగ్రణి యబ్భంగి నఖిలజనములు నాహారకలన

తే. మాచరించి రయ్యిందఱు నవనిశయన
మొంది యారాత్రి నిద్రించి రుదితసూర్య
కాల మగుటయు సముచితకర్మకరణ
మనుజులును దాను నడపె నమ్మనుజవిభుఁడు. 65

వ. అట్లు కాలోచితకృత్యంబులు నడపి సహోదరసహితుండును దారోపేతుండును సర్వపరివారానుగతుండును నై యాశ్రమపథంబు గలయ మెలంగి పావనస్నానపావకార్చనజపధ్యానాదితాపసధర్మచర్యావిధంబులు నానామృగనిర్భయసంచారప్రకారంబులు వివిధపక్షికులనిశ్శంక[1]కేళీవిభవంబులు నాలోకించి కృతప్రాతస్సవనకరణీయుం డై యున్న కురువృద్ధుకడకు వచ్చి వందనాభినందనవచనంబుల నతనియుల్లంబు పల్లవింపం జేసి యతఁడు వనుపఁ బవిత్రాసనోపవిష్టుం డై.

చ. అనుజులుఁ దాను భక్తిమెయి నమ్మహనీయునిఁ గొల్చి యుండ న
య్యనికిఁ గనుంగొనంగఁ గర ముత్సుకతన్ శతయూపుఁ డాదిగా
మునివరు లేఁగుదెంచినఁ బ్రమోదమునం గుశపీఠరాజిపై
నునుపఁగఁ బంచె గాఢవినయోక్తుల నాధృతరాష్ట్రుఁ డందఱన్. 67

వ. అట్లున్న యమ్మునిజనంబులును బాండుపుత్త్రులునుం బరమధర్మమయసంభాషణంబులు సేయుచుండ నినుండు నభోమధ్యగతుం డయ్యె నప్పుడాంబికేయుండు సవినయంబుగా నత్తాపసోత్తములతో మీరును మధ్యందినకృత్యంబు లాచరింపవలయు విజయంచేయుం డనిన వారలు నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ కౌంతేయుల మాధ్యాహ్నికకరణీయంబులు నిర్వర్తించుట కరుగుం డని పనిచె నని చెప్పిన విని జనమేజయుం డప్పాండవేయు లవ్విధంబున వనంబున నెన్నిదినంబులు వసియించి రని యడిగిన వైశంపాయనుం డతని కిట్లనియె. 68

సీ. ధరణీశ పాండునందను లిట్లు పాంతగపురంబును సపరివారంబుఁ గాఁగ
నడవికి నేఁగి యయ్యంబికానందనుఁ గాంచినదినమునఁ గరము నియతి
ఫలమూలసమితి నాఁకలి వుచ్చి భూమిశయనమున నిద్రించి రాగరిష్ఠుఁ
డమ్మహాత్ముల కర్థితో మఱునాఁ డనుజ్ఞ యిచ్చిన సుమనోజ్ఞములును

ఆ. సన్నుతములు నైనయన్నపానాదుల, ననుభవించి మృదులహారితల్ప
ముల శయించి రట్లు నెలనాళు లయ్యెడ, నతనిఁ గొల్చియుండి రధిపముఖ్య.

వ. పదంపడి యొక్కనాఁ డెప్పటియట్ల పాండుపుత్త్రులు గాంధారీకుంతీసముపాసితుం డయి యున్న విచిత్రవీర్యపుత్త్రుఁ బరివేష్టించి యుండ నవ్విశిష్టగోష్ఠికై శతయూపప్రభృతిమునివరులు సనుదెంచిన నక్కురువృద్ధుం డర్ఘ్యంబు లగు

---

1 కేళీభంగులు నాలో.

నాసనంబులు వెట్టించి సంభావించిన. 70

వేదవ్యాసుఁడు పాండవసహితుం డైనధృతరాష్ట్రునాశ్రమంబునకు వచ్చుట

సీ. సముచితంబులు సధర్మములును నైనసల్లాపముల్ సెల్ల నుల్లంబు లలర
వార లున్నెడ సత్యవతికొడుకు కందుల కేతేర నందఱు నెదురువోయి
వినతులై భక్తిఁ దోడ్కొని వచ్చి యతులకృష్ణాజినదర్భోత్తరాసనమున
నునిచి యమ్మునివరుననుమతిఁ దమతమయాసనంబుల నుండి రమ్మహాత్ము
ఆ. నర్చితునిఁగఁ జేసె నాంబికేయుఁడు దద,నంతరంబ సమధికాదరమున
నతఁడు మధురమృదువిధాక్షరంబుగ నమ్మ,హీశముఖ్యుతోడ నిట్టు లనియె 71

సీ. వనవాసమున [1]నీకు మన మలవడియె నే నియతిమైఁ దాపసక్రియల కోర్చి
నడపెదవే పుత్త్రనాశజ మైనశోకము భవదంతరంగంబునందు
లేదు గదా ధర్మవేదిని గాంధారి యున్మలికంబు లేకున్న యదియె
నీకుఁ బరిజ్ఞాననిష్ఠ గల్గెనె గొంతి శుశ్రూష మీకొనర్చునె తగంగ
తే. రాజ్య మొల్లక వచ్చె నరణ్యవాస,మునకు నీయమ మీరు రాఁ దనకు నింట
నిలువఁ దగ దని యిష్మేలు నీదుబుద్ధి,నొలసి యుండునె కౌరవకులపవిత్ర. 72

చ. అనఘ యజాతశత్రునెడ నాదరణాతిశయాన్వితంబె నీ
మనము వృకోదరుఁ నరుని మాద్రితనూజుల సత్క్రియాభినం
దనముల గారవింతె వినుతస్థితిఁ దద్దయు నిర్మలత్వ మొం
దెనె భవదీయచిత్తమున ధీమహితా దృఢశాంతిమూలమై. 73

వ. అని యంత నిలువక. 74

ఆ. వినుము దీర్ఘవైరవృత్తియుఁ గ్రోధచిం,తనము లేక వాక్కు మనము నొక్క
చంద మగుట సకలజనముల కనుబద్ధ, సంపదాప్తి పరమసాధనంబు. 75

వ. అని చెప్పి వెండియు. 76

సీ. విదురుండు దేహంబు విడిచినతెఱఁ గెల్ల నెఱిఁగితె మాండవ్యు డిచ్చినట్టి
పటుశాపమున శూద్రభావంబు నొందినధర్మదేవత బోధనిర్మలాత్ముఁ
డైనయమ్మహనీయుఁ డట్లగు టంబుజాసనునియాజ్ఞాపనమున విచిత్ర
వీర్యనృపాధీనవిశ్రుతక్షేత్రంబునం దేఁ బ్రవర్తింప నధిప కలిగె
తే. ధర్మదేవతమాఱటతనువు సూవె
యీయుధిష్ఠిరునుజ్జ్వలకాయ మింత
యెఱిఁగి కాదె యమ్మహితయోగీశ్వరుఁడు స
మీడ్యయోగబలంబున నితనిఁ గలసె. 77

ఆ. అట్లు దేవతామయాత్మకుఁ డైనయి, వ్విభుఁడు నిన్నుఁ బ్రేష్యవృత్తి నిట్లు
గొలిచి యునికి బుద్ధిఁ దలపోసి సంతస,మంది యుండు దే కులాగ్రగణ్య. 78

1 కియ్యకొనియుండె నే మది.

వ. అనిన విని వైచిత్రవీర్యుం డప్పారాశర్యునకుఁ బరమవినయంబున ని ట్లనియె. 79

సీ. వనవాస మించుకయును నాకు దుఃఖంబు సేయదు దేహంబుఁ జిత్తమును ద
పఃక్రియలకుఁ [1]బనుపడియున్నయవి నన్ను గాంధారిఁ బుత్త్రశోకం బొకింత
యేనియుఁ బొందంగనీఁడు సభక్తిక మైనవృత్తమున ధర్మాత్మజుండు
మునివర యితనిపై ననుజులమీఁద వత్సలము నాహృదయ మిద్ధరణివిభుఁడు

ఆ. దేవతాత్ముఁ డగుట దెల్లమై యునికి మ
ద్వచనవర్తనములవలన నితఁడ
యెఱిఁగి యుండు గొంతి తెఱఁగు శుశ్రూషయు
నద్భుతంబు ముదము నావహించు. 80

వ. నాకుం బరిజ్ఞానంబును మానసనిర్మలత్వంబును భవత్ప్రసాదంబునం గలిగెడుఁ
గాక యనియె నాసమయంబున ద్రౌపదీసుభద్రలును దక్కనుం గల్గునంగనా
జనంబులును బారాశర్యసందర్శనప్రవణత్వంబునం జనుదెంచి సభక్తికప్రణామంబు
లాచరించి యంతంతనిలిచిరయ్యలఘుజ్ఞానమాననీయుండు ధృతరాష్ట్రుతోడ. 81

ఉ. మీయెడ చింత వాయఁగ సమీహితబుద్ధి యొనర్పఁ గోరి యే
నీయెడ కిప్పు వచ్చితి నభీష్టము వేఁడుము శంక దక్కి భూ
నాయక యెల్లభంగిని మనఃప్రియముం దగ నిత్తు నన్నుఁ గొం
తేయు లెలర్చి రవ్వసుమతీపతి మోదము నొందె నెంతయున్. 82

వ. వ్యాసుండు వెండియు. 83

చ. అనఘ యమానుషం బయినయట్టిద యైనను నాతపంబు పెం
పునకు మునీంద్రు లద్భుతముఁ బొందఁగ మీ కవలీల నిత్తు నే
ననుటయు నాకురుక్షితిపుఁ డాదటఁ గోరఁగ మీర లిందు వ
చ్చినకరుణామయాదరవిశేషముకంటెను మేలుఁ గల్గునే. 84

క. మానుష మైన నమానుష, మైనను బ్రార్థనకు విషయ మైనది భవదీ
యానూనకృపకు నెక్కుడు, గా నొక్కఁడుఁ గాన నేను గారుణ్యనిధీ. 85

ఆ. సంయమీంద్ర నాదుజన్మంబు సఫలతఁ, బొందె మీరు విమలబుద్ధి నింత
యాదరించినపుడ లేదింకఁ బరలోక,భీతి ధన్యతముఁడ నైతి నేను. 86

వ. అట్లయినను మీ రొక్కటి గోరు మనిన నామనంబున నెప్పుడుం గలయదియొకటిం
గింప వలసె విన్నవించెద. 87

సీ. దుష్టచిత్తుం డగుదుర్యోధనుండు నిష్పాపస్వభావులఁ బాండుసుతులఁ
బరిభవించి సమస్తనరనాథు లనిఁగరితురగయుతంబుగాఁ ద్రుంగఁ జేసి
ధరణిరాజ్యము గోరి గురుభీష్మకర్ణాదిసత్పురుషుల నెల్లఁ జంపికొనియె
నన్నిచునకుఁ గా మహారాజు లాంధ్రను బిడ్డల విడిచి యభేద్యవైర్య

[1] జాలఁ బనుపడియున్నవి గాంధారి.

తే. వ్యక్తి రణమృతిఁ బొందె రవిప్రభుల కేది
గతియొ యిమ్మెయి మూఢులై కలనఁ బడిన
[1]కురుకుమారకు లెట్టిరో పరమబోధ
మహిత యెఱుఁగనివగ పెద్ద మాన్పు మనియె 88

వ. అనుటయు నవ్విప్రముడిపలుకులు విని గాంధారికిం గుంతికిం బాంచాలికి సుభ
ద్రకు మఱియునుం గలయంగనలకుం జిత్తంబుల నెవ్వగలు గ్రొత్తలయ్యె నప్పు
డాసుబలనందన పట్టావృతలోచనత్వంబునన సూచి దయాధాముం బై యున్న
యామామ నుద్దేశించి మోడ్చినచేతు లద్దెసకు నిగిడ్చి యిట్లనియె. 89

సీ. మునినాథ యీరాజతనయ లందఱును గయ్యంబునఁ దెగినది యాదిగాఁ బ
దాఱేండ్లు వగలపా లగుచుఁ దత్సన్నిధి గల్గుట గోరులోకంబులెన్ని
యన్నియుఁ జూపంగ నైనను జాలుదు నిర్మలతపమునఁ బేర్మి నీవు
పుత్రసాన్నిధ్య మీభూపతి కొనరించు టెంతటిపని నీకు గొంతి ద్రుపద

తే. రాజపుత్త్రి సుభద్ర కౌరవకుమార, శతముభార్యలు నూర్వురు సౌమదత్తి
పత్నియ త్తన్వియ త్తయప్పడఁతియ త్త, గోరుదురు యుద్ధమృతబంధుకోటిఁ జూడ.

వ. అంతయును భవదీయదివ్యబోధంబు గనుచుండు. 91

క. పరమమునీంద్రసమరమృత, కురువీరుల మానసములఁ గోడుడుగ భవ
త్కరుణ వెలయ లోకం బచ్చెరు వందఁగఁ జూపవే విచిత్రపుమహిమన్. 92

చ. అనునెడఁ గొంతి వాడువదనాబ్జముతోడ మదిం దలంచెఁ గ
ర్ణుని నది యత్తపోధనవరుం డెదఁ గాంచి దయానురక్తిఁ న
వ్వనితఁ గుఱించి యిట్లను భవన్మతి నొందినకోర్కి సెప్పు మే
ననఘచరిత్ర దాని ఫల మందఁగఁ జేసి యలంతఁ బాపెదన్. 93

వ. అనిన విని యక్కుంతి సంతసిల్లి యాసంయమివల్లభునకు దండప్రణామంబు సేసి
చేతులు మోడ్చి లజ్జాసహితం బగునంతరంగంబుతో వినయనమ్ర యగుచు
ని ట్లనియె. 94

కుంతి వేదవ్యాసునితోఁ గర్ణుఁడు దనకు జన్మించిన తెఱఁ గెఱింగించుట

సీ. దేవతలకు నీవ దేవత విట్టిని స్వామిగాఁ బడసితి మహితకరుణ
ననుఁ జూచి నాదువిన్నప మాదరింపు మేఁ గన్యాత్వదశ నుండఁగా మదీయ
జనకునికడకుఁ గోపనుఁ డైనదుర్వాసుఁ డన్మహాముని వచ్చె నతని సవిన
యార్చనకలనాసమారాధితుండుగాఁ జేసితిఁ బ్రీతుఁ డై చెలువ నీకు

ఆ. నిత్తు వరము వేఁడు మెయ్యది కోరికి, యనియె నతఁడు మీఁ ప్రియంబుకంటె
ననఘ మిగులుఁ గోర్కి యును గలదె నాకు, నంటిఁ గాని యొకఁడు నడుగ నైతి.

---

1. కురుకుమారుల కెట్లొకో పరమ.

వ. అప్పాట తనమనంబునకు రానిచందంబు మొగంబునం దోఁప నత్తాపసవరుండు వరం బెల్లభంగి నొసంగక పోవ నడుగు మనుటయు వెఱచియు నాదు వేడ్కకు దెఱం గట్ల యగుటను బుత్త్రుం గోరితిఁ గోరిన నమ్మునిపతియొక్కమంత్రం బను గ్రహించి దీన నీ వావహించినదేవతలు భవద్వశగతు లై సుతజన్మంబుగలి గింతురు విశేషించి ధర్మమునకుఁ దల్లివి గాఁ గలదాన వని పలికి యంతర్ధా నంబు సేసిన. 96

ఆ. అద్భుతమునఁ బొంది యమ్మంత్రరూప మ్ముల్లమున నెప్పుడును దలంతు నొక్క నాఁడు మేడమీఁదఁ బోఁడిమి నే నుండి, కంటిఁ బొడుచుచున్నకమలమిత్త్రు. 97

క. కని యిది కన్యక దోషం, బని తలఁపక బాల్యసంభృతాజ్ఞానము వే డ్కఁ నొనర్ప నావహించితి, మునిమంత్రబలమున సూర్యు మునినాథవరా. 98

తే. ఆవహించిన నద్దేవుఁ డాకసమున, నాత్మమూర్తి వర్తింప మూర్త్యంతరంబు దాల్చి నాకడ కేతెంచెఁ దత్క్షణంబ, నాదుచిత్త మాశ్చర్యమగ్నంబు గాఁగ. 99

వ. ఇట్లు సనుదెంచి. 100

సీ. అడుగు మిచ్చెద వరం బనిన వడంకుచుఁ గేలు మొగిడ్చి పొం దేల యిచట ననిన వృథాహ్వాన మాచరించుట తప్పు నిన్నును నెవ్వఁడు నీకు మంత్ర మిచ్చె నాతని శపియింతుఁ జుమ్మీ యని పలికె నయ్యర్కుఁ డే నలికి గురుని నిరపరాధుని శాపనిహతుఁగాఁ జేయుట కోర్వక పుత్త్రికు నొసఁగు దేవ

తే. కృప భవత్సము ననిన నయ్యపరిమేయ
తేజుఁ డాత్మ తేజమున నాదృఙ్ముఖేంద్రి
యములు మనసును సమ్మోహితములు సేసి
యపుడు తనయుండు పుట్టెడు మనియెఁ బిదప. 101

వ. అని నిర్దేశించి. 102

తే. నీకుఁ గన్యాత్వవికలత గాక యుండ, వరము నిచ్చితి ననుచు దివమున కరిగె జనకముఖబంధుచిత్తవంచనమునడపి, గూఢమందిరాంతరమునఁగొడుకుఁగంటి. 103

క. కని యేటిలో నిడితిఁ గలఁ, గనిన ట్లయి యుండెఁ దత్ప్రకారం బిది మీ కనినయది దివ్యబోధం,బున నత్తెఱఁ గంతరంగమునఁ గొని కాలున్. 104

తే. పాప మయ్యెఁ గా కుండె నప్పనిఁ దలంచి
యళుకు చుండుదు మద్భయ మపనయింపుఁ
డతులకరుణ నిక్కురువృద్ధునభిమతమును
సఫలముగఁ జేయుఁ డివి నాకు సద్వరములు 105

వ. అనిన విని యమ్మునీంద్రుం డమ్మానినికి ట్లనియె. 106

సీ. నీచెప్పినది యెల్ల నిక్కంబు కోడల యొగ్గు నీయందు లే దేల వెఱవ [1]సుర లద్భుతాపాదిచరితులు గర్జన కట్లు గా నున్నది యగుటఁ జేసి

---

1 సతు లద్భుతాపాదిచరితలు.

యేటిలో నాతని నిడి తీవు కన్యాత్వహాని లేకున్కిఁ గులాగ్రగణ్య
వైతి భవద్వృత్త మమలిన మగుటకు ననుమాన మించుక యైన వలవ

ఆ. [1]దనుచు నాదరార్ద్రుఁ డయి పల్కి గాంధారి, తోడ నీవు సుతుల దోడఁబుట్టు
వులను గాంతు నీదుచెలియలు గొంతియుఁ, గర్ణుఁ జూడఁ గాంచు గన్యచరిత.

ఉ. ద్రౌపదియుఁ సుభద్రయును దక్కటికాంతలు భ్రాతృపుత్త్రపౌ
త్త్రాపవిలోకనోత్సవము నొందుదు రిచ్చటి కిప్డు వచ్చు శే
నీపని యాచరించుటకు నిమ్మునిజేంద్రుఁడు నీవు గొంతి చిం
తాంకురితాపనోదనవిధంబుగఁ గోరితి రట్లు సేసెదన్. 108

క. నీకొడుకులకు మనుమలకు, శోకింపఁగ వలదు వారు శూరత వెలయం
జేకొనిరి రణమరణమున, నాకభువనసుఖము సద్గుణస్తవనీయా. 109

ఆ. భామ విను మవశ్యభవితవ్యమైన భారతరణంబు పొంటె నతులమహిమ
మాననీయ దేవ యోనులు జననంబు, నొంది రిందు మనుజయోనులందు. 110

సీ. ధృతరాష్ట్రుఁ డనఁగ వర్తిల్లెడు మేటిగంధర్వుఁ డీధృతరాష్ట్రధరణివిభుఁడు
తన్వి పాండుఁడు మరుద్గణమయజని ధర్మదేవత సూవె యుధిష్ఠిరుండు
పవనుండు భీముఁడై ప్రభవించె నరుఁడనుముని యర్జునుం డయి జనన మొందె
నారాయణుఁడు కృష్ణనాముఁడై జనియించెఁ [2]గనుఁగొను కవలనాశ్వినులుగాఁగ

తే. ద్వాపరంబుగ నెఱుఁగు గాంధారరాజుఁ, గలి సుయోధనుఁ డయ్యె రాక్షసులు పుట్టి
రతనియనుజులై కర్ణుని నరుణకిరణుఁ, గాఁగ నభిమన్యుఁ జంద్రునిఁగాఁ గనుము.

క. అనలుఁడు ధృష్టద్యుమ్నుం, డన ద్రౌపదితోడఁ బుట్టె ననిలునియంశం
బున జనియించె శిఖండియు, ననిమిషగురుఁ డుద్భవించె నస్త్రగురుం డై. 112

తే. వినుము వసుశక్తి గాంగేయుఁ డనఁగ జనన
మొందె రుద్రాంశమున ద్రౌణి యుదయ మయ్యెఁ
దెలియఁ జెప్పితిఁ గొందఱు గలరు మఱియు
నిర్జరాసురాంశమున జన్మించినారు. 113

క. అని పలికి మీ మనంబుల, వనట సమస్తంబుఁ బుచ్చి వైచెద నాతో
జను దెండు మీరు గంగకుఁ, గనియెద రనిఁ దెగినబంధుగణముల నచటన్. 114

తే. అనుచు నుత్థితుఁ డగుటయు నార్పు బెలుఁగు
లాకసం బంద ధృతరాష్ట్రుఁ డాది గాఁగఁ
గలుగు నా సర్వజనులు నొక్కటఁ గడంగి
యరిగి రమ్మునినాథుతోఁ గురువరేణ్య.

క. అరుగఁగ మునిజనములు న, చ్చెరు వందుచు నమ్మునీంద్రు సేవించి మరు

1 దని సమాదరార్ద్రుఁ డయి. 2 గనికొను కవల.

[1]త్సరిదుపకంఠతలమునకు, నరిగిరి కౌతుకము మనములందు నెలకొనన్. 116

వ. అట్లు పౌరజానపదసహితు లై సకలజనంబులుం జని సాత్యవతేయుండు వసుప భాగీరథీతీరంబున విడిసి రవ్విచిత్రచరిత్రుండు దనచేయంబూనినపని మఱు నాఁడు రేపకడ సేయువాఁడుగాఁ బలికిన నయ్యందఱు నద్దినశేషంబు నాయా మినియును శతసంవత్సరంబులుం బోలె నుండ సూర్యోదయసమయం బగు టయుఁ గాలోచితకృత్యంబు లాచరించి ధృతరాష్ట్రుండుఁ బాండుతనయులుం దపోధనులు నప్పరాశర్యుపాలికి నరిగి యమ్మునివరుం బరివేష్టించిరి గాంధారీ ప్రముఖభామినులు నేతెంచి యొక్కవలన నతనిం గొలిచి యుండిరి సర్వజనులు నట్లు లెత్తికొని యంతంత నిలిచిరి తదనంతరంబ. 117

వ్యాసుఁడు ధృతరాష్ట్రులకు భారతరణమృతుల రావించి చూపుట

సీ. సాత్యవతేయుండు జాహ్నవీసలిలావగాహన మొనరించి గారవమున నింపారునెలుఁగున నిందు రం డనవుడు నీ కేమి సెప్పుదు నీటియందు రవ మగ్గలముగ రారాజుఁ దమ్ములుఁ దత్కుమారవర్గము నభిమన్యుఁ డాది యగు పాండుపుత్రులు నర్కజుండును బాహ్లికప్రముఖాఖిలకౌరవులును

తే. ద్రుపదమాత్స్యులు వారిబంధులును శకుని
యును దదీయానుజులును నాతనితనూజ
రాజియును భీష్మగురులఁ బురస్కరించి
కొనుచుఁ దమదివ్యదేహముల్ గొమరుమిగుల 118

ఆ. దివ్యమాల్యములును దివ్యాంబరంబులు
దివ్యభూషణములు దివ్యలేప
నములుఁ జెన్నుఁ జేయఁ దమమిత్రసుభటసం
దోహములును దారుఁ దోఁచి రధిప. 119

వ. అట్టియెడ. 120

క. తగ నాకురువృద్ధునకు నొ,సఁగె నాఁటికి [2]దివ్యదృష్టి సాత్యవతేయుం
డగణితతపఃప్రభావం,బు గని యధికవిస్మయంబుఁ బొందఁగ జనముల్. 121

వ. అవ్విశేషంబు విని యద్భుతప్రమదభరిత యై నిజనయనంబుల బంధించిన పట్టం బపనయించి గాంధారియును గనుంగొనుచుండ. 122

క. అవ్విధమునఁ దోఁచిన మఱి, నవ్వుచుఁ దెగడుచును బెరసి నరవర పగ లే
కవ్వీరవరులు నెయ్యము, నివ్వటిలఁగ విలసనములు నెఱయ మెఱయఁగన్. 123

తే. చతురగంధర్వు లప్సరోజనులు గాన
ములఁ బ్రమోద మొనర్పంగఁ బొగడ వంది
సమితి నిరహంకృతులు హృదయములగౌర
వములు దెల్లంబు సేయంగ వచ్చి రొప్పి. 124

---

1 త్సరిదుపకంఠమ్మునకును. 2 తెల్లదృష్టి.

వ. ఇట్లు వచ్చి సకలబంధుజనంబులకుం బరమప్రమోదం బావహిల్లం గలసి సము
చితాచారంబులు నడపి రా రెండుదెఱంగులవారలు నన్యప్రకారంబులం బితామ
హాచార్య శిష్యమాతృమాతామహ పితృపితామహ భ్రాతృ జామాతృపుత్ర
పుత్రీభగినీపౌత్త్ర దౌహిత్త్ర శ్వశురశ్వశ్రూస్నుషామాతులస్యాలకప్రియ ప్రియా
మిత్ర సమాగమసుఖంబు లనుభవించుచు. 125

తే. అనఁగి పెనఁగి నాఁడెల్ల నిచ్ఛానురూప
వృత్తి వర్తిల్లుచుండి రవ్విధము సకల
జనుల నద్భుతరసమున మునుఁగఁ జేసె
నే మనఁగ వచ్చు నాసంయమీంద్రుమహిమ. 126

వ. మఱునాఁడు రేపకడ యప్పారాశర్యుండు వనుప నయ్యిరుదెఱంగులవారలుం
బరస్పరామంత్రణంబు సేసి రాకారజనంబులు దమతమలోకంబులకుం జను
వారై జాహ్నవీజలంబులం బ్రవేశింప నన్నిలింపవందనీయుండు దానును
జొచ్చి యచ్చటనుండి పతుల ననుగమింప వలసినయంగనలు గంగాతోయం
బులం గ్రుంకుటకు రం డనిన విని విధవ లగు వీరభార్య లెల్లను ధృతరాష్ట్ర
గాంధారికుంతీధర్మనందనులయనుజ్ఞలు గొని రయంబునం జని భాగీరథీసలిల
మగ్నలై మానుషదేహంబులు విడిచి దేవతనువులు దాల్చి దివ్యాలంకార
సమలంకృతమూర్తులై మగలం గలసి రవ్విశేషంబు సూచి సర్వజనులు
నత్యంతాశ్చర్యసంతోషాధీనమానసులై రని చెప్పి వైశంపాయనుండు జన
మేజయున కి ట్లనియె. 127

సీ. జననాథ యీప్రియ సంగమోత్సవకథ వినినఁ బఠించిన వివిధములఁ
[1]బరమప్రియము లిందుఁ బరలోకమున సంభవించు మనమ్మున కించుభంగి
బాంధవయోగశోభనము వర్తిల్లు ననాయాసమున నామయాపగమము
గలుగు భూదేవనికాయంబునకు దీనిఁ దగ వినిపించిన ధార్మికులకు
తే. నవ్యయానందసంప్రాప్తి యావహిల్లుఁ, దత్పరతఁ గొనియాడిన దైవతములు
నీచదశఁ బొంద కుండంగఁ గాచి తిరిగి, మే లొనర్తురు భరతభూపాలవర్య.

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనుతో ధృతరాష్ట్రుం డట్లు కృష్ణద్వై
పాయనప్రసాదలబ్ధం బైన తత్కాలకలితదృష్టివిశేషంబున బంధులోకంబు నాలో
కించి మఱి యేమివర్తనంబున నుండెఁ బాండవు లెట్లు వర్తించి రెఱింగింపవే
యనుటయు నతనికి నతం డి ట్లనియె. 129

### ధృతరాష్ట్రుఁడు భాగీరథీతీరంబుననుండి నిజాశ్రమంబు ప్రవేశించుట

సీ. [2]అయ్యద్భుతవృత్త మమ్మెయిఁ జెల్లిన ధృతరాష్ట్ర మేదినీపతి తపస్వి
గణము సవినయంబుగా నిజస్థానయానమునకు నామంత్రితముగఁ జేసి
యాశ్రమభూమికి నరిగెఁ దోడన పాండురాజనందనులును రా నుదాత్త

1 బరమప్రియము లొందుఁ బరలోకమునను సంభవించు మనమ్మున. 2 అత్యద్భుతపు.

తేజు సత్యవతీతనూజు ము న్నిడికొని యప్పు డమ్మునిపతి యతనితోడ
తే. నీవు వేదశాస్త్రార్థములు భావితాత్మ, లగుమునీంద్రులచే జెవులార వింటి
కంటి తనయులనీకన్న కంటె నొప్పి,యుండుదురువారు దివిసౌఖ్య యోగ మెసఁగ.
ఉ. కావున నింక [1]వారికయి కౌరవసత్తమ యుమ్మలింప కా
త్మావిలభావముం దపము నగ్గలికం బెడఁబాపు నిన్ను సం
భావనఁ గొల్చి యొక్కనెల పాండవముఖ్యుఁడు నిల్చె నిష్ఠమై
నీవనభూమి నీవసుమతీశ్వరుఁ బొమ్మనఁ గాదె వీటికిన్. 131
వ. అని చెప్పిన నవ్వారవోత్తముం డట్ల చేసెద నని పలికి యమ్మునిసత్తమునకుం
బ్రణమిల్లి భవదీయకృపావిశేషంబునం గృతార్థుండ నైతి నని యతని నామం
త్రితుం జేసినం బాండవులుం దగ నప్పుణ్యమునిని వీడ్కొని రయ్యంధుఁడును
దీవించి యమ్మహాత్ముం డంతర్హితుం డయ్యెఁ దదనంతరంబ. 132
సీ. ఆంబికేయుండు ధర్మాత్మజుఁ జిత్తసంప్రీతి మోమునఁ దోఁపఁ జేరఁ బిలిచి
వసుమతీకార్యనిర్వహణంబు పెద్దకొల్వున నుండి నీ వనుదినము నడప
కునికి కర్తవ్యమే [2]వినుకులు భీష్మవిదురహితులచేత సమగ్రభావ
మొందినయవి యింక నుపదేశ మేమియు వలవదు రంధ్ర [3]మొవ్వనిజనంబు
తే. వేచు ననుజానుగతుఁడవై వేగ పొమ్ము, దారయుతముగఁ బురికి నుదారచరిత
నీకతంబున మున్న నాశోక మెల్లఁ, బాసెఁ దేజంబు సౌఖ్యానుభవముఁ గంటి.
చ. తపమునెడన్ మదీయమతి తత్పర గావున దాని కోర్తు నీ
వపగతఖేదమానసుఁడవై నను నిం దతినిష్ఠ నొందఁ బం
చి పురజనంబు సమ్మదముఁ జెందఁగ సైనికు లుల్లసిల్లఁగా
నృపవర యేఁగి రాజ్యభరనిర్వహణం బొనరింపు నావుడున్. 134
సీ. ధర్మతనూజుఁ డాతనితోడ నిట్లను నధిప భీమాదుల నరుగఁ బనుపు
పుడమి రక్షింప నీయడుగులకడ నేను నిలిచి మాతల్లుల నిన్నుఁ గొలిచి
యంచితతపమున కనుగుణం బైనట్టి శుశ్రూషణము సేయుచును దపోని
యతితోడ నుండెద ననవుడు గాంధారి యిట్లనఁ దగునన్న యీవ కాదె
తే. కురుకులమునకు సంరక్షకుఁడవు నీవు
తండ్రులకుఁ బిండ మొసఁగఁ గర్తవు భవజ్జ
నకునిపంపు సేయుము భూజనము దలంక
కుండఁ బొమ్మది ప్రియము మాయుల్లమునకు. 135
వ. అని పలికిన నప్పాండవాగ్రజుండు పాండురాజాగ్రమహిషితో నిట్లనియె. 136
ఆ. ఇట్లు మీరు నన్ను నెంతయుఁ దఱిమిన
విపినభూమి మిమ్ము విడిచి పోవ
నియ్యకొనదు నాదుహృదయంబు మునువోలెఁ

1 వారలకుఁ గౌరవసత్తమ. 2 విను కురుభీష్మాది. 3 మోర్వనిజనంబు.

గలుగ దిపుడు రాజ్యకాంక్ష నాకు. 137

క. విను పాంచాలురు మాత్స్యులు, వనితాజనశేషు లైరి వారలు లేమిం
జననీ శూన్యం బై తోఁచినయది రాజ్యంబు నాదుచిత్తంబునకున్. 138

వ. అట్లుం గాక. 139

క. సమరము దీఱినకోలెను, శమనిరతా నామనంబు సారతపమునం
రమియింపఁ గోరు యుష్మత్సమధికతపమునకు నేను సందడి సేయన్. 140

సీ. అన విని సహదేవుఁ డతనితో నేఁ దప మాచరించెద వీర లందఱకును
శుశ్రూష సేయుచియాశ్రమంబున నన్న నక్కుమారునిఁగుంతి యక్కుఁజేర్చి
వలవదు మీరు రా వలతు లై మామీఁదిభక్తి నిం పెసఁగ నీ పలుకు లిట్లు
వలుక మీయునికి తపమునకు విఘ్నంబ కాక యేకాగ్రత గలుగు నెట్లు

ఆ. మాకు నియమవిధిసమాచరణములపై, నింత యొఱఁగి మీర లెల్లభంగి
నరుగుటొప్పుగానికురుకులోద్వహుమాట, గొనక యునికి చనదు తనయులార.

వ. మీకు సర్వకార్యంబులయెడను శుభంబు లయ్యెడును బోయి రం డనిన నజాత
శత్రుండు మఱియొండు వలుకం బుయిలోడి ధృతరాష్ట్రునితోడం దపోమహ
నీయు లై నమిమ్ముం గొలిచి గతకల్మషుండ నైతి మీయాజ్ఞాపనంబు దల నిడి
కొని పురంబునకుం బోయివచ్చెద ననుటయు నక్కురువృద్ధుం డతని దీవించుచు
నాలింగనంబు సేసి భీమసేను [2]సాంత్వనవచనంబులం బ్రీతుం గావించి కౌగిలించు
కొని గాండీవిం గొనియాడి సంశ్లేషం బాచరించి కవల సంభావించి పరిరంభ
ణంబు నిర్వర్తించిన నయ్యేవురు నతనిపాదంబులకుఁ బ్రణమిల్లి యాశీర్వా
దంబులు వడసి. 142

సీ. అతిభక్తి గాంధారియడుగుల కెఱఁగిన నద్దేవి వారల నక్కుఁ జేర్చి
దీవించె వారుఁ గుంతీచరణంబులు ఫాలముల్ వొందఁగఁ బ్రణతు లైనఁ
దప్పక గ్రుచ్చి యందఱ నొక్కకౌఁగిటఁ బొదివి యాశీర్వాదములు గ్రమమున
నర్మిలిపెంపున నలరుమనంబుతో వేర్వేఱ యిచ్చె నా వీరజనని

తే. ద్రుపదపుత్త్రికాప్రభృతివధూజనములు, తగు తెఱంగుల మామనత్తలను వీడు
కొనిరి వారును వారు నగ్గురుజనముల, నల్ల వలగొని చనిరి నృపాగ్రగణ్య.

క. చని పరిజనములుఁ బౌరులు, ననుమోదముతోడఁ గొలువ నరిగిరి నగరం
బునకుం గన్నులపండువు, జనపదముజనం బొనర్ప జనసంస్తుత్యా. 144

వ. అరిగి సముచితవర్తనంబుల నుండిరి కొంతకాలంబు సనిన నొక్కనాఁడు
నారదమునీంద్రుం డనుజసహితుం డై యున్న ధర్మతనయుకడకుఁ జనుదెంచిన
నజ్జననాథుండు దమ్ములుం దానును నమ్మహాత్మునకు భక్తిం బ్రణమిల్లి యాస
నార్ఘ్యపాద్యాదిసత్కారంబు లొనర్చి తదీయసమీపంబున నాసీను లై
రతనివదనంబు విలోకించి వినయం బెసంగ నమ్మహీపతి మహాభాగ యెందుండి

1 మీరలు వంత మై. 2 శాంతవచనంబులం.

రాక యేదేశంబులఁ జరించితిరి నేను మీకు నేమిపని సేయుదుఁ జెప్పుం డనిన నప్పరమసంయమి యప్పుడమిఱేనితోడ. 145

నారదుఁడు పాండవులకు ధృతరాష్ట్రాదులనిర్యాణంబు సెప్పుట

సీ. భూపవరేణ్య తపోవనంబుననుండి వచ్చితిఁ దీర్థసేవాపరత్వ
మున నేను బహుదేశములఁ జరించితి నినుఁ గని పెద్దకాలంబుగాన నూడఁ
దివిరి యిందులకు నేతెంచితి ధృతరాష్ట్రచరితంబు జాహ్నవీపరిసరంబు
జనములచే వింటి ననిన నజ్జనపతి యారాజవరుఁడు గాంధారి గొంతి
తే. సంజయుండు సమాధానసహితులై శరీరముల వింత పుట్టి కున్నా రె యనియె
సనుడు నద్దేవముని వారియఖిలవర్త, నంబు వినుము సుస్థిరహృదయంబుతోడ.
వ. అని పలికి యిట్లను మీరు వోయి కాంతారంబున నక్కురువృద్ధుం గొలిచి యుండి యతం డనుమతి సేయ నిట వచ్చితిరి మఱికొన్నిదినంబులకు. 147
సీ. ఆరాజు నియతి గాంధారియు గొంతియు సంజయుండును దోన చనఁగ నగ్ని
హోత్రంబు గొని యాజకోత్కరం బగ్రేస[1]రం బయి పో నిజాశ్రమము విడిచి
యరిగె గంగాద్వారపరిసరారణ్యభాగమునకు నందు దుష్కరతపంబు
వాయుభక్షితఁ బూని జేయఁ దొడంగె గాంధారియు నీళ్ల నాహారకలన
తే. మోపి యొనరించె గొంతి మాసోపవాస,నియమమూఁదివర్తించె సంజయుఁడుసప్త
భోజనాంతరితం బగుభోజనంబు, వ్రతము గాఁగఁ జరించెఁ గౌరవ్యముఖ్య. 148
తే. యాజకులుదార యక్కురురాజు భక్తియుక్తి,నొద్ద నుంపఁగనగ్నిహోత్రహోమ
మాచరింతు రొక్కొకమరి యతఁడు పర్ణ,శాల వెడలి శూన్యాటవి సంచరించు
వ. విషమప్రదేశంబుల నవ్విభునకు సంజయుండును గాంధారికిఁ గుంతియుం గన్నై మెలంగుదు రొక్కనాఁడు వార లందఱు గంగాద్వారంబునఁ గృతస్నానులై యాశ్రమంబునకు వచ్చు చుండ మహావాతోద్ధూతం బై. 150
సీ. పటుతరంబగు ఛటచ్ఛటరవ మెసఁగంగ మ్రాఁకులఁ బొదలును గ్రాఁచికొనుచుఁ
గమరును నార్తనాదములును బెల్లుగ నఖిలమృగంబుల వాఁగికొనుచు
లాఁగలఁ బుట్టలలోఁగినశిఖల భుజంగమకులముల మ్రింగికొనుచు
వెగడొందియఱచుచు నెగయు బల్పులుఁగులఁబోగనూర్ధ్వకీలలఁబొదివికొనుచు
తే. దెసల నన్నిటఁ దనసముదీర్ణగతులు, దారుణస్ఫురణమున విస్తార మొంద
ఖేచరులకును భయముగ నేచి పరఁగె, నద్భుతోద్భవం బైనమహానలంబు. 151
వ. ఇ ట్లెరగలిచిచ్చు గవిసి చుట్టుముట్టిన నమ్మనుజనాథుండును నన్నాతులు నిరాహారులై యునికింజేసి యొక్కచోటఁ దఱియ నుఱికి తొలంగి పోవ లావు లేరై రట్టియెడ నారాజర్షిసత్తముండు సంజయుతోడ. 152
సీ. ఒక్కింతదెఱపి నీ వెక్కడ నైనను గనుఁగొని పొ మ్మగ్ని దనుక కుండ
నని చెప్పి తలఁగి పోఁ దనకు గాంధారికిఁ గుంతిభోజాత్మజకును నశక్య

1 రంబుగాఁగ నిజాశ్రమంబు విడిచి.

మగుటయుఁ జెప్పిన నడలొంది యాసూత[1]సుతుఁడు మీరును నొకచోటఁ వెడలి
పోవుట గలిగినఁ బోదు [2]గాకే దవాగ్నికి మిమ్ము నెర సేసి యకట పోదు
ఆ. నే మహాత్మ యనుఁడు నిలు వాసి యి ట్లున్న జనుల కివ్విధమున సమయు టెగ్గు
గాదు నీకుఁ బోఁకఁ గా వచ్చి యుండంగఁ బోవ కునికి పాపమునకుఁ బట్టు. 153
వ. అని పలికి యతనిం బోవ నొడంబఱిచి యప్పారగసత్తముండు సమాహిత
చిత్తుండై ప్రాఙ్ముఖాసీనుం డయ్యెఁ గాంధారియుం గుంతియు నవ్విధంబునం
గూర్చుండి రప్పుడు సంజయుండు ధృతరాష్ట్రుతో యోగయుక్తుండవు గమ్మనియె
నతండు నట్లు సేసెఁ దదనంతరంబ 154
ఆ. ఒక్క తెఱపి సంజయుఁడు సని హిమశైల, మెక్కె నంత వారి నెల్ల నగ్ని
వొదివి కొనియె నిట్లు వోయి రమ్మువ్వురుఁ, బుణ్యలోకమునకు భూపవర్య. 155
సీ. పదపడి నృప యేను భాగీరథీతీరమున వచ్చుచుండి యవ్వనము దివ్య
మునులచే వీరా రట సని క్రమ్మఱంగ వచ్చినది యాదిగ నయ్యశేషవృత్త
మును నేర్పడఁగ వింటి మూఁడుకళేబరములుఁ గంటి నక్కురుపుంగవుండు
భార్యయుఁ బాండునిపత్నియు సద్గతి నొందిరి నీ వింక నుమ్మలింప
ఆ. కుండు మనిన శోక మొదవి యాతఁడు బాహు, లెత్తి యెలుఁగు సెలఁగ నేడ్వఁ దమ్ము
లడలు గదిరి యేడ్చి రవ్వార్త నంతిపురమున రోదనార్తరవము లెసఁగ. 156
వ. అవ్విశేషంబు. 157
క. విని పౌరజనసమూహము, లనయంబును వనట మునిఁగి హాహారవముల్
వినువీథి ముట్ట రోదన, మొనరిచె నవ్వేళఁ గరుణ ముత్కటమయ్యెన్. 158
క. నారదుఁ డుపశమఘటితులఁ, గౌరవసత్తమునిఁ దేర్పఁ గ్రమమున నాక్రం
దారవము లుడిగె బంధుజ, నారబ్ధము లైనయనునయాలాపములన్. 159

ధర్మరాజు ధృతరాష్ట్రప్రభృతులు మృతు లగుటకు శోకించుట

వ. అట్లు సమస్తజనంబులును విగతరోదను లై రప్పు డక్కౌరవనాథుండు నారద
మునియాననం బాలోకించి యి ట్లనియె. 160
సీ. ఎఱుఁగంగ వచ్చునే యెవ్వరి కెత్తఱి నేదెస యగునొ మునీంద్ర యేము
గలుగంగ దెసలేని పులుమానిసికిఁ బోలె నక్కురువృద్ధున కట్టిచావు
పాటిల్లె సముదీర్ణబాహుదర్పోజ్జ్వలు లైనపుత్త్రులు నూర్వు రట్లు గలిగి
బలము నాగాయుతప్రాణసమం బగునమ్మహారాజ కట్టె యడవిచిచ్చు
తే. వలనఁ దెగటాఱె నేమనఁగలదు కమల, ముఖుల తాలవృంతానిలములసుఖించు
ప్రభువె కంకగృధ్రావలిపక్షవాయు, వదర నిలఁ బడి యున్నవాఁ డక్కటకట.
క. కలమృదుమాగధగానం, బుల మేల్కను రాజు గృధ్రములునుం గాకం
బులు నఱవఁగ నిడుదనిదుర, నొలసి తెలుప దిక్కుమాలియున్నాఁడు గదే. 162
సీ. వల్లంభుం డొక్కసద్వ్రతముఁ బూనినఁ దానుఁ దద్వ్రత మూని గాంధారియతని

1 సూనుండు మీ రొకచోట. 2 గాక దవాగ్నికే మిమ్ము నెర సేసి యెట్లు పోదు.

పోయినగతిఁ బోయె నాయమ్మకై యంత వగవఁ బుత్త్రులరాజ్యవైభవంబు
విడిచి [1]మేయొంటక యడవికిఁ బోయిన తల్లికి వగచెద ధర్మసుతుఁడు
భీమసేనుండును బీభత్సుఁడును దనకడుపునఁ బుట్టినకొడుకు లట్టె

తే. [2]యుగ్గతంబునఁ దానుఁ గార్చిఁ గాల్చె,నకట యనాథయై దీనికి నంతరంగ
ములఁదుగక తల్లడిల్లక యాఁపటమున, నుడుక కలుమటఁబడక యెట్లుండెఁ జెపుమ.

క. విను ఖాండవదహనంబునఁ, దనకుఁ బ్రమోదంబు శక్రతనయుఁ డొసఁగె నా
తనతల్లిఁ గాల్పఁ దగునే, యనలునకుం గడుఁ గృతఘ్నుఁ డయ్యె మునీంద్రా.

సీ. మఱియుక్క నెవ్వగ మనమున జనియించె నాంబికేయుండు గార్చి నెఱసె
దానికి నెయ్యది యేను జేయుదునొక్కొ యనవుడు నారదుం డానృపాలు
తోడ నబ్భరతవృద్ధుఁడు శాంతి యొక్కఁడై సవిశేష మైనపూజావిధాన
మున నుపాసించి తగినయిష్టి సేసి యగ్నులఁ దొలునాడ వీడ్కొనియె ననియు

తే. నపుడు యాజకజనము లయ్యగ్నిచయము
నడవిలోన నుద్వాసించి [3]యరిగె ననియుఁ
బేర్చి యది యప్వనం బెల్ల నేర్చె ననియు
వింటి నాత్మాగ్నిఁ గాలె నావిభుఁడు వత్స. 165

ఉ. కావున నెవ్వగం బొరయఁ గాఁ బనిలేదు నరేంద్ర కొంతియుం
బావకు నప్పుడుం గరము భక్తిఁ దగం బరిచర్య సేసి దే
వావలి ప్రస్తుతింపఁగ నిరామయలోకము నొందె వారికి
నీ వుదకంబు లీ వలయు నిష్టమెయిం దిలసంయుతంబుగన్. 166

యుధిష్ఠిరుఁడు ధృతరాష్ట్రాదులకుఁ దిలోదకప్రదానంబు సేయుట

క. అనుజన్ములు నంతఃపుర, వనితాజనములును నీవు వసుధేశ్వర వే
చని నడపుఁ డుదకవిధి నీ, జనకునకును జననులకును జాహ్నవిలోనన్. 167

ఆ. అనిన లెస్స గాక యని ధర్మసుతుఁ డేక, వస్త్రధరణనియతి వఱల నెల్ల
వారు నట్ల యేఁగుదేరఁగఁ బౌరులు, బలసి చనఁగఁ జనియెఁ బౌరవేంద్ర. 168

వ. ఇట్లు చని గంగాస్నానం బాచరించి యమ్మహీపతి మొదలగు నర్హజనంబులు ధృతరాష్ట్రునకు గాంధారికిం గుంతికిం దిలోదకప్రదానంబులు నిర్వర్తించి నివృత్తులై యశుచిత్వం బపనయించుటకుం బురబహిరంగణంబునఁ బటకుటీరప్రకరంబుల వసియించి రట్టియెడ. 169

సీ. అంబికేయాదుల యస్థిపుంజముల గంగాద్వారసలిలసంగమవిశిష్ట
సంస్కారమునఁ గూర్పఁ జాలెడుసంశుద్ధజనముల రావించి సబహుమాన
ఫణితుల వారి కప్పని యేర్పడఁగఁ జెప్పి పనిచె నక్కౌరవజనవిభుండు
శ్రాద్ధార్హదినమున వృద్ధానుమతి నతం డక్కురువృద్ధున కతనిసతికి

1 మెయ్యాడక యడవికి. 2 యనదతనమునఁ దానుఁ. 3 యరిగి రనియుఁ.

తే. గొంతికిని రత్నకాంచన గోతురంగ, హాస్తికన్యాధరిత్రీగృహాదిదాన
విధుల సర్వజనంబులు విస్మితులుగ, నియతిమెయిఁ బారలౌకికక్రియ లొనర్చె.

ఆ. మునిజనములు వచ్చి యనుమోద మందంగ, సకలబంధుజనులు సంతసిల్ల
నన్నపర్వతముల నాజ్యనదులఁ బిత్రు,మేధ ముల్లసిల్లె మేదినీశ 171

క. ద్వాదశదినములు నారదుఁ, డాదరమున నొద్ద నుండి యంతయుఁ గని స
మ్మోదంబుతోడ నాశీ,[1]ర్వాదం బొనరించెఁ బాండవప్రవరునకున్. 172

వ. అమ్మునీంద్రునిం దక్కనుం గలుగు తపస్విసత్తముల సమర్చితులం గావించి యుధిష్ఠిరుం డామంత్రితులం జేసిన నాసంయమివరులు నిజనివాసంబులకుం జని రానృపకుంజరుండు బంధుమిత్రసహితుం డై కుంజరపురంబు ప్రవేశించె నిత్తెఱంగున నాంబికేయునకు భారతరణంబు పిదప దానాదిపుణ్యక్రియాకలాపకరణంబులం బురంబునం బదియేనును దపోనియమంబున వనంబున మూఁడు నుంగా బదునెనిమిదిసంవత్సరంబులు సనియె నివ్విధంబున వైచిత్రవీర్యని[2]సంసేవన సమస్తప్రకారంబుల సంఘటించి కృతార్థతానందంబు నొంది ధర్మనందనుండు జనంబు లభినందించు చందంబున సామ్రాజ్యంబుఁ బాలించె నని యిట్లు ధృతరాష్ట్రుని యాశ్రమవాసంబువిషయం బైనవర్తనంబు వైశంపాయనుండు సెప్పిన విని జనమేజయుండు మహాత్మా యిట్లు కృతకృత్యతం బొందిన పాండవాగ్రజుండు భూభారంబు నిర్వహించుచుండం బదంపడి పుట్టిన విశేషంబు లెఱింగింపవే యనుటయు. 173

శా. కారుణ్యాత్మకదృక్ప్రచార గతసంకల్పాంతరంగస్థితి
స్మేరాకార పతంగమధ్యమమరీచివ్యాప్తిమూర్ఛత్సుధా
ధారారూపవిహార నిర్మితజగత్సంసార నానాగమ
క్షీరోద్యన్నవనీతతాలసిత నిశ్చిత్తత్త్వ సంభాసితా. 174

క. నిర్మలసంవిదుపాస్య ధర్మకరణదుర్వికాస్య దైత్యశ్రేణీ
నిర్మథన కేళినిర్జర, శర్మకృతివిహారశీల సంయమిలోలా. 175

మాలిని. సముదవిమదదూరా సన్న రక్షాప్రసన్నా
శమశుభమయమూర్తి స్ఫార దుర్లక్షసారా
దమవిభవసముద్యద్ధాన నిస్సీమభూమా 176
సమహృదయలసత్సంసర్గ సానందవర్గా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున నాశ్రమవాసపర్వంబు నందుఁ ద్వితీయాశ్వాసము. 177

---

1 ర్వాదంబుల నొసఁగెఁ. 2 సమస్తప్రకారంబుల నారాధించి కృతా.

శ్రీరస్తు.

శ్రీగణేశశారదాగురుభ్యో నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## మౌసలపర్వము, ప్రథమాశ్వాసము



క. శ్రీధర్మకామహృదయస
మాధానాధానకారకాంఘ్రిసరోజా
బోధఘనవ్యాసపరస
మాధిసమాలీఢతేజ హరిహరనాథా. 1

ధర్మజురాజ్యంబున నుత్పాతంబులు దోఁచుట

క. దేవా జనమేజయధా,త్రీవల్లభునకు నుదాత్తతేజోదీప్తుం
డావైశంపాయనుఁడు ప్రి,యావేశస్మేరచిత్తుఁ డై యి ట్లనియెన్. 2

సీ. భారతసంగ్రామపారీణుఁ డై జయరమ యుల్లసిల్ల సామ్రాజ్యమునకుఁ
బాండవముఖ్యునిఁ బట్టంబు గట్టిన యది యాది గాఁగ ముప్పదియు నైదు
సంవత్సరంబులు [1]సన ననంతరవత్సరంబునఁ బ్రజకు భయంబు వొనర్చు
నుత్పాతములు పుట్టె నుర్వీశ విను మహావాయువు శర్కరావర్షి యగుచు

ఆ. వీచు నర్కునుదయవేళల బింబంబు, బలసి తోఁచు ఘనకబంధసమితి
నీరదములు లేక నిర్ఘాతపాతముల్, గలుగు నుల్క లెల్లకడల డుల్లు. 3

క. పరివేషము లినరజనీ,కరులకు నతిరూక్షరుచులు గలిగి గలుగు నం
బర మెల్లఁ గప్పి వేసవిఁ, బరఁగుం బెనుమూడమంచు పౌరవముఖ్యా. 4

సీ. ఇ ట్లనుదినమును నెన్ని యేనియును మహోత్పాతములు పుట్టుచుండఁ గొంత
కాలంబు వోవంగఁ గౌంతేయముఖ్యుండు వినియె నొండొరులతోఁ బెనఁగి సర్వ
యాదవులును దెగి రంబుజనాభుండు హలధరుండును దక్కనని నరేంద్ర
విని భీమసేనుని విజయుఁ బ్పు నకులుని సహదేవు రావించి సంభృతార్తి

తే. యగుచు నవ్వార్త యెఱింగించె నందఱకును,వార లేవురు నెవ్వగల్ గూరుమాన
సములు గలఁగ నత్యంతవిషణ్ణు లైరి, సకలజనకోటులును శోకజలధి మునుఁగ.

---

[1] సనిన యనంతరవర్తన సెల్లంగ వసుధలోన.

తే. అనిన విని యమ్మహీపతి యాదవులకుఁ, బోరు పములోనఁ గలిగినకారణంబు
వారివృత్తాంతములు వినవలతుఁ జెప్పు, మనుడు నమ్ముని యి ట్లను నతనితోడ.

క. ద్వారవతికిఁ గణ్వుండును, నారదమునివరుఁడు గాధినందనుఁడును బెం
పారంగఁ దొల్లి వచ్చిరి, నారాయణుఁ జూచువేడ్క నరవరముఖ్యా. 7

సీ. చనుదెంచి పురవీథిఁ జనునవసరమున వృష్ణికుమారులు విధివశమున
మనముల నవినీతి జనియింప సాంబున కంగనాలంకార మమరఁ జేసి
కొని వచ్చి యమ్మహామునివర్గమునకు మిథ్యావినయమున వందన మొనర్చి
నిభృతు లై కారుణ్యనియతాత్ములార యీభామిని బభ్రునిభార్య ప్రజలఁ

తే. గనునె యిది యని యడిగినఁ గౌరవేంద్ర, యత్తపోధనవర్యు లయ్యాగడమున
కాత్మ లందుఁ గ్రోధానల మగ్గలముగ, నెలయ నక్కుమారులతోడ నిట్లు లనిరి.

క. అంబుజనాభునికొడుకు, సాంబుఁడు గను యాదవక్షయాపాదనక
ల్యం బగుముసలము మావచనంబున కనృతంబు లేదు నమ్ముఁడు మీఁగల్. 9

సీ దామోదరుఁడు హలధరుఁడును దక్కంగ యాదవు లెల్లను నమ్ముసలము
నద్భుతశక్తి గీటడఁగుదు రబ్బలదేవుండు దన దైనదేహ మధిక
నిష్ఠమై విడిచి వార్నిధిఁ బ్రవేశించు భూశయ్య నుండంగ నాచక్రధరుని
జర యనురాక్షసి వెరవునఁ [1]బట్టి క్రమించుఁ బోం డని చెప్పి మెచ్చుగాదు

ఆ. మనము కృష్ణు నింకఁ గను టనియెడుబుద్ధి, నమ్మహామునీంద్రు లపుడు మరలి
యాత్మవాసములకు నరిగిరి తదనంతరంబ కృష్ణుఁ డవ్విధంబు వినియె. 10

క. విని కాలవేది యగు నవ్వనజాక్షుఁడు నియతి నగునవస్థకుఁ దలఁపం
జన దన్యథాత్వకరణం, బని యూహించుచు నుపేక్ష యాత్మ నొలయఁగన్. 11

క. తనచుట్లు నున్నబంధులఁ, గనుఁగొని యిట్టిది విధాత్రకరణీయం బి
ప్పని మనవారలయొప్పని, తనమున మూఁడె నని వంతఁ దలపోయకుఁడీ. 12

మునిశాపంబున సాంబునికడుపున ముసలంబు పుట్టుట

సీ. అని పల్కి యభ్యంతరావాసమున కేఁగె మఱునాఁడు సాంబకుమారుకడుపు
లోనుండి జముదూత వోనిభయంకరనిష్ఠురముసలంబు నిర్గమించె
దానికి నత్యద్భుతంబును భయమును గదురంగ వసుదేవుకడకుఁ బాఱి
బంధు లయ్యాదవపతి కెఱిఁగించిన నలఁదురి వెలువెల్ల నగుచుఁ గొంత

తే. ప్రొద్దు నివ్వెఱఁ గంది యాభూవరుండు, కడు రయంబున రోఁకలి పొడిగఁ జేసి
వనధిలోపలఁ జల్లంగ వారిఁ బనిచె, వారలును నట్ల చేసిరి కౌరవేంద్ర. 13

క మునిశాపశక్తి మానుష, మునఁ ద్రోవఁగ రామి యుల్లములఁ దలఁపక య
జ్జనపతియు బాంధవులు న, ట్లొనర్చి యూఱడిలి యుండి రుర్వీనాథా. 14

క. పదపడి ధృతరాష్ట్రమహిషి, యదయహృదయ యై సమస్తయాదవులకు బె

1 బిట్టాక్రమించు.

ట్టిక మగుశాపం బిచ్చుట, విదిత మయిన సజ్జనములు వెఱచుచు నుండన్. 15

క. కాలం బగుటయుఁ గురుభూ,పాలోత్తమ యాదవేంద్రపట్టణమున వ్యా
త్కాలుప్యసమాపాదన,శాలిమహోత్పాతముల్ ప్రజాతము లయ్యెన్. 16

తే. అరుణములు ఘూర్ణితంబులు నైనలోచ
నములు మెఱయ మహోగ్రదండము ధరించి
తిరుగు నొక్కొక్కచోటను దృశ్యుఁ డగుచు
నంతకుం డిదె యదె తోఁచె ననఁగ నధిప. 17

ద్వారకాపురంబున మహోత్పాతము లనేకములు పుట్టుట.

తే. నీలపింగళదేహ మాభీలభంగి,కముగ నమ్మెయి వర్తించు జముఁడు సకల
వృష్ణిభోజాంధకోత్సాదివిహారణమున, మునులశాపంబు ప్రేరేప మనుజనాథ. 18

సీ. చిలుకలు గూబలయెలుఁగులచందంబు దోఁపంగ నఱచు రాత్రులను దినము
లందును నక్కలయట్లు మేఁకలు గూయు మొదవుపిండునకు గాడిదలు వుట్టు
ముంగుల కుదయించు మూషికంబులు గుక్క లెల్లను బిల్లుల నీను బలుఁడు
హరియును దక్కఁగ యాదవనివహంబు బ్రాహ్మణప్రతతికి బాధ సేయు

తే. గురుల కవమాన మొనరించుఁ దిరుగు లజ్జ
విడిచి యభిలాషములవెంట విభులపంపు
సేయ కున్మార్గములఁ దమచిత్తములకు
వచ్చినట్ల వర్తింతురు వనిత లధిప. 19

క. అనలములు హోమకాలం,బున నానాభూతవర్ణములతోడ శిఖల్
మనుజేశ్వర వామావ,ర్తన మొందఁగ నుగ్రగంధరౌద్రంబు లగున్. 20

క. విను కూడుగూర పాకము, గనుఁగొని ప్రాయి వాపి డింపఁ గా నప్పుడ సం
జనితము లై పుర్వులు గల,గొన మిలమిల మెదలు నందుఁ గురుకులముఖ్యా.

సీ. అనుదినంబును నిట్టి లశుభసూచకములు దోఁపంగ సర్వవిదుండు కృష్ణుఁ
డంతరంగమున సమాలోచనము సేసి గాంధారి పుత్త్రశోకమునఁ జేసి
కోపంబు గదిరిన శాపంబు ముప్పదియాఱవు నేఁ డెల్ల యాదవులకు
నాశ [1]మన్యోన్యహననమున నగుటకు నిచ్చె నిక్కించి యయ్యేఁడు వచ్చెఁ

ఆ. దప్ప దది ఫలించు దానికిఁ దీర్థస,మీపభూమి యైన మేలు గాదె
యని నరేంద్ర యమ్మహాత్ముఁ డీభంగి నూ,హించి తెఱఁగు నిశ్చయించెఁ దివిరి.

ఆ. అట్లు నిశ్చయించి యాదవనివహాక్ష,యంబు దివ్యబుద్ధి నరసి యపర
దివసకలిత మగుటఁ దెల్లంబు గానిఁ గ, కొని యతండు పెద్దకొలువులోన. 23

ఉ. జాతర సేయఁగా వలయు సర్వజనంబులు నంబురాశికిఁ
బ్రీతిగ భక్తితోడ నని బంధుల కెల్లను జెప్పి వీట వి

---

1 మన్యోన్యవధనన మగుటకు నిచ్చె నిక్కించి యయ్యేఁడు నేఁడు వచ్చె.

భ్ర్యాలిగ నప్డు పాటుటకు నర్హునిఁ బంచిన ఘంటికాస్వనో
పేతము గాఁగ వాఁ డెలమిఁ బెద్దయెలుంగునఁ జాల నెల్లెడన్. 24

సీ. ఆరేయిఁ గల నెల్లవారును గోరదాడలును నల్లని మేను గలనెలంత
యొక్కత యిలు సొచ్చి యువిదల నీడిచి కొనిపోవ శస్త్రాస్త్రకోటికేతు
చయమును భూషణసమితియు రాక్షసు లపహరింపఁగ గని రపరదినము
నం దగ్నిద త్తంబు నబ్జనాభంబును నైనకృష్ణునిచక్ర మద్భుతముగ

ఆ. నెగసి యఖిలజనులు నీక్షింప దివమున, కరిగె నమ్మహాత్మగరుడకేత
నంబుఁ దోన చనియె నరవర రోహిణీ,తనయుతాటినిడము ననుసరించె. 25

తే. విభుము సుగ్రీవమును శైబ్యమునువలాహ,కంబు మేఘపుష్పంబునాఁగలుగునట్టి
వాహనంబులతోఁ గూడ వాసుదేవు, తేరు తదవసరంబున దివికి నరిగె. 26

క. వెడలుండు తీర్థయాత్రకుఁ, గడువేగం బనిరి సురలు గగనంబున న
ప్పుడు సువ్యక్తముగా నెక్కు డెలుంగులు నెలఁగ రాజకులమౌళిమణీ. 27

క. అవి గనియు వినియు నులుకక, నవరణ లొప్పార నపు డసంభ్రము లై యా
దవులు మనోజ్ఞము లగుసీ,ధువులును మాంసములు వేడ్కతో నింటింటన్. 28

యాదవు లందఱుఁ గృష్ణసహితు లై సముద్రతీరమునకుఁ బోవుట

సీ. సమకట్టికొనుచు భోజ్యములు భక్ష్యంబులు నానావిధముల నొనర్చికొనుచు
క్షీరశర్కరలును ఘృతబహుభంగికవ్యంజనంబులు వివిధాన్నపాన
ములును నక్షతగంధములును బుష్పంబులు గావించుకొని బలుగావళులును
దలమోపులును బండ్లఁ దమతోడ నొప్పారి చనుదేరఁ గరులు నశ్వములు నరద

తే. ములు నలంకారవిరచనములు నుదాత్త
లలితరేఖంబు లగుమాల్యములును భూష
ణములు నాలేపనములు వస్త్రములు వింత
చెన్ను సేయఁ జేష్టలు విలసిల్లుచుండ. 29

క. తనరథము లేమి నొండొక, ఘనరథమును దారుకుండు గైకొని యెలమిం
గొని రా వెడవెడ గై సే,సినకృష్ణుఁడు నిర్వికారచిత్తత వెడలెన్.

ఆ. తోడవు చీర పూఁత తొంటియట్టులు గాఁగ, నేమివాహనంబు నెక్క కించు
కేని వికృతి లేనిహృదయంబు మిత్రసం,భాషణంబు గలిగి బలుఁడు వెడలె. 31

క. ఆందోళికాదివాహన, సందోహంబున నితాంతచారుత్వము చె
న్నొందఁగ సమలంకృత లగు, సుందరు లేతేర విభవశోభితభంగిన్. 32

చ. వెలువడి లీల నేఁగి మును వేడ్క నొనర్చిన మేటిచప్పరం
బుల నెలమిన్ మహార్ణవముపొంత వసించిన నుద్ధవుండు దా
నలఘుతపం బొనర్చుటకు నై విపినంబున కేగువాఁడు గాఁ
బలికిన దాని కొండొకఁడుఁ బల్కఁడ కృష్ణుఁడు కాలవేదితన్. 33

వ. అంత బలుండును బోవ నిశ్చయించి చెప్పిన. 34

చ. పలుకక మ్రొక్కి వీడుకొలుపంగ వనంబున కప్పురోహితుం
డలఘువినిశ్చయంబు వగ పంతయు మాన్పఁగఁ బోయె నాతనిన్
హలధరుఁ డన్పఁ బోయి వినయంబున భక్తియుఁ దోఁప నయ్యనా
కులు నట పుచ్చి యొక్కెడ నకుంఠితనిర్ణయశాంతచిత్తుఁ డై. 35

క. విను మొక్కఁడు నొకభూరుహ,మునమూలంబున నిరస్తమోహాంధత్వం
బున వెలుఁగు బుద్ధివిజ్ఞే,యనిరూఢతఁ జేసి యుండె నాసీనుం డై. 36

ఉ. భూమిసురావళీమహితభోజనతంత్రముఁ దీర్పఁ బూని హృ
ద్యామలరాజితంబు లగు నట్లొనరించినకూడుగూర లా
కోమలు లాఁగఁగాఁ గడఁగి క్రోఁతుల కన్నియుఁ బంచి పెట్టి రు
ద్దామవిహారలీల వసుధావర యాదవు లేమి సెప్పుదున్. 37

చ. పదపడి గీతవాద్యగతి బంధురనృత్యము లుల్లసిల్లఁగా
నుదధికి నంచితాక్షతమహోత్తరగంధవిశిష్టపుష్పసం
పదలు బహుప్రకారముఁ బ్రస్తుతి కెక్కఁగఁ బూజ నేసి పెం
పొదవ నివేద్య మిచ్చిరి సముజ్జ్వలహృద్యపదార్థకోటులన్. 38

చ. విను తదనంతరంబ మదవిహ్వలభావము సేయఁ జాలి యిం
పొనరినయాసవంబులు సముత్సుకతం గనకంపుఁగోరలం
గొని హరిసన్నిధానమునఁ గ్రోలిరి యాదవు లంతరంగమో
దనకరణంబు లై నయుపదంశములం గొనుచున్ మహీశ్వరా. 39

తే. సాత్యకియుఁ గృతవర్మయుఁ జారుదేష్ణుఁ
డును గదుండును బ్రద్యుమ్నుఁడును మొదలుగఁ
గలుగుయాదవు లెల్లను గాంక్షఁ బాన
విధి యొనర్చిరి పెల్లుగ విధివశమున. 40

తే. వృష్ణిభోజాంధకులు కురువీర యిట్లు, రేఁగి మద్యపానం బొనరించి మదముఁ
బొంది కేకిసలాడుచుఁ బొందు వడని,పలుకు లెసఁగంగఁ దిరిగి నవ్వులు సెలంగ. 41

### సాత్యకికృతవర్మలకు రోషజనకంబుగాఁ గలిగినసంవాదము

సీ. [1]ఉన్మార్గవర్తు లై యుండిరి విను మట్టియవసరంబున ఘూర్ణితారుణంబు
లయిననేత్రముల సాత్యకి కృతవర్మునివదనంబు గనుఁగొని మద మెలర్ప
నొద్ద నిల్చున్నప్రద్యుమ్ను[2]చే సఱచుచు నవమాన మేర్పడునట్టిభంగిఁ
బెలుచ నవ్వి యరాతిబృందంబు నిద్రావశత్వంబుఁ బొందుటఁ జావువోని

తే. దుష్టదశ నొంది యుండఁగఁ దుచ్ఛుఁడేని
నడరి వధియింపఁగాఁ జొరఁ డనిన రాజ

1 ఉన్మత్తచిత్తు లై. 2 జెచ్చెర నవ.

తనయుఁ డంతకసాపంబు సేయునె యుతంపు
బాడి చెనకు యిస్సిరో యిట్టిపోటుఁ బోటు

తే. అనిన బ్రద్యుమ్నుఁ డిది నీచు లయినవారి, తెఱవు వృష్ణివంశోత్తమ దీని నిట్లు
నీవు వాక్రువ్వ నేటికిఁ బోవ విడుపు, జను లితనిఁ బ్రువ్వఁ దిట్టుట సాల దెట్లు.

చ. అన విని రోషచిహ్నవికృతాననుఁ డై కృతవర్మ సాత్యకిం
గనుఁగొని సిగ్గు లేక యొరుకయ్యము నీ కిటు లుగ్గడింపఁగాఁ
జనునె కిరీటి చే నఱుక శాంతత నొందినసోమదత్తనం
దనుతల ద్రుంపవే మఱచితా యిసిరో యిది పోరిపాడియే. 44

సీ. అనియె దానికి హరి యంభోజపతిమీఁదఁ గడు నెఱ్ఱ నైనక్రేఁగంటిచూడ్కి
నిగిడించి సక్రోధ మగు మానసంబుతో నఖిలభోజులఁ గలయంగఁ జూచె
నప్పుడు సాత్యకి హరితోడఁ గృతవర్మననుజుండు శతధన్వుఁ డనుచితోద్య
మమున సత్రాజిత్తు మహితాత్ము మాననీయుని శమంతకమణికిని వధించెఁ

తే. గాదె యని వారిదెసఁ గీడు గానిపింపఁ
బలికె నవ్వాదు విని సత్యభామ గోప
మడరి వనితాస్వభావోద్గతాశ్రుపూర
యగుచు హరియగ్రతలమున కరుగుదెంచె. 45

క. కనుఁగొని హరి కతిరోషము, జనియించెను దానిఁ జూచి సాత్యకి యద్దే
వునకును దేవికినిం బ్రియ, మొనరించెద నని తలంచి యుద్వృత్తుం డై. 46

మ. కృతవర్మం బటుదృష్టిఁ జూచి కినుకం గెంపారువక్త్రంబుతో
నితఁ డాచార్యసుతుండు దోడ్పడఁగ రేయొల్లక వడిం గిట్టి క
ష్టతరోత్సాహత ద్రౌపదేయులను ధృష్టద్యుమ్నుఁ దత్సోదర
ప్రతతిం జంపిననీచు వారలగతిం బ్రాపించు టర్హం బగున్. 47

మద్యపానమత్తుఁ డైనసాత్యకి కృతవర్మతల నఱకుట

మ. అనుచున్ సంయమిశాపజాతముసలాత్యంతాద్భుతస్ఫీతశ
క్తినిరూఢంబుగ నూనినట్టినిజనిస్త్రింశంబు శీఘ్రింబునం
గొనితద్దీధితిరాజిచే నతనిమూర్ధ్నిన్ విహ్వలత్వంబు నొం
ద నుదగ్రోద్ధతిఁ ద్రుంచెఁ దద్గళము [1]రక్తాంబుప్రసారంబుగన్. 48

తే. అట్లు కృతవర్మఁ దెగటార్చి యాతఁ డంత
నిలువ క్రుద్ధుఁ డయి భోజకులముమీఁదఁ
గవిసె బాహావిలాసంబు [2]ఖడ్గదీప్తి
చయము మెఱయంగ సంరంభసత్వరముగ. 49

చ. కవిసినఁ జూచి యాఁగుటకుఁ గా నలినాక్షుఁడు వోవునంత నా

---

1 రక్తంబుల్ ప్రసారంబుగన్. 2 ఖచరదృష్టి, చయము నొదిఁగింప.

హావఖురు లైనభోజులును నంధకవీరులు నొక్కఁ డై పెసల్
సెవుడు పడంగ నార్చి యతిశీఘ్రత సాత్యకిఁ జుట్టుముట్టి ర
ప్పు విమలబోధుఁ డాహరి కడుం గన లొందియుఁ గాలవేఁచితన్. 50

ఉ. సప్పునిఁ గాచునట్టిసముదగ్రత నైకొన నొల్లఁ డయ్యె వే
గమ్మున రుక్మిణీసుతుఁ డఖండపరాక్రము మొప్పఁ గిట్టి శౌ
ర్యమ్ము భుజాబలమ్ము మెఱయం గని సాత్యకి సంతసిల్లి ద
ర్పమ్మునఁ జేర్చె మెచ్చొలసి ప్రస్తుతి సేసిరి చూచుఖేచరుల్. 51

చ. కనుఁగొని వృష్ణివీరులు నికామసముజ్జ్వలరోషవహ్ని నె
మ్మనమున నుత్థితంబుగ సమత్సరశౌర్యము విక్రమోద్ధతిం
బెనుపఁగ వార లిద్దఱకుఁ బ్రీతియొలర్పఁగ సింహనాదము
ల్ఘనపథ మెల్ల నిండఁగ బలంబుఁ జలంబును నుల్లసిల్లఁగన్. 52

క. భోజాంధకసంగమునవి, రాజిత మగునబ్బలంబు రౌద్రోద్రేక
భ్రాజితు లయి తాఁకి పెనఁగి, రేజాలియు లేక కృష్ణుఁ డీక్షింపంగన్. 53

క. అయ్యిరు[1]దెఱఁగున కప్పుడు, కయ్యమునకుఁ బరమసాధకంబుగఁ గలిగెన్
ముయ్యంచుతుంగ యచ్చట, దయ్యమునేర్పు విను సెప్పెదం గురునాథా. 54

చ. మునివరశాపసంభవదమోఘగతిన్ ముసలంబు పొద్భుతం
బును నతిదారుణంబు నగుభూరిసముద్భటశక్తిఖేలనం
బున ముసలత్వవిస్ఫురణముం గలిగించెఁ బ్రవేశలీలఁ నై
కొనిసమరప్రవర్తనము ఘోరతరంబుగ [2]నెల్లతుంగలన్. 55

క. పొడి గాఁగఁ జేసి యమ్మెయి, జడనిధిలో వృష్ణివరుఁడు సల్లించినను
జెడ దయ్యె మునివరులయుక్కుడుశక్తిని ముసలశక్తి కురువంశవరా. 56

సీ. యాదవవీరుల కాసమయంబున మద్యపానోద్భూతమదము పేర్మి
మునివరామోఘవచనదివ్యశక్తినిఁ జేసి కల్గద తుంగ వ్రేసినంత
టన ప్రతిభటునకుఁ దనుపీడ గలుగునే యనువివేకము దానిఁ గొని విరోధి
నడచినయప్పుడు మిడుక లే కిలఁ బడఁ గని యిది యెట్లొకో యని తలంచు

తే. టయును గావున సమర మిట్టలపుభంగిఁ, జెల్లె గృత్రిమముసలచండోల్లసనము
లతిశయిల్లఁగ వారి కన్యోన్యవధవి,హారదుర్వారసంచారఘోర మగుచు. 57

ఆ. తండ్రి పుత్త్రుఁ డన్న దమ్ముఁడు నాక య, య్యిరుదెఱంగువారు నేపు రేఁగి
మడియ మోఁద గాలిఁ బడుప్రాఁకుగములతె,ఱంగు దోఁచె నేమనంగఁగలదు.

క. మునిశాపము వారలమది, ననయము నస మెక్కఁ జేయ నం దొకఁ డైనన్
విను మరలుటదెరలుట లే, కని బెట్టుగఁ జేసి రధిప యార్పులు సెలఁగన్. 59

తే. అట్టియెడ విను భోజులు నంధకులును
జాలఁ గలుగుట బ్రబలుండు సాత్యకియు స

---

2 దెఱఁగుల కప్పుడు. 2 దుంగయేటులన్.

ముగ్రశక్తి ప్రద్యుమ్నుఁడు నాఁడి డాఁగి
మడిసె వారిచే వృష్ణిసమాజ మెల్ల. 60

సీ. అనిరుద్ధుఁ బ్రద్యుమ్ను సాంబుని సాత్యకి గదునిని మఱియును గలుగువృష్ణి
వరుల నంధకభోజవర్గపరాక్రమక్రీడల సమసి యాక్షితితలమునఁ
బడియుండఁ గనుఁగొని పరమమునీంద్రశాపంబు మహాశక్తిఁ బద్మనాభుఁ
డను దీవ్రకోపాగ్ని తనదుచిత్తమున నుద్ధురమై జనింపంగ దురములోనఁ

తే. బడక శేషించి మెఱసిన ప్రతిభటాళి, మీఁదఁగవిసి తుంగలఁ గొనిమోఁది నిరవ
శేషముగఁ జేసె నిట్టు లశేషయాదవులును మౌసలవిస్ఫూర్తిఁ బొలిసి రధిప.

క. నారాయణుఁ డప్పుడు గాంధారీవాక్యంబు తెఱఁగు దలఁచి మనమునం
బారంబుఁ బొందెనే యిది, యూరూపున ననుచు సంగరావని నొకఁడున్. 62

క. నిలుచున్నఁ జూచి రణసంకులతఁ బడకయున్న దారుకుఁడు బభ్రుఁడు న
జ్జలరుహనాభుసమీపస్థలికిం జని యిట్టు లని రతనితోడ నృపా. 63

తే. అఖిలజనమును సంహృత మయ్యె నిచట, నేల బలభద్రదేవుఁ డున్నెడముకుంద
యరసికొనిపోయి యాతనిచరితమునకు, ననుగుణం బైనవర్తన మాచరింపు. 64

అనుటయు నట్ల కాక యని యంబుజనాభుఁడు బభ్రుదారుకు
చ. ల్మనములు దల్లడిల్లఁగఁ గెలంకుల రా బలభద్రదేవుపో
యినదెస నాదరం బెసఁగ నేఁగి కురుక్షితిపాగ్రగణ్య యా
ఘనతరమూర్తి నవ్వలనఁ గాంచె మహీజముపొంత నుండఁగన్. 65

యాదవులెల్ల మడిసినపిదపఁ గృష్ణుఁ డర్జునుం దోడ్తేర దారుకుం బంపుట

సీ. కాంచి దారుకుదెసఁ గనుఁగొని నీవు వే పాండుతనూజులపాలి కరిగి
వారికి యాదవవర్గసంక్షయవిధ మెఱిఁగించి యర్జును నిందుఁ దెమ్ము
నావుడు నతఁడు మహావేగవంతంబు లగురథ్యములఁ బట్టి యలఁతియరద
మునఁ బూన్చికొని రయంబున నేఁగె నప్పు డమ్మురవైరి బభ్రునిమోముఁ జూచి

ఆ. యతివపిండుఁ గుంజరాదులఁ బురిఁ జేర్చి, యరుగుదెమ్ము వేగ మనిన నాతఁ
డట్ల చేయుపనికి నయి చన నొకబోయ, త్రుంగఁ జేసె నతనిఁ దుంగ వ్రేసి. 66

క. హరికిఁ గానవచ్చునంతదవ్వుల నట్లు, వడియె బభ్రుఁ డతనిపాటుఁ జూచి
సంయమీంద్రశాపశక్తికి నద్భుత, మంది యమ్ముకుందుఁ డన్నతోడ. 67

క. సామజరథతురగములను, రాములఁ బురి సేర్చి యే మరలి వచ్చెద నీ
భూమిజముకడన నిలువు ద,యామయ నా రాక వార్చి యనియె నరేంద్రా 68

సీ. అని గజాదుల నింతులను గొని పురి కేఁగి వసుదేవుఁ గాంచి యవ్వసుమతీశు
తోఁ దగ నిట్లను దొల్లి [1]కౌరవకులక్షయము సూచితి నేఁడు సకలయాద
వులనాశమును గంటి నలఘుతేజోధన యఖిలబాంధవహీన మయినయిచటి
మనువున వర్తింప మనసు గొల్పదు మున్న యన్న కాననమున కరిగినాఁడు

1 యేకౌరవక్షయమ్ము

తే. భవ్యతపమున నాబలభద్రుఁ గూడి, యేను తప మాచరించెద నింక మీర
లరసికొనుఁడు సర్వంబును నరుఁడు వచ్చు, నిందు మీపంపునేఁతకై యెల్లి నేఁడు.

క. అనుచు నతనిపాదంబులు, తనఫాలతలంబు సోఁకఁ దాత్పర్యమునన్
వినతి నడపె నంతక మును, వినియె జనులచేత సమరవిధ మతఁ డధిపా. 70

చ. విని బలుజీవి వోయి మది విహ్వలమై వెయి వ్రాసుపాటు నొం
ద నునికి మీఁదఁ గేశవుఁడు దానును రాముఁడు నిల్లు వాసి కా
ననమున నుండువార మని నైష్ఠికతం బలుకంగ నున్న చే
తనయు నడంగఁ జేష్టితము దక్కి శవాకృతి నుండె నత్తఱిన్. 71

క. తనమాటలు నజ్జనన్యా,థునవస్థయు వినియుఁ గనియు దురపిల్లి సతీ
జను లొక్కటఁ బెల్లాక్రం,దన మొనరించిన మురారి దయ మది నొలయన్. 72

సీ. అందఱ నూరార్చి యర్జునుం డిప్పుడ వచ్చు నిచ్చటికి మీ వంత లెల్ల
దీర్చు నక్కురుకులదీపకుం డని యుపశమవాక్యములఁ దేర్చి జనకుపాల
నాసీనుఁ డయి తదీయాంఘ్రిపద్మంబులు తనచారుపాణిపద్మముల మెత్త
మెత్తన యొత్తుచు మేలుపొందఁ గర్జంపుఁబలుకులఁ జిత్తవిభ్రమము మాన్చి

తే. మఱియుఁ బార్థునిరాక పల్మఱును జెప్పి
యన్నయాధుర్యుఁడు పనిసేయ నున్నవారిఁ
గరితురంగాదికముల మీ రరసికొనుఁడు
వినుఁడు కర్తవ్య మిట్టిది వేయు నేల. 73

క. అని తెగఁ బలికి యతని వీ,డ్కొని రామునికడకుఁ జని యకుంఠితభక్తిన్
వినతుం డయి మనజనకుని, యనుమతి వచ్చితి మహాత్మ యనియె నరేంద్రా. 74

బలరాముఁడు శరీరంబు విడిచి యనంతునియందుఁ గలయుట

సీ. తదనంతరంబ యద్దామోదరుఁడు రామువదనసరోజంబువలన వెడలఁ
గనియె మహాభుజంగము నరుణచ్ఛాయ మై పొల్చువక్త్రసహస్రకంబు
మణుల వెలింగెడుఫణములుఁ దెలుపారి పర్వతాభోగనిభంబు నైన
మేనిపెంపును గలదాని నట్లాబలభద్రుండు నిజయోగబలముపేర్మిఁ

ఆ. దనదుతనువు విడిచి [1]చనియె వియద్వీథి, నంబునిధికి నమ్మహాత్ము నెదురు
కొనియె వరుణుఁ డధికవినయంబుతో నాగ,కులము లెల్ల వచ్చి కొలిచె భక్తి.

ఆ. అహికులాగ్రగణ్యుఁ [2]డైనవాసుకియుఁ గ,ర్కోటకుండుఁ దక్షకుండు వారు
ణుండుఁ గుంజరుండునుం గుముదుండును, దుర్ముఖుండునుం బృథుశ్రవుండు. 76

తే. హ్రాదుఁడును వక్రదంతుండుఁ గ్రోధనాము
కుండు శంఖుండుఁ బుండరీకుండు మిశ్రి
యును నజేయుండు ధృతరాష్ట్రుఁడును మొదలుఁగ
నరుగుదెంచిరి యద్దేవు నర్థిఁ గొలువ. 77

---

[1] చనియెను వినువీధి. [2] లైన వాసుకియుఁ.

ఆ. పరమకౌతుకంబు భవ్యభక్తియు నొప్ప, యంగ వచ్చి కొలిచె నాఘణీంద్రు
గంగ యాది గాఁగఁ గలమహానదులు స్వముజ్జ్వలాభిరామమూర్తు లొంది. 78

క. అంతయును దివ్యదృష్టి, క్రాంతి యగుమురాంతకుండు గనుఁగొన సమ్మూ
ర్త్యంతరము గలపికొనియె న,నంతుఁడు దనపరమమూర్తియందు నరేంద్రా. 79

సీ. అట్లగ్రజుఁడు చన్న నచ్చటు వాసి యం
తంతఁ గ్రుమ్మరుచు మురారి సకల
[1]లోకపాలనకు భూలోకంబునందుఁ దాఁ
బుట్టంగ వలసినయట్టిమేటి
పను లెల్లఁ దీఱుట మనమునఁ దలపోసి
తనువిముక్తికి నిమిత్తంబుఁ దలఁచి
మునులవాక్యము తెఱంగును దొల్లి దుర్వాసు
నవయవసమితిఁ బాయసము పూయు

తే. నప్పు డఱికాలఁ బూయమి నత్తపస్వి
యచట [2]నవిలంఘ్య మై యపాయంబు గలుగు
ననినమాటయుఁ జర్చించి మనసు నింద్రి
యములు నడఁగించి గాఢసమాధి నొంది 80

క. జలనిధిశయనుండు మహీ,స్థలశయనుం డయ్యె నట్టిసమయమునం దా
నలుకుచుఁ దత్కాంతార,స్థలి కల్లన నరుగుదెంచె జర కురుముఖ్యా. 81

ఆ. అరుగుదెంచి యచటఁ దిరిగెడునొకవేఁట, కానిఁ గాంచి వాఁడు కమలనాభు
నొడలు చూచి బెంకి యున్నయేణం బను,నట్లు సేసి మాయ యావహించె. 82

మ. ధరణీనాథ యతండు శాతశర ముద్యద్వృత్తి సంధించి యు
ద్ధురభంగిం దెగ నిండఁగాఁ దిగిచి [3]యత్యుగ్రంబుగా నేసె నా
హరి శ్రీపాదతలంబుఁ దూరఁ గొని యయ్యస్త్రంబు మీఁగాల ని
ష్ఠురవేగంబున నుచ్చిపోయె వెస వాఁడుం జేరెఁ గైకొంటకున్. 83

క. చేరి తెలియఁ గనుఁగొని పెం,పారుపురుషుఁ డగు టెఱింగి యత్యంతార్తిం
గూరి పడఁకి తచ్చరణాం,భోరుహములఁ దనశిరంబు వొందం బడియెన్. 84

క. పడి యేడ్చినఁ గృష్ణుఁడు తగు,నొడువుల నూరార్చి తనమనోరథ మిమ్మై
[4]నొడఁగూడిన మానుష మగు,నొడలు విడిచి నిజపదంబు నొందుట కరిగెన్. 85

శ్రీకృష్ణుఁడు శరీరంబు విడిచి పరమపదంబునకుఁ బోవుట

సీ. ఊర్ధ్వలోకమునకు నూర్జితతేజస్కుఁ డగుకృష్ణుఁ డరిగిన నచటిదివ్య
మునివరులును సిద్ధులును రుద్రవసుమరుదాదిత్యవిశ్వముఖామరులును
సంక్రందనుండును సంభృత సంభ్రములగుచు భక్తియు వినయంబు నెఱయఁ

---

1 లోకపాలకుఁడు. 2 నవిలంఘ్య మగునపాయంబు. 3 యత్యుగ్రంపుటే టేసె. 4 నొడఁగూరిన.

గా నెదుర్కొని చరణానతు లై పరమస్తుతివాక్యముల్ విస్తరిల్ల

ఆ. బలసి రండు దేవపతి యల్లఁ జేరి కరములు మొగిచి ధర్మరక్షణమున
కై దయావిధేయ మగుఖేలనంబున, నవని నవతరించి తాదిపురుష. 86

ఆ. అవతరించి కంసుఁ డాదిగాఁ గలదైత్య, శత్రుకోటి నెల్ల సమయఁ జేసి
భరతకులముకసటు వాపి సంశుద్ధప్రతిష్ఠఁ గూర్చి యరుగుదెంచి తీవ. 87

క. అమృతం బజరం బవ్యయ, మమలం బవితర్క్య మచల మాగమగమ్యం
బు మహాత్మ భవత్పద మ,య్యమేయతత్త్వంబుఁ బొందు మనిరూప్యగతిన్. 88

క. కృప నిట్ల యవతరింపుము, ప్రసన్ను లగువారియార్తిఁ బాపుట కై య
జ్ఞపురుష యుగయుగమున న,త్యపరిమితగుణాఢ్యరూప మభినుతి నొందన్. 89

క. అని నిభృతిఁ బలుక నాసువ,చనముల నత్యాదరం బెసఁగ వినినమరుం
దునిపైఁ బెల్లు గురిసె న,య్యనిమిషపతి పుష్పవర్ష మతులితభక్తిన్. 90

ఉ. అప్పుడు బ్రహ్మ వచ్చి హరియంఘ్రిలకుం బ్రణమిల్లి భక్తిమైఁ
దప్పక చూచుచుఁ మది ముదంబునఁ దేల సలక్షణస్వరం
బొప్పి చెలంగ నాగమికసూక్తులఁ బ్రస్తుతి సేసెఁ బ్రీతుఁ డై
యప్పురుషోత్తముండు కరుణార్ద్రనిరీక్షణముఁ నిగుడ్పఁగన్. 91

సీ. అప్పరమేశ్వరుం డయ్యండజను జూచి యనిరుద్ధనామకం బైనయదియుఁ
బ్రద్యుమ్నతాప్రతిభాసమానమును సంకర్షణభావ[1]వికాసితంబు
వాసుదేవాత్మకవరరూపమున నేకతావిభవత్సమాధానసిద్ధి
నొందించుకొంటి నానందబోధనిరంజనామేయమత్పదప్రాప్తి పరమ

ఆ. మంగళానుభూతి నంగీకరించెద, సుఖుల రగుఁడు మీరు సుకృతులార
యనినవచనసమితి యతిమృదుమధురత, నింపు నొసఁగ నలరి రెల్లవారు. 92

క. ఆదేవదేవుఁ డత్యం,తాదరసంభాషణంబు లమ్మెయి బ్రహ్మేం
ద్రాదులతోడ నొనర్చి య,నాదినిరవసాననిజపదాస్థితుఁ డయ్యెన్. 93

తే. ఇంద్రియాగోచరుం డైనయీశు నపుడు
బుద్ధిఁ జూచుచు నిర్భరాద్భుతకరంబు
లగుతదీయగుణమ్ముల నభినుతించు
చరిగి రాత్మవాసముల కజాదు లెల్ల. 94

దారుకుఁడు పాండవులకు సకలయాదవక్షయంబు సెప్పుట

సీ. అవనీశ విను మంత నద్దారుకుఁడు సని పాండవేయులఁ గని పరమమునులు
యాదవకులముఁ జేరలుకమైఁ దొల్లి శపించుట మునుఁ దలఁపించి పిదప
జలధితీరముల నాసవపానమత్తు లై వృష్ణిభోజాంధకవీరు లెల్ల
మునివరనిర్దిష్టముసలాత్మకము లైనముయ్యంచుతుంగల మోఁదులాటఁ

1 వికాసతయును.....వరరూపమును నేకతావిభవత్వ మాధానసిద్ధి.

తే. చెర్చి యొండొరువులఁ బరిమార్చుటయును
రామకృష్ణులయునికియు నా మురారి
దన్నుఁ బుత్తెంచుటయును సవిస్తరభంగిఁ
జెప్పె వారలు [1]వెనువగఁ జేద్పడంగ. 95

తే. సర్వయాదవసంఘంబుచావు విన్న
ద్రౌపదీప్రముఖాఖిలాంతఃపురాంగ
నలును శోకించి యాక్రందనములు సేసి
రతికరుణముగఁ బురజను లార్తిఁ బొంద. 96

సీ. దారకుం [2]డత్యంతధర్మవినీతి మై నర్జునుతో నన్ను నచ్యుతుండు
నినుఁ దోడితె మ్మని పనిచిన వచ్చితి నని చెప్పెఁ జెప్పినఁ నతనిఁ జూచి
యాదవకులవిషయం బైనయొప్పనిపలుకు నావీనులఁ జిలుకునట్టి
యచటికి వేగంబ యరుగక యిచటఁ గాల్దన్ని యుండెడునట్టిధైర్య మెందుఁ

ఆ. గలదు నాకు నీవు పిలువ నే లని పల్కి, యన్నతోఁ దంగగ నాడి యాతఁ
డక్కులాగ్రగణ్యననుమతితో ద్వారవతికి నరిగె శీఘ్రగతి నరేంద్ర. 97

చ. అరిగి మగండు సచ్చినకులాంగనయుక్తి శశి గ్రుంకినట్టిశ
ర్వరియును బోల్పఁ బట్టగుచు వారిజనాభుఁడు లేనిదీనతం
బొరసి కృపైకభాజనతఁ బొందినయప్పురిఁ జూచి మానసం
బెరియఁగఁ జొచ్చె నేటి కెదు రీఁదినచాడ్పున నేమి సెప్పుదున్. 98

క. దారుకుఁడుఁ దోడఁ జనుదేఁ, బౌరజనము లంతఁ దన్నుఁ బరమాశ్వాసం
బారెడుమనములతోడను, గారవమునఁ జూడఁగా నగరికిం జనియెన్. 99

చ. చనుటయుఁ గ్రొత్తపేరడలు సైఁపఁగలేక మురాంతకప్రియాం
గనలు పదాఱువేలును మొగంబులఁ గప్పఁగ బాష్పవారి రో
దనరవముల్ సెలంగఁగఁ బదంబులు దొట్రుపడంగ దైన్యముల్
తనువులు దాల్చినట్టు దెరలం జనుదెంచిరి పార్థుపాలికిన్. 100

ఉ. వారలఁ గాంచి శోకఘనివారణఁ జిత్తము పెల్లగింప న
క్కౌరవసత్తముం డెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచుం
దే రొకభంగి డిగ్గి యిలఁ ద్రెళ్లినయద్దురవస్థఁ జూచినన్
వైరుల కైన డెందములు వ్రయ్యలుగా వగ దాఁకు భూవరా. 101

తే. రోదనధ్వను లెసఁగంగ రుక్మిణియును, సత్యభామయు నప్పాండుసవ్యసాచి
కడకు నేతెంచిపుడమిపైఁ బడిరి వనట, వెల్లి మునిఁగి యుల్లంబులు వెగడునొంద.

క. [3]తక్కనుగలమహిషీజను, లక్కుంతీతనయుచుట్టు నవని నొఱిగి లో
నెక్కొనినవగలఁ బొగిలిరి, దిక్కెవ్వరు మాకు ననుచు దీనత దోఁపన్. 103

క. వినుము ధనంజయుఁ డప్పుడు, తనుఁ దాఁ దేర్చికొని యెల్లతరుణుల నూరా

---

1 పనువంగ. 2 డట్టు లత్యంతవినీతి మై. 3 తక్కఁ గలుగుమహిషీ.

ర్చి నతనిఁ దోడ్కొని హరిజనకునికడకుం జనియె దారుకుం డట్టియెడన్. 104

సీ. యాదవుల్ సమసిన యయ్యెడ నడలుచుం[1]దమ కాక యవ్వనితాజనంబు
నందు దైన్యముతోడి యత్యంతశోకసమాకులత్వముఁ దోఁచె నస్మదీయ
మగుచిత్తమున వీరి యాతురత్వము గన్న యంతన కొండల మతిశయిల్లెఁ
గాని విశేషంబు గల్గదు కృష్ణునిదశ యెట్టిదో యనుతల్లడంబు

ఆ. నెవ్వరొక్కొ దీని నెఱిఁగించువా రను, నెవ్వగయును గదిసెఁ గవ్వడికిని
నధిప దారుకునకు నట్లయ్యు నాన్నృపుఁడ నెఱుంగువారు గాఁగఁ దారు. 105

అర్జునుఁడు సకలస్వజనక్షయదుఃఖితుం డగువసుదేవునిం గాంచుట.

క. తలఁకుచుఁ జని యతనిం గనఁ, బలువగలం బొగిలి సెజ్జపై మేనిడి య
శ్రులు గ్రమ్మ నున్న యవ్విభుఁ, డలమట గ్రొత్తయయి మనసు నలమికొనంగన్.

ఆ. లేచి యడలి సవ్యసాచిఁ గౌఁగిటఁ జేర్చి, గద్గదిక నెలుంగు గడలుకొనఁగ
నడరి పెలుచ నేడ్చె నాఱడిఁ బోయిన, ప్రజలఁ బేరు గ్రుచ్చి పనవి పనవి. 107

క. మనుజాధిపుఁ డమ్మెయి రోదన మటు సేయంగ నరుఁ డతని నూరార్చెఁ
విను మవ్వసుదేవుం డి, ట్లను నాలుక దొట్రుపడఁగ నాతనితోడన్. 108

చ. మనుజులమాత్ర గాక సురమాన్యపరాక్రమ ముల్లసిల్లఁగా
దనుజులఁ దాఁకి గీటడఁచుదర్పమునం బెచు పొంది మాఱు లే
క నెగడి రట్టిబిడ్డల కకారణరోషమునం బరస్పరా
హననము గల్గి చావలసె నందఱ కక్కట దైవ మల్గినన్. 109

క. విను నీశిష్యులు సాత్యకియును బ్రద్యుమ్నుండు నిమ్మహోగ్రపుసమరం
బునఁ దొలుపీనుఁగు లైరని, వినియు బ్రదికినాఁడ నేన వీరుఁడ జగతిన్. 110

క. తొలితొలి సాత్యకికృతవర్మలు రేపఁగఁ బుట్టె సంగరము దానను వా
రల దూఱ నేల మునిముఖ్యులశాపం బిట్టిచేఁతకుం [2]దగి యుండన్. 111

చ. వలసిన నెట్టికార్యమును వావిరి నెట్టుగ నైనఁ జేయఁగా
వలఁతి మృతుం బరిక్షితుని వత్సలతం బ్రదికించె శౌరి మొ
క్కలమున యాదవుల్ వెనఁగఁ గాఁ గని మాన్పఁ డుపేక్ష సేసె నీ
పొలియు టవశ్యభావ్య మని బుద్ధిఁ దలంచుట గాన నయ్యెడన్. 112

క. ఇది విధివశత్వమున నైనది యని శోకంబు దొఱఁగు నట్టివివేకం
బొదవదు ఫల్గున యాఱడి, యదువంశం బెల్ల సమసె ననువగ పేర్మిన్. 113

వసుదేవుఁ డర్జునునకు యాదవనాశంబు తెఱఁగెఱింగించుట.

క. అనునెడఁ గ్రీడి యితఁడు కృష్ణునుపేక్షయ చెప్పెఁ గాని శోక మడరియుం
బనవఁడు కృష్ణునిఁ గావున, ననుమానము వలవ [3]దమ్మహాత్మునికికిన్. 114

సీ. అని మదిఁ జర్చించె నప్పు డవ్వసుదేవుఁ డతనితో ననియె సమస్తయాద

---

1 దమ్ముగా కవ్వనితాజనంబు. 2 దెగి యుండన్. 3 దమ్మహాత్మునిగతికిన్.

పృథునుమహామునీంద్రులఘోరశాపంబు ఘనశక్తి నుద్భవించినమహోగ్ర
ముసలంబువిలసనమున ముసలాయమానము లైనతుంగల సముదవృత్తి
నన్యోన్యవినిహతి యాచరించి గతాసు లగుటయు నొక్కఁడు నతివపిండుఁ

ఆ. గరులఁ దురగములను నరదంబులను గోని, యరుగుదెంచెఁ గృష్ణుఁ డనిన సాధ
నంజయుండు తనమనంబు దల్లడపడ, నమ్ముకుందుఁ డెచటి కరిగె నధిప. 115

క. అని యడిగిన వసుదేవుఁ డ,తని కిట్లనునట్లు వచ్చి దామోదరుఁ డే
వనటం బొందుచు నుండఁగ, నను నూఱార్చుటకుఁ గాఁగ నరవర నాతోన్, 116

సీ. విధివశంబునఁ జేసి వృష్ణిభోజాంధకనాశంబు వాటిల్లె నరున కేను
జెప్పిపుచ్చినవాఁడ నిప్పుడ యక్రూరగవాగ్రణి యిప్పురి కరుగుదెంచు
నీయెడ భక్తుండు నినుఁ గొల్చి యుండెడుఁ బనిచినపని యొనర్పంగ వలఁతి
యమ్మహాభుజుఁడు కార్యజ్ఞుండు శౌర్యసమగ్రుండు విక్రమమహితుఁ డతఁడు

ఆ. నాఁగ నే ననంగ నరనాథ ఖేద మిం,చుకయు లేదు విడువు శోక మతనిఁ
జేతఁ బట్టి నీవు మాతంగతురగాది,కముల బంధుజనులఁ గాచికొనుము. 117

క. అతఁడు వనితలను బాలుర, నతిప్రయత్నమున నరసి యాపదఁ బాపున్
ధృతిసారమహిత యంబుధి, కతిపయదినములను ముంపఁ గల దిప్పురమున్. 118

సీ. యాదవుల్ తమలోన నాహవం బొనరింప కట మున్న బలదేవుఁ డడవి కరిగి
యత్యంతనియతి మై నధికతపోవర్తనంబునఁ దగిలి యున్నాఁడు నాకు
నదియ యొప్పెడుతెరు వై యుండుఁ గర్తవ్య మిట్టిది వేయును నేల యింక
నొండువిచారంబు లుడిగి దయాలోల యనుమతిసేయు మప్పనికి నన్ను

తే. నాధనంజయుచెప్పినయట్ల సకల
కార్యజాతంబు నడపి నెగడు మతండ
సమరమృతయాదవుల కెల్లసముచితప్ర
కారమునఁ జేయు నగ్నిసంస్కార మనియె. 119

క. అతఁడు కాలాంతరమున, బాతిఁగ భవదీయభవ్యపరలోకవిధుల్
చేతోగతి భక్తిపరి,స్ఫీతములుగఁ జేయు ననియుఁ జెప్పెఁ గుమారా. 120

క. చెప్పిన నేను నొడంబడి, యప్పురుషోత్తముని నెమ్మి ననిచితి నిట నీ
చెప్పిన యట్టులు సేయుట, యొప్పైనను గలదు నీకు నొక్కఁడు సెప్పన్. 121

ఉ. వీనుఁగు వెంటగాఁ బడినబిడ్డల నెల్లఁ దలంచు టెప్పుడున్
మానఁగ రాని తెల్ల మిది మానసముం గలఁగింప నన్నముం
బానము నెమ్మెయిన్ రుచికిఁ బట్టగు నట్లును గాక యిద్దెసం
దాను [1]సహించి యేమిగతిఁ దావుకొనున్ మెయిఁ బ్రాణ మర్జునా. 122

క. ఈవనితలఁ బ్రజలను దం,తావళముఖవస్తువులను దగుచందమునన్

---

1 సహించి యెమ్మిగతిఁ దావికొనున్.

నీ వరసి కొనుము బాహా, శ్రీవిశ్రుత కృష్ణపనుపు సెల్లింపవనా. 123

సీ. అన విని ఫల్గునుం డావృష్ణిపతిహర్మ్యనయము దేహానిరపేక్ష మగు టెఱింగి
ఖేదంబు నెవ్వగఁ బొంద నిమ్మేదినీరమణుతోఁ గృష్ణవిరహిత మైన
యుద్దేశమున వసియింపంగ నాకుఁ జిత్తము గొల్చునే ధర్మతనయభీము
లును నేను మాద్రినందనులును బాంచాలియును నేకచిత్తుల మనఘ వినుము

తే. ధర్మతనయుఁ డిక్కార్యంబు దలఁచి మున్న
నిశ్చయించి బాలకులను నెలఁతపిండుఁ
దగుధనమును నింద్రప్రస్థనగరమునకుఁ
జేర్పవలయుట మాకెల్లఁ జెప్పినాఁడు. 124

ఉ. కావున నప్పురంబున సుఖస్థితి నుండెడునట్లు గాఁగఁ బృ
థ్వీవర సంప్రయత్నమున వీరల నందఱ నంద పెట్టెదన్
నీవు పురస్సరుండ వయి నెమ్మి జనం గొనిపోయెదన్ భవ
ద్భావనముష్మలంబుఁ [1]బెడఁ బాపుము తప్పునె దైవకృత్యముల్. 125

క. అని పలికి దారుకునిఁ గనుఁ,గొని యాతనిచిత్తవృత్తి గుందుట బుద్ధిం
గని యి ట్లనుఁ గృష్ణునిపో,యినవంక నెఱింగి పోద మేనును నీవున్. 126

ఉ. ఇచ్చటికార్యముల్ నడపుఁ డి ట్లని నెమ్మి నమాత్యకోటికిం
బొచ్చెము లేక చెప్పి మఱి వోవుట యుక్తము నిల్చి వారలం
దెచ్చుట కీవ పొమ్మనిన దిగ్గన నాతఁడు వోయి యందఱం
దెచ్చె సుధర్మ యన్సభకు దేవపతిప్రియసూనుఁ డుండఁగన్. 127

సీ. అమ్మండపమ్మున కరిగినయమ్మంత్రివర్యు లక్కౌరవవంశవర్యు
వినయ మారఁగ బరివేష్టించి రమ్మహితాత్ముండుఁ [2]గరమును నార్ద్రుఁ డగుచు
గారవంబున వారి గలయఁ గనుంగొని యంతరంగంబు శోకాగ్ని నెరియ
వారలతో నిప్డు పౌరజనంబుల నెల్లను బిలిపింపుఁ డేను మీకు

తే. వారికిని నెఱింగింపంగ వలయునట్టి, పనులు గల వని చెప్పిన విని రయమున
వారు బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రు, లాదిగాఁ బ్రజ రావించి రధిపముఖ్య.

తే. అరుగు దెంచి యాప్రజ లుచితాసనమున
నున్న యయ్యింద్రనందనుఁ గన్న నతఁడు
గరము నెమ్మి నయ్యందఱఁ గలయఁ జూచి
యి ట్లనియె మోమునను దైన్య మెసక మెసఁగ. 129

క. వననిధి నేఁటికి నేడవ, దినమున నిప్పురము ముంచు దివిజులు గగనం
బుననుండి చెప్పఁగా నే, వినినది యిది వెడలవలయు వేగమ మనకున్. 130

క. వినుఁ డింద్రప్రస్థపురం,బునకు నధీశుఁడుగ వజ్రుఁ బోఁడిమితో నే
నునిచెద మీ రెల్ల నతఁడు, మనుపంగాఁ దొంటియట్ల మనుఁ డచ్చోటన్. 131

1 నడవాపుము. 2 బరమాదరార్ద్రుఁ డగుచు.

క. పరకులు భారవహులకును, భరియింపఁగఁ గొలఁది యయినభంగిని మోపుల్
వెరవుపడఁగఁ గట్టుఁడు సై,చ్చెర శకటము లాయితంబు సేయుఁడు మీరల్. 132

ఆ. వాహనములు వాని [1]వానిముట్లులు నొక్క,వంకఁగా నొనర్చి వలసినపుడ
కట్టి వెడలి పోవునట్టితెఱంగున, కనువు గాఁగ జేసికొనుఁడు వేగ. 133

క. ఈదేశము ప్రజ ధర్మజు, నాదరసంభావనముల నాజ్ఞానిరతిక
యాదవవీరులకలనాఁ, డేది తెఱం గట్టిమనికి యొసకం బారున్. 134

క. అని చెప్పి పురజనులఁ బోఁ బనిచి సచివకోటితో నిభము లాదిగ వా
హనముల సవరణ బెరయం, గొని రాఁ దగినపరిచారకుల మునుముట్టన్. 135

క. నియమింపుఁడు నగరిసరకు, లయినవి యిట్టిట్టిభంగి నక్షీణము లై
యొయిదం గలవారలఁ గని, పయనము తెఱఁగు సమకట్టుపని మఱకుఁడీ. 136

క. సుందరులకు బాలురకును, నందలములు వేసడములు నాయితములుగాఁ
గందక కుందక చనువిధ, మొందఁగ సమకట్టుఁ [2]డెడలకుండుఁడు తాల్మిన్. 137

తే. గతము లయినకార్యంబులు గ్రమ్మఱింప,రాదు గాని మనకు ధర్మరాజుగలఁడు
శేషజనరక్ష కొఁడయనిఁ జేయవచ్చు, వాసుదేవునిమనుమని వజ్రదేవు. 138

క. అని వారి నిండ్లకును బోఁ, బనిచి మదిని వగలు మిగులఁ బార్థుం డారే
యనవద్యచరిత కృష్ణుస,దనమున వసియించె సముచితపువృత్తమునన్. 139

చ. తెలతెల వేగునప్డు వసుదేవుఁడు నిర్మలయోగనిష్ఠ మే
నిల నిడి వర్ణనీయగతి కేగినఁ దత్సదనాంతరంబునం
జెలఁగె ననేకరోదనవిశేషము లవ్వసుదేవవల్లభల్
నలువురు నెమ్మిఁ గూడి మరణంబునకై కయి సేసి రత్తఱిన్. 140

వసుదేవుఁడు శరీరంబు విడిచి పరమగతికిఁ బోవుట

సీ. ఆసమయంబున నర్జునుఁ డచటికి నేతెంచి వైభవ మెసక మెసఁగఁ
బ్రాలంబమాలికాపంక్తులఁ గదళికాస్తంభంబులను శాతకుంభకలశ
శిఖరంబులను బెంపుఁ జెలువును విలసిల్ల యానంబు గల్పించి యాదవేంద్రు
శవము సుస్నాతంబుఁ జందనచర్చాసమేతంబుఁ జీనాంబరాతిశోభి

తే. తంబు నాభరణస్ఫురితంబు మాల్య,యోజితంబును గాఁ జేసి యాజకప్ర
యుక్తమంత్రతంత్రస్ఫుటయోగ మింపా,నర్ప నేతెంచె సామగానంబు నెలఁగ.

క. విను దేవకియును రోహిణి,యును భద్రయు మదిరయును సముచితవిధానం
బున నొనరించినయానము, లనూనపరికర్మరుచి రలయి యెక్కి తగన్. 142

క. చెలులుం జుట్టలు దాపట, వలపట నేతేరఁ దెలిసి వదనసరోజం
బుల నొప్పం దగియొడుమా,టల వారలవగలు మాన్పుటలు నుతి కెక్కన్. 143

క. ఆనృపునివల్లభలు శవ,యానంబుపిఱుంద నిట్ల యరిగిరి విధిస

1 వానిముట్లును నొక్క. 2 డోడకుండుఁడు.

స్వానితగతి ముందట వి,ప్రానీకము చనియె నుజ్జ్వలాగ్నులు గొంచున్. 144

తే. ద్వారకావాసు లెల్లను దల్లడంబు, లుల్లములఁ గప్ప మోముల నురుల బాష్ప
ధార లతికరుణమున హాహారవంబు, లెసఁగ నేఁగిరి [1]వెనుకను నిరుదెసలను. 145

సీ. ఇమ్మెయిఁ గొని చని యమ్మహీశుఁడు వేడ్క మెలఁగెడుతోఁటలోపల సమగ్ర
చందనాగురుకాష్ఠచయముల మున్న కావించినసొదకు సద్విధియుతముగ
నప్పాడె నేర్పించి యర్జునుఁ డయ్యాదవేంద్రునిపితృమేధ మెల్లజనులు
నభినుతి సేయంగ నచ్చితియం దాశవంబు నారోపింపఁ బనిచి యగ్ని

తే. దీప్త మగునట్లు సేయింప దేవకీప్ర,ముఖులు నలువురు నప్పు డాశిఖిఁ బ్రవేశ
లీల నంగీకరించి రాబాలవృద్ధ, మైనసకలజనంబులు నార్తి నొంద. 146

క. ఘృతములు పైఁ జల్లఁగ న,చ్చితిఁ బేర్చినసప్తజిహ్వశిఖలరవము నూ
ర్జితసామగానవాదో,ద్గతియును హాహారవంబుఁ గలసీ చెలంగెన్. 147

క. తదనంతరంబ వజ్రుఁడు, మొద లగుపురుషులు సతీసమూహముఁ దగుమై
నుదకప్రదానవిధి య,య్యదుముఖ్యున కాచరించి రన్వయముఖ్యా. 148

తే. అప్పు డందఱబంధుల నాదరమునఁ, దనదుసముచితాలాపసంతానకలన
ననునయించి పురంబున కరిగెఁ దాను, వారు వగ మదిఁ గదుర వివ్వచ్చుఁ డధిప.

తే. ఇ ట్లెఱింగున సత్క్రియా[2]యత్తుఁ డైన,యర్జునుఁడు పితృమేధము నభినుతముగఁ
జలిపి వృష్ణిభోజాంధకసమరధరణి,తలమునకు బుధజనపహితంబు గాఁగ. 150

సీ. అపరదినంబున నరిగె నప్పుడు వృద్ధబాలకాంతాజనప్రకరములకు
నని నిర్గతప్రాణులై పడి యున్నభోజులను నంధకుల వృష్ణులను గలయఁ
జూడంగ నుత్కటశోకంబు గదిరిన నఱిముఱి మేదిని నొఱగువారు
విప్రలాపంబు నానాప్రకారంబులఁ జేయువారును నిరుచేయి నెత్తి

తే. యలత నాక్రందనములు హాహారవము[3]ల
తో నొనర్చువారును నైన నానరుండు
దద్ద యడలి దారుకుభాషితములఁ దేఱి
యఖిలజనులకు నుపశమ మావహించె. 151

క. తదనంతరంబ రణమృత, యదుసంఘములకు సమంచితానలసంస్కా
రదశాపూతత్వము నా, విదితయశుఁ డొనర్చె విప్రవితతిఘటకుఁ డై. 152

ఆ. నిఖిలబంధుజనుల [4]కఖిలమృతులకును, దగఁ దిలోదకప్రదాన మాచ
రించునట్లు గాఁగఁ బంచి యలుప్తక్రి,యత్వ మొనర నడపె నక్కిరీటి. 153

క. ఇవ్విధమున విశ్రుతముగఁ, గవ్వడి నియతుఁ డయి బంధుకార్యము లెల్లన్
నెవ్వగలు దనమనంబున, నివ్వటిలఁగ నాచరించె నృపసంసేవ్యా. 154

---

1 వెనుక నిర్దెసల నధిప. 2 వృత్తుఁడైన. 3 లొ,నర్చువారును నైన ధనంజయుండు. 4 కఖిలమిత్రులకును.

అర్జునుఁడు రామకృష్ణుల వెదకుచు వనంబునకుఁ బోవుట

సీ. పదపడి యాదవభామినీబాలకవృద్ధజనంబు నాశుద్ధబుద్ధి
గలయంగఁ గనుఁగొని పలుకుల మార్దవ మారఁ బురంబున కరుగఁ జెప్పి
రామకృష్ణులు తపోరతులై ప్రవర్తించువనభూమి యారసికొని తదీయ
సందర్శనమునకుఁ జనియెద నని వారి నామంత్రితులఁ జేసి యేమి యనుచు
ఆ. టకును శోక మార్చుటకును దారుకుఁ డాది, యయినతగినవారి నర్హవచన
రచన మెఱయఁ బనిచి యుచితాప్తకతిపయ,జనులు దోడ రాఁగఁ జనియె నధిప.

క. చని చని మనమున నిట్లను, ననుఁ బిలువఁగఁ బనిచి జనకునకుఁ గావలిగా
నునిచినవాఁ డయి నెమ్మదిఁ, జనినహరికిఁ జావు సెప్పఁ జనియెద నకటా. 156

సీ. ఆరాజు సచ్చుట నారాయణున కేల [1]సెప్పఁ దపోనిష్ఠ జెంది యున్న
యమ్మహాత్మునిహృదయమునకు మెరమెర పుట్టింప నేటికిఁ బోయి కాంచి
పంచినపని యాచరించెదఁ గాక సవినయభక్తికముగ ననుచు మఱియు
వివిధచింతారూపవిధులు చిత్తమ్మునఁ బాఱ గాంధారిశాపంబు తెలఁగఁ
తే. దలఁచి యయ్యవ్వ యతఁ [2]డెగ్గతంపుఁజోట
నరయ దిక్కెవ్వరును లేనియట్టితెగుట
నొందఁ గలవాఁడుగాఁ బల్కె నొద్ద నుండి
వింటి నకట నిప్పును జెదలంటు నొక్కొ. 157

క. అనుచుఁ బెనుఁగలక నొందిన, మనంబుతో వలయుదిక్కు మతి నరయక వే
చను చుండె నొండుదెస కే,మనఁ గలదు విధాతచేత కడ్డము గలదే. 158

క. విను మనుచరు లాతనిమో,మునఁ దోఁచువిషాదభావముం గని వెగ డొం
దినకతన నట్లుగా ది, ట్లని చనియెడువంక సాలరై రెఱఁగింపన్. 159

క. అట్లు దిక్కుదప్పి యడవిలోపలఁ గొన్ని,దినము లిట్టు నట్టుఁ దిరుగ నొక్క
బోయ సూచి యెందుఁ బోయెద రనవుడు, హరి తపంబు సేయునచటి కనిరి 160

క. అన విని యొకనాఁ డొక్కెడఁ, గనుఁగొంటిం గృష్ణుఁ జూపఁ గా వచ్చెద నా
వనభూమి నాతఁ డింతకుఁ, జనునో నిలుచునో యెఱుంగఁ జనుదెం డనుచున్.

తే. అక్కిరాతుండు సన వాని ననుగమించి
వెన్నురుచిరదేహము పడియున్నచోటు
నేరి తెలియంగఁ జూచి మూర్ఛిల్లి పుడమిఁ
బడియెఁ గవ్వాడి యనుచరు లడలు నొంద 162

అర్జునుఁడు రామకృష్ణులకళేబరంబులు చూచి పలవరించుట

క. మఱి కొంతసేపునకుఁ దెప్పిఱి లేచి ముకుందు మేను పెద్దయునుం బ్రొ
ద్దిఱియఁగఁ గౌఁగిటఁ జేర్చెం,బఱివోయినతాల్మి నూష్మబాష్పము లురులన్. 163

1 సెప్పెదఁ బో నిష్ఠ. 2 డగ్గతంపుఁ జోట.

క. అనుచరులలోనిభూసురు, లనునయవచనములఁ దేర్ప నతఁ డంకిలి దే
ఱినమతితో నశ్రులు మఱియును గ్రమ్మం గరతలమున నొత్తుచుఁ జూచున్.

ఉ. ఏమిట నిట్టు లయ్యెనొకొ యిమ్మహితాత్మకుఁ డంచు నున్నిష
ద్ధామము లైనయంగములఁ దాఁ గలయం బరికించి యోగిహృ
ద్యామలపాదపద్మగత [1]మైనవిశేషము సూచి రుద్రతే
జోమయుఁ డైనసంయమివచోగతి గాంచి సువిస్మితాత్ముఁ డై 165

క. అవికృతమును రుచిరము నై, యవయవములు నిదురవోయి నప్పటిక్రియనుం
డ వఱలుకృష్ణునిదేహం, బవిరతచక్షురభిముఖత నాలోకించెన్. 166

ఉ. అమ్మెయి నూరకుండ ననుయాయిజనమ్ములు పెక్కులాడి చి
త్తమ్ముకలంక దేర్చి యుచితక్రియకుఁ మొగకొల్పి బంధుసం
ఘమ్ముల నిందుఁ దెత్తమొ వికారవిదూర యుపేంద్రుభవ్యదే
హమ్మట గొంచుఁ బోదమొ సమర్థవిధం బొకఁ డేర్పరింపుమా. 167

చ. అని యడుగంగ దైవగతి నంబుధి పట్టణ మాక్రమించు నె
ద్దినమున నొక్కొ యన్వగ మదిం జొనిపెం గురునాథ యప్పు డ
వ్వినుతగుణాభిరాముఁ డడవిం దమత్రిమ్మటఁ జన్నప్రొద్దు ల
య్యనుచరకోటితోడఁ దెలియం దలపోయఁగ లెక్క దోఁచినన్. 168

క. మఱునాఁడ యగుట లెస్సఁగ, నెఱిఁగి నినుం డప్పుడు వేఁడి యొడలినదీప్తుల్
దఱఁగలిగొనఁ బశ్చిమగిరి, చఱికి ననతిదూరమున విశదుఁ డై తోఁచెన్. 169

సీ. దాని కజ్జనములుఁ దాను నుత్తల మంది చర్చించి కార్యంబు [2]చాయఁ గాంచి
మనము కృష్ణునిఁ గని చనుదెంచినార మై పురమున నివ్వార్త పుట్టకుండ
నడచి యచ్చటిమాట లవికొన్ని [3]ఘటియించిచెప్పి యీరేయి సెచ్చెరఁ బ్రయాణ
మునకుఁ గృత్యము లగుపను లెల్ల సమకట్టి వేగంగ గ్రక్కున వెడలవలయుఁ

ఆ. గాని వెడల కున్న భానూదయంబున, వనధి పురము ముంచికొనిన గణన
సేయరానియట్టిసేగియుఁ [4]బ్రయ్యుఁ బా,పంబు వగయు నెల్లభంగిఁ గలుగు. 170

అర్జునుఁడు రామకృష్ణులకు నగ్నిసంస్కారంబు సేయుట

ఉ. కావున వేగ మగ్నియును గాష్ఠములుం సమకూర్చి సద్విధి
శ్రీ విలసిల్లఁ గృష్ణునిశరీరము సంస్కృతిఁ గూర్చి క్రమ్మఱం
బోవుట బుద్ధి యంచు మఱి భూసురకోటియుఁ దాను గాఢసం
భావనతోడఁ జేసె దృఢభక్తికుఁ డై పితృమేధభద్రమున్. 171

చ. హాలధరునిం దలంచి మును లాడినమాట తెఱంగు దప్ప దం
చలయక తత్ప్రదేశమున నారసి కాంచి తదీయదేహముం
వలయుతెఱంగునం బరమవహ్నికి నాహుతి సేసె నయ్యనా
కులహృదయుండు భూమిసురకోటియుఁ దానును సత్వరంబుగన్. 172

1 మైనవిభేదము చూచి. 2 సన్న గాంచి. 3 గణియించి. 4 ప్రయ్యాభావంబు.

సీ. అబ్భంగిఁ గృతకృత్యుఁ డైనయప్పార్థుండు యాదవపురమున కరుగుచున్న
రొండ సనుచరులతో నిట్టికార్యంబును నడపక తక్కిన నాథుచన్న
గతికిఁ బోవుటకునై కడఁగెదురుక్మిణీప్రభృతుల మనకు నిల్వంగ వశమె
రేయెల్ల నిప్పని సేయువిధముల కవ్వ్యయ మగు నంతకు వచ్చు నబ్ధి
ఆ. మేలు సేయఁ బోయి యీలోక మంతయుఁ, దిట్టు నట్టికీడు దెచ్చికొనఁగ
వచ్చునే స్వదేశవర్తుల మై చూచి, కొండ మెల్లపనియు రండు వేగ. 173
తే. అనుచు నరిగి తాఁ దలఁచిన యట్ల యెల్ల
తెఱఁగుపనులు నారాత్రిలోఁ దీర్చి ప్రొద్దు
పొడుపునకు మున్న వెడలించెఁ బురము సకల
జనములను జీవధనముల సరకు నతఁడు. 174
సీ. అప్పుడు కృష్ణునియంతగపురాంగనాజనము షోడశసహస్రమ్ము నతని
మహిషీజనుల రాముమహిళల నుచితవాహనముల నిడికొని యర్హపురుషు
లేతేరఁ దేరుల నేనుంగులను గుఱ్ఱములను సత్పరిచారకులు ప్రయత్న
మున సవరణతోడఁ గొని రా నగరి సరకులుఁ దదీయాధికారులు బహుప్ర
ఆ. కారశకటములను గాఁళ్ల నెత్తించి, యరసికొని కడంక నరుగుదేర
విగతనాథ లైన మగువల గారాము, నెడక యుండునట్లు నడపికొనుచు. 175
క. విను వజ్రముఖ్యయాదవ, జనము నుచితవృత్తి నడపి సర్వంబున క
య్యనఘుండు దాన దిక్కయి, చనియె నరదమునను మది విషాదము గదురన్.
క. ఇమ్మెయి నరుండు సకలజ,నమ్ము వెడల నినుఁడు పూర్వనగ మెక్కను వే
గమ్మున ముంచుకొనియె నగ,రమ్ము పయోరాశి భరతరాజవరేణ్యా. 177

ద్వారకానగరంబు సముద్రమున మునింగి పోవుట

క. వననిధి పురంబు ముంపఁగ, మనుజేశ్వర యెల్లజనులు మరలఁబడి కనుం
గొని రద్భుతరసపూరం,[1]బున పెన్నిట్టఁ దమచిత్తములు మునుఁగంగన్. 178
తే. అపుడు రెండవజలనిధి యనఁగఁ జాలి
యద్భుతోద్భూతవాక్యచయంబు వేర్మి
మ్రోయునాజనసంఘంబు మురవిరోధి
మఱఁది నడపించె దర్శితమార్గుఁ డగుచు. 179
క. నడపించి పంచవటమున, విడియించెను వీడుచోరవీరులు గని యొ
క్కుడుధనములు గల వీమ్ముక్కడిప్రజలో లేరు దీనిఁ గావఁగ యోధుల్.
క. కవ్వడి యొక్కఁడ కంటిరె, జివ్వనఁ జేరుద మితండు సేద్పడఁగా నిం
దెవ్వరుఁ గడంగ లే రివి, ద్రెవ్విపడినధనము లెఱఁగితిమి లోఁ దెల్లన్. 181
క. అని వారొండొరువులతో, ధనముల నుత్సాహ మెసఁగ మానితధనముల్
గొనునగ్గలికం బలుకుచు, ననేకబలకోటు లగుట నలు కేది వడిన్. 182

1 బునఁ బెన్నిటఁ.

క. బాలురు వృద్ధులుఁ జుండీ, యాలమునకుఁ గడఁగ నొక్కఁ డయినను లేఁ డీ
స్త్రీలం బొదువుద మనుచును, నేల యవిసి మూఁగినట్లు నిర్భరభంగిన్. 183

క. ఏ పెసఁగ రేఁగి య ట్లప్పాపాత్మక మగుకిరాతబలము సముగ్రా
టోపమునఁ గవిసి వివిధధనాపహరణ మాచరింప నారంభించెన్. 184

బోయ లర్జును నోర్చి యాదవాంగనలసొమ్ముల నపహరించుట

సీ. కనుఁగొని జంభారితనయుఁ డోరోరి యీ
ప్రజ కేన చుండు సంరక్షకుండఁ
నొలఁగి పొం డడియాస నొద్దకుఁ జొచ్చినఁ
దల లేఱె యుర్వికి బలి యొనర్తు
నని యదల్చినను వా రఱవాయి గొనక య
ప్పలుకు లన్నియును రజ్జులుగఁ గొనుచుఁ
జామల నచట నచ్చట నొల్చికొనఁగ నా
లోకించి యవ్వీరలోకవరుఁడు

తే. గాండివం బెక్కు వెట్టి ప్రచండబాణ
నికర మక్కిరాతులమీఁద నిగుడఁజేయ
నలఘుచర్మసంవృతగాత్రు లగుచుఁ దుచ్ఛ
బాణపాషాణ[1]లగుడముల్ పరఁగ జేసి. 185

క. ఆబోయలు నిర్భయమతు, లై బీభత్సుపయిఁ గవియ నతఁడు మహాస్త్ర
ప్రాబల్యంబును మెఱయుటఁ, దా బుద్ధిఁ దలంచి మంత్రతతి దోఁపమికిన్. 186

క. ఇది దైవవిరోధం బని, మదిఁ దా నూహించి ప్రకృతిమార్గణములు బె
ట్టిదముగ నేయఁగ నవియుం, దుదిముట్టఁగ రిత్త లయ్యె దొనలు నరేంద్రా. 187

సీ. అప్పుడు కాలపర్యయమున కాశ్చర్యమును విషాదముఁ దనమనములోనఁ
బెరిగొన బాహువిస్ఫురణకోదండదండమున నాబోయల సమదవృత్తి
నెట్టకేలకు నొకయెడ మాన్చి రుక్మిణి యాదిగాఁ గలకృష్ణు నగ్రమహిషు
లెనమండ్ర బలదేవువనితల మఱియును గతిపయ యాదవాంగనలఁ గాచెఁ

తే దక్కఁగలయింతిగముల నాదస్యు లడరి, పట్టికొని యేచి వీ డెల్ల బన్నపడఁగ
దొద్దగొని రథకుంజరతురగతతులు, దమకు వలవకునికిఁ దిగఁ ద్రావి చనిరి. 188

క. ఇమ్మాడ్కిం బఱివోయిన, యమ్మొత్తము నడపికొనుచు నతిదైన్యము చి
త్తమ్మలఁపంగఁ గురుక్షే, త్రమ్మునకుం జనియె నరుఁడు ధరణీనాథా. 189

క. చని యచట నచటఁ దన్నుం, గనునాప్తజనంబుతోడఁ గాలవశత్వం
బునఁ బొందినయద్దశఁ దగ, వొనర నతఁడు సెప్పెఁ బొచ్చె[2]మురివినమదితోన్.

సీ. కోపించి గాంధారి శాప మిచ్చినయది యాదవసంక్షయ మగుట యొట్లుఁ
దప్పదు మనము దద్బాలవృద్ధస్త్రీజనంబుల నెల్ల నర్థ్యంబు లైన

---

1 నికరముల్. 2 మురిలినమదితోన్.

కావుల [1]సత్ప్రతిష్ఠావిశోకంబులఁ గాఁ జేయవలయు నక్కాలమునకు
[2]నొడవి యత్తెఱఁగున నుత్సహించుట కృత్య మర్జున నీ కని యాడుచుండఁ
ఆ. బలుమఱును దలంచి పాండవాగ్రజుఁ డది, కారణముగ నతనికరుణపెంపు
నొప్ప నెఱుఁగఁ గాన యప్పార్థుఁ డయ్యెడు, నికరశేషజనుల నెమ్మి నిలిపె 191
సీ. నిలిపినతెఱఁ గెల్ల నృపవర చెప్పెద విను కృతవర్మనందనునిఁ జూచి
నీతల్లియును నీవు నీతోడఁబుట్టినవారును మృత్తికావతపురమున
నిలుఁడని బహుసంపదలఁ బొల్చునప్పట్టణంబుఁ దదీయదేశంబు నిచ్చి
యభిషిక్తుఁ జేసిన నాతండు నిజపరిజనములుఁ దాను హర్షం బెలర్ప
తే. నందుఁ బోయె సరస్వతి యనఁగఁ బరఁగు
ఘననగరమున సాత్యకితనయు నట్ల
నెయ్యమును గారవంబును నెఱయ నిలిపి
యనుప ముదమున నందుల కతఁడు సనియె. 192
సీ. తక్కటివారి నింద్రప్రస్థనగరంబునకుఁ గొని చని వజ్రనాథుఁ గాఁగ
నందుఁ బట్టము గట్టి హస్తితురంగరథంబుల విభజించి తగినభంగి
నమ్మువ్వురకును సమర్పితంబులు సేసి యయ్యాయిబంధుల నందు నందు
నందును నిలుచున ట్లొందఁగ నియమించి యక్రూరుభార్యల నాత్మజులను
తే. వజ్రునకు నప్పగించె నవ్వాసుదేవు, పౌత్రుఁ డతివినయంబునఁబట్టువఱుప
వారు నిలువక పోయిరి వలచునెడకు, దాని విని యూరకుండె భీమానుజుండు.

అర్జునుఁడు రామకృష్ణులనిర్యాణంబును యాదవస్త్రీల కెఱిఁగించుట

క. యాదవకుటుంబముల నత్యాదరమున నట్లు నిలిపి హలధరుఁడును దా
మోదరుఁడుఁ దెగుట వారల, గాదిలిపొలఁతులకుఁ జెప్పఁగాఁ దలఁచె మదిన్.
చ. తలఁచి యతండు మందగతిఁ దానును నర్జునోత్కరంబు వా
రలకడ కేఁగి శోకవిధురం బగుచిత్తముతోడఁ దారు గా
సల కటువోయి పంకరుహనాభుని రాముని రోసి పద్దినం
బులు భ్రము సంచరించుటయు బోయ దమ్ముం గని యార్ద్రచిత్తుఁ డై. 195
క. కందువచోటికిఁ గొనిపోవం దా రరుగుటయుఁ జెప్పి వనట గదిరిన
డెందము గలంగఁ గన్నీ, రందంద మొగంబుమీఁద నగ్గల మురులన్. 196
సీ. తలవాంచియేమియుఁ బలుకక యప్పార్థుఁ డున్న నయ్యువిదలు వెన్నుఁ డూర్ధ్వ
గతి కేగు టెఱిఁగి శోకము మూర్త లొందినతెఱఁగునఁ బొగిలియు ధీరభావ
మాత్మల నెలకొన్న నన్న నీ వింతేలయడలెదు కాలపర్యయము నుడుప
వశమె యెవ్వరికిని వార్తలకొఱఁతఁ జెప్పుము మాకు ననుడు నప్పుణ్యచరితుఁ
ఆ. డడవిలోన నేము దడసినదినము ల, న్నియు గణించి యంబునిధి పురంబు
రేపకడయ ముంచు నేపాట నిమ్మెయి, వచ్చునెడరు దలఁగు వార మొక్కొ.

1 సంప్రతిష్ఠావిశేషంబులఁ. 2 నొడవిన తెఱఁగున నుత్స.

చ. అసుతలఁ బాత్మ నొందుటయు నప్పటి కద్దెస మీకు నెల్లఁ జె
ప్పిన సుచితంపుభంగులకుఁ బెద్దయుఁ బ్రొద్దు సనంగ నప్పురం
బునఁ గలవిప్రముఖ్యజనముల్ పయనంబున కర్హ మైనవ
ర్తన మొనరింప లేమి జలరాశి మునుంగుచు నిట్లు గావునన్. 198

చ. హరికిని రామదేవునకు సర్వవిధానము లాచరించి యొ
వ్వరికిని జెప్ప కెల్లపరివారముఁ బౌరులు సామజాదులున్
సరకులు [1]నాయితంబు లగుసంఘటనం బొనరించి నాఁటికిం
గర మవధానయుక్తి సమకట్టితి నెవ్వగతోఁ బ్రయాణమున్. 199

తే. వినుఁడు యాదవభామినీ వృద్ధబాల, జనుల నందఱ నుచితవర్తనముతోడఁ
బ్రొద్దువోవకముందర పురజనప్రయుతముగాఁ బురి వెలువరించితిఁ గడంగి.

ఆ. దానఁ జేసి మీరు నేనును [2]బ్రయ్యుబ్బాపంబు లేక వెడలఁబడితి మిపియ
తల్లులార కరము తప్పయి తోఁచుట, నుల్ల మలఁతపెర్మి నురియుచుండు. 201

క. వినుఁ డీతప్పున దోషము, దనుకక యుండంగ నన్ను దయతోఁ జూడుం
డనుచు నిలఁ జాఁగి మ్రొక్కినఁ, గని యందఱు నెత్తి యతని గారవ మెసఁగన్.

క. ఊరార్చి యింక నుచితా,చారంబులు నడపుటయు యిచటఁ గృత్యము దు
ర్వారం బగువిధి చేఁతకుఁ నేరికి నడ్డపడ వశమె యేల యలఁదురన్. 203

రుక్మిణీదేవి మొదలగు కృష్ణభార్య లగ్నిప్రవేశము సేయుట

సీ. అని పల్కి రప్పిండునందు రుక్మిణియు జాంబవతియు లోనగుపద్మముఖులు
గొందఱు గోరిరి కురునాథ యనుమరణమునకు బంధుజనంబు లెల్ల
శోకార్తులై రోదనాకులత్వము నొంది రనుమృతికలనకు నమరి యున్న
యాబలదేవముఖ్యాంతకమహిషుల కతివిభవం బైనయానకల్ప

తే. నంబు నాకల్పరచనంబు నడపి నరుఁడు, చందనాగురుముఖ్యచితాసంవిధాన
మాచరించి యర్హప్రకారాగ్నివిధియొనర్చె మహనీయవిప్రజనంబుఁ బనిచి. 204

క. విను సత్యభామ లోనగు, వనితాజను లధికనియతి వనములకుఁ దపం
బొనరింపఁ బూని కొందఱు, చని రవ్విధమున నలుప్తసత్కార్యం బై. 205

తే. అఖిలబంధుజనంబుల నాప్తజనుల, నర్హవాక్యప్రయుక్తి నూరార్చి యుచిత
మార సామంత్రితులఁ జేసి యశ్రులురులఁ,బోయినాక్రీడిసాత్యవతేయుగుఱిచి.

అర్జునుఁడు వేదవ్యాసునొద్దకుఁ బోయి యాదవక్షయంబు చెప్పుట

సీ. పోయి మరున్నదిపొంతయాశ్రమమున నర్హాసనమున నేకాంతనిరతి
నాసీనుఁ డై యున్న యమ్మహాత్మునిఁ గని యత్యంతభక్తి సాష్టాంగవినతి
యాచరించినఁ జూచి యమ్మహనీయవిద్యానిధి సేరంగ నతనిఁ బిలిచి
తనసమీపంబున నునిచి తద్వదనమ్ముఁ గనుఁగొని నిన్నెఱుఁగంగ రాదు

తే. వెడ ముగం బై నదిది యేమ విజయ యొట్ట,కేల కెఱఁగితి నిది యేమి గినుకవాఁడమి

1 నాయితంబులుగ. 2 బ్రయ్యఁ బ్బాపంబు.

వధమునకు నయోగ్యుం డగువానిఁ జంపితే పరాజితుఁడైతె నీ తెఱఁగు సెప్పుము.

చ. అనవుడు నాతఁ డిట్లు లను నమ్మహితాత్మునితోడఁ బద్మలో
చనుఁడు నవాంబుదప్రతిమచారుతనూలసితుండు దేవకీ
తనయుఁడు రామదేవుఁడును దానును మేను దొఱంగి పోయె నే
మనఁ గల పెల్లయాదవులు నాఱడిఁ బోయిరి సంయమీశ్వరా. 208

క. మహితాయుధసంప్రహతులు, సహించుదృఢగేహధృతులసడిసన్నమహో
త్సాహులు యాదవవీరులు, నిహతు లయిరి దుంగలను మనీషిప్రవరా. 209

తే. అట్లు రామకృష్ణులు సర్వయాదవులును, బెగినఁజిత్తంబు పొగులంగమగువపిందు
బాలవృద్ధులఁ గొనిరాఁగఁ బథమునందు, నన్ను బోయలు దాఁకిన నగుచు నేను.

చ. ఘనతరబాహుశక్తియును గాండివశక్తియు నస్త్రశక్తియు
న్మనమున నచ్చి యప్డు మునినాథ కడంగితి నెట్టకేల క
ద్ధనువు గుణంబుఁ గూర్చితి నుదగ్రత బాహుల లేక యుండె న
స్త్రనికరమంత్రతంత్రములు సంస్మృతిఁ బొందవ యేమి సెప్పుదున్. 211

క. బోయలసంహృతికిఁ బ్రకృతి, సాయకసంపాతనములు సాలవె యని యే
నేయఁ దొడఁగ దొనలు సెనటు, లై యుండె నొకండుఁ జేయునది లేదయ్యెన్.

క. నెవ్వగయు నచ్చెరువు మది, నివ్వటిలఁగ నప్పు డేను నివ్వెఱపడితిన్
[1] జివ్వన ముసరి కిరాతులు, క్రొవ్వేసకం బెసఁగఁ జూఱగొని రజ్జనులన్. 213

ఆ. చాపదండనిహతి నోపినభంగిఁ గిరాతకోటి నాఁగి రామకృష్ణ
వల్లభాదు లైనవనితలఁ గొందఱ, వృద్ధబాలకులను వెరవుతోడ. 214

క. కాచికొని వచ్చితగ నా, నేచినయ ట్లచట నచట నిలిపితి మునినా
థా చేటును భంగంబును, నై చిత్తము శోకమునకు నగ్గం బయ్యెన్. 215

తే. పడనిపాటు వాటిల్లిన వెడమొగంబు, వడక యె ట్లుండ వచ్చుఁ దపఃప్రకీర్త
నీయ యింకిట యే నేమిసేయువాఁడ, నెసఁగుదయతోడ నానతియిమ్ము నాకు.

వేదవ్యాసుఁ డర్జునునకు హితోపదేశము సేయుట

సీ. అన విని యమ్మహాముని క్రీడికి ట్లను సంయమిదత్తోగ్రశాపనిహతి
నఖిలయాదవులును నస్తైరి దానికి నడలఁగఁ బని లేదు హరి యెఱుంగు
మున్న యాసంక్షయ మన్న జెప్పెద విను ప్రాప్తకాలం బగుపనికి నడ్డ
పడ నేల యని యాత్మ భావించి యతఁ డుపేక్షాపరుఁడై యుండెఁ గాక మూఁడు

తే. భువనములు నన్యథాత్వంబుఁ బొందఁ జేయఁ, జాలువాఁడు కణ్వాదులశాపముడుప
శక్తిలే కుండెనే యవశ్యంబు భావి, యైనయది గాన యదునాశ మయ్యెఁ జూవె.

ఉ. నీ వని సేయ నీవలని నెయ్యమునం గృప నన్యసైన్యముం
దా వధియించు శూలధరతాస్ఫురణం బెసఁగంగ [2]ముంద ర
ద్దేవుఁడు దానిఁ గాంచు భవదీయసమంచితదృష్టియుక్తి నినుం

1 జివ్వన. 2 ముందఱన్, దేవుఁడు.

గావఁడ యాముకాంతకుఁడు గాలవిపర్యయ మావహిల్లుటన్. 218

చ. ధరణీభరంబు వాప నవతారము నొందినవిష్ణుఁ డత్తెఱం
గరుదుగ నిర్వహించి యజరామరనిష్కలనిర్వికారభా
స్వరనిజసత్పదంబు నుపశాంతిపరుం డయి పొందె దానికిం
గురుకులవర్య శోకమునఁ గుందుదురే మిముబోఁటి బోధనుల్. 219

మ. అవనీభారము వాపి తా హరికిఁ దోడై భీమసాహాయ్యగౌ
రవదుర్దాంతపరాక్రమంబునఁ గృతార్థత్వంబునం జేసి య
స్త్రవితానంబును నిన్నుఁ బాసి చనియెం దైవప్రకారజ్ఞ నీ
దువరిష్ఠాచరణంబునం సురలు సంతోషించి రప్పొరుఁడన్. 220

క. బలమును బుద్ధియుఁ జేవయు, నలఘుధృతియు యుల్లసిల్ల నగుకాలమునం
బొలియుం గాలవిపర్యయ, కలనంబున బుధుల కబ్బుఁ గలఁకయుఁ గలవే. 221

తే. కాలమూలంబు సర్వంబుఁ గాన దీని,కొండుతలఁపులు దక్కి మీ రుత్తమంపు
గతికిఁ జనుఁడు నిశ్చింత [1]వికారతనులు, విడిచి యార్యజనంబులు వినుతి సేయ.

సీ. అన విని శోకమోహంబులు వాసినడెందంబు నిర్భరానంద మొంద
నధికభక్తియు వినయంబును దలకొన నర్జునుఁ డమ్మహితాత్ము వీడు
కొని వారణపురికిఁ జనుదెంచి ధర్మజుఁ గని తనపోయివచ్చినతెఱంగు
వినిపించె సర్వంబు నని యిట్లు సంయమిసుతుఁడు వైశంపాయనుండు రాము

తే. కృష్ణు లాదిగఁ గల్గినవృష్ణిచయము, భోజసంతతి యంధకరాజి నూత్న
వృత్తములుజనమేజయవిభున కింపు,[2]సెవులఁ దళుకొత్త నేర్పడఁ జెప్పుటయును.

శా. కాలస్వైరవిహారభంజనకళాకౌతూహలత్రస్య దు
శ్శీలాంతఃకరణావిభావ్య కరుణాశ్రీమందిరాపాంగ మం
త్రాళీవాచ్యసుధామయాంగ పవనవ్యాపారరోధక్రియా
శాలిస్వాంతసముల్లసద్విహరణా సంసారనిస్తారణా. 224

క. హృదయకమలమధురూపా, విదారితదురంతతాప వేదస్తోమా
స్పదపారాశర్యమనస్సదనా దివిజశుభకృద్వచనపరవదనా. 225

మాలిని. అమరగణవిరోధివ్యాపదాపాదికోపా
శమితవినతచిత్తా సంగిగాఢత్రితాపా
యమనియమవికాసిధ్యానగేహప్రదీపా
దమశమకలితానందప్రకాశస్వరూపా. 226

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబునందు మౌసలపర్వంబు సర్వంబు నేకాశ్వాసము.



[1] వికారచిత్త, తనువు లార్యజనంబులు. [2] చెలువుఁ.

